# హాస్య తరంగాలు

(ప్రత్యేక సంచిక)

## సంస్కృతాంధ్ర సాహిత్యం- హాస్యం

(యు. జి. సి. జాతీయ సదస్సు- 25,26 మార్చి -2022)



సదస్సు సంచాలకులు

ప్రొ. ఎన్. వి. కృష్ణారావు


సంపాదక మండలి

ఆచార్య పి. వరప్రసాద మూర్తి

ఆచార్య ఎన్. వి. కృష్ణారావు

డాక్టర్ ఇ. మాధవి



ప్రచురణ

తెలుగు & ప్రాచ్య భాషా విభాగం

ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయం

నాగార్జున నగర్ – 522510

గుంటూరు-ఆంధ్ర ప్రదేశ్

# హాస్య తరంగాలు

(ప్రత్యేక సంచిక)

## సంస్కృతాంధ్ర సాహిత్యం- హాస్యం

## (యూ. జి. సి. జాతీయ సదస్సు 25,26 మార్చి – 2022)

**సంపాదకులు**

**ప్రొ. ఎన్. వి. కృష్ణారావు**

**ప్రథమ ముద్రణ : మార్చి, 2023**

**ISBN: 978-93-5626-901-9**

**వెల : రూ 200/-**

**టైపింగ్ & డిజైనింగ్ :**

**ఏంజల్స్ ప్రింటర్స్**

**ప్రత్తిపాడు, సెల్: 9951854571**

**ప్రతులకు :**

**ప్రొ. ఎన్. వి. కృష్ణారావు**

**ఆచార్యులు,**

**తెలుగు మరియు ప్రాచ్య భాష విభాగం,**

**ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయం,**

**గుంటూరు.**

**ఫోన్: 9490218173**

**మెయిల్: vkraonarisetty@yahoo.com**

**విషయ సూచిక**

# స్ఫూర్తిదాయకం

**ఆచార్య పి. రాజశేఖర్**
**ఉపాధ్యక్షులు**
**ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయం.**

ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయంలోని తెలుగు మరియు ప్రాచ్య భాషా విభాగం, విశ్వవిద్యాలయం ప్రారంభమైన నాటి నుండి ఉన్న కొన్ని పెద్ద విభాగాలలో ఒకటి. 47 సంవత్సరాల నుండి ప్రగతి పథంలో దూసుకు పోతున్న ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయానికి తెలుగు మరియు ప్రాచ్య భాషా విభాగం ఒక గొప్ప వరం. ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయ గీతం రాసిన ఖ్యాతి ఈ విభాగానిదే. ఆచార్య తూమాటి దొణప్ప, ఆచార్య బొడ్డుపల్లి పురుషోత్తం, మహా మహోపాధ్యాయ శ్రీ జమ్ములమడక మాధవ రామ శర్మ, ఆచార్య తమ్మారెడ్డి నిర్మల, ఆచార్య ఎస్.గంగప్ప, ఆచార్య యార్లగడ్డ బాలగంగాధరరావు, ఆచార్య జి.కృపాచారి గార్ల వంటి గొప్ప ఆచార్యులు బోధన, పరిశోధనలో ఎంతో కృషి చేసి, విభాగాన్ని ఉన్నత స్థాయిలోకి తీసుకెళ్లారు. వారి వారసత్వాన్ని నేటి తరం ఆచార్యులైన ఆచార్య పి.వరప్రసాద మూర్తి, ఆచార్య ఎన్.వి.కృష్ణారావు,డా.ఇ.మాధవి గార్లు కొనసాగిస్తూ ఉండటం ఎంతో సంతోషించదగ్గ, అభినందించదగ్గ అంశం.

విద్యా బోధన, పరిశోధనా పరంగా విశ్వవిద్యాలయ ప్రగతిని సూచించే విద్యా విషయ, పరిశోధన జ్ఞానాన్ని పెంచే విద్యా విషయ కార్యక్రమాలలో ఒకటి ప్రతి సంవత్సరం జాతీయ స్థాయిలో నిర్వహించే జాతీయ సదస్సులు, విశ్వవిద్యాలయంలోని ప్రతి విభాగం జాతీయ సదస్సును నిర్వహించి విద్యా బోధన పరిశోధనలో తమ బాధ్యతను అస్తిత్వాన్ని చైతన్యాన్ని ప్రకటించుకుంటాయి. ఈ పరంపరలో ప్రతి సంవత్సరం తెలుగు మరియు ప్రాచ్య భాషా విభాగం ఒక జాతీయ సదస్సును ఎంతో సమర్థవంతంగా నిర్వహిస్తూ ఉండటం విశేషం. ఈ సంవత్సరం " సంస్కృతాంధ్ర సాహిత్యం - హాస్యం " అనే అంశం మీద జాతీయ సదస్సు నిర్వహించారు.

"నవ్వు రాని మానవుడు
నవ్వలేని మానవుడు
నరకంలోనే ఉంటారు
భూలోకంలో ఉండరు" కదా!

"హాస్య రసం లేని
హాస్యరస భావాన్ని అనుభవించని
మానవ జీవితం అసంపూర్ణమే!" అని భావించాలి.

హాస్యం మీద మంచి జాతీయ సదస్సును నిర్వహించడమే కాకుండా సదస్సులో వచ్చిన పరిశోధనా పత్రాలన్నింటినీ కలిపి ఒక ప్రత్యేక సంచికగా తీసుకొని రావటం ఎంతో ప్రశంసించవలసిన సందర్భం. జాతీయ సదస్సులు అందరూ నిర్వహిస్తారు. కానీ ప్రత్యేక సంచికలను ( special issue ) తీసుకురావడం అరుదు. ఆ ప్రయత్నం చేసినందుకు ముందుగా తెలుగు మరియు ప్రాచ్య భాషా విభాగాన్ని, ఈ ప్రత్యేక సంచిక సంపాదక మండలిని అభినందిస్తున్నాను. ఇది విశ్వవిద్యాలయంలోని మిగిలిన విభాగాల వారికి స్ఫూర్తిదాయకంగా నిలుస్తుంది. తెలుగు సంస్కృత సాహిత్యాలలో ఆవిష్కృతమైన హాస్య రసాన్ని విద్యార్థి లోకానికి, పాఠక లోకానికి అందించాలనే సత్సంకల్పంతో ఈ ప్రత్యేక సంచికను వెలువరిస్తున్న జాతీయ సదస్సు సంచాలకులు ఆచార్య ఎన్. వి. కృష్ణారావును ఆశీర్వదిస్తూ, దీనికి ఎంతో ప్రోత్సాహాన్ని అందిస్తున్న విభాగ అధ్యాపకులు ఆచార్య పి. వరప్రసాద మూర్తి గారిని, డా.ఇ.మాధవి గారిని అభినందిస్తూ, ప్రతి జాతీయ సదస్సు ప్రత్యేక సంచికను ఇలాగే వెలుగులోకి తీసుకురావాలని కాంక్షిస్తూ...

ఆచార్య పి. రాజశేఖర్

# హార్దిక శుభాశంసనమ్

**ఆచార్య పి. వరప్రసాదమూర్తి,**
**రిజిస్ట్రార్,**
**ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయం.**

ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయంలోని పలు విభాగాల వారు యు.జి.సి. వారి సౌజన్యంతో పెక్కు జాతీయ – అంతర్జాతీయ సదస్సులను నిర్వహిస్తూ పరిశోధన వ్యాస పరిమళ సౌరభాలను సమాజానికి అందిస్తూ విశ్వవిద్యాలయ ఖ్యాతిని, ప్రగతిని మునుముందుకు పయనింపజేస్తున్నందుకు ముందుగా నా హార్దికాభినందన మందారాలు.

ఈ క్రమంలో మా తెలుగు మరియు ప్రాచ్య భాషా విభాగం వారు కూడా యు.జి.సి. వారి సౌజన్యంతో 2022 వ సంవత్సరం,మార్చి నెల, 25 మరియు 26వ తేదీలలో "సంస్కృతాంధ్ర సాహిత్యం – హాస్యం" అనే విషయ విశేషంతో జాతీయ సదస్సును విజయవంతంగా నిర్వహించటం ఎంతో ముదావహం. ఈ సదస్సుకు సంచాలకులుగా వ్యవహరించిన ఆచార్య ఎస్.వి.కృష్ణారావు గారిని, కోశాధికారిగా వ్యవహరించిన డా|| ఇ.మాధవి గారిని ముందుగా అభినందిస్తున్నాను.

"నవ్వటం ఒక భోగం, నవ్వించడం ఒక యోగం, నవ్వలేక పోవడం ఒక రోగం" అని తెలుగు సినీ దర్శక ప్రముఖులైన జంధ్యాల గారు పేర్కొన్నట్లుగా మనసారా నవ్వటం అనేది మరచి, అనునిత్యం ఆందోళనలతో, ఉరుకుల –పరుగు ల జీవితాలతో, పలు అనారోగ్య సమస్యలతో సతమతమవుతూ, యాంత్రిక జీవనాన్ని సాగిస్తున్న ఆధునిక మానవ సమాజానికి చక్కని దిశా నిర్దేశం చేస్తూ, నిత్య జీవనంలో హాస్యానికి వున్న ప్రాముఖ్యతను–ఆవశ్యకతను, దాని పూర్వా పరాలను గూర్చి ప్రసిద్ధ ప్రాచీన భాషలైన సంస్కృతాంధ్రములలోని పెక్కు సాహిత్య గ్రంథములలో పేర్కొన్న హాస్యరస సంబంధిత విషయాలను మరియు ప్రయోజనాలను సవివరంగా వివరిస్తూ ఈ సదస్సులో పాల్గొన్న పలువురు పత్ర సమర్పకులు తమ పరిశోధన పత్రాలను సమర్పించి సదస్సు లక్ష్యాన్ని సఫలం చేయటం సదా హర్షణీయం, ప్రశంసనీయం.

ఇలాంటి సాహిత్య సామాజిక విలువలతో కూడిన జాతీయ సదస్సును రెండు రోజులపాటు సమర్థంగా నిర్వహిం చడమే కాకుండా, సదస్సుకు సమర్పించిన పరిశోధక విలువలతో కూడిన పత్రాలను ISBN సంఖ్యతో ప్రచురిస్తూ, సదస్సుకు సార్థకతను, పరిపూర్ణతను తెచ్చిన సదస్సు సంచాలకులైన ఆచార్య ఎస్.వి. కృష్ణారావు గారి కృషి– పట్టుదలలను నిండు మనసుతో ప్రత్యేకంగా అభినందిస్తున్నాను. భవిష్యత్తులో ఇట్టి మరిన్ని సదస్సులకు మన విభాగం ఆలవాలంగా నిలవాలని, ప్రగతి పథమున పయనించాలని ఆకాంక్షిస్తున్నాను.

"హాస్యం దివ్యౌషధం స్మృతమ్ "

(signature)
ఆచార్య పి. వరప్రసాదమూర్తి

# అభినందన

**ఆచార్య బి.కరుణ**
**రిజిస్ట్రార్**
**ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయం**

ఆధునిక జీవితం చాలా సంక్లిష్టమైనది మరియు ఒత్తిడులతో కూడినది. ఆ సంక్లిష్టతలను అర్థం చేసుకోవాలన్నా, ఈ ఒత్తిడి నుండి బయటకు రావాలన్నా సులభ మార్గం హాస్య రచనలు చదవడం.

" Humour is the tendency of experience to provoke laughter and provide amusement " అని హాస్యానికి కేంబ్రిడ్జి నిఘంటువు ఇచ్చిన నిర్వచనం. సాహిత్యంలో ఉన్న హాస్యం మూడు రూపాలలో ప్రజలను ఉత్తేజితం చేస్తుంది. అవి Satire, Parody, Spoof .

Satire/వ్యంగ్యం : రాజకీయ, సామాజిక రంగాలలో పెద్ద మనుషులుగా చాలా మనీ అవుతున్న వారి మూర?త్వాలు మరియు దుర్మార్గాలపై దాడి చేయడానికి వ్యంగ్యం ద్వారా ప్రజలను అప్రమత్తం చేయడానికి ఉపయోగిస్తారు.

Parody / పేరడీ : ఈ రకమైన హాస్యాన్ని పుట్టించడానికి గంభీరతను (Seriousness) అనుకరించడం ఉపయోగించబడుతుంది.

Spoof / స్పూఫ్: తేలికగా, మంచి హాస్యంతో ఎవరినైనా లేదా దేనినైనా అపహాస్యం చేసేవిధంగా అనుకరించడం.

అయితే సాహిత్యంలో హాస్యానికి అంతిమ ప్రయోజనం మనిషిని సంతోషింపచేయడం, ఆలోచింపజేయడం. హాస్యం జీవితానికి తప్పనిసరి ఔషధం లాంటిది. అది మనల్ని ఎల్లప్పుడూ ఉత్సాహంగా ఉంచుతుంది. అయితే మనం అనేక బాధ్యతల వల్ల నవ్వడం మర్చిపోయాం. హాస్యాన్ని ఆస్వాదించడం వదిలివేశాం. ఆ వదిలేసిన హాస్యాన్ని తిరిగి మన జీవితంలో నెలకొల్పుకోవలసిన ఆవశ్యకతను సూచిస్తోంది మన ఈ సెమినార్.

సంస్కృత ఆంధ్ర సాహిత్యాలలో హాస్యం అనే అంశం మీద నిర్వహించిన ఈ సెమినార్ కి ఎంతోమంది ఆచార్యులు, అధ్యాపకులు, పరిశోధకులు, పరిశోధక విద్యార్థులు తమ పరిశోధనా పత్రాలను సమర్పించడం చాలా సంతోషంగా ఉంది. తెలుగు మరియు సంస్కృత సాహిత్యాలోని ఇంత మంది కవుల రచనలలో హాస్యం పండు వెన్నెలలు కురిపిస్తుందనే సత్యాన్ని ఈ సెమినార్ ద్వారా వెలుగులోకి తీసుకువస్తున్నందుకు తెలుగు మరియు ప్రాచ్యభాషా విభాగం వారికి నా ప్రత్యేకఅభినందనలు తెలియజేస్తున్నాను. ఈ అంశాన్ని ప్రత్యేక సంచికగా ముద్రించి అందరికీ అందుబాటులోకి తీసుకు వస్తున్నందుకు అభినందనలు.

REGISTRAR
ACHARYA NAGARJUNA UNIVERSITY
NAGARJUNA NAGAR - 522 510.
GUNTUR (A.P.) INDIA.

# సంపాదకీయం

ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయం స్థాపించి నేటికి 46 వసంతాలు పూర్తయ్యాయి. ఈ 46 ఏళ్లలో విద్యాబోధన , ప్రచురణ, ప్రణాళికలలో విశ్వవిద్యాలయం ఎన్నో విధాలుగా, అభివృద్ధే ధ్యేయంగా ముందుకు దూసుకుపోయిన ఫలితం నాక్ - ఏ గ్రేడ్ సాధన. అదే రీతిలో ప్రారంభం నుండి ఉన్న తెలుగు మరియు ప్రాచ్య భాషా విభాగం విద్య, పరిశోధన, ఉపాధి విషయకంగా ఎంతో పురోగతిని సాధించింది. పునః శ్చరణ తరగతులకు (Refresher Courses), జాతీయ సదస్సులకు (National Seminars) ప్రత్యేక వేదికగా తెలుగు విభాగం నిలుస్తోంది. ఆ విషయకంగా ఈ సంవత్సరం అంటే 2022 మార్చి 25, 26 తేదీలలో "సంస్కృతాంధ్ర సాహిత్యం - హాస్యం" అనే అంశంపై జాతీయ సదస్సును నిర్వహించింది.

"నవ్వడం ఒక భోగం - నవ్వించడం ఒక యోగం - నవ్వలేకపోవడం ఒక రోగం" అని ప్రఖ్యాత హాస్య, వ్యంగ్య రచయిత జంధ్యాల చెప్పిన మాటలు హాస్యం విలువ తెలిపే అక్షర సత్యాలు. నవ్వు మనిషి జీవితంలో ఎక్కువగా ముడిపడిన అంశం. నవరసాలలో అత్యంత ఆవశ్యకమైన రసంగా పేరు పొందినది హాస్యరసం. మనస్ఫూర్తిగా నవ్వుకోవాలని ప్రతి మనిషి కోరుకుంటాడు. దానివల్ల మానసిక ప్రశాంతత పొందాలనుకుంటాడు. మన లోపలి ఆనందానికి బాహ్య రూపమే నవ్వు. నవ్వు ప్రతి ఒక్కరికి అవసరమైంది. ప్రాచీన కవుల దగ్గర నుండి ఆధునికుల వరకు ఎందరో దీని ప్రాధాన్యతను గుర్తించారు. ఎంత గొప్ప శృంగార కావ్యమైన, ఎంత గొప్ప నాటకమైనా, ఇతర రచనలైనా అందులో "విదూషకుడు" పేరుతో హాస్యాన్ని పండించే ప్రయత్నం చేశారు. మరికొందరు అధిక్షేపాలతో హాస్యాన్ని అందించారు. ఇంకొందరు అచ్చంగా హాస్య రచనలే చేశారు.

తెలుగు సంస్కృత సాహిత్యాలలో వచ్చిన హాస్య రచనలను, వాటిలోని హాస్య పాత్రలను ఈ జాతీయ సదస్సు ద్వారా పునశ్చరణ చేసుకొని, నలుగురితో పంచుకొని, మనస్ఫూర్తిగా నవ్వుకుంటూ, మానసిక ఆనందాన్ని, ఆరోగ్యాన్ని పెంపొందింపజేయాలనేది మా ఆకాంక్ష. అందుకే "సంస్కృతాంధ్ర సాహిత్యం - హాస్యం" అనే అంశంతో రెండు రోజుల జాతీయ సదస్సు నిర్వహించడానికి పూనుకున్నాం.

విద్యాబోధన, పరిశోధన, అభివృద్ధి విషయములలో ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయంలో ఒక సత్సంప్రదాయం ఉంది. ప్రతి సంవత్సరం జనవరి నుండి మార్చి నెల వరకు మూడు నెలల కాలంలో విశ్వవిద్యాలయంలోని ప్రతి విభాగంలోనూ యు.జి.సి. జాతీయస్థాయిలో జాతీయ సదస్సులు, వర్క్‌షాప్‌లు, సింపోజియాలు, అంతర్జాతీయ సదస్సులు నిర్వహించడం విశ్వవిద్యాలయంలోని విద్యార్థులకు, పరిశోధకులకు, అధ్యాపకులకు ఆసక్తిని, నూతనోత్తేజాన్ని, ప్రేరణను కలిగించి, విద్యా విషయకంగా మరింత అభివృద్ధి పథంలోకి సాగిపోవడానికి ఎంతగానో తోడ్పడతాయి. ఇటువంటి కార్యక్రమాలు మా విభాగంలో నిరంతరాయంగా కొనసాగటానికి ఆర్థిక చేయూతనిచ్చి, హార్దిక ప్రోత్సాహాన్నందించిన, అందిస్తున్న విశ్వవిద్యాలయ ఉన్నతాధికారులకు

మా విభాగం హృదయపూర్వక ధన్యవాదాలు తెలియజేస్తుంది. ఈ జాతీయ సదస్సు నిర్వహణకు మమ్మల్ని ఎంతగానో ప్రోత్సహించి చేయూతనందించిన విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులు ఆచార్య పి.రాజశేఖర్ గారికి, విశ్వవిద్యాలయ రెక్టార్ ఆచార్య పి.వరప్రసాద మూర్తి గారికి, విశ్వవిద్యాలయ రిజిస్ట్రార్ ఆచార్య బి.కరుణ గారికి మరియు యు.జి.సి. వ్యవహారాల కోఆర్డినేటర్ డా॥ జె.రత్నాకర్ గారికి హృదయపూర్వక ధన్యవాదాలు.ఈ సదస్సు నిర్వహణకు సహకరించిన విభాగంలోని ఇతర అధ్యాపకులకు, పరిశోధకులకు, విద్యార్థులకు కృతజ్ఞతలు.

వివిధ విశ్వవిద్యాలయాలు, కళాశాలల నుండి వచ్చి, ఈ జాతీయ సదస్సులో పాల్గొని, మంచి పత్రాలు సమర్పించిన పత్ర సమర్పకులందరకూ కృతజ్ఞతాభినందనలు. ఈ ప్రత్యేక సంచికకు ఐ.ఎస్.బి.ఎన్. నెంబర్ తీసుకురావడంలోనూ, ఇలా వెలువరించడంలోనూ ఎంతో తోడ్పాటునందించిన పరిశోధక విద్యార్థులు డా॥ కచ్చళ్ళ బలరామ్, డా॥ దాసరి రమేష్ లకు ఆశీస్సులు, అభినందనలు.

ఈ ప్రత్యేక సంచిక అందరి హస్త భూషణం కావాలని కోరుకుంటూ ..

సంపాదకమండలి.

# हास्यं दिव्यौषधं स्मृतम्

## मत्तविलासप्रहसने हास्यरसनिष्पत्तिः

**आचार्य पि. वरप्रसादमूर्तिः,** रेक्टार् (निर्देशकः), तेलुगु & प्राच्यभाषा विभागः,
आचार्य नागार्जुनविश्वविद्यालयः, नागार्जुननगरम्, आन्ध्रप्रदेशः।

**आमुखम् :-**

**''आङ्गिकं भुवनं यस्य वाचिकं सर्ववाङ्मयम् ।
आहार्यं चन्द्रतारादि तं नुमः सात्त्विकं शिवम् ।।''**

अथ नवरसेषु आद्यस्तावत् रसराजः शृङ्गारः । रसराजात् शृङ्गारात् परं हास्यरसः द्वितीयत्वेन परिगण्यते।

**''शृङ्गाराद्धि भवेद्धास्यः''**(1)

इति भरतमुनेः कारिकाभागानुसारं शृङ्गारात् हास्यरसः सञ्जातः इति हेतोः शृङ्गार - हास्ययोः जन्य - जनकभावरूपः सम्बन्धः समुल्लसति ।

**''शृङ्गारानुकृतिर्यातु स हास्यस्तु प्रकीर्तितः ।।''**(2)

इति वचनमनुश्रुत्य शृङ्गारानुकरणेन हास्यरसः सम्भवति । हासस्थायिभावात्मको हास्यः । भरतमुनिस्तु हास्यं द्विधा विभनक्ति - आत्मस्थः, परस्थः चेति । यदा कश्चन सहृदयः स्वयं हसति तदा आत्मस्थः इति, यदा कश्चन सहृदयः परं हासयति तदा परस्थश्चेति निगद्यते । अपि च नाट्ये उत्तम - मध्यम - अधमप्रकृतित्वेन पात्रवर्गीकरणं दृश्यते । उत्तमप्रकृतीनां स्मितं हसितं चेति द्वयं, मध्यमप्रकृतीनां तु विहसितम्, अपहसितं चेति द्वयम्, अधमप्रकृतीनां च अपहसितम्, अतिहसितम् चेति द्वयम् आहत्य षट्भेदाः सम्पद्यन्ते ।

**षण्णां हास्य भेदानां लक्षणानि :-**

1. **स्मितम्** : ईषद्विकसितैः कटाक्षैः अलक्षितं हास्यं स्मितं भवति ।

2. **हसितम्** : विकसितनेत्रे विकसितगण्डस्थली किंचिल्लक्षितहसितं हसितं भवति ।

3. **विहसितम्** : सस्वरं मधुरया हसितात् अक्षिगण्डस्थलौ आकुं चित्तौ कालानुगुणानुराग हास्यं विहसितं भवति ।

4. **उपहसितम्** : विकसितनासिकारन्ध्रौ अंगकम्पनं शिरः कंपन पूर्वकः हासः उपहसितं भवति ।

5. **अपहासितम्** : विकटाट्टहासात् नेत्राभ्याम् अश्रूणि, शिरः कंपः, कंपितांसुकसहित हास्यम् अपहसितं भवति ।

6. **अतिहासितम्** : संरंभाश्रुनेत्राभ्यां विकृष्टस्वरेण पार्श्वाङ्गकंपित पूर्वकं हास्यम् अतिहसितं भवति।

**"विपरीतालङ्कारैर्विकृताचाराभिधानवेषैश्च ।**
**विकृतैरर्थविशेषैर्हसतीति रसः स्मृतो हास्यः ॥**
**विकृताचारैःवाक्यैः अङ्गविकारैश्च विकृतवेषैश्च ।**
**हासयति जनं यस्मात् तस्मात् ज्ञेयो रसो हास्यः ॥"**[3] इति

विकृतपरवेषालङ्कार धार्ष्ट्यलौल्यकुहकासत् प्रलाप व्यङ्ग्यदर्शनदोषोदाहरणादिभिः विभावैः, ओष्ठ - नासा - कपोल - स्पन्दन - दृष्टि - व्याकोच - आकुञ्चन - स्वेदास्य - राग - पार्श्वग्रहणादिभिः अनुभावैः, आलस्य - अवहित्त - तन्द्रा - निद्रा - स्वप्न - प्रबोधासूयादिभिः सञ्चारिभावैः हास्यरसः निष्पद्यते ।

हास्यरसस्य वर्णस्तु सितः, अधिदेवता तावत् प्रमथगणो भवति ।

## मत्तविलासप्रहसने हास्यरसनिष्पत्तिः :-

संस्कृतरूपकवाङ्मये दशविधरूपकेषु प्रहसनं हास्यप्रधानम् । व्याख्यातृभिः प्रकृष्टतया हास्यते इति प्रहसनम्, इति प्रहसनशब्दस्य व्युत्पत्तिः प्रदर्शिता । भरतमुनिस्तु नाट्यशास्त्रे प्रहसनलक्षणानि निर्दिशति यथा -

**"भगवत्तापसविप्रैरन्यैरपि हास्यवादसम्बद्धम् ।**
**कापुरुषसंप्रयुक्तं परिहासाभाषणप्रायम् ॥**
**अविकृत भाषाचारं विशेष भावोपपन्न चरितं पदम् ।**
**नियतगति वस्तु विषयं शुद्धं प्रहसनं तु ॥**
**वेश्याचेट नपुंसक विट धूर्ता बन्धकी च यत्र स्युः ।**
**अनिभृत वेषपरिच्छद चेष्टित करणैस्तु संकीर्णम् ॥"**[4]

हावभावविशेषैः सम्प्रदायबद्धानां धार्मिकद्विजानां नीचपुरुषालापैश्च सह क्रियमाणं सम्भाषणं शुद्धप्रहसने दृश्यते ।

वेश्याभिः धूर्त - विट - चेट - नपुंक प्रभृतिभिः सम्बन्धि प्रहसनं संकीर्णं प्रहसनमित्युच्यते । परं दशरूपक, साहित्यदर्पणादि लक्षणग्रन्थेषु तु शुद्धं, वैकृतं, संकीर्णं चेति प्रहसनं त्रिधा विभक्तम् ।

संस्कृतसाहित्ये शताधिकप्रहसनानि समुपलभ्यन्ते । अथ तत्रभवान् श्रीमान् महेन्द्रविक्रमवर्मा मत्तविलासाख्यं प्रहसनं षष्ठशतके समालिखत् । संस्कृतप्रहसनेषु मत्तविलासप्रहसनमेव आदिमं प्रहसनमिति विमर्शकाः विभावयन्ति । पल्लववंशोद्भवस्य नरेन्द्रस्य सिंहविष्णुवर्मणः पुत्रोऽसौ महेन्द्रविक्रमवर्मा क्री.श. 575 आरभ्य 600 पर्यन्तं काञ्चीपुरं राजधानीनगरत्वेन विधाय राज्यं पर्यपालयत् । तस्मात् कविपुङ्गवस्यास्य महेन्द्रविक्रमवर्मणः कालः षष्ठशतकमिति निर्धारयितुं शक्यते ।

मत्तानां विलासः मत्तविलासः । इस प्रहसने तु एकाङ्क कथा चतुर्षु दृश्येषु विभक्ता । आदिमदृश्ये 'देवसोमा' नामिका काचन तरुणी मत्ता, अस्याः सहचरः शैवागमानुयायी एकाम्रवासी दुरात्मा मत्तः कापालिकः । असौ कापालिकः, देवसोमयाच सह काञ्चीपुरे सुरापणं गत्वा सुरां पीत्वा मत्तस्सन् ततो व्रजति । तदा कापालिकः "कपालं कस्मिन् आपणे परित्यक्तम्" इत्यालोचयति । तं प्रति शूल्यमांसगर्भित कपालं शुनकेन, बौद्धसन्यासिना वा अपहृतम्" इति सन्दिह्य तौ देवसोमा कापालिकौ कपालमन्वेष्टुं काञ्चीपुरं परितः परिभ्रमन्तौ आस्ताम् ।

द्वितीय दृश्ये तु बौद्धसन्यासी मिथ्यावादी नागसेनाभिधः कश्चन शाक्यभिक्षुः चीवरान्त प्रच्छादित पात्रेण राजविहारं (बौद्धसन्यासिनां निवास्थानं) याति । कपाली शाक्यभिक्षोः हस्ते पात्रं विलोक्य स्वकपालं तेन अपहृतमितिमत्वा तेन सह विवादं कुरुते । ततःपरं देवसोमा साहाय्येन सुरां पीत्वा मत्तः कापालिकः तं दण्डयित्वा कपालं नीत्वा गन्तुमुद्यतः ।

तृतीय दृश्ये तु कापालिक - शाक्यभिक्ष्वोः वादप्रतिवादसमये शैवमतानुयायी पाशुपताख्यः कश्चन सन्यासी तत्रागत्य तयोः वाद-विवादं श्रुतिगोचरी करोति । तद्वादं परिष्कर्तुं सक्षमोऽपि कपालीपक्षं वहन् "अधिकरणम् आश्रयणीयम्" इति सूचयति । दरिद्रः शाक्यभिक्षुः न्यायस्थानं गन्तुम् असमर्थस्सन् भीतोऽभूत् । स्वकपालं दातुम् अनिच्छन् बुद्धं शरणं याति । ततः पाशुपतः समस्यां परिष्कर्तुं यतते ।

ततस्तुरीयेदृश्ये उन्मत्तनामकः कश्चन नीचः पथि प्रव्रजन् पाशुपतं प्रेक्ष्य "आचार्याय नमः" इत्यभिवाद्य तेनापृष्टस्सन् "दुष्ट कुक्कुट भक्षितं शेषमांसखण्डं भक्षयितुं मांससहितं भिक्षाकपालं" पाशुपताय ददाति । ततः पाशुपतसाहाय्यात् कपालं प्राप्य कापालिकः बौद्धसन्यासिनं नागसेनं पुनर्मेलितुम् अनुमतिं याचते । देवसोमा-पाशुपातौ परितुष्टौ दृश्येते ।

**"सर्वेजनाः सुखिनो भवन्तु"**

# హాస్యరస ప్రవాహాలు - మన జానపద గేయాలు

**డా॥ తరపట్ల సత్యనారాయణ,**
సహాయాచార్యులు, తెలుగు శాఖ
ఆదికవి నన్నయ విశ్వవిద్యాలయం,
రాజమహేంద్రవరం. ఆంధ్రప్రదేశ్

**ప్రవేశిక :**

ప్రజలకు వినోదాన్ని అందించే అతిప్రధానమైన రసం హాస్యరసం. నవరసాలలో హాస్యరసానికి అందుకే అంత ప్రాధాన్యత ఉంది. అందుకేనేమో "నవ్వడం ఒక భోగం – నవ్వించడం ఒక యోగం – నవ్వలేకపోవడం ఒక రోగం" అన్నారు. మనిషికి నవ్వు అనేది ప్రశాంతత నిస్తుంది. దానితోపాటు మనశ్శాంతిని కూడా కలిగిస్తుంది. ఆ క్షణంలో గతమంతా మరచిపోయి హాస్యలోకానికి వెళ్ళి రసగుళికల్లాంటి హాస్యోక్తులతో వికసించిన కలువల్లా పరవశంతో ప్రకాశవంతంగా కనిపిస్తారు. హాస్యం అనేది మనిషిని ఆనందింపచేస్తుంది. హృదయంతో ఉవ్వెత్తున లేచే అలజడుల్ని, సమస్యల కల్లోల్లాల్ని అమాంతంగా అదుపుచేసే చల్లనిసమీరాల్లాంటి నెమ్మదినిచ్చే రసగుళికలే హాస్యం. అందుకే సాహిత్యంలో హాస్యరసం ఉత్తమోత్తమైనస్థానాన్ని దక్కించుకుంది. అనేక ప్రక్రియల్లో హాస్యరసం అద్భుతంగా ఆవిష్కరింపబడుతుంది. కొంతమంది కవులు హాస్యరసప్రధానమైన రచనలు చేసి తెలుగు సాహిత్య చరిత్రలో హాస్య కవులుగా కీర్తిని సంపాదించి తెలుగుతల్లి మెడలో మల్లెలదండగా గుభాళించారు.

**ముఖ్యోద్దేశ్యం :**

అక్షరంముక్కరాని నిరక్షరాస్యులైన జానపదులు ఆసువుగా పాడే గేయాల్లో అచ్చమైన హాస్యం గంధంలా గుప్పున గుభాళిస్తూ తరతరాల మన మౌఖిక వారసత్వ సంపదగా వస్తు గేయసంపదను గుర్తుచేస్తుంది. అందుకే జానపద గేయాలు హాస్యరసప్రవాహాలుగా నేటికీ మనముందు ప్రత్యక్షంగా కనిపిస్తూనే సరికొత్తగా వినిపిస్తున్నాయి. అవి ఒక ప్రత్యేకతను చాటుతూనే ఉన్నాయి. శిష్ఠ సాహిత్యంలో కనిపించే హాస్యంకన్నా జానపద సాహిత్యంలో కనిపించే హాస్యం సహజసుందరంగా, స్వచ్ఛమైన భాషతో ప్రత్యేకమైన యాసతో, మనస్సులను రంజింపచేస్తుంది. క్షణక్షణం గుర్తుకువస్తూ జానపదుల కల్పనాశక్తికి, పదబంధాల కూర్పునకు, వ్యక్తీకరించే పద్ధతికి ఆశ్చర్యం కలగకమానదు. అంతేకాదు అందరిని ఆలోచింపచేస్తుంది. అదే జానపదుల మౌఖిక సృష్టికి, మరచిపోని సృజనశక్తికి ప్రతిబింబాలుగా జానపదగేయాలు నిలుస్తాయి. అటువంటి జానపదగేయాల్లో హాస్యరస ప్రవాహాలుగా పరుగులు తీస్తున్న కొన్ని గేయాలను వివరించే ప్రయత్నమే ఈ వ్యాసంయొక్క ముఖ్య ఉద్దేశ్యం.

జానపద సాహిత్యం జగతికి ప్రతిబింబం. జానపద గేయాలు మన జన సంస్కృతికి, మన శ్రమసంస్కృతికి ప్రతిరూపాలు. పనిలేకుండా పాట, పాట లేకుండా పని ఉండదు. పని పాట కలిసే ఉంటాయి. ఈ రెండు శ్రమశక్తికి ప్రతీకలు. జానపదలు శ్రమజీవులు కాబట్టి శ్రమనుంచి, చెమట నుంచి, ఆవేదన నుంచి, ఆక్రందనల నుంచి, ఆనందం నుంచి, ఆవేశాల నుంచి ఆవిర్భవించి శ్రైమక్య నాదంగా, శ్రమైఖ్య గీతాలుగా వెలుగొందిన గేయాలే జానపదగేయాలు.

జానపద గేయాలపై ఎన్నో పరిశోధనలు జరిగాయి. మొదటిగా చెప్పుకోదగిన వారు ఆచార్య బిరుదురాజు రామరాజు గారు వీరు 1956లో తెలుగు జానపద గేయ సాహిత్యం పై విస్తృతమైన పరిశోధన చేశారు. ఆ తరువాత తులనాత్మక పరిశోధనలో చెప్పుకోదగ్గవారు ఆచార్య ఆర్వీఎస్ సుందరం గారు. వీరు 1973లో తెలుగు కన్నడ జానపద గేయాలపై తులనాత్మక పరిశోధన చేసారు. ఆ తరువాత పుంఖాను పుంఖాలుగా ఎన్నో పరిశోధనలు వెలుగుచూశాయి. వీటన్నింటికి ఆద్యులుగా, ఆరాధ్యులుగా చెప్పుకోదగినవారు నేదునూరి గంగాధరం గారు. వీరి కృషి మరచిపోలేనిది. అందుకే వీరు జానపద వాఙ్మయోద్ధారకులుగా, జానపద సాహిత్య చరిత్రలో నిలిచారు. వీరి సేకరణ నేటికి ప్రామాణికమైన పరిశోధనలకు ఆధారాలుగా నిలుస్తున్నాయి. అందుకే వీరు ఒక మౌఖిక విజ్ఞాన

సర్వస్వంలా భావిస్తారు. ఆ తరువాత వరుసగా కోనసీమ, రాయలసీమ, తెలంగాణ, కళింగాంధ్రా వంటి ప్రాంతాల జానపద గేయ వాఙ్మయంపై ఎన్నో పరిశోధనలు జరిగాయి. కాని హాస్య గేయాలమీద పరిశోధనలు ప్రత్యేకాంశాలుగా స్వీకరించి జరగలేదనే చెప్పవచ్చు. ఈనాటి పరిశోధనలు క్షేత్ర సాహిత్యాంశాలుగా కనబడుటలేదు. సేకరణమీద దృష్టి తగ్గినది. కేవలం ప్రకరణముల మీదే దృష్టి పెరిగింది. ఇటువంటి పరిస్థితుల్లో జానపద గేయాల్లోని హాస్యరసావిష్కరణల వైవిధ్యాన్ని వాటి ప్రత్యేకతను పరిశీలించవలసిన అవసరం ఉంది.

జానపదులు శ్రమజీవులైనా అప్పుడప్పుడు హాస్యాన్ని అద్భుతంగా పండిస్తారు. శ్రామిక గేయాల్లో పనిని వేగంగా చేస్తున్నప్పుడు, చల్లనిగాలి వీస్తున్నప్పుడు హుషారుగా సాగే గేయాల్లో శృంగారంతోపాటు హాస్యంకూడా సమపాళ్ళలో కొనసాగుతుంది. ఒక్కొక్క సందర్భంలో శృతిమించిన శృంగారం, గుక్కతిప్పుకోలేనంత విధంగా పొట్టచెక్కలయ్యేటంత నవ్వుతో గేయాలు ప్రవాహాల్లా వేగం పుంజుకుంటాయి. అటువంటి గేయాల్లో వినబడే శ్రామిక గేయం "ఇంజనుమీద చెయ్యేసి లంజలమీద కన్నేసి" అనే గేయం ఇది కుప్పనూర్పు పాటల్లో విరివిగా వినబడుతుంది. వాటిని పరిశీలిద్దాం.

**ఇంజనుమీద చెయ్యేసి - లంజలమీద కన్నేసి**
**జాయ్‌జాయ్ గా తోలరా - లంజమారి గొల్లిగా**

1. **ముందుచూసి తోలరా - లంజలమారి గొల్లిగా**
**ఎనకచూసి తోలరా - లంజలమారి గొల్లిగా**
**అటుఇటు చూడరా - లంజలమారి గొల్లిగా**
**ఆగి ఆగి తోలరా - లంజలమారి గొల్లిగా**　　॥ఇంజ॥

2. **తిన్నగా తోలరా - లంజలమారి గొల్లిగా**
**దున్నలా వున్నావురా - లంజలమారి గొల్లిగా**
**మిటకరించి చూడకురా - లంజలమారి గొల్లిగా**
**గుటకలు మింగకురా - లంజలమారి గొల్లిగా**　　॥ఇంజ॥

3. **నొక్కి నొక్కి తోలరా - లంజలమారి గొల్లిగా**
**ఆపి ఆపి తోలరా - లంజలమారి గొల్లిగా**
**ఊగి ఊగి పోకురా - లంజలమారి గొల్లిగా**
**తాగి తాగి తూలకురా - లంజలమారి గొల్లిగా**　　॥ఇంజ॥

ఈ గేయంలో లంజలమారి గొల్లిగా అనేది మనకు అశ్లీలపదంగా కనిపించవచ్చు కాని జానపదులకు అది అచ్చమైన వ్యవహారికి పదం. బూతులు ఊరకనే తిట్టరు. ఆ బూతులు వెనుక ఏదో ఒక కథ ఉంటుంది. వ్యక్తుల ప్రవర్తనకు సంబంధించిన అంశం దాగి ఉంటుంది. కుప్ప నూర్చేటప్పుడు చాలా చిరాగ్గా ఉంటారు కూలీలు, వరి నూర్చే టప్పుడు దానినుండి రేగే దూగర, దుమ్ము, ధూళి, నూగును కలిగిస్తాయి. ఆ సమయంలో కుప్పనూర్చే ట్రాక్టర్ డ్రైవర్ చూపులు వికారంగా, కాస్త తేడాగా కనిపించాయి పనిచేసే స్త్రీలకు అందుకే పడుగు లాగుతూ పాటలో విషయాన్ని స్పష్టంగా, చమత్కారంగా హాస్యం జోడించి ఒక జాడింపు పెట్టారు కాయకష్టంచేసే కూలి స్త్రీలు. ఈ గేయంలో ఇంజనుమీద చెయ్యి - లంజలమీద కన్ను అనడంలో ఎవరికైనా నవ్వురాకుండా ఆగదు. ఇందులో ఉన్న పదాలను గమనిస్తే జాయి జాయిగా తోలరా, ఆగి ఆగి తోలరా, ఆపి ఆపి తోలరా, ఊగి ఊగి పోకురా, తాగి తాగి ఊగకురా, తిన్నగా తోలరా, దున్నలా ఉన్నావురా, మిటకరించి చూడకురా, గుటకలు మింగకురా, ముందువెనుక చూడరా అనే పదాలను డ్రైవర్ మనస్తత్వాన్ని ప్రవర్తనా వాదన్నా తెలియజేస్తాయి. జానపదులు ఎదుట వారి మనస్తత్వాన్ని క్షణాల్లో పసిగట్టే మనస్తత్వవేత్తలు. అందుకే నీతిగల శ్రమజీవులు నిర్మోహమాటంగా తనకు వచ్చిన భాషలో ఉన్నది ఉన్నట్టుగా మాట్లాడటం జానపదుల నైజంగా కనిపిస్తుంది. "మరొక గేయం నిన్నుచూసి మా ఈరన్న నిద్రమేల్కొన్నాడా" అనేది పరిశీలిద్దాం.

**నిన్నుచూసి మా ఈరన్న - నిద్రామేల్కొన్నాడా**

1. **ముక్కుబేసరి తళుక్కుమంటే - ఉలిక్కిపడ్డాడీరన్న**
   **చేతి గాజులు తళుక్కుమంటే - ఉలిక్కిపడ్డాడీరన్న ॥నిన్ను॥**
2. **పూసలుపేరు తళుక్కుమంటే - ఉలిక్కిపడ్డాడీరన్న**
   **కాసులపేరు తళుక్కుమంటే - ఉలిక్కిపడ్డాడీరన్న ॥నిన్ను॥**
3. **కాళ్ళకడియాలు తళుక్కుమంటే - ఉలిక్కిపడ్డాడీరన్న**
   **దండకడియాలు తళుక్కుమంటే - ఉలిక్కిపడ్డాడీరన్న ॥నిన్ను॥**

ఈ గేయంలో ఆసువుగా సాగే కవితాకల్పన కనిపిస్తుంది. ఈ తరానికి తెలియని వస్తు సంపద ఈ గేయంలో ఉంది. ఆనాటి జానపదులు ధరించే ఆభరణాలను కళ్ళకి కట్టినట్టు వర్ణించారు. దానికి హాస్యాన్ని జోడిస్తూ చిన్నపిల్లవాడైన ఈరన్నకు నిద్రభంగమైందని దానికి కారణంగా ఇంటికి వచ్చిన వాళ్ళు ధరించే ఆభరణాలు ఆటంకాలని భావిస్తూ ఆ ఆభరణాల తళుకులను చూసి ఉల్లిక్కిపడ్డాడని వర్ణిస్తూ ముక్కుబేసరి, పూసలపేరు, కాసులపేరు, కాళ్ళకడియాలు, దండకడియాలు, చేతిగాజులు, వంటివి తళుక్కుమనడం వల్ల ఉలిక్కిపడ్డట్టయ్యిందని ఈ గేయంలో చెప్పబడింది. నేటి ఈ యువ ప్రపంచానికి ముక్కుబేసరు లాంటి పాతవస్తువులు పోయి నేటి కాలంలో నోస్‌రింగ్ వచ్చింది, జడగంట్లు, వాలుజడ పోయి పోనీటైల్ వచ్చింది. కాళ్ళకడియాలు, దండకడియాలు ఇంకెక్కడ కనిపిస్తున్నాయి, అంతా ఫ్యాషన్ ప్రపంచం, జగమంతా మేచింగ్ మాయాజాలం. ఈ పరిస్థితుల్లో సహజత్వమెక్కడ ఏడు గజాల చీరలు పోయాయి. వాలుజడలు పోయి కొత్తిమీర కట్టల్లా చిన్న కుచ్చులేతప్ప మూడు పాయల భారీజడలెక్కడ. ఈగేయంలో ప్రాచీన సాంస్కృతక అలంకరణ తీరుకు అర్థంపడుతుంది. తళుక్కుమంటే ఉలుక్కిపడ్డాడనడంలో సునిశిత హాస్యం కనిపిస్తుంది. పదాల పొందిక అద్భుతంగా ఆకర్షిస్తూ ఆలంకారిక కవిత్వానికి ప్రతీకగా నిలుస్తుంది.

మరొక గేయం మా మాంగారు మట్టగడస బాబు. ఈ గేయంలో హాస్యాన్ని పరిశీలిద్దాం.

**మా మాంగారు - మట్టగడస బాబు**
**మా అత్తగారు - ఇంగిరాయ బాబు**

1. **మా అమ్మ పేరు - అరటికాయ బాబు**
   **మా అయ్య పేరు - ఆనబకాయ బాబు ॥మా మాంగారు॥**
2. **మా చెల్లిపేరు - శనక్కాయ బాబు**
   **మా పిల్లపేరు - ఉల్లపాయ బాబు ॥మా మాంగారు॥**
3. **మా బావపేరు - తాంబ్రకాయ బాబు**
   **మా మరదలపేరు - తంపడకాయ బాబు ॥మా మాంగారు॥**
4. **మా అక్క పేరు - చిక్కుడుకాయ బాబు**
   **మా అన్న పేరు - నిమ్మకాయ బాబు ॥మా మాంగారు॥**

ఈ గేయాన్ని భిక్షు గాయకులైన మాల మాష్టీడీలు ఇంటింటికి వచ్చి అన్నం కూరలు ఆప్యాయంగా అడుక్కుంటూ తంబుర భుజాన్న వేసుకొని ఎన్నో ఇటువంటి హాస్య పాటలు పాడుతుంటారు. చిన్న చిన్న పిల్లలైన వీళ్లు 10-12 సం॥ల వయస్సు ఉన్నటువంటి వాళ్ళు. వీరిచేత చాలా మంది సరదా కోసం హాస్య గేయాలను పాడించుకుంటారు. అటువంటి వాటిలో ఈ గేయం ఒకటి. దీనిలో మాంగారు మట్టగడస, అత్తగారు ఇంగిరాయి అంటు హాస్యాన్ని రప్పిస్తారు. ఈ పదాలు కల్పనలో ఒక ప్రత్యేకత ఉంది. మట్టగడస పట్టుకుంటే దొరకదు, ఇంగిరాయ పట్టుకుంటే కుడుతుంది. దాని నొప్పుకూడా తీవ్రంగా ఉంటుంది. అటువంటి చేపలతో అత్తగారిని, మామగారిని పోల్చి

చెప్పటం సరికొత్త హాస్యమేకదా. అలాగే చెల్లిపేరు శనక్కాయి, పిల్లపేరు ఉల్లిపాయి అనడంలో వీరికి వీరే సాటిగా కనిపిస్తారు.

మరొక హాస్య రసగుళిక సుబ్బక్కో సోడిపప్ప మాడిపోతుంది. ఈ గేయం కోత పనుల్లో, కుప్ప నూర్పుల్లో తరచుగా వినిపిస్తుంది. పనివేగంతో పాటు ఈ గేయంలో వేగంకూడా అదే విధంగా ఉంటుంది. ఇది ఒక సామూహిక గేయం. ఈ గేయాన్ని పరిశీలిస్తే ఆనాటి ఆహార సంస్కృతి ఎలా ఉందో తెలుస్తుంది.

**సుబ్బప్పో సుబ్బప్పో - సోడిపప్ప మాడిపోతుంది**
**మీ ఆయనెక్కిన - రైలుబండి పారిపోతుంది　　　　॥సుబ్బప్పో॥**

1. **సుబ్బప్పో సుబ్బప్పో - కూరదాక మాడిపోతుంది**
   **మీ ఆయనెక్కిన - రైలుబండి పారిపోతుంది　　　　॥సుబ్బప్పో॥**
2. **సుబ్బప్పో సుబ్బప్పో - కూటికుండ మాడిపోతుంది**
   **మీ ఆయనెక్కిన - రైలుబండి పారిపోతుంది　　　　॥సుబ్బప్పో॥**
3. **సుబ్బప్పో సుబ్బప్పో - దాపుకుండ కారిపోతుంది**
   **మీ ఆయనెక్కిన - రైలుబండి పారిపోతుంది　　　　॥సుబ్బప్పో॥**

ఈ గేయంలో గ్రామీణ సంస్కృతి కనిపిస్తుంది. గ్రామీణ వ్యవహారిక భాషలో ఉన్న యాస ప్రత్యేకంగా పరిశీలించవలసిన అవసరం ఉంది. ఆ యాసలో సునిశిత హాస్యం మిళితమై ఉంది. గ్రామ జనపదాల్లో నేటికీ అక్కడక్కడా  సంబంధ  బోధక పదాలు గమనిస్తే సుబ్బప్పా, బావప్ప, పెద్దప్ప, చిన్నప్ప, అనే పదాలు ఆనాటి సంస్కృతిని తెలియజేస్తాయి. సుబ్బప్ప అనే పాత్ర చుట్టూ ఆనాటి వస్తు సంస్కృతికి సంబంధించిన కూరదాక, కూటికుండ, దాపుకుండ, అనే పాత్రలు ఈ తరానికి పరిచయం చేసినట్లైంది. మట్టి పాత్రలు ఇప్పుడు మచ్చుకైనను కనిపించుటలేదు. ఆనాటి పల్లె ప్రజలు ఉపయోగించిన మట్టి పాత్రల్లో చాలారకాల పేర్లు ఈ తరానికి తెలియవు.

జానపద గేయాల్లో అత్యంత ప్రాచుర్యం పొందిన గేయం "అత్తర సాయిబో రార" ఈ గేయంలో శృంగారంతోపాటు సునిశిత హాస్యం కనిపిస్తుంది. ప్రధానంగా వ్యవసాయ పనులన్నింటిలోను కూలీలు ఈ గేయాన్ని ఉత్సాహభరితంగా, వేగవంతంగా, సామూహిక గేయంగా పాడుకుంటారు. శ్రమను మర్చిపోవటానికి ఇటువంటి గేయాలు జానపద సాహిత్యంలో కోకొల్లలుగా కనిపిస్తాయి. ఈ గేయాన్ని పరిశీలిస్తే అత్తర సాయిబుకి ఒక గ్రామీణ స్త్రీకి ఉన్న సంబంధ బాధవ్యం, మరొకపక్క అమాయకుడైన భర్త యొక్క లక్షణాలు హాస్యాన్ని కలిగించే విధంగా కనిపిస్తాయి. వాటిని పరిశీలిద్దాం.

**అత్తర సాయిబో రార - అందాల మారాజో రారా**

1. **అత్తర సాయిబొత్తాడని - ఉత్తరమేశాను**
   **అది చింతల్లంక లాకులకాడ - చిక్కడిపోయిందో　　　　॥అత్తర॥**
2. **సందెకాడ వద్దామంటే - చలేసుకొచ్చింది**
   **చుక్కలు పొడిచాకొద్దామంటే - కుక్కలు మొరిగాయి　　　　॥అత్తర॥**
3. **అందరి మొగుళ్ళు భీమారమెళ్ళి - బిందులు తెస్తుంటే**
   **నా మొగుడు భీమారమెళ్ళి - బాడీలు తెచ్చాడు　　　　॥అత్తర॥**
4. **కారం కొట్టులో ఉన్నానని - కంగారు పడబోకు**
   **కాళీగుంటే కాలవగట్టుకు - నేనేవస్తాలే　　　　॥అత్తర॥**

**5. అదేటి మామ కుదేసి కొడితే - కుంకుమ రాలింది**
**కట్టుకున్న లంగాకాస్త - రంగైపోయింది		॥అత్తర॥**

ఈ గేయంలో శిష్ట సాహిత్యానికి మించిన ఆలంకారిక ప్రయోగం, వర్ణణాత్మక శైలి, అద్భుతంగా కనిపిస్తుంది. చక్కని ప్రాస, గ్రామీణ యాస కలగలిపిన శృంగారాత్మక సునిశిత హాస్య గేయం అత్తరసాయిబు అనే గేయం. ఈ గేయంలో జానపదుల మనస్తత్వాలు వారి అభీష్టాలు తేటతెల్లంగా కనిపిస్తాయి. అమాయక భర్త లక్షణాలు, ప్రౌఢత కలిగిన ప్రియురాలి గాఢమైన ప్రేమకు ఈ గేయం ప్రతిబింబంగా కనిపిస్తుంది.

చివరిగా జానపద హాస్య గేయాల్లో పిల్లల గేయాలు కూడా హాస్యాన్ని పంచే విధంగా కనిపిస్తాయి. వారి మాటలు, చక్కని పలుకుబడులు, హాస్యానికి తోడౌతాయి. వినోదాన్ని కలిగించడంతోపాటు ఆనాటి సాంప్రదాయకతను కనింపించే విధంగా ఈ గేయాలు మనకు కనిపిస్తాయి. వాటిలో కొన్నింటిని పరిశీలిద్దాం.

**మెద్రాసు మేడమీద చిలకాలింది**
**చిలకనుచూసి బేపనోడు పిలకూడింది.** అలాగే మరొక చిన్న గేయం

**మేస్టార్ మేస్టార్ మెట్టొంకాయ్**
**మేస్టార్ పెళ్ళం తెల్లొంకాయ్** అనే గేయంతో పాటు మరొక గేయం సంక్రాంతి సందర్భంగా చిన్నపిల్లలు సాయంకాల సమయంలో గోనిసంచె పట్టుకుని భోగిమంటకోసం పిడకల్ని, పుల్లల్ని, డొక్కల్ని, ఇవ్వమని అడుగుతూ ఇంటింటికి తిరుగుతూ ఈ విధంగా పాడుతారు.

**కూతురెందుకు వచ్చింది - కుడుములు తింటాకొచ్చింది**
**అల్లుడెందుకు వచ్చాడు - అరుసులు దొబ్బటానికొచ్చాడు**
**ఏసినోళ్ళకు పుణ్యం - వెయ్యనోళ్ళకి పాపం** అంటూ చక్కని గేయాన్ని ఆలపిస్తారు. ఈ విధంగా జానపద గేయాలు హాస్య రస ప్రవాహాలుగా నేటికీ ప్రచారంలో ఉన్నాయి. కొన్ని ప్రాంతాల్లో ఆధునికత పేర యంత్రాలు ప్రవేశించడంతో యంత్రాలే ప్రతిపని చెయ్యడంతో మనిషి అవసరం లేకుండా పోయింది. ప్రపంచీకరణ వచ్చి పేద కూలీల బ్రతుకుల్లో తూటాలు పేల్చినట్లైంది. ఒకపక్క రియల్ ఎస్టేట్ వ్యాపారంతో పంటచేలన్నీ ఫ్లాట్ల అమ్మకాలతో నిండిపోయాయి. మరొకపక్క డాలర్ల వ్యామోహంతో పచ్చనోట్ల వ్యాపారంతో పచ్చని చేలన్నీ చేపలచెరువులు, రొయ్యల చెరువులకు కేంద్రాలయ్యాయి. నారు వేసినదగ్గర నుంచి, నాట్లు వేసి పంట కోసే వరకు, ధాన్యం తూసి అమ్మేవరకు అన్నీ యంత్రాల అవసరమే కనిపిస్తున్నాయి. యంత్రాల యుగంలో మనిషి జీవితం యాంత్రికమైపోయింది, అందుకే జానపద సంస్కృతిని పరిరక్షించుకోవాల్సిన అవసరం ఉంది.

జానపద కవులు దురదృష్టవంతులు నేటికీ వారి గేయాలు ఇంకా సజీవంగా బ్రతికేఉన్నాయి. కాని ఆ గేయాలు వ్రాసిన కవులు ఎవరో, ఎవరు కూర్చారో, ఎవరు ప్రచారం చేసారో ఇప్పటికీ తెలియని పరిస్థితి. వారు నిరక్షరాస్యులైనా వారు తరతరాల సంపదగా వదలివెళ్ళిన జానపదగేయాలు నేటికీ సజీవంగా నిలిచేఉన్నాయి. మన ప్రాచీన జన సంస్కృతికి వారసులైన జానపద గేయ కళాకారులకు శిరస్సు వంచి నమస్కరించి కృతజ్ఞతలు తెలియజేయాలి. అది మనకర్తవ్యంగా భావించాలి. నేటి నుంచి ప్రతీ సభలోను సాంప్రదాయంగా అదే మన నినాదం కావాలి. అందుకే "కళలను పోషించు – కళాకారులను బ్రతికించు" అనే నినాదంతో ముందుకు సాగుదాం.

పాడినవారు :
1) కీ.శే. శ్రీమతి దాకారపు లక్ష్మమ్మ, ఐనవిల్లి మండలం
2) కీ.శే. పులిదిండి వెర్రియ్య, ఐనవిల్లి మండలం

## నండూరి వేంకట సుబ్బారావు గారి హద్దులు - హద్దులు- హాస్యనాటకం

**సునీత.డి**

పరిశోధక విద్యార్థిని,

ఆచార్య నాగార్జున యూనివర్సిటీ, గుంటూరు

సెల్ : 8247431536

**ఉపోద్ఘాతం :-**

హద్దు అంటే పరిధి. ఏదైనా పరిధి దాటితే అనర్ధమే జరుగుతుంది. అని చెప్పడమే ఈ హాస్య నాటిక యొక్క ఉద్దేశ్యం, హద్దులు - హద్దులు అనే నాటిక ద్వారా రచయిత నండూరి సుబ్బారావు గారు అల్లుడు, మరిది, అత్త, మామ పాత్రలచే ప్రతి విషయంలో హద్దులుండాలనే సందేశాన్ని హాస్యంతో మేళవించాడు. హద్దులు - హద్దులు అనే నాటికను 8వ తరగతి పాఠ్యపుస్తకంలో పిల్లలు చిన్నతనంలోనే నేర్చు కోవాలని పొందుపర్చడమైనది.

**కవి పరిచయం :-**

నండూరి వేంకట సుబ్బారావు 1895వ సం॥లో ఏలూరు దగ్గరలో ఉన్న వసంతవాడలో జన్మించారు. ఈయన వృత్తి న్యాయవాది. ప్రవృత్తి కవితా వ్యాసంగం ఇతని రచనలు ఎంకి పాటలు, ఎంకి పాటలు తొలిముద్రణ 1925లో 35 పాటలతో, ఎంకి పాటలలో నండూరు వారు వాడిన భాష గోదావరి మండలికం, విశాఖ ప్రాంత తూర్పుయాస నండూరి కావ్య నాయిక యెంకీ జానపద బాణీలో యెంకీ పాటలు రచించి ప్రజాదరణ పొందినారు. ఇతను 06-06-1984లో మరణించారు.

**హద్దులు - హద్దులు - ఇతి వృత్తం :-**

రచయిత నండూరి సుబ్బారావు గారు హద్దులు- హద్దులు అనే హాస్య నాటికలో అల్లుడు, బావమరిది, అత్త, మామగారు, డాక్టర్ గారు పాత్రల ద్వారా హాస్యాన్ని పండించారు. ఈ నాటిక యొక్క ముఖ్య ఉద్దేశ్యం హద్దు అనగా పరిధి. పరిధి దాటి ప్రవర్తిస్తే ఏం జరుగుతుందో తెలియజేశాడు.

క్రొత్తగా పెళ్ళై అత్తవారింటికి వచ్చిన అల్లుడికి అత్తగారింట్లో మంచి, మర్యాదలు బాగానే చేస్తారు. క్రొత్తగా పెళ్ళై అత్తవారింటికి వచ్చిన అల్లుడిని “బావా, బావా పన్నీరు బావని పట్టుకు

తన్నేరు. వీధి వీధి తిప్పేరు. వీశెడు గంధం పూశేరూ. అంటూ ఒక్క పక్క బావ మరిది ఆట పట్టిస్తుంటే, అత్త వారింటికి వచ్చిన అల్లుడు వసపిట్టలా మాట్లాడుతూ ఉండడం, మామకు చిరాకు తెప్పించడం జరుగుతుంది. బావమరిది అల్లరికి కానీ, అల్లుడి మాటలకు గాని హద్దే లేకుండా పోయింది. కొత్తగా ఇంటికి వచ్చిన అల్లుడు కదా అని అత్తగారు అతగాడికి హద్దూ, అదుపు లేకుండా బొబ్బట్లు గారెలతో భోజనం, కారప్పూసా, తాలింపు శెనగలూ అంటూ హద్దు లేకుండా ఆరోగ్యాన్ని అల్లకల్లోలం చేసి చిరుతిళ్ళు పెట్టి అత్తగారు తన ఆత్మీయతను చాటుకున్నారు. హద్దు మీరి తిన్న అల్లుడు గారి ఆరోగ్యం అయోమయావస్థలో పడి చివరకు కడుపు నొప్పితో కొట్టు మిట్టాడే పరిస్థితికి చేరింది. ఇలాంటి సమయంలో కూడా మరిది వేళా కోళాలు అతనికి చిరాకును పుట్టించేలా చేసింది. అసలే అల్లుడ్ని ఇంటికి తెచ్చి బోలెడు ఖర్చు పెడుతున్నాం. మరలా ఈయనకేమైనా అయితే ఏంటిరా బాబూ అంటూ మామగారి కంగారుకు కూడా హద్దు లేకుండా పోయింది. ఆరోగ్యం దారి తప్పిన అల్లుడిని ఆసుపత్రికి తీసుకెళ్ళడంతో కూడా అత్త, మామల మధ్య జరిగిన గొడవకూ హద్దు లేకుండా పోయింది. తప్పు నీదంటే – నీదంటూ చివరకు ఖర్చులో ఖర్చని అల్లుడ్ని ఆసుపత్రికి చేర్చే పరిస్థితి వారికెదురైంది.

అల్లుడి కేకలకూ, అత్తమామల కంగారుకూ, మరిది అల్లరికి హద్దు లేనట్లే డాక్టర్ గారి ఆపరేషన్ ఫీజుకి హద్దులేకుండా పోయింది. డాక్టర్ గారు అల్లుడి కడుపై ఓ రంపపు కోత కోసి అత్తగారు అప్యాయంగా పెట్టిన గారెలు, బొబ్బట్లు, వేరుశెనగ పప్పులతో పాటు అతి రహస్యంగా మెంతులు డబ్బాల్లో, పప్పు డబ్బాల్లో దాచుకున్న అయిదు పైసలు, పదిపైసలు నాణాలు, బొబ్బట్లు ద్వారా అల్లుడి కడుపులోకి పోవడం, వాటిని బయటకు తీయడం జరిగాయి.

మొత్తం మీద ఈ హాస్య, నాటికి తినడానికి, నవ్వడానికి, ఆలస్యానికి, తొందరకు, చాదస్తానికి, అల్లరికి, పిసినారి తనానికి, ఖర్చులకు ఇలా ప్రతి దానికి హద్దులుండాలని... లేకపోతే అంతా అనర్థమే నన్న సందేశాన్ని అందిస్తుంది.

**ముగింపు :-**

రచయిత నండూరి సుబ్బారావుగారు క్రొత్తగా పెళ్ళైన అల్లుడికి, అత్తగారి మర్యాదలు, బావమరిది వేళాకోళాలు, మామగారి పిసినారి తనం, అతగాడు పరిధి లేకుండా తినడం వల్ల,

అరగక, కడుపునొప్పి వచ్చి ఆసుపత్రికి తీసుకెళ్ళడం, డాక్టరు గారు రంపంతో కోసి కడుపులో ఉన్న బొబ్బట్లు, గారెలు, వేరుశెనగపప్పులు, అయిదు పైసలు, పదిపైసలు నాణాలు తీయడం మొదలైన సంఘటనలు హాస్యాస్పదంగా నాటకం ద్వారా వివరించారు.

కాబట్టి తిండికి, నవ్వడానికి, ఆలస్యానికి, తొందరకు, చాదస్తానికి, అల్లరికి, పిసినారి తనానికి, ఖర్చుకు హద్దులుండాలి. హద్దులనేవి లేకపోతే చివరకు అనర్థం జరుగుతుందని చెప్పారు. నేటి బాలలే రేపటి పౌరులు కాబట్టి పిల్లలు భవిష్యత్తులో ఇలాంటి అనర్థాలు జరగకుండా తమ పరిధి తెలుసుకుని ప్రవర్తిస్తారని ఈ 8వ తరగతి పాఠ్య పుస్తకంలో ఈ హద్దులు – అనే హాస్య నాటికను ఉపవాచకంగా పొందుపరచడమైనది.

# భానుమతి రామకృష్ణ గారి అత్తగారు - కట్టుడుపళ్ళు - హాస్యం

**జి.యం. మల్లేశ్వరి,**
ఎం.ఎ., బి.ఇడి.,
పరిశోధక విద్యార్థిని,
తెలుగు & ప్రాచ్యభాషా విభాగం
ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయం,
గుంటూరు - 522 510.
చరవాణి: 8333055125

**ఉపోద్ఘాతం :**

హాస్యం అంటే నవ్వు – ఆ నవ్వు పుట్టించేది హాస్యం. నవ్వు అనేది మానవులు క్రొత్తగా నేర్చుకున్నది కాదు, ఏడుపు ఎంత మానవ సహజమో నవ్వూ అంతే హాస్యమునకు కారణభూతమైనదీ, నవ్వించేది హాస్యం నవరసాల్లో హాస్యానికి ఎంతో ప్రాధాన్యం ఉంది. అసందర్భోచిత నవ్వు గురించి నవ్వు నాలుగు విధాలా చేటు అని ఉండవచ్చు. కానీ సందర్భోచిత హాస్యం గురించి అయితే నవ్వు నాలుగు విధాలా మేలు అనాలి. ఆనందోబ్రహ్మ అని అంటారు. ఆనందం వల్ల మనస్సు తేలిక పడుతుంది. నిత్యం ఉరుకులు, పరుగులతో నిండిన మనిషి జీవితంలో నవ్వు ప్రధాన భూమిక పోషిస్తుంది. ఎప్పుడూ శ్రమ, ఒత్తిడితో జీవించే మానవ జీవితంలో అప్పుడప్పుడు నవ్వుల జల్లులు కురిపించడం చాలా అవసరం లేకపోతే నిరాశా నిస్పృహలు ఆవహించి జీవితం అంధకారమయ్యే ప్రమాదం ఉంది.

**రచయిత గురించి :**

బహుముఖ ప్రజ్ఞాశాలి అయిన భానుమతీ రామకృష్ణ దక్షిణ భారత సినీనటి, నిర్మాత, ధర్శకురాలు, స్టూడియో అధినేత, రచయిత్రి, గాయని, సంగీత దర్శకురాలు భానుమతి గారు రాసిన "అత్తగారి కథలు" తెలుగు సాహిత్యంలో ఎంతో గుర్తింపు పొందాయి. 1966లో ఆమెకు భారత ప్రభుత్వం నుంచి "పద్మశ్రీ" పురస్కారం లభించింది. భానుమతి గారి పాత్ర యొక్క స్వభావం, మాటలు, చేసే పనులు చాలా నవ్వు తెప్పిస్తాయి. వట్టి ఛాదస్తపు మనిషి. ఒకటి చేయబోయి ఇంకొకటి చేస్తూ ఉంటుంది. హాస్యం పుట్టేది ఇక్కడే. 1994 లో ఈ పుస్తకానికి భానుమతి గారికి "ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ" అవార్డు లభించింది.

**అత్తగారు - కట్టుడుపళ్ళు కథ నేపథ్యం :**

ఈ కథలో అత్తగారికి పళ్ళు లేక పోవడంతో తనకిష్టమైన ఆహారం తినలేక ఆవిడ పడే అవస్థలు, బాధలు వినడానికి హాస్యాస్పదంగా ఉంటాయి. ఇక కథలోకి వెళ్తే డెబ్బై ఆరేళ్ళ అత్తగారికి పాపం పళ్ళూడిపోయి ఇష్టమైన పదార్థాలు తినలేక నానా అవస్థలు పడేవారు. ఆవిడది పూర్తిగా బోసినోరు కాకపోయినా ఆ ఉన్న నాలుగు పళ్ళూ ఒకదానికొకటి సంబంధం లేకుండా పాడుపడ్డ దేవాలయ స్థంభాల్లా ఆడుతూ ఉంటాయి. ఆవిడ ఏదైనా గట్టి పదార్థం నోట్లో వేసుకుంటే నాలుగు పళ్ళ మధ్య నాలుగు స్థంభాలాట ఆడాల్సిందే కానీ

నములుడు పడదు. క్రింది పన్ను కుతుబ్‌మినార్ అంత ఉంటే కోయించేశారా మధ్య పై పెదవికి దెబ్బ తగులుతుందని. వాళ్ళ వంట వాడు ఆవిడ పుట్టినరోజునాడు ఆవిడకిష్టమైన వడియాలు, చెకోడీలు, వడలు, పాయసం మొదలైన పదార్థాలన్నీ చేసిపెడతాడు. అవన్నీ చూసి నోరూరిపోయి ఆమాంతం నోట్లో వేసుకుని కాసేపు చప్పరించి, అప్పటికీ లాభంలేక నోట్లోనే నానేని చిగుళ్ళతో నొక్కడానికి ప్రయత్నించి నొప్పిపుట్టి ఓయమ్మో ఇది నమలం నావల్లకాదేవ్ అంటూ మింగేసేవారు. ఒకరోజు అనుకోకుండా అత్తగారి బాల్యస్నేహితురాలైన ఎనభైయేళ్ళ ఆండాళ్ళమ్మ వస్తుంది. తను కూడా పళ్ళు లేక తిండి తినడం కోసం పడిన పాట్లు చెప్పి, అవి తప్పించుకునేందుకు కట్టుడుపళ్ళు పెట్టించుకున్నట్లు చెప్తుంది. పంటికి పదేసి రూపాయల చొప్పున ఖర్చు అయినట్లు చెప్తుంది. అది విన్న అత్తగారు తానూ పళ్ళు కట్టించుకుని ఇంతకాలం తనని అవస్థపెట్టిన గట్టి పదార్థాలన్నింటినీ కసికొద్ది నమిలి మింగేయాలనీ కోరిక కలుగుతుంది. పంటికి పది రూపాయలు ఖర్చు పెట్టడం ఇష్టం లేకపోయినా కోరిన పదార్థాలు తినవచ్చు అనే ఆశతో కట్టుడు పళ్ళు పెట్టించుకుంటుంది. ఆ తర్వాత అలవాటు లేని ఆ పళ్ళతో నానా తంటాలు పడుతుంది. పళ్ళు కట్టించుకున్న విషయం మర్చిపోయి అలవాటుగా ఆహార పదార్థాలను మింగేస్తూ ఉంటుంది. తర్వాత ఆ విషయం గుర్తొచ్చి తనను తానే తిట్టుకుంటూ ఉంటుంది. ఈ క్రమంలో ఒక రోజు బావి దగ్గర నీళ్ళు తోడుకుంటూ, అక్కడే పని చేసుకుంటున్న పనిమనిషిపై కేకలేస్తూ ఉండగా కట్టుడు పళ్ళు కాస్తా ఊడి బావిలోపడిపోతాయి. దాంతో ఆవిడ లబోదిబో మంటూ పంటికి పది రూపాయలు పెట్టాను అని బాధపడిపోతూ ఆవిడపడే అవస్థలు వింటే మనకి విపరీతంగా నవ్వు తెప్పిస్తాయి.

**హాస్య సన్నివేశాలు :**

తన బాల్యస్నేహిరాలివి కట్టుడుపళ్ళని తెలిసి "ఓసి నీ అఘాయిత్యం కూలా, ఎంత మోసపోయానే! నీ నోట్లోవన్నీ కట్టుడు పళ్ళే? అంటూ ఆశ్చర్యపోతుంటే ఆవిడ అమాయకత్వం చూసి మనకు నవ్వొస్తుంది.

➢ "ఏమిటీ పంటికి పది రూపాయలే? మన కాలంలో ఇంకో మూడు రూపాయలు వేసుకుంటే సవరం బంగారం వచ్చేది కదూ!" అని అంటే దానికి ఆండాళమ్మ గారు "బంగారం ఏం చేసుకుంటామే? కరిగించి తాగుతావా? మనసుకు నచ్చినవి తినలేనప్పుడు దేనికి? అసలు చిన్నప్పుడు నీ పళ్ళు ఎట్లా ఉండేవి చెప్పు సొరగింజల్లా ఉన్నా ముత్యాల్లా మెరిసి పోయేవి కదూ!" అని ఆవిడ అంటుంటే అత్తగారు ముసిముసి నవ్వులతో సిగ్గుపడిపోవడం చూస్తే మనకు నవ్వాగదు.

➢ ఆండాళ్ళమ్మ మాటలు విన్న అత్తగారు తానూ పళ్ళు కట్టించునే ఉద్దేశ్యంతో "ఏమే నేనూ పళ్ళు కట్టించుకుంటే బాగుంటుందంటావా? ఉన్న ఈ నాలుగూ ఊడితే ఇంకా అవస్థ అవుతుందేమో! అయినా పంటికి పది రూపాయలు పెట్టి అన్ని పళ్ళు దేనికే, ఏదోకాస్త గట్టి పదార్థాలు నమలడానికీ, మాట తుస్సుపోకుండా ఉండడానికేగా కింది వైపూ, పై వైపూ రెండు రెండు పళ్ళూ... ముందువైపు మూడు మొత్తం పధ్నాలుగు చాలు. కాస్త వెడల్పాటి పళ్ళు పెట్టించుకుంటే సరి చోటు కలిసొస్తుంది" అని ఆవిడ అనే మాటలు వింటే నవ్వు ఆపుకోలేము.

➢ పళ్ళు పెట్టించుకున్న విషయం మర్చిపోయి – "అయ్యో తలరాత నమలడం మర్చిపోయానే" అని తనను తాను తిట్టుకోవడం చూస్తే హాస్యం అనిపిస్తుంది.

➢ "నోటి నిండా పళ్ళుంటే నమలాలని గుర్తుంటుంది. మైలుకొకటి కట్టించారు అవి ఉండీ ఒకటే లేకా ఒకటే" అంటూ వంటవాడు ఎగతాళి చేయడంలో హాస్యం కనిపిస్తుంది.

➢ పనిమనిషి మీద కేకలేస్తూ పళ్ళు ఊడి బావిలో పడిపోయినప్పుడు "అయ్యో! అయ్యో! నా పళ్ళే, నా బంగారం లాంటి పళ్ళు బావిలో పడ్డాయే. నేనేం చేసేదిప్పుడు" అంటూ అత్తగారు బావి చుట్టూ గిరగిరా తిరగడం చూస్తే నవ్వాగదు.

➢ "బంగారం లాంటి పళ్ళు కట్టించుకుని నెలరోజులు కూడా కాలేదు. ఒక్కో పన్నూ పది రూపాయలు, అన్యాయంగా బావి పాలు చేశాను. అయినా పళ్ళు కట్టేవాడు దగాకోరు కాకపోతే ఇట్టా తుమ్మితే ఊడిపోయే ముక్కులాగా కడతాడా? కాస్త గట్టిగా మాట్లాడితే పళ్ళు రాలిపోతే ఎట్టాగూ అంట. ఇంత లక్షణంగా కట్టడమే కాకుండా నాకున్న నాలుగు పళ్ళూ పీకేశాడే దుర్మార్గుడు" అంటూ ఆవిడ వాపోతుంటే పొట్ట చెక్కలయ్యే లాగా నవ్వొస్తొంది.

➢ బావిలో దిగి పూడిక తీసిన వాళ్ళు యాభై రూపాయలు అడిగే సరికి "అయ్యో! అయ్యో! యాభైరూపాయలే ఆ డబ్బు పెడితే 5 పళ్ళొచ్చేవి కదుటే" అంటూ లబోదిబో మంటూ, ఆఖరికి ఆ డబ్బు తీసుకుని వాళ్ళు వెళ్ళగానే ఆవిడ ఆ పూడిక ముందు కూర్చుని దిక్కుమాలిన పళ్ళు దొరక్కపోగా 50 రూపాయలు వదిలాయి" అంటూ బెంగపడిపోవడం చూస్తుంటే నవ్వుకోవడం మన వంతవుతుంది.

**ముగింపు :**

తెలుగు సాహిత్యంలో హాస్యానికి ఎందరో ప్రముఖులు పెద్ద పీట వేశారు. వారందరిలో భానుమతి గారి శైలి భిన్నమైందిగా చెప్పుకోవచ్చు. మధ్యతరగతి కుటుంబాల్లో జరిగే సంఘటనలను, ఉమ్మడి కుటుంబాల్లోని అభిమానాలను, అత్తాకోడళ్ళు మధ్య ఉండే బాంధవ్యాన్ని ఎంతో హాస్య రూపకంగా వర్ణించారు. వారి కథలు వింటుంటే మనకు నిజ జీవితంలో జరిగే సన్నివేశాలు కళ్ళకు కట్టినట్లుగా ఉంటాయి.

# సాక్షి వ్యాసాల్లో హాస్యం

- డా॥ వి.కె.టి. మహాలక్ష్మి
తెలుగు ఉపన్యాసకురాలు
ప్రభుత్వ మహిళా డిగ్రీ కళాశాల, మర్రిపాలెం
విశాఖ జిల్లా.
e-mail : vktmahalakshmi@gmail.com

తెలుగు భాషను ఇష్టపడేవారు సాక్షి వ్యాసాలను కళ్ళకద్దుకుంటారు. పానుగంటి లక్ష్మీ నరసింహారావు గారు తెలుగులో వ్యాస ప్రక్రియకు వన్నెతెచ్చారు. సమకాలీన సామాజిక అంశాలన్నింటినీ సాక్షిలో ప్రస్తావించారు. సాంఘికాభివృద్ధిని కాంక్షించి, సామాజిక లోపాలను, వ్యక్తుల మనో వైకల్యాలను ఘాటుగా విమర్శిస్తూనే, దానికి తగ్గట్టు సమపాళ్లలో హాస్యాన్ని మేళవించి వ్యాసాలకు వింత సొబగును చేకూర్చారు.

ఇంగ్లీషులో ఎడిసన్, స్టీల్ అనే రచయితలు "స్పెక్టేటర్, టాట్లర్" అనే పత్రికల ద్వారా సంఘ విమర్శ చేశారని, పానుగంటి వారు "స్పెక్టేటర్" పదాన్నే సాక్షిగా అనువదించుకున్నారని సాక్షివ్యాస సంపుటి ముందుమాటలో పేర్కొనబడింది.

**7** సంపుటాలుగా వెలువడిన **147** సాక్షి వ్యాసాలను 'ఎమెస్కో' వారు ఒకే సంపుటిగా పుస్తక ప్రియులకు అందించారు.

పానుగంటివారు రాజమండ్రి దగ్గర సీతానగరంలో **11-02-1865**న జన్మించారు. **01-01-1940**న మరణించారు. వీరు నాటక కర్తగా కూడా ప్రసిద్ధులు. వీరు రచించిన రాధాకృష్ణ, పాదుకాపట్టాభిషేకము, కంఠాభరణం వంటి నాటకాలు ఎంతో ప్రసిద్ధి చెందాయి. వీరికి ఆంధ్రా ఎడిసన్, ఆంధ్రా షేక్స్పియర్, అభినవ కాళిదాసు బిరుదులు కలవు.

నదీ జలాలు అనువైన మార్గం గుండా పరవళ్లు తొక్కి ప్రవహించినట్లు సాక్షి వ్యాసాలు చెప్పే విషయాన్ని బట్టి విధానం మార్చుకుంటాయి. ఇందులో 'జంఘాలశాస్త్రి' అనే వ్యక్తి సభకులనుద్దేశించి ప్రసంగిస్తుంటాడు. ఒక్కోసారి ఉపన్యసించినట్టు కలగంటాడు. ఊహాతీతమైన భావాలతో వింత వింత తీరుల్లో చెప్పదలచిన అంశాలను అధిక్షేపధోరణిలో చెప్తూనే, వాటికి హాస్యాన్ని మేళవించి పాఠకుల మనస్సులను గెలుచుకోవటం సాక్షివ్యాసాల ప్రత్యేకత.

ముఖ్యంగా సాక్షి వ్యాసాల గొప్పదనం ఏంటంటే, పానుగంటి వారి అభిప్రాయాలతో పాఠకులు ఏకీభవించక పోయినా, వారి శైలీ చమత్కారం చదువరులను తన వెంట లాక్కుపోతుంది.

ఈ వ్యాసాల్లో అనర్గళంగా సాగే జంఘాలశాస్త్రి వాగ్ధాటి పాఠకులకు ఆశ్చర్యం కల్గిస్తుంది. ఈ వ్యాసాల్లో తెలుగు అక్షరాలు కదం తొక్కుతాయి. పదాలు చెంగు చెంగున గంతులేస్తాయి. వాక్యాలు ఉవ్వెత్తున ఎగిసిపడే సముద్ర కెరటాలై విజృంభిస్తాయి. ఈ వ్యాసాల్లో తడమని సామాజికాంశం లేదంటే అతిశయోక్తి కాదు. తెలుగు భాషా పటిమను పొందగోరే విద్యార్థులకు సాక్షివ్యాసాలు అవశ్య పఠనీయం, సాక్షి వ్యాసాలు అనిర్వచనీయాలు, అనుభవైకవేద్యాలు.

చిన్న పామునైనా పెద్దకర్రతో కొట్టాలన్నట్టు, ఏ చిన్న విషయానికైనా అనేక ఉదాహరణలు, సామెతలు, అలంకారాలతో సాగే సాక్షి వ్యాసాలను మెచ్చుకుంటూ శ్రీశ్రీ గారు చెప్పిన సరదా పద్యం.

"లక్ష్మీ నరసింహారావు పానుగంటి
సాక్షి వ్యాసాలు చదవడం మాననంటి
ఏంచేతంటే వాటిలో పేనులాంటి
రూపాన్నియ్యడం నేను గంటి".

"తృష్ణ" అనే వ్యాసంలో ఉన్నదానితో సరిపెట్టుకోక, లేనిదానికోసం అర్రులు చాచే మానవ మనస్తత్వాన్ని ఆమూలాగ్రం వర్ణించారు. ఆ సందర్భంలో కవి రాసిన పద్యం చదువరులకు నవ్వు తెప్పిస్తుంది.

"మానసికి నున్న దేదైన లేనిదగును
లేనిదే యుండదగినది లేనిదాని
కేడ్వ దగినది యుండి లేకేడ్వులేక
లేక యెదుపె బ్రతుకగు లోకమందు"

సాక్షి వ్యాసాల్లో ఓ మూడు వ్యాసాలను ఈ వ్యాసంలో పరిచయం చేస్తాను. 'భూతవైద్యము, 2. వేదాంతోపన్యాసము, 3. దివ్యయోగములు. "భూతవైద్యము" హాస్యస్ఫోరకంగా ఉంటుంది. ఈ వ్యాసంలో ఒక భూతవైద్యుని శిష్యుడు, గురువులు గారి వద్ద నున్న సాధన సామాగ్రిని గూర్చి వివరిస్తాడు. ఆవహించిన దెయ్యాన్ని వదిలించడానికి వారివద్ద కొన్ని పరికరాలుంటాయి. అవి ప్రజలకు తెలిసిన వస్తువులే అయినప్పటికీ, రోగులకు చికిత్సయందు అనాదరణ కలగకుండా వాటికి వింత వింత పేర్లు పెడతారు.

"చీపురుకట్ట – కాంతాకరవాలం, వేపచెత్తం – బాల బుద్ధుద్దీపి, దూలగొండి బూడిద – ఉగ్ర నారసింహం, ఇనుపగోళ్లు – కాళికాదంష్ట్రలు, సీసాలు – క్షోణీ కుక్షి నిక్షేపాలు, తాటాకు మొక్క – గ్రంథపత్ర శకలం, పసుపు – "హేమ రజం".

ఆ భూతవైద్యుని దగ్గరకు ఒకరోజు ఒక వెలమదొర వచ్చి తమ వీధిలో ఒక బాలెంతరాలు చనిపోయి బ్రహ్మరాక్షసి అయ్యిందని, ఓ రాత్రివేళ ఒక భటుడు అటువైపు వెళితే ఎదుటపడి గుండెలపై ఒక్క చరుపు చరిచిందని, అతని గుండెపై ఆ రక్కసి గోళ్లగీరుల ఆనవాళ్లు కూడా ఉన్నాయని, ఆ భటుడు ఇంటికి వచ్చి, రెండు రక్తవమనములు చేసుకుని మరణించాడని, ఆ వీధి సాయంకాలమైతే చాలు నిర్మానుష్యమౌతుందని, ఎలాగైనా ఆ బ్రహ్మరాక్షసి బారినుండి కాపాడమని భూతవైద్యుని వేడుకుంటాడు.

ఆరాత్రి భూతవైద్యుడి శిష్యుడు ఆ వీధిలోకి వెళ్తాడు. ఆ వీధిలో ఒక్క దీపం కూడా లేదు. అతడు భయపడుతూనే ఆ దొర చెప్పిన ఇంటివైపు వెళ్తాడు. అంతలో దెయ్యంవచ్చి దబాలున గుండెలవిసిపోయేలా అతడిని కొడుతుంది. అతడు కెవ్వున చావుకేక పెడుతూనే, రెండు చేతులతో తన గుండెను గట్టిగా పట్టుకుంటాడు. అతని చేతులలో చిక్కుకున్న భూతం పీకినా, కరిచినా లెక్కచేయక, పట్టువదలక ఒక్క పరుగున భూతవైద్యుడి ఇంటికి వస్తాడు. అప్పుడా భూతవైద్యుడు క్షోణీకుక్షి నిక్షేపములో ఆ దెయ్యాన్ని బంధించాలని, నెమ్మదిగా చేతులపట్టు విడువమని చెప్తాడు. శిష్యుడు గుండెలమీద నుండి చేతులు తీయగానే, ఒక పెద్ద గబ్బిలము తుర్రున ఎగిరి, ఆ

గదిలో ఉన్న ఒక విగ్రహంపై వాలుతుంది.

శిష్యుడిని కొట్టినప్పుడు బ్రహ్మరాక్షసి రూపంతోటే ఉందని, కామరూపిణి కావటంవల్ల, శిష్యుడు పట్టుకోగానే గబ్బిలంగా మారిందని ఆ భూతవైద్యుడు శిష్యుడితో చెప్తాడు. శిష్యుడి ధైర్యానికి మెచ్చుకుంటాడు. "గబ్బిలం గాధ రెండవ కంటి వానికి తెలియకూడదు సుమా' అని హెచ్చరిస్తాడు.

ఇది చదివిన పాఠకులు భూతవైద్యుని బతకనేర్చిన తనానికి, ప్రజల అజ్ఞతకు నవ్వకుండా ఉండలేరు.

వేదాంతోపన్యాసము మెట్ట వేదాంతంపై, వ్యంగ్యాస్త్రమీ వ్యాసం, ఒక ఊరికి ఆకస్మికంగా ఒక వేదాంతి వచ్చి, ఆ ఊరి దేవాలయంలో వేదాంతోపన్యాసం ఇస్తాడు. ఆ ఉపన్యాసం విన్న వారికి వైరాగ్యం బాగా తలకెక్కుతుంది. అప్పటి వారి మాటలను కవిగారు ఇలా వర్ణిస్తారు.

ఇంత ఆలస్యమైనదేమి? అని భార్య అడిగితే, "మూడునాళ్ల ముచ్చటకు ఆలస్యమేమి? శీఘ్రమేమి? అని బదులిస్తాడు భర్త.

'మా అమ్మకు అటుకుల వడ్లు ఎందుకు తీసుకురాలేదని, ఓ భార్య అడిగితే, "తలలో జ్ఞానము లేనప్పుడు కడుపులో నడుకులేల?" అని భర్త విరుద్ధముగా మాట్లాడతాడు.

"వడియాలు నేతిలో వేయించనా? అని భార్యభర్తను అడుగుతుంది.

"వేగిన వడియము నా నోట బదుసరికి నేను మృత్యువు నోట బడకయుండగల నను విశ్వాసమెట్లు? అని భర్త ప్రత్యుత్తరమిస్తాడు.

పై సంభాషణలన్నీ చదువరులకు నవ్వు పుట్టిస్తాయి.

ఇలా అందరికీ జ్ఞానబోధ చేసిన వేదాంతి ఓ వర్తకుని ఇంట్లో రత్నాభరణాల పెట్టెతోను, ఇంటివారి కోడలితోను పరారవుతాడు. పరారైన వేదాంతికోసం అందరూ వెదుకుతుండగా ఇంతలో అక్కడికి రక్షకభటులు వచ్చి, ఆ వేదాంతి పాతనేరగాడని ఈ మధ్యనే ఒకమ్మాయి గొంతు పిసికి చంపి, ఆమె మెడలోని హారాన్ని అపహరించాడని చెప్పడం ఈ వేదాంతోపన్యాసానికి కొసమెరుపు.

"దివ్యయోగము" అను వ్యాసములలో జంఘాలశాస్త్రి అతీంద్రియ శక్తులు సాధించవలెనని తక్కువ శ్రమతో మహాకార్యములు చేయవలెనని తపించి ఒక సిద్ధుని వద్దనుండి "సర్వ జగద్రహస్యసార"మను గ్రంథాన్ని తస్కరిస్తాడు.

"సీతనూలు దారంబులు చిదుకగొట్టి
గాడిదగడపాకురసాన గలిపి కాచి
తత్కషాయంబు చిట్టాముదమున గూర్చి
కాళ్లరాయంగ నాకాశ గమనమిచ్చు"

పై పద్యమాధారంగ ఒక లేపనాన్ని తయారుచేస్తాడు. ఆకాశ గమన విద్యయందు ఆశక్తి గల కాళ్లకు ఆ లేపనం పూస్తాడు. ఆ వ్యక్తి దర్శించవలసిన ప్రదేశాన్ని మనసులో తలుచుకుని ఒక్కసారిగా ఎగిరి గోడపక్క నున్న గాదెకింద పడతాడు.

"పగటనేకాదశిని జంపబడిన తొండ
నాల్కనుదుము నెత్తుట మర్ధనంబొనర్చి
పొదుము చిటికింత పసుపుతో బొందుపఱచి
కలికమును వేయ లొంగని కాంతలొంగు"

పై పద్యంలో చెప్పినట్టు కలికాన్ని తయారుచేసి స్త్రీ వశీకరణయందు ఆశక్తి గల ఓ వ్యక్తికి ఇస్తాడు. ఆ వ్యక్తి ఆ కలికాన్ని ఓ స్త్రీమీద ప్రయోగించి ఆమె చేతిలో తన్నులు తింటాడు.

"ఆ దూడ రేణంబు గేదెమూత్రమఱు తోడ
గలయనూఱుచు రెండుతులము లెత్తు
.......................................
పూసికొనగ నదృశ్యుడౌ పురుషుడిలను"

పై పద్యంలో చెప్పిన వస్తువులతో ఒక తైలాన్ని తయారుచేసి, తానెవరి కంటికీ కనిపించకూడదని భావించే ఓ వ్యక్తికి ఇస్తాడు. ఆ వ్యక్తి ఓ రాత్రివేళ ఆ తైలాన్ని ఒళ్ళంతా పూసుకుని గాఢంగా నిద్రిస్తున్న తన తల్లిని లేపి "అమ్మా నీకేమైనా ఎదుట కనబడుచున్నదా? అని అడుగుతాడు నిద్రమత్తుతో ఉన్న ఆమె "పోరా! నాకేమీ కనబడటం లేదు" అనగా, అది నిజమని భావించి ఆ వ్యక్తి ఒక వర్తకుని ఇంటికి దొంగతనం చెయ్యడానికి వెళ్లి, దొంగతనం చేస్తూ పట్టుబడి కారాగార బద్ధుడౌతాడు.

ఇలాంటి విషయాలన్నీ వర్ణించి చివరకు "సర్వజగద్రహస్యసారము"ను తగలబెట్టటంతో ఈ వ్యాసం పూర్తవుతుంది.

కవిశేఖర బిరుదాంకితులైన పానుగంటి లక్ష్మీనరసింహంగారు సాక్షి వ్యాసాల్లో సాంఘిక దురాచారాలను, మూఢ నమ్మకాలను, నయవంచకుల నైజాన్ని, వ్యక్తుల్లోని స్వార్థపరత్వాన్ని తనదైన శైలిలో తూర్పారబట్టారు. వ్యంగ్యాన్ని ఆశ్రయించి, చెప్పే విషయానికి, హాస్యాన్ని మేళవించి, చదువరులకు ఆనందం కల్గించారు. సాక్షివ్యాసాలు సామాజికుల మీద ప్రయోగించిన హాస్యం పూసిన బాణాలు, నవ్విస్తూనే ఆలోచింపచేయటం సాక్షివ్యాసాల ప్రత్యేకత. సాక్షి వ్యాసాల్లో ఏ వ్యాసాన్ని చదివినా అందులో అంతర్లీనంగా హాస్యం తొంగి చూస్తుంది. సమాజంలోని ఎగుడుదిగుళ్లను సరిచేయటానికి పానుగంటి వారు సాక్షి వ్యాసాల ద్వారా శతధా ప్రయత్నించారు.

ఆధార గ్రంథం :

సాక్షి : పానుగంటి లక్ష్మీనరసింహారావు
సంపాదకులు : డా॥ డి. చంద్రశేఖరరెడ్డి
ముద్రణ : నవంబరు 2011

## హాస్య ప్రసంగాలు

డా॥ చదలవాడ విజయకుమార్
తెలుగు శాఖాధ్యక్షులు, గవర్నమెంట్ డిగ్రీ కళాశాల,
నాయుడుపేట - నెల్లూరు జిల్లా.
చరవాణి : 9490105761

శాంతి మొదలగు నవరసాల్లో అత్యంత క్లిష్టతరమైందీ, కష్టసాధ్యమైందీ హాస్యరసం. అది కంటికి పెట్టుకునే కాటుకలాంటిది. లేశమంత వాసి తగ్గితే కళ నిలబడదు. ఏమాత్రం మితి మీరినా వెగటుపుడుతుంది. హాస్యరచన కత్తిమీద సాములాంటిది. అందుకే తలపండిన కవులూ, రచయితలూ ఎందరో హాస్యరసాన్ని పండించడం కష్టమైందని గ్రహించి దాని జోలికి పోకుండా మిగిలిన రసాల్ని ఆశ్రయించి కీర్తిని పొందారు.

నిజానికి తెలుగు నిత్యజీవితంలో హాస్య చతురుడు కావచ్చునేమో గాని సాహితీ జీవనంలో మాత్రం తెలుగు వారి హాస్య చతురత తక్కువనే చెప్పాలి. పూర్వ రచనల్లో తెనాలి రామకృష్ణుని పాండురంగ మహాత్యంగానీ, చికలమర్తి లక్ష్మీనరసింహం గణపతి నవల గానీ, మొక్కపాటి పార్వతీశం రచనలుగానీ ఇలా అక్కడక్కడ కొన్ని రచనలే ఉన్నాయేగానీ పూర్తిస్థాయిలో హాస్యంతో కూడిన రచనలు అంతంత మాత్రమేనని చెప్పాలి.

1935 వరకు తెలుగులో ఆరోగ్యకమైన హాస్యం పుట్టనేలేదు. "శ్రీ భమిడిపాటి కామేశ్వరరావు, శ్రీ మొక్కపాటి నరశింహశాస్త్రి, మునిమాణిక్యం నరశింహారావు ఈ ముగ్గురే అసలు సిసలైన హాస్యాన్ని ఆంధ్రలోకానికి ప్రసాదించింది. ఇదే మార్గాన్ని మరింత కాంతివంతంగా మార్చిన అనేక మందిలో ముళ్లపూడి వెంకట రమణను ప్రత్యేకంగా చెప్పుకోవాలి. సీరియస్‌గా ఉండే జంధ్యాల సినిమాలు కూడా ఎంత హాస్యంగా ఉంటాయే మనందరికి తెలిసిందే ఈ వారసత్వాన్ని అందిపుచ్చుకున్న "దర్భాబాబురావు" హాస్య ప్రసంగాల సంపుటిని ఆంధ్ర లోకానికి అందించారు.

కళా, సాహిత్య సాంస్కృతిక రంగాలకు పుట్టినిల్లైన బాపట్లలో పుట్టి పెరిగిన దర్భాబాబురావు వృత్తిరీత్యా వాణిజ్య శాస్త్ర అధ్యాపకులు. ఆర్ట్స్, సైన్సెస్ కళాశాల బాపట్లలో బాపట్ల కళా, సాహిత్య సాంస్కృతిక రంగాలకు పుట్టినిల్లు. అందువల్లనేమో సాహితీ సాంస్కృతిక రంగాల వైపు ఆకర్షితులైనాడు.

డా॥ కె.వి.యస్. ఆచార్యగారి సాహచర్యం, పోలాప్రగడ సత్యనారాయణ మూర్తి ప్రేరణ ఉషశ్రీ గారి పరిచయం, హాస్య రచనలపై మక్కువకు కారణమైంది. అనంతరం నటులుగా, చిత్రాకారులుగా, గేయరచయితగా, ఆకాశవాణి ద్వారా అనేక హాస్య ప్రసంగాలు చేయడం - ప్రవృత్తిగా పెట్టుకొని ఎన్నో బహుమతులను పొందారు. వీరు రాసిన "కదిలే రైల్లో కథాకళీ" హాస్య ప్రసంగాల సంపుటి నుండి కొన్ని ప్రసంగాలను సదస్సును దృష్టిలో ఉంచుకొని పరిచయం చేస్తాను.

### భర్తల్ని లొంగదీసుకోవడం ఎలా ప్రసంగ సారాంశం

ఎక్కడున్నా ఆన్యోన్య దాంపత్యం ఇంటికి, వాడకి, ఆమాటకొస్తే ఆ ఊరికి చివరకి దేశానికి ఎంతో ఆరోగ్యకరం. అలా ఉండాలని అందరం అనుకుంటాం. అలా ఉంటారా వాళ్ళు అంటే ప్రశ్నార్థకం. భార్యాభర్తలిరువురూ ఒకరి మీద ఒకరికి ఆధిపత్య పోరు ఉండనే ఉంటుంది. కాపురానికి ముందే ఇరువురు శిక్షణ పొందే ఉంటారేమో? నిత్య అగ్నిహోత్రంలా ఇద్దరి మనస్సుల నుండా అదే భావన. కాస్త మెళకువ, వివేకం కలిగిన వారు మాత్రం ఎంతటి సంక్లిష్ట పరిస్థితులనైనా పొగడ్తలతో దారికి తెచ్చుకుంటారు. ఎంతటి మొండి మొగుడైనా భార్యను లొంగదీసుకోవడానికి చివరి ప్రయత్నంగా తన చావుని కూడా ఎరగా పెట్టడానికి వెనుకాడరు. ఈ విషయంలో మగదేవుళ్ళు కూడా వారికే పూర్తి మద్దతునిస్తారు. స్థూలంగా ప్రసంగం ఇది. నవ్వుకోవడానికే అనేక హాస్య పంక్తులు ప్రసంగం నిండా కనువిందు చేస్తాయి. భార్యభర్తలు గొడవల్ని గండు పిల్లులాగా కీచులాడుకోవడం. కొటాకుస్తీ మొదలు పెట్టి ఇంట్లోంచి వీధుల్లోకి, వీధిదాటి ఊరిమీదకీ పడటం". తన ఇంటి జగడం ఆడచేదుక పొరుగింటి జగడం చూడవేడుక" లాగా చెయ్యడం. లాంటి హాస్యోక్తులు హాస్యంతో పాటు ఆలోచనను కలిగిస్తాయి.

దీనికంతటికి కారణం భార్యలకు భర్తలను లొంగదీసుకోవడానికి 'సాంకేతిక పరిజ్ఞానం' లేక పోవడమేనని ఛలోక్తి కిసురులారు. లొంగదీసుకోవడం అనేది ఒక "అసంకల్పిత ప్రతీకార' చర్యగా పేర్కొంటాడు. ఈ ప్రక్రియకు కావలసిన అన్ని హంగులూ, ఆయుధాలు ఆడవాళ్ళకు అడక్కుండానే భగవంతుడు ప్రసాదించాడట. దీనికి కారణం ఒక్క రాముడికి తప్ప మిగిలిన దేవుళ్ళందరికీ అనేక మంది భార్యలు ఉండటమే కారణమని, చెపుతూ 'సతీనిరోధం' ఉంటే ఇప్పటి మగాళ్ళకు ఆడవాళ్ళ వల్ల ఇన్ని సమస్యలు ఉండకపోవు అనె హాస్యధోరణిలో ప్రసంగిస్తాడు.

మరొక సందర్భంలో ఏ పనిని నేర్చుకోవాలన్నా దానికి సంబంధించిన సమాచారం విరివిగానే లభ్యమవుతుంది. దాని నుండి శిక్షణ పొందవచ్చు. కానీ భార్యలు భర్తలను లొంగదీసుకోవడానికి ఏరకమైన శిక్షణ అవసరం లేదని" అందరి కాంతలకూ ఆసాంతం లొంగదీసుకునే శక్తియుక్తులు సహజంగానే కలిగి ఉంటారని అంటాడు. ఈ సందర్భంగా త్యాగరాజు కీర్తనను ఉటంకిస్తూ "ఎంత నేర్చినా... ఎంత జూచినా - ఎంత వారలైనా... కాంతదాసులే" అని రాగం కట్టి మరీ పాడినట్లుగా చెపుతారు.

ఇక భర్తలను రెండు రకాలుగా వర్గీకరిస్తారు. దూదిపింజలు, దుండముక్కలు అని. దూది పింజలు లాంటి భర్తలు పూర్తిగా భార్యల కనుసన్నల్లోను, అదుపు ఆజ్ఞల్లోనూ, కొంగును పట్టుకొని వేళ్లాడే వారిగాను, మొత్తంగా భార్యలు కోర్కెలు తీర్చే యంత్రాలుగా మారుతుంటారని హాస్యాన్ని పండించారు. దుండుముక్కలు లాంటి భర్తలను లొంగదీసుకోవడానికి గడుసు భార్యలు నాటక రచయితలకే అంతు చిక్కని నాటకాలు ఆడుతుంటారు. భర్తలపై సామధాన ప్రయోగాలు చేసిన తరువాత అప్పటికీ లొంగక పోతే - "ఏమార్గమూ దొరకనప్పుడు దుర్మార్గమే గతీ' అని - నూతిలో దూకుతాననో ... ఉరోసుకుంటాననో బెదిరిస్తారు. ఇలాంటి కుయుక్తులికి ఎలాంటి మొండిఘటం భర్తైనా లొంగి రాక ఛస్తాడా" ని హాస్యపు జల్లులు కురిపిస్తాడు రచయిత. మొత్తంగా భార్యా భర్తల బంధంగా మంగళకరంగా ఉండాలంటే పొగడ్తలను నమ్ముకుంటే ఇరువురికి ఎటువంటి డోకాలేదని, సందేశంతో హాస్య ప్రసంగాన్ని ముగిస్తాడు రచయిత దర్భాబాబూరావు.

ఇదే హాస్యపు జల్లుల ఝుదుల ప్రస్థానంలో కొన్ని ప్రసంగాల పేర్లను గమనిస్తే పండగ అల్లుడు, వద్దనకూడా ఒక కళే, అధులెరుగని అతిథులు, అరువులు తెచ్చిన పుస్తకం, పోటీకోసం కసరత్తులు, కంటి తుడుపు మార్కుల సంస్కృతి, అందని రైలు, తుమ్ముకు తమ్ములు లేరు' - మొదలైన హాస్య ప్రసంగాలు పాఠకుల్ని హాస్యంలో ముంచెత్తుతాయి.

సృజనాత్మక కళైన హాస్యాన్ని సృష్టించడం సామన్యమైన విషయం కాదు. హాస్యం హృదయాల్ని తేలిక పరస్తుంది. కాని సృష్టి మాత్రం అంత తేలిక కాదని ఒక ఆంగ్లకవి ఇలా అన్నాడు "It lighten the heart, But the process to arrive at it requires serious thinking".

అందువల్ల మనిషి జీవితం పుట్టుక నుండి చావు దాకి దు:ఖమే. అయితే అందులో తనకు కావాల్సిన ఆనందాన్ని వెతుక్కోవడానికీ, పదిమందికి పంచడానికీ మనిషి సాహిత్య సృష్టి చేశాడని చెప్పొచ్చు. ఈ ఆనందాన్వేషణే మనిషిని ఇతర జీవరాసుల నుండి వేరు చేసిందని చెప్పడంలో ఏమాత్రం సందేహం లేదు.

ఆధునిక కాలంలో, వేగవంతమైన జీవితంలో, హాస్యానికి మరింతగా దూరం అవుతున్నాడు. ఒకప్పుడు నవ్వు నాలుగు విధాల చేటని ఎందుకన్నారో తెలియదు గానీ ఇవాళ సంపూర్ణ ఆరోగ్యానికి 'నవ్వు' నాలుగు విధాలుగా అవసరం. అందుకే అన్ని నగరాలల్లో "హ్యూమర్ క్లబ్స్" పుట్టుకొచ్చాయి. పనిగట్టుకొని రోజూ గంటసేపు నవ్వడం ఆరోగ్యం కోసమే" నని విరివిగా ప్రకటనలు కూడా రావడాన్ని చూస్తూనే ఉన్నాం. అలాగే ఇలాంటి జాతీయ సదస్సులు జరపడం కూడా హాస్యానికి కావలసిన టానిక్‌ను అందిస్తున్నట్లేనని చెప్పక తప్పదు.

**ముగింపు :-**

'దర్భాబాబురావు రచించిన కదిలే రైల్లో కథాకళీ' హాస్య ప్రసంగాల సంపుటి ఈ సందర్భంగా అభినందిస్తూ వాసనలేని పూవులా పరిహాస ప్రసంగం లేని వాక్యం వ్యర్థమన్నాడు ఒక తెలుగు కవి. హాస్యం ఆనందాన్నీ, ఆరోగ్యాన్నీ ఇచ్చి విషాద విచ్ఛేదకమవుతుంది. అలాగే తనివి తీర నవ్వడం వల్ల శ్వాసకోశమంతా ప్రాణవాయు మయమవుతుంది." అఇదువల్ల రోజూ ఓ గంటసేపు నవ్వితే అమృతాన్ని సేవించినంత అనుభూతి కలుగుతుందని చెప్పిన పెద్దల మాటలు అక్షర సత్యం.

**ఉపయుక్త గ్రంథాలు :-**

1. కదిలే రైల్లో కథాకళీ హాస్య ప్రసంగాల సంపుటి

2. బారిస్టరు పార్వతీసం మొక్కపాటి నరశింహారావు.

## గొల్లపూడి 'బడ్జెట్ ప్రతిపాదన' హాస్యవ్యాసం - విశ్లేషణ

డా. ఎమ్.ఆర్.ఎల్.శంకర రావు

తెలుగు అధ్యాపకులు

శ్రీ విశ్వశాంతి విద్యాసంస్థలు

ఉయ్యూరు, కృష్ణాజిల్లా, ఆంధ్రప్రదేశ్.

చరవాణి : 96188 71530.

'హాసము' అనే పదానికి 'నవ్వు' అని అర్థం. హాసాన్ని కలిగించేది కనుక హాస్యం. మేలము, చతురు, చమత్కారము, పరాచికము, పరిహాసము, ఎకసక్కెము వంటి పర్యాయపదాలెన్ని ఉన్నా 'హాసము' అనే మాటను తరచూ వాడుతూ ఉంటాం. ధనంజయుడు తన అలంకారిక గ్రంథమైన దశరూపకంలో-

**"స్మిత మిహ వికసిత నయనం**
**కించిల్లక్ష్య ద్విజంతు హసితం**
**స్యాత్ మధుర స్వరం విహసితం**
**సశిరః కంప మిద ముపహసితం**
**అపహసితం సాస్రాక్షం**
**విక్షిప్తాంగం భవత్యతి హసితం"**

అని చెబుతూ హాసము ఆరు రకాలంటూ పేర్కొన్నాడు. వీటిలో స్మితం, హసితం మాత్రమే ఉత్తమమైనవనీ, తక్కినవి ఉత్తరోత్తరం పరిహరణీయాలనీ పేర్కొన్నాడు.

'సహృదయుడూ, విజ్ఞుడు, దయామయుడూ, నాగరికుడూ అయిన వ్యక్తిని నవ్వించేదే ఉత్తమమైన హాస్యం' అని పాశ్చాత్య పండితుడు 'బర్గసన్' అన్నాడు. అంటే అందుకు భిన్నమైనది ఉత్తమహాస్యం కాదు అని అర్థం. అనగా అవహేళన చేసేదీ, ఇతరుల మనసుల్ని నొప్పించేదీ, కొందరికైనా ఇబ్బందినీ, మానసిక క్లేశాన్నీ కలిగించేదీ, నీచ హేయ విషయ సంబంధీ అయిన హాస్యం 'ఉత్తమ హాస్యం' కాదు అని తాత్పర్యం. నవ్వడం అయిపోయాక అది చేసిన గాయం కానీ, దాని తాలూకు మచ్చ కానీ ఏమీ ఉండకూడదని సహృదయుల అభిమతం. ఒక వ్యక్తిని ఉద్దేశించి నవ్వకూడదు. ఒక వేళ నవ్వినా, ఆ వ్యక్తి కూడా మనతో కలిసి కడుపారా నవ్వితే, స్వపర భేదం లేకుండా నలుగురూ తలుచుకుని, నవ్వగలిగితే అది ఆరోగ్యకరమైన హాస్యం అన్నమాట!

అసలు మనిషి ఎందుకు ఏ పరిస్థితిలో నవ్వుతాడు? సహజత్వానికి భిన్నమైన వికారము కానీ, వైపరీత్యము కానీ నవ్వు పుట్టిస్తుంది. అలాగే విపరీతాలంకారము, వికృతాచార అభిదాన వేషములు, అంగవికారములు - వీటి వలన కూడా నవ్వు వస్తుంది. ఓ సందర్భంలో అనుకరణ వలన హాస్యం ఉద్భవిస్తే మరో సందర్భంలో విరుద్ధమైన పలుకుబడీ, ఉచ్చరించే విధానమూ కూడా హాస్యానికి కారణాలవుతాయి.

నేడు తీరికలేని జీవితాన్ని గడుపుతున్న ఆధునిక మానవుడు నవ్వడమే దాదాపుగా మర్చిపోయాడు. తినడానికీ,

తాగడానికీ కూడా తీరిక లేకుండా కాలాన్ని గడిపేస్తున్నాడు. మున్ముందు శ్వాస పీల్చుకోవడానికి కూడ టైము లేదంటారేమో! మెనీ మనీ కోసం మనుగడ సాగించే మన మినీ మానవులు. ఓ సర్వే ప్రకారం ఆరు సంవత్సరాలలోపు వయసులో రోజుకి సుమారు మూడువందల సార్లు మానవుడు నవ్వుతాడట. అదే పెద్దయ్యాక అయితే రోజుకి పదిహేనుసార్లు కూడా నవ్వడం గగనమేనట. తీరికలేని జీవితాన్ని గడుపుతున్న మానవునికి షుగరు, బీపీలు తీరిక చేసుకుని మరీ వచ్చి పలకరిస్తున్నాయి. కల్మషం లేని పసిపిల్లల స్వచ్ఛమైన నవ్వులు మనసుకు ఎంతో ఆహ్లాదాన్ని కలిగిస్తాయి. నవ్వడం మర్చిపోయినా కనీసం ఆ నిర్మలమైన నవ్వులనైనా అప్పుడప్పుడు ఆస్వాదించాలి. లేకపోతే ఆరోగ్యానికి ఎంతో చేటు. "నవ్వు నాలుగు విధాల చేటు" అని రామాయణంతో పాటు ఎన్నో కథలు చెప్తున్నా, నవ్వకపోతే ఆరోగ్యానికి చేటు అని నేటి డాక్టర్లు చెప్తున్నారు. తనివితీరా నవ్వితే 'ఇంటర్ ఫెరాన్ గామా' మన శరీరంలో ఉత్పత్తి అయ్యి వ్యాధి నిరోధక శక్తిని పెంపొందిస్తుందట. అందుకేనేమో మనోళ్ళు లాఫింగ్ క్లబ్‌లు, లాఫింగ్ థెరపీలు ఏర్పాటు చేసుకుని మరీ కృత్రిమంగానైనా సరే పగలబడి మరీ నవ్వుతున్నారు. ఇదీ ఒకందుకు మంచిదే అనుకోండి.

మానవుడికి వినోదం అవసరం ఈ రోజుల్లో బాగా ఎక్కువగా ఉందని గ్రహించిన కొందరు టీ.వీ. ఛానళ్ళవారు అనేకరకాల హాస్యకార్యక్రమాలు ప్రారంభించారు. కాకపోతే వాటిల్లో అపహాస్యమే ఎక్కువగా ఉంటుందనుకోండి. అలాగే ఈమధ్య కాలంలో ఎక్కువగా ప్రజాదరణ పొందుతోంది. 'స్టాండప్ కామెడి' అనే మరోకొత్త హాస్య ప్రక్రియ. ఏదేమైనా నవ్వడానికి కూడా ఓ యోగ్యత ఉండాలట. అందుకే గుఱ్ఱం జాషువా గారు 'కొత్తలోకం' అనే తన కావ్యంలో-

**"ఉ॥ నవ్వవు జంతువుల్ నరుడు నవ్వును, నవ్వులు చిత్త వృత్తికిన్**
**దివ్వెలు కొన్ని నవ్వులెటు తేలవు కొన్ని విషప్రయుక్తముల్**
**పువ్వుల వోలె ప్రేమరసమున్ వెలిగ్రక్కు విశుద్ధమైనవే**
**నవ్వులు సర్వదుఃఖ దమనంబులు వ్యాధులకున్ మహౌషధుల్"**

అనే పద్యంలో జంతువులు నవ్వలేవు, నరుడు నవ్వగలడు. ఇది అతనికి భగవత్ప్రసాదమని చెప్పాడు. అంతేగాక నవ్వులు మానసికోల్లాసానికి తోడ్పడతాయని, సర్వదుఃఖాలను పోగొడతాయని, వ్యాధులకు దివ్యౌషధాల్లా ఉపకరిస్తాయని చెప్పాడు. కొన్ని దొంగనవ్వులు కూడా ఉంటాయని, వాటితో జాగ్రత్తగా ఉండాలని సున్నితంగా హెచ్చరించాడు.

ఈ విషయాన్ని ముందే గ్రహించిన మన కవులు, రచయితలు మన సాహిత్యంలో హాస్యరసాన్ని ఎంతో చమత్కారంగా పెంచి పోషించారు. ప్రాచీన సాహిత్యంలో హాస్యం అక్కడక్కడ తొంగి చూసిందేతప్ప చెప్పుకోదగ్గ స్థాయిలో లేదు. ఆధునిక సాహిత్యంలో మాత్రమే హాస్యరచనలకు ఏమాత్రం లోటులేదు. ఎంతో మంది రచయితలు హాస్య ప్రధానంగా నవలలు, కథలు, నాటికలు, వ్యాసాలు లాంటివి రాయడం ప్రారంభించారు. పాఠకలోకంపై హాస్యపుజల్లులు కురిపించారు.

శ్రీ గొల్లపూడి మారుతీరావు ఎప్పుడో నలభైఐదు సంవత్సరాల క్రితం అనగా 1977లో "కళాసాగర్" పత్రిక పంచమ వార్షికోత్సవ సంచిక కోసం "బడ్జెట్ ప్రతిపాదన" అనే ఒక హాస్య వ్యాసం రాశారు. దానికి ఇప్పటికీ

కాలదోషం పట్టలేదు. ఎందుకంటే అందులోని ఎన్నో అంశాలు నేటి కాలానికి చక్కగా సరిపోతున్నాయి. ఆ వ్యాసంలోని హాస్యాన్ని ఒకసారి పరిశీలించి మనంకూడా కడుపుబ్బా నవ్వుకుందాం!

సాధారణంగా ఆర్థిక మంత్రులు ప్రతిసంవత్సరం చట్టసభల్లో వార్షిక బడ్జెట్‌ని ప్రవేశపెడుతుంటారు. ఆ బడ్జెట్‌లలో అప్పుడప్పుడు కొన్ని అంశాలు హాస్యాస్పదంగాను, కొన్ని వివాదాస్పదంగాను ఉంటాయి. ఎందుకంటే ప్రజలపై కొన్ని లేనిపోని అనవసర పన్నులు పడుతుంటాయి. ఏదేమైనప్పటికీ ఏబడ్జెట్టు ప్రజలందరినీ సంతృప్తి పరచలేదు. దానిని భూమికగా తీసుకుని గొల్లపూడి వారు తమదైన రచనా చమత్కృతితో వ్యంగ్య ధోరణిలో ఓ కొత్త బడ్జెట్‌ని తమ హార్దిక మంత్రిగారిచేత ప్రతిపాదింప చేశారు.

**"హార్దిక మంత్రిగారు బడ్జెట్ ప్రతిపాదిస్తున్నారు**
**ప్రజా సంక్షేమానికి ప్రణాళికను సిద్ధం చేస్తున్నారు**
**ప్రతివ్యక్తీ సుఖంగా బ్రతకాలన్నదే మా ధ్యేయం**
**అందరికీ సమానంగా సుఖాన్ని పంచాలన్నదే మా ఆశయం"**

అంటూ వ్యాసం ప్రారంభిస్తూ 'ఆర్థికమంత్రిని' 'హార్దిక మంత్రి'గా చేసేశారు గొల్లపూడి. 'సుఖం' అనేదేదో మార్కెట్టులో దొరికే వస్తువులాగా సమానంగా అందరికీ పంచుతారట. ఇలా ఆదిలోనే తమ చమత్కారాన్ని చూపించారు గొల్లపూడి.

**"సుఖం మరీ కొందరి దగ్గరే మురిసిపోతోందని మాకు రిపోర్టులు వచ్చాయి.**
**దాన్ని బయటకి లాగి నలుగురికీ పంచాలనే మా తాపత్రయం"**

అని అనడంలో మంత్రిగారి మేధస్సు మనకు అర్థమైపోతుంది.

అప్పుడప్పుడు ఆర్థిక మంత్రులు బడ్జెట్‌లో కొన్ని కోతలు పెడుతుంటారు. ప్రస్తుతం మన హార్దిక మంత్రిగారు విధిస్తున్న కోతలేంటో చూడండి.

**"మనిషి చిఱునవ్వుకి మరీ కొరత ఏర్పడింది.**
**అందుకని చిఱునవ్వులమీద సీరియస్‌గా కంట్రోలు అమలు పరుచ దలిచాం.**
**ఇకనుంచి వారానికి ఒకసారి కంటె మనిషి ముఖం మీద చిఱునవ్వు ఖర్చుకారాదు.**
**ప్రత్యేక కారణం చూపగలిగితే తప్ప రెండోసారి నవ్వుకోరాదు."**

పాపం ప్రజలు తనివితీరా నవ్వు కూడా నవ్వుకోకూడదట. ఇక ఉద్యోగుల విషయానికొస్తే-

**"మధ్యాహ్నం నిద్రని మధ్యతరగతి ఉద్యోగులు బాగా మరిగారని ఈ మధ్యే అర్థమయింది.**
**ప్రభుత్వం సహించరాని భరించలేని నేరం. సుఖాన్ని పట్టపగలే దోచుకోవడం.**
**అందుకని లంచ్ టైముని రద్దుచేసి ఠంచన్‌గా పది గంటలు పనిచేసే కార్యక్రమాల్ని**
**నిర్దేశిస్తున్నాం."**

రామ! రామ! ఏంటండీ! ఇది మరీను. జీతం ఎక్కువయ్యి పని తక్కువైతే ఆమాత్రం నిద్రరాదా అండీ ఇది హార్దిక మంత్రిగారి చాదస్తం కాకపోతేను. కార్మిక చట్టాలు పక్కనపెట్టి మరీను పదిగంటలు పనా?! పైగా భోజన విరామం లేకుండా! బిల్లు పాసైన వెంటనే మన ఉద్యోగమిత్రులు 'పెన్‌డౌన్' చేయడం తథ్యం.

కొన్ని కొత్త నిర్మాణాలు కూడా చేపడతారంట మన ప్రభుత్వం వారు అవేమంటే!

**"కల్తీలేని ప్రేమ కనుమరుగై పోయింది.**
**అందుకనే ప్రేమించుకోవడానికి పెర్మిట్ల సిస్టం నిర్ణయించాం**
**ప్రతివీధి చివరన చౌకప్రేమ దుకాణాలు తెరిపిస్తున్నాం"**

నిత్యావసర వస్తువులకోసం చౌకదుకాణాలు ఏర్పాటు చేయడం విన్నాంగాని, మరీ ఇలా ప్రేమించుకోవడానికి "చౌక ప్రేమ దుకాణాలు" ఏంటండి మరీను. ఇది పాశ్చాత్యదేశమో! భారతదేశమో అర్థమై చావట్లేదు. ఇక తల్లిదండ్రుల పరిస్థితేంటో?! ఆ భగవంతుడికే తెలియాలి. ప్రేమా! గీమా! మానేసి బుద్ధిగా చదువుకోమని చెప్పాల్సిన ప్రభుత్వమే ఇలా ప్రేమించుకోమనడం ఏంటండీ విడ్డూరం కాకపోతేను హవ్వ!

మన హార్దిక మంత్రిగారు కొన్ని మినహాయింపులు కూడా ఇస్తున్నారండోయ్! అవేంటో చూడండి.

**"మంచితనం మీదా, దైవచింతన మీదా**
**స్నేహశీలత మీదా మనశ్శాంతి మీదా**
**విరివిగా రిబేటు ఇవ్వడానికే నిర్ణయించుకొన్నాం.**
**ఎందుకంటే వీటివల్ల దేశానికి నష్టం రావడం లేదని రూఢి చేసుకున్నాం కనుక"**

అబ్బా! చూశారు ఏమేమి మినహాయించారో. దీంతో ప్రజలకు చాలా ఆర్థికబాధ తగ్గినట్లుంది కాబోలు. ఏం చేస్తాం చచ్చినోడి పెళ్ళికి వచ్చిందే కట్నం అనుకుని సర్దుకోవాలి మరి.

పూర్వం రాజుల కాలంలో బ్రిటీషువారి కాలంలో జిజియా పన్ను, తీర్థయాత్రల పన్ను, చదువుపన్ను, పెళ్ళిపన్ను ఇలా రకరకాల పన్నులు విన్నాం మనం. కానీ మన హార్దిక మంత్రిగారు వీరందరినీ మించి పోయారండోయ్! ఎందుకో మీరే చదవండి.

**"ప్రియురాలి వేలిగోళ్ళమీదా, జవరాలి కళ్ళకొసలమీదా, పెదవులకు రాసే రోజా రంగు మీదా, హృదయంలో రేగే మజా కోరికల మీదా, బీదవాడి ఆశమీదా, రిక్షావాడి అరువు ఖాతామీదా, పన్నీరు మీదా, పళ్ళపొడి మీదా, అజీర్ణ వ్యాధి మాత్రల మీదా, సుఖవ్యాధి ఇంజక్షన్ల మీదా, కుక్కపిల్ల విశ్వాసం మీదా, గుమాస్తాగాడి ఆదుర్దా మీదా కఠినంగా పన్నులు వేస్తున్నాం."**

ఓరి నాయనోయ్! ఏంటండీ ఈ పన్నులు చరిత్రలో ఎప్పుడూ కనీవినీ ఎరుగమే! బహుశా భవిష్యత్తులో మన ప్రభుత్వాలు కూడా ఇలాంటి పన్నులే ప్రజలకు వేస్తాయేమో! ఎందుకంటే ఈనాడు దేశవ్యాప్తంగా నాయకులు చేస్తున్న ఎన్నికల వాగ్దానాలు నెరవేర్చాలంటే ఇలాంటి పన్నులు వేయాల్సిందే మరి. గొల్లపూడి వారు ఈ విషయాన్ని ముందే ఊహించినట్లున్నారు.

యావత్ దేశాన్ని పట్టి పీడిస్తున్న నీటి సమస్యను గూర్చి మన హార్దిక మంత్రిగారు ఏమని సెలవిస్తున్నారో చూడండి.

**"నీళ్ళ కొరతకీ మాకు సంబంధం లేదు.**
**కన్నీళ్ళు విరివిగా ఖర్చు పెట్టుకోవచ్చు, మాకేం అభ్యంతరం లేదు.**
**పోయిన దానికోసం ఏడిస్తే లెక్క రాసుకోం**
**లేని దానికోసం కారిస్తే కన్నీటి మీదా పన్ను వెయ్యక తప్పదు"**

పాపం ప్రజానీకం ఈ దెబ్బతో దేనికి కన్నీళ్ళు కార్చాలో, దేనికి కార్చకూడదో అనే అయోమయస్థితిలో పడిపోయారు పాపం. ఇంకా మన హార్దిక మంత్రిగారు ఏవో హామీలిస్తున్నారు చూడండి.

**"ఈదెబ్బతో మనదేశంలో 'సోషలిజం' పాగా కొయ్యలాగా పాతుకు పోతోందనడంలో అతిశయోక్తిలేదు.**
**కాకపోతే, ఒక్కటే మా చేతికి అందనిది మిగిలిపోయింది.**
**మనిషిని రెచ్చగొట్టే అన్ని సుఖాల్నీ కట్టు దిట్టంలో పెట్టాం**
**కానీ నిద్రపోయేటప్పుడు కనే కలల్ని ఎలా ఖాతాలో చూపాలో అర్థంకాలేదు**
**అయితే సభ్యులకు ఒక హామీ ఇస్తున్నాం**
**సుఖపడే అన్ని అవకాశాలూ మన చేతుల్లోనే ఉన్నాయి కనక**
**కలగనే అవకాశాన్ని ఒక్కదాన్నీ, తప్పనిసరి కావడం వల్ల, పన్ను వెయ్యకుండా మినహాయిస్తున్నాం"**

చాలా పెద్ద మినహాయింపే ఇచ్చారు. మన హార్దిక మంత్రిగారు ఏంచేస్తాం వారి దయ ప్రజల ప్రాప్తం. ఇంకా ఈ వ్యాసంలో ప్రథమ రస ప్రస్తావన కూడా గొల్లపూడిగారు మన హార్దిక మంత్రిగారి చేత చేయించారు. దానిపైన కొన్ని పన్నులు, కొన్ని మినహాయింపులు ఉన్నాయి. కాకపోతే మన ప్రస్తుతాంశం ద్వితీయ రసమే కాబట్టి, అవన్నీ చెబితే సభ్యతగా ఉండదని వాటిని ప్రస్తావించడం లేదు.

ఈ విధంగా గొల్లపూడి మారుతీరావు గారు చక్కటి వ్యంగ్యంతో తనదైన చమత్కారంతో హార్దిక మంత్రిగారి చేత బడ్జెట్ ప్రవేశపెట్టింది. ఆద్యంతం పొట్టచెక్కలయ్యేలా నవ్వించారు.

**ఆధారం:**

1. పోలాప్రగడ సత్యనారాయణమూర్తి (సంపాదకులు) – హాస్యతోరణము – ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, హైదరాబాద్, 1982.

# జొన్నవిత్తుల సినీ సాహిత్యం - హాస్యం

డా. ప్రసాదం శ్రీలక్ష్మి
తెలుగు అధ్యాపకురాలు
శ్రీ విశ్వశాంతి విద్యాసంస్థలు
ఉయ్యూరు, కృష్ణాజిల్లా, ఆంధ్రప్రదేశ్.
చరవాణి : 96188 71530.

నవరసాలలో 'హాస్యరసం' యొక్క ప్రాధాన్యత ఎంతో చెప్పుకోదగ్గది. ఏ రసానికదే ప్రత్యేకతను కలిగియున్నప్పటికీ మిగిలిన ఎనిమిది రసాలకు తనదైన ప్రత్యేకతను సంతరించుకుంది హాస్యరసం. ముఖ్యంగా అనేక రకాల ఒత్తిళ్ళతో సతమతమవుతున్న మానవునికి మానసికోల్లాసాన్ని కలిగించేది హాస్యం. ఆ మానసికోల్లాసం కోసమే మానవుడు లలితకళలను ఆశ్రయిస్తాడు. అందుకే నన్నయనాటి నుండి నేటి ఆధునిక కవుల వరకు వారు రచనలు గావించిన ప్రక్రియల్లో హాస్య రసానికి ఎంతో ప్రాముఖ్యతనిచ్చారు. కొందరైతే హాస్యరసాన్నే అంగిరసంగా స్వీకరించి రచనలు గావించి పాఠకులను పొట్టచెక్కలయ్యేలా నవ్వించి వారి బాధలను మరిపించారు. అనేక బాధలతో, ఒత్తిళ్ళతో సతమతమయ్యే ఆధునిక మానవుడు నవ్వడమే మర్చిపోయి, తీరికలేని జీవితాన్ని గడిపేస్తున్నాడు.

"నవ్వించడం ఒక యోగం
నవ్వడం ఒక భోగం
నవ్వకపోవడం ఒక రోగం"

అని ఓకవి మూడు ముక్కల్లో హాస్యరస ప్రాశస్త్యాన్ని, ఎంతో గొప్పగా చెప్పేశాడు. 'నవ్వు నాలుగు విధాల చేటు' అని కొందరన్నా నవ్వితే మన ముఖంలో నలభై కండరాలకు తోడ్పాటు అని వైద్యశాస్త్రం చెబుతోంది. అందుకే ఆత్రేయగారు "నవ్వుతూ బతకాలిరా తమ్ముడూ....... నవ్వుతూ చావాలిరా....." అని ఎంతో చక్కగా చెప్పారు. అందుకే ఈనాడు కాసేపైనా నవ్వుకోవాలని లాఫింగ్ క్లబ్బులు, లాఫింగ్ థెరపీలు ఏర్పాటయ్యాయి.

హాస్యరసం యొక్క ఆవశ్యకతను గ్రహించి భమిడిపాటి, మొక్కపాటి, మునిమాణిక్యం లాంటివారెందరో హాస్యరస ప్రధానమైన ఎన్నో కథలు, నవలలు, నాటకాలు, కవితలు రచించారు. తరువాతి రోజుల్లో జంధ్యాల, ఇ.వి.వి. లాంటివారు హాస్యరస సినిమాలు చిత్రీకరించారు. ఆ సినిమాల్లోనేకాక, సందర్భానుసారంగా కొన్ని సినిమాల్లో కూడా హాస్యరస ప్రధాన గేయాలు ఎన్నో వచ్చాయి. అలాంటి హాస్యగేయాలు రాసిన వారిలో జొన్నవిత్తుల రామలింగేశ్వరరావు కూడా ఒకరు. జొన్నవిత్తుల సినీసాహిత్యంలోని హాస్యరసాన్ని ఒకసారి పరిశీలిద్దాం.

ప్రముఖ దర్శకులు జంధ్యాల 1987లో చిత్రీకరించిన 'అహనా పెళ్ళంట' అనే చిత్రంలో పరమ పిసినారి అయిన కోట శ్రీనివాసరావును బురిడి కొట్టించే సన్నివేశానికి జొన్నవిత్తుల ఓ అద్భుతమైన గేయం రాశారు.

పల్లవి: పీనాసి అయినా సన్నాసి అయినా
ఉన్నవాడే మనిషి డబ్బున్న వాడే మనిషి

పీనాసి సంఘం జిందాబాద్... పిసినారి సంఘం జిందాబాద్

చరణం1: సంపాదించిన ప్రతిరూపాయిని పాపాయిలాగ పెంచాలి
అతిథులొస్తే మైలొచ్చిందని అబద్ధమాడి పంపాలి
ఎంత కలిగినా లేదో లేదని ఎపుడు ఏడుస్తుండాలి
కుటుంబ సభ్యులు చచ్చినా సరే ఉన్నది కదల్చకుండాలి
శవానికి చందాలడగాలి　　　　॥పీనాసి॥

చరణం2: అరికాళ్ళకే నాడవేస్తే చెప్పులు ఖర్చు తగ్గునుగా
నూనె షాంపూ క్రాఫింగు ఖర్చు - గుండొకటుంటే పొదుపేగా
మంగళసూత్రం ఇత్తడిదైతే మొగుడికి ప్రాణం పోదుగా
ప్యాంటు షర్టు డ్రాయరు వేష్టు పేపరు గోచి బెస్టు ॥పీనాసి॥

కథానాయకుడు ప్రేమించిన అమ్మాయి తండ్రి పరమ పిసినారి, తనకంటె పొదుపరికి తన కూతురిని ఇవ్వాలనుకుంటాడు. మావగారికి తానుకూడా పెద్ద పొదుపరినే అనే విషయాన్ని కథానాయకుడు తెలియజేస్తూ పైపాటను పాడతారు. ఈ సన్నివేశానికి జొన్నవిత్తుల అద్భుతమైన చమత్కారంతో కూడిన పదప్రయోగాలు చేసి కడుపుబ్బ నవ్వించారు.

జంధ్యాల దర్శకత్వం వహించిన "ష్! గప్ చుప్" అనే చిత్రంలో జొన్నవిత్తుల 'తిట్ల దండకం' రాశారు. దండకం రాయడంలో జొన్నవిత్తులది అందెవేసిన చేయి.

**తిట్లదండకం:**

"ఒరేయ్ జిరాఫీ! మహా పాపి కురూపి నిన్ను చూడంగనే వచ్చు హైలెవల్ బీపీ ముండమోపి జిరాఫి నిన్ను తెగ్గోస్తే లోకానికే పిచ్చ హ్యాపీ అంక చండాలుడా బంక బదిరాంధుడా పరమ పాపిష్టి నికృష్ట దుష్టాత్ముడా నీ నీచరూపంబు చూడంగ పాపంబు నీ కంఠ నాళంబు కక్కుల్సు గొట్టంబు నీ కళ్ళలో కుళ్ళు నీ బుర్రలో బురద నీపైపులె చెత్త నీ జన్మ డ్రైనేజి నువ్వో దగుల్బాజి ఏబ్రాసి చెప్రాసి సన్నాసివీ అశుద్ధ స్వరూప అబద్ధ ప్రలాప పింగు బొంగైన పింజారిగా కుత్తేక బచ్చా కొవ్వెక్కిన లుచ్చా వగిలేను నీ పుచ్చ తీరేను నా కచ్చ నీ చేతికే వచ్చు చిల్లిబొచ్చ నిక్కచ్చిగా భ్రష్టాతి భ్రష్టా పరాకాష్టకెళ్ళావు దుష్టత్వమందున్ ముదనష్టుడా త్రాష్టుడా కుష్టుముష్టోడి అంగుష్టమా వృద్ధ క్షయరోగి ఉచ్ఛిష్టమా ఓరే పళ్ళపిచ్చి అరే చిల్లుగోచి నీపిచ్చి పోగొట్టగా టచ్చి ఇస్తాను పెంటచ్చిగా... పెన్ టచ్చిగా ... ఒరే పాచి ముఖమా నడుస్తున్న శవమా వేడి ఇడ్లీలు పారేయుచున్ చద్ది సాంబారు తెగ త్రాగు సోంబేరిగా పెద్ద ఇడియట్టువి చద్దిపెసరట్టువి పిచ్చి టేస్టున్న శాడిస్టువి గజ్జిపాదాల మరుగుజ్జువి ఉచ్చనీచాలు లేనట్టి రాస్కేలువి తేలువి ఒరే అక్కుపక్షి నిరక్షర కుక్షి కుంకాక్షి ఏకాక్షి సంఘాల అధ్యక్షుడా నువ్వు చుంచెలుక గొడ్డెవి రాబందు రెట్టవి బొద్దింక కేశానివి సీంపంది మూతివి గబ్బిలం తోకవి ఏకాకి కాకీకవి న్యూసెన్సు డాంకీవి నోసెన్సు మంకీవి కుడితెలో చిట్టెలుకవీ మున్సిపాలిటీ పందికిన్ మూత్రపిండానివి ఎద్దు మొండానివి సృష్టి మొత్తంబులో శుంఠవీ ఒరే పేడతట్ట అరే చెత్తబుట్ట ఒరే గడ్డిపోచ అరే నారపీచ ఒరే తుప్పు మేకా అరే పందితోక ఒరే వానపాము

ఇలా తొక్కుతాము ఒరే గౌడిగేదె ఇదే బడిత పూజ సెంటిమెంటన్నదే లేని పెంటాసుర నిన్ను తిట్టంగ నేనెంతవాడన్ దురాత్మా ఏడేడు లోకాల భాషలకె శోషొచ్చి మూర్చిల్లురా మహాబండ బూతుల్ తలల్ వంచు నీముందు పాపాత్ముడా చావరా ఓ బోడి వెధవ చావరా ఓ అంట్ల వెధవ చావరా నెల్తక్కు వెధవ వెధవన్నర వెధవ ముప్పావు వెధవ పరిపూర్ణ వెధవ చావరాచావరా చావు .... చావు .... తూ ....!"

పై దండకంలో ఓ బ్యాంక్ సిబ్బంది సరదాగా ఒక ప్రాంతానికి విహారయాత్రకు వెళతారు. అక్కడ ఒక దొంగల ముఠా వారిని దోచుకోవడానికి ప్రయత్నిస్తారు. కాకపోతే వారు చాలా కాలంనుంచి ఆహారం తినకుండా రహస్యంగా దాక్కుని ఉండటంవల్ల బాగా బక్కచిక్కిపోయి ఉంటారు. వారిని చూసి విషయం కనిపెట్టిన ఆ ఉద్యోగులు, వాళ్ళకు చిత్రవిచిత్రమైన తిట్లతో విరక్తి కలిగించి, వారిలో మార్పు తెస్తారు. ఆ సందర్భానికి జొన్నవిత్తుల హాస్యపూరితమైన కొత్త కొత్త తిట్లతో ఈ దండకాన్ని ఎంతో అద్భుతంగా రచించారు. ఇది విన్నవారు పొట్టచెక్కలయ్యేలా నవ్వడం తథ్యం.

'చెవిలో పువ్వు' అనే చిత్రంలో ప్రముఖ హాస్య నటులు 'బ్రహ్మానందం - శ్రీలక్ష్మి' స్వయంగా ఆలపించి అభినయించిన హాస్య గేయం ఒకటి కలదు.

"పల్లవి: పిచ్చెక్కింది వెర్రెక్కింది తిక్కెక్కింది ప్రేమిస్తే ఓరయ్యో
పిచ్చిగిచ్చి వెర్రిగిర్రి నయమౌతుందే వాటేస్తే ఓలమ్మో
బాబోయ్ ఇన్నాళ్ళు విరహంతో చచ్చాను
నేను జుట్టంతా పీక్కుంటూ తిరిగాను
లేవుకుపోరా నీతోటి వచ్చేసెయ్‌వే నాచిట్టి

చరణం1: వయసొక లడ్డు వలపొక జిడ్డు
నీకు నాకు ఉండదులేరా పెళ్ళికి అడ్డు
ఎవరేమన్నా గాడిదగుడ్డు
తస్సాజిల్లా నడకపోతే ఎక్కాలంట బెడ్డు
నా పేరులా నీ చరణ - చాంతాడులా చుట్టెయనా
ఈ గోల యేలరో నన్నెత్తుకోరా
రేయంతా రెచ్చిపోతా స్వీటీ బ్యూటీ శ్రీలక్ష్మి

చరణం2: హవ్వలల్లారాని అల్లల్లకానీ! కాదన్నావో ఉన్నట్టుండిపోతాడే ఈ ప్రాణి
ఆజారే ఆజా చేపలరాజా
నీదేలేరా గుమ్మెత్తించే పుల్పెను రోజా
నానా వచ్చి నువ్వే తెచ్చు - గడపతొక్కి తూలా బొడ్డు

అజన్నవోమ్మో నీముందు తోజా

వారెవ్వా రసికుడవంటే నువ్వేనయ్యా! బావయ్యా!"

అంటూ సాగే ఈ పాట హాస్యనటులైన వారి పాత్రలకు ఔచిత్యవంతమైన పదప్రయోగాలు చేసి జొన్నవిత్తుల కడుపుబ్బా నవ్వించారు.

జొన్నవిత్తుల స్వయంగా కథ, సంభాషణలు అందించి దర్శకత్వం వహించిన చిత్రం సోంబేరి. అందులో హాస్యభరితమైన ఓ సంభాషణాత్మక గేయం కలదు.

"భక్తుడు: కోతికి తోక ఎందుకుంటుంది గురూ?

స్వామీజి: కొమ్మకొమ్మకి వేళాడేందుకు శిష్యా!

భక్తుడు: కట్టుకున్నదానికి, ఉంచుకున్న దానికి తేడా ఏమిటిగురూ?

స్వామీజి: కట్టుకున్నదేమో కర్మఫలమురా? ఉంచుకున్నదేమో పాపఫలమురా

భక్తుడు: ముక్కుపొడుముకి కంది పొడుముకి తేడా ఏమిటి గురూ?

స్వామీజి: నాయనా! ముక్కు పొడుముని ఎగబీల్చాలి కందిపొడుముని దిగమింగాలి"

అంటూ సాగే పై పాటలో ఓ స్వామీజిని భక్తులు సందేహాలు అడుగుతూ ఉంటారు. దానికి స్వామీజీ చాలా చమత్కారమైన సమాధానాలు చెబుతూ ఉంటారు. ఇవన్నీ ఎంతో హాస్యాన్ని పండిస్తాయి. వినేవారికి గిలిగింతలు పెడతాయి.

జొన్నవిత్తుల అనేక చిత్రాలలో ఎన్నో పేరడీ పాటలు రాశారు. అవికూడా ఎంతో హాస్యభరితమైన పాటలే. ఈ విధంగా జొన్నవిత్తుల అనేక చిత్రాలలో ఎన్నో హాస్యరస గేయాలు రాసి ప్రేక్షకులను కడుపుబ్బ నవ్వించి, వారికి వినోదాన్ని పంచి, వారికి మానసికోల్లాసాన్ని కలిగించారు.

# భానుమతి రామకృష్ణ కథలు - అత్తగారి హాస్యం

**కోష్టు గోవిందరావు**
పరిశోధక విద్యార్థి,
తెలుగుశాఖ,
ఆంధ్ర విశ్వకళాపరిషత్, విశాఖపట్నం.
చరవాణి : 76808 43505
Gmail : kostugovindarao@gmail.com

ఏదైనా ఒక కావ్యాన్ని చదివినప్పుడు కానీ, రమణీయమైన కళారూపాన్ని చూసినప్పుడు కానీ మనస్సుకు కలిగే హాయిని, ఆహ్లాదాన్ని, అలౌకికమైన ఆనందాన్ని రసము అని చెప్పవచ్చు. రసాన్ని గుర్తించినవాడే రసజ్ఞుడు, రస హృదయం కలిగినవాడే రసికుడు. రసము గల కావ్యాన్నే రసవంతమైన కావ్యము అంటాము.

"రస్యతే ఇతి రసః" అని శబ్దానికి వ్యుత్పత్తి సహృదయుల చేత ఆస్వాదించబడుతుంది కాబట్టి రసమని చెప్పబడుతుంది. అందువల్ల విభావాల, అనుభవాల చేత, వ్యతిచారీ భావాల చేత ఆస్వాద్యమానమైన స్థాయీ భావమే రసమని దీని అర్థం. పై చెప్పిన లక్షణాలు కలిగి సామాజికునికి అటువంటి భావస్ఫోరకమైన అనుభవం కలిగినప్పుడు అతనిలో రసం ఉత్పన్నమౌతుంది. ఈ రసాలు మొత్తం తొమ్మిది కలదు. అందులో హాస్యం రెండవది. వికృతమైన ఆకారము, భాష, వేషము, చేష్టలు మొదలగు వాటి వలన కలిగేదే హాస్యము. ఈ హాస్యానికి స్థాయీ భావం హాసం. సామాజికుడు పై చెప్పిన వికృతాకార వాగ్వేష చేష్టలు ఎవరి వలన కలుగుతాయో వారే ఆలంబన విభావం, వారి చేష్టలే ఉద్దీపన విభావం, కళ్ళు మూసుకోవడం, నవ్వడం మొదలగునవి అనుభవాలు, హర్షము, అవహిస్థ, చాపల్యం, ఆవేదన వ్యభిచారీ భావాలు. పెద్దలు చెప్పినట్లు

*"నవ్వడం ఒక భోగం*
*నవ్వించడం ఒక యోగం*
*నవ్వకపోవడం ఒక రోగం"*

అంటూనే నవ్వు నాలుగు విధాల చేటు అని హెచ్చరించారు. నవ్వడం ఎంత ఆరోగ్యకరమైనదో, నవ్వకపోవడం అంతే రోగమనీ, అలాగని సమయ సందర్భాలు లేని నవ్వు కూడా ముప్పు తీసుకువస్తుందని పెద్దల మాట, గ్రాంథికంలో హాస్యం వ్యవహారంలో నవ్వుగా పిలవబడుతుంది. ఈ హాస్యం అనుభావాలను బట్టి ఆరు విధాలుగా వుంటుంది. ఉత్తములకు స్మితము హసితము, మధ్యములకు విహసితము-అవహసితము, నీచులకు అపహసితము, అతిహసితము కలుగుతాయని లాక్షిణికులు పేర్కొన్నారు. అందులో మొదటి కోవకు చెందిన స్మితము హసితములు ఉన్నతమైనవిగా సున్నితమైనవిగా ఉంటూ సహృదయుని మెప్పిస్తాయి. ఇటువంటి ఉన్నతమైన ఉత్తమమైన హాస్య విలువల్ని పాటిస్తూ శ్రీమతి భానుమతీ రామకృష్ణ రచించిన అత్తగారి కథలు హాస్యరసానికి పట్టం కట్టిన ఉన్నతమైన మకుటంగా చెప్పవచ్చు.

ఆధునిక తెలుగు సాహిత్యంలో శాశ్వతమైన కీర్తిని సంపాదించిన సజీవమైన పాత్రను పరిచయం చేసిన శ్రీమతి భానుమతి రామకృష్ణ గారు 1926, సెప్టెంబరు 7న ఒంగోలులో జన్మించారు. తండ్రి బొమ్మ

రాజు వెంకటసుబ్బయ్య గారి దగ్గర శాస్త్రీయ సంగీతం నేర్చుకున్నారు. 13వ ఏటనే వరవిక్రయం చలన చిత్రంలో నటించిన భానుమతిగారు బహుముఖ ప్రజ్ఞాశాలి. దక్షిణ భారత సినిమా నటిగా తన గాంభీర్యం, రాజసంతో ప్రేక్షకుల్ని అలరించిన భానుమతిగారు తమిళ తెలుగు చలన చిత్రాల నిర్మాత, దర్శకుడు, ఎడిటరు అయిన పి.యస్. రామకృష్ణారావును వివాహమాడింది. ఈమె నూరుకు పైగా చలనచిత్రాల్లో నటించింది. అదే విధంగా గాయినిగా 40 చిత్రాలకు పాటలు పాడింది. సినిమా పాటలే కాక రేడియోలోనూ, రికార్డుల్లోనూ ఆమె పాటలు వచ్చాయి. విజయవాడ రేడియో కేంద్రం ప్రారంభమైనప్పుడు వినిపించిన ప్రారంభ గీతం బాలాంత్రపు రజనీ కాంతారావుతో కలసి ఆమె పాడినదే, అదే విధంగా దర్శకురాలిగా 15 సినిమాలు, నిర్మాతగా 10 సినిమాలు, సంగీత దర్శకురాలిగా 2 సినిమాలుతో పాటు రచయిత్రిగా ప్రేమ, అత్తగారి కథలు, నాలో నేను, భానుమతి కథానికలు మొదలైనవి భానుమతి గారి కలం నుండి జాలువారిన ఆణిముత్యాలు. అందులో అత్తగారి కథలు జాతిరత్నాలనే చెప్పవచ్చు. భానుమతి గారి కథల్లోని అత్తగారు తెలుగు సాహిత్యంలోనే విలక్షణమైన హాస్యపాత్రగా చెప్పవచ్చు. అలాగని భానుమతి గారు చౌకబారు హాస్యాన్ని ప్రదర్శించలేదు, సున్నితమైన ఉత్తమ హాస్యాన్ని అత్తగారి ద్వారా తెలుగు పాఠకలోకానికి అందించడం జరిగింది. ఈమెకు భారత ప్రభుత్వం 1966లో పద్మశ్రీ అవార్డుతోనూ, 1975లో ఆంధ్ర విశ్వకళాపరిషత్ వారు కళా ప్రపూర్ణతోనూ, 1984లో శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం వారు గౌరవ డాక్టరేట్‌తోను, 1986లో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం రఘుపతి వెంకయ్య అవార్డుతో ఉత్తమ దర్శకురాలిగా సత్కరించడం జరిగింది. ఈ అవార్డులు, సత్కారాలే ఆమె యొక్క బహుముఖ ప్రజ్ఞాశీలతను తెలియజేస్తున్నాయి.

తెలుగు సాహిత్యంలో అటు సనాతన సాంప్రదాయానికి ఇటు హాస్యరస పోషణకు పెట్టింది పేరు భానుమతి గారి అత్తగారు. భానుమతి అత్తగారి పాత్ర ద్వారా హాస్యాన్ని పండించడంలో కృతకృత్యులయ్యారు. అత్తగారి మనస్తత్వానికి బాహ్య ప్రపంచానికి ఎక్కడ పొంతన లేదు, అందుకే ఆవిడ హాస్యం పుట్టిస్తుంది. కావడానికి అత్తగారు భారీ మనిషే అయినా ఆవిడ అంతస్తులో ఉన్న ప్రపంచం చిన్నది కొంచం పురాతనమైనది కూడాను. సవతులన్న తరువాత పోట్లాడుకోవద్దూ? మీరిద్దరూ పోట్లాడుకోరేం? అని ఆవిడ పాలవాడి పెళ్ళాలతో పోట్లాడుతుంది. అదేం ప్రారబ్దమో...? ఆవిడకు జరిగేవి కూడా అలానే జరుగుతాయి...!

తెలుగువారికి ఆవకాయ అంటే ఎంత మమకారమో అందరికీ తెలిసిందే. వాళ్ళు ఆంధ్రాలో వున్నా, అమెరికాలో ఉన్నా ఆవకాయ తినాల్సిందే, ఆ మమకారంతోనే అత్తగారు చేసిన ఆవకాయ అబాసుపాలైంది. అత్తగారు ఈ సంవత్సరం ఆవకాయ లేదండీ అనగానే నేను తయారు చేస్తానని ముందుకొచ్చారు అత్తగారు. కానీ ఆవిడా పుట్టినిల్లు చెంగల్ పట్టు, మెట్టినిల్లు నంద్యాల, ఆవకాయకూ అత్తగారితో ఏలాంటి సంబంధమూ లేదు. కానీ అలా అంటే ఆవిడ ఆక్షేపించడమే కాదు, ఆ "నీదంతా చోద్యమే మరీను! ఎవర్నో ఎందుకడగడం? ఆవకాయ పెట్టడం ఏ బ్రహ్మ విద్య గనకనా, తేలీకడుగుతా! అయినా అంత కారం, అంత నూనె వేస్తే చాలు, నేపెట్టిస్తానుండు ఆవకాయ" అంటుంది. కానీ ఆవకాయకి ఏకాయలు అవసరమో తెలీదు. మామిడి కాయలు కావాలిగా అంటే ఎందుకూ మన తోటలోని పండ్లకాయలే చాలంటూ తీర్పు ఇస్తుంది. ఆవకాయకు ఐదువేల కాయలు కావాలంటుంది, ఐదు వేల కాయలంటే ఎన్ని ఉంటాయో తెలియని అత్తగారు. తోటమాలిని పిలుస్తూ వాడి పేరేమిటి? జటాయువా? జానకి రామా? అంటే జటాయువు కాదు జానకి రాము కాదు దశరథుడు అని కోడలు చెప్పగానే ఆ ఏ అతిరథుడో ఎవడికి జ్ఞాపకం అంటుంది. ఆవకాయకి 5 వేల కాయలకి గాను 5 శేర్లు నూనె, ఒక వేశ మిరపకాయలు, ఒకసేరు ఆవపిండి చాలని చెప్పినప్పుడే తెలుస్తుంది, ఆవిడ గారి వంటల

2

నైపుణ్యం. అదే విధంగా ఆవకాయకి ఉప్పెంతో కారం అంత కారం ఎంతో ఆవపిండి అంత. అవన్నీ ఎంతో నూనె అంత, నిమ్మకాయెంతో ఆవకాయా అంతే అంటుంది అత్తగారు. కౌలుదారు ముక్కు పిండి వసూలు చేసిన ఐదు వేల కాయలు రాశి చూసి "మనం ఐదు వేళ్ళగా అడిగిందీ, వెధవ భయపడి పదివేల కాయలు కక్కినట్లున్నాడే అంటుంది. ఐదు వందల కాయలు ముక్కలు కొట్టించిన అత్తగారు ఎనిమిది జాడీల్లోనూ పోసి గుప్పెడు కారం, ఉప్పు, ఆవపిండి వేసి ఒక్క జాడీకి రెండు గరిటెల నూనె పోసి మూత పెట్టి "కృష్ణా" అంటుంది అత్తగారు. వారం తరువాత బంధువుల్ని భోజనానికి పిలిచి ఆవకాయ జాడీలు మూతలు తీసి చూస్తే ఆవకాయ లేదు మామిడి పండ్ల ముక్కలున్నాయి, బూజు పట్టి అది చూసిన అత్తగారి ముఖాన కత్తి వాటుకు నెత్తురు చుక్కలేదు.

చూసారుగా అత్తగారి పాకశాస్త్ర నైపుణ్యం. ఆవిడకు వంటలు రావు, అలాగని రావని చెప్పరు, అదేమైన బ్రహ్మ విద్యా? అంటూ ప్రయోగం చేయడం, అది కాస్త వికటిస్తే ఆవిడ చప్పుడు కాకుండా వంటగదికి పోవడం షరా మామూలే. ఏ విషయమైనా ఆవిడ తెలియదని ఒప్పుకోకపోగా బడాయి చూపిస్తూ, చివరికి తప్పును పక్కవాళ్ళ మీదకు నెట్టడంతో ఆమెకు నైపుణ్యం ఎక్కువ.

కొడుకు అరిటికాయ పొడి అంటే ఇష్టమనీ, చెంచెత్త చాలా బాగా చేస్తుందనీ అనగానే అత్తగారు అదేం భాగ్యంరా! నేను చేస్తాను అనగానే పాపం ఆ ఇంట్లో ఎవరికీ ఆ రాత్రి నిద్రపట్టలేదు. అప్పటికీ కొడుకు తెల్లవారిజామునే పెరట్లో అరటి గెల కొట్టించి, గుట్టుచప్పుడు కాకుండా పక్కింట్లో ఇవ్వడం జరిగింది. కొడుకు ఇంట్లో భోజనం చేయనని పోతున్న సమయంలో అత్తగారి అక్క కొడుకు రావడంతో ఇక అత్తగారికి వంట తప్పలేదు. ఇంట్లో కూరగాయలు లేవు, పక్కింటి వాళ్ళకు కూరగాయలు అడగ్గా పక్కింటావిడ మళ్ళీ ఆ అరటి కాయలే ఇస్తుంది. ఇక అత్తగారు తన పాకశాస్త్ర నైపుణ్యం అంత ప్రదర్శించి అరటికాయ పొడి తయారుచేస్తుంది. భోజనాలకు కూర్చున్న అన్నదమ్ముల కంచాల్లో అరటికాయ పొడి ప్రత్యక్షమైనది. ఆవిడ కొడుకు పరిస్థితి ముందు నుయ్యి వెనుక గొయ్యి. ఆ పొడి నోట్లో వేస్తే రాళ్ళు నమిలి తిన్నట్లే ఆ అన్నదమ్ముల పాట్లు చెప్పనలవి కాదు.

ఇక అత్తగారు చేసిన వడియాలు సంగతి వేరే చెప్పాల్సిన పని లేదు. అవి మనుషుల పళ్ళను గట్టి పరచడమో లేక వూడగొట్టడమో తేల్చేస్తాయి. ఆ వడియాలు కంచంలో వేసేప్పుడే వడగళ్ల శబ్దం బయల్దేరుతుంది. రచయిత్రి నాన్నగారు ఆ వడియాలు తినడానికి నానాపాట్లు పడి చివరకు అవి పొడి చేయాల్సిందేనని సలహా కూడా ఇచ్చారు. దానితో అత్తగారు వాటి జోలికి పోలేదు. ఇక ఆ వడియాలతో పిల్లవాడు ఆడుకుంటూ ఆకాశానికి పంపించివేయగా మిడిలినవి కాకుల్ని, పక్షుల్ని తోలడానికి ఉపయోగపడ్డాయి. ఆ వడియం తగిలి ఒక పిల్లవాడి నెత్తి మీద చిల్లుపడి బొట బొట రక్తం కారితే, ఆ సంగతి విన్న పిల్లవాడి తల్లి ఎవరో రాయితో కొట్టి అబద్ధాలు ఆడుతున్నారనీ, వడియంతో అంత దెబ్బ తగలదనీ, యుద్ధానికి రాగా ఆ వడియాలు చూసి కళ్ళు చెదిరి "దిక్కుమాలిన వడియాలు" అంటూ తిట్టుకుంటూపోతుంది. ఇక అత్తగారి చాకలి పద్దులు, కిరాణా సరుకుల జాబితాలు ప్రహసనాలనే చెప్పవచ్చు. చాకలికి వేసిన బట్టల్ని పనివాడు లాండ్రికి వేయగా అవి చాకలే దొంగిలించాడని అత్తగారు వాడిని దబాయించడం, ఆ తరువాత పనివాడు చెప్పగానే మౌనంగా వంటిట్లోకి పోవడం, కిరాణా జాబితాలో అచ్చు తప్పుల వలన కిరాణా షాపు వాడు క్వింటాల కొద్దీ సరుకులను బండ్ల మీద తీసుకుపోవడం మొదలైన విషయాల్లోనూ ఆవిడ యొక్క ప్రవర్తన, మనస్తత్వం పాఠకులను హాస్యంతో ముంచెత్తుతుంది.

.... 3 ...

అత్తగారి చేతుల మీదుగా ఏదైనా చెట్టూ చేమా నాటితే పూత, పిందే సమృద్ధిగా, చిరంజీవిగా వర్ధిలుతాయని ఆవిడ యొక్క అవ్వగారు అంటుండేవారని చెపుతారు అత్తగారు. పెరట్లో చాలా కాలంగా కాయలు కాయని నాలుగు అరటి చెట్లు అత్తగారు నాటినవే. బహుశా వాటికి ఈ సాంప్రదాయం తెలిసి ఉండదు. ఆ విషయం అత్తగారిని అడిగితే అవి కాయలు కాసే జాతి అరటికాదు కేవలం ఆకుల కోసమే వేసానంటుంది. కానీ అవే పిలకలు తెలిసిన వాళ్ళు తీసుకెళ్ళి నాటితే మంచి గెలలు కాసాయి. ఆ విషయం విన్న అత్తగారు వంటింట్లోనే ఉండిపోయారు పాపం. భోజనాల సమయంలో భార్యాభర్తల ఇద్దరి కంచాల్లో వెనుక నుండి పడిన నల్లని పదార్థం ఏమిటని అడిగితే కనుక్కోరా అంటూ మొహం క్వశ్చిన్ మార్క్‌లా పెడుతుంది అత్తగారు. "అబ్బే నీ వంట కనుక్కోవడం నా చేతకాని పని" అంటాడు కొడుకు. అదే ప్రశ్న కోడలు వైపు రాగానే అదేదో విషమ సమస్య అనుకుంటూ ఉండగా వంటవాడు అప్పాలు వెంకాయ పెచ్చడి అంటాడు. ఆవిడ చేసిన వంటలు సాధారణంగా పోల్చుకోవడం కష్టం ఎందుకంటే అవి కమ్మటి వాసనకు బదులు భూమి మీద నీటి తుంపరలు పడిన తరువాత వచ్చేమట్టి వాసన వస్తుంటాయి. ఆ ఇంట్లో వంటవాడు అన్ని పనులు చేస్తుంటాడు ఒక్క వంట పని తప్ప. వంట విషయంలో మాత్రం అతను ఎప్పుడూ అత్తగారికి సహాయకుడే. అత్తగారు ఎప్పుడు ఏ పని చేసినా అది ప్రహసనమై ఎవరి పీకల మీదికి వస్తుందో తెలియదు.

ఆమె చిన్నప్పుడు తన జాతకం చూసిన పండితులు ఆమె వృద్ధాప్యంలో లంకెల బిందెలు దొరుకుతాయని చెప్పిన తరువాత ఆవిడ వృద్ధాప్యం కోసం ఎదురు చూస్తూ కుటుంబ సభ్యుల బంగారం కొందామంటే నాకు లంకెల బిందెలు దొరికిన తరువాత మేలిమి బంగారంతో ఆభరణాలు చేయించుకోవచ్చునని చెప్తూతూ, ఆ పెరట్లో తవ్వకాలు మొదలు పెడుతుంది. కొడుకు ఏమిటని అడగగా నాగశిల వుందనీ, అందుకే రాత్రి తవ్వకాలు చేస్తున్నామనీ చెప్పి రెండు రోజులు నిద్ర లేక త్రవ్వగా జంట నాగుల శిలా ప్రతిమ బయట పడుతుంది. ఆవిడ ఆవు శుక్రవారం ఇంటికి వస్తుందని హారతి సిద్ధం చేయగా బ్రహ్మాండమైన రంకె వేస్తూ వృషభం ప్రత్యక్షం అవుతుంది. "అత్తగారు నక్సలైట్లు" కథలో ఆవిడ యొక్క భయం తారా స్థాయికి చేరుకుని, ఇంటికి వచ్చిన బంధువులు, చుట్టాల్ని అనుమానంతో తరిమివేసి, మాయమాటలు చెప్పి ఇంట్లోకి వచ్చిన దొంగలకి అతిథి మర్యాదలు చేస్తుంది. తమిళ సంవత్సరాది అని వంటవాన్ని వేప పువ్వు కోసం పక్కింటి వాళ్ళ వేపచెట్టు ఎక్కిస్తుంది. తీరా పక్కింటివాడు అడిగేసరికి ఆ తప్పు వంటవాడి మీదకి నెట్టి వేస్తూ వాడిని తిడుతుంది. ఆ దెబ్బతో వంటవాడు చెట్టు మీద నుండి కుడితి తొట్లో పడి ఒళ్ళు హూణం చేసుకుంటాడు. గడ్డం దొంగలు తిరుగుతున్న రోజుల్లో పళని మొక్కు కోసం వంటవాడు, శబరిమల మొక్కు కోసం పనివాడు, గడ్డం పెంచుతూ రాత్రి రెండవ ఆట సినిమాకు వెళ్ళి పోలీసులకు దొరికిపోగా, పనివాళ్ళు పోలీసులకు చెప్పి ఇంటికి తీసుకురాగా అత్తగారు వాళ్ళు ఎవరో తెలీదనీ, అనగానే కొడుకు కల్పించుకునే సరికి గుట్టు చప్పుడు కాకుండా వంటింట్లోకి పోతుంది. ఇక ఆవిడ భయంతోనూ, గాబరాతోనూ, తెలివితక్కువతో చేసిన పనులన్నీ అబాసుపాలై రసాబాసగా రూపాంతరం చెందడం గమనించవచ్చు.

అత్తగారు అన్నీ తెలిసి ఏమీ తెలియని వ్యక్తి ఆవిడ పరిజ్ఞానానికి ఆధారం లేదు, అంతూ లేదు. ఆవకాయ పెట్టాలా? పెట్టేస్తే పోయే, నిమ్మకాయెంతో ఆవకాయ అంతే! ఆవిడకు నిమ్మకాయ కూడా పెట్టడం చేతకాదని తెలిసినవాళ్ళకు ఈ మాటలు వినగానే గుండెల్లో రాయి పడవచ్చు. కానీ ఆవిడకు మాత్రం మనస్సులో సంకోచం లేదు. ఆవకాయకు పళ్ళకాయలు కూడా బేషుగ్గా వెయ్యొచ్చు. కారం ఎప్పుడు కావాలంటే అప్పుడు

కలుపుకోవచ్చు అంటుంది. ఇలాగే ఆవిడకు తన దక్షతలు చెట్లు నాటడమేమిటి, అరటికాయ పొడి చెయ్యడమేమిటి, వడియాలు పెట్టడంలో, చాకలి పద్దులు, కిరాణా కొట్టుకు పంపే జాబితాలు రాయడంలోను, ఓటు వేయడంలోనూ, తాను చేసే ప్రతి నిర్వాకంలోనూ కల్తీ లేని నమ్మకం, అందుచేతనే తన నిర్వాకానికి విఘ్నాలు కలిగినప్పుడు ఆ ప్రయత్నంగా తప్పు వేరొకరి మీదకి నెట్టి వేస్తుంది. ఆవిడ ఒకంతట తప్పు ఒప్పుకోదు అయితే ఆవిడలో ఆకర్షవంతమైన లక్షణం ఏమిటంటే తన తప్పు రుజువయ్యాక తలవంచుకోవడం ఆవిడకు తెలుసు లేదంటే వంటింటికి పోయి దబ్బున బయటికి రాదు.

శ్రీమతి భానుమతి రామకృష్ణ గారు హాస్యం పండించడంలో అందె వేసిన చెయ్యి. కథాగమనంలో లీనమైన పాఠకుడు ఉన్న పళంగా హసితములోకి జారుకోవడం జరుగుతుంది. ఎందకంటే అత్తగారి లోకం వేరు ఈ లోకం వేరు ఈ ద్వంద్వ లోకాల తీరు తెన్నులు యొక్క అంతరాలే పాఠకుని చేత హసితాన్ని తెప్పిస్తాయి. అత్తగారు ప్రసవిస్తున్న ఆవు చుట్టూ ప్రదక్షిణ చేసి కుడితి తొట్టిలో పడిపోవడం, ఆవిడ గొప్పలకు పోయి తిప్పలుపాలు కావడం ఇలా విషయాల్లోనూ, అన్ని సందర్భాల్లోనూ అటు కుటుంబ సభ్యులనూ, ఇటు పాఠకులను కూడా నవ్వించడంలో కృతకృత్యులయ్యారు అత్తగారు. భానుమతి గారి రచనా సామర్థ్యం ఈ పాత్రకు జీవం పోయగా ఇక హాస్యోక్తులు కథల నిండా కుప్పలు తెప్పలుగా ఉన్నాయనే చెప్పవచ్చు.

**ఆధార గ్రంథాలు :**


1) అత్తగారి కథలు - భానుమతి రామకృష్ణ

2) తెలుగు సాహిత్య విమర్శ - ఆచార్య బుదాటి వెంకటేశ్వర్లు

3) సంస్కృత సాహిత్య చరిత్ర - డా॥ ముదిగంటి సుజాతా రెడ్డి

# కందుకూరి, చిలకమర్తి రచనల్లో హాస్యం

**తోట శ్రీనివాసరావు,**
పరిశోధక విద్యార్థి,
తెలుగు మరియు ప్రాచ్య భాషా విభాగం,
ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయం.
చరవాణి : 9849598060

ఈ ప్రపంచంలో ప్రజలకు హాస్యం కన్నా ఆహ్లాదాన్ని కలిగించేది, ఆనందాన్ని కలిగించేది మరొకటి లేదు. నవరసాల్లో హాస్యానికి రెండవ స్థానమే ఇచ్చినా జీవితంలో మాత్రం ప్రథమ స్థానమే పొందుతుంది. నవ్వుల్లో తేలియాడాలని, నవ్వులు పంచుకోవాలని, జీవితమంతా నవ్వుతూ గడపాలని ప్రతి ఒక్కరూ కోరుకుంటారు.

మానవుడు జీవితంలో ప్రతీ కష్టాన్ని నవ్వులతో ఎదిరించాలి. చిరునవ్వు పెదవులపై నుండి చెరగకూడదు. జీవితంలోని ప్రతి సంఘటనలలో హాస్యం పుడతూనే ఉంటుంది. అన్ని విధాల హాస్యాన్ని చూడగలిగిన హృదయమే అందరికీ హాస్యాన్ని పంచగలుగుతుంది. అన్ని రసాలనీ ఆనందంగా స్వీకరించి, ఆస్వాదించి అందరితోనూ పంచుకునే వారినే సహృదయులంటారు.

లక్షణశాస్త్రం, అలంకార శాస్త్ర నిర్వచనం ప్రకారం హాస్యం అంటే "వికృతమైన విలక్షణమైన వేష, భాషా చేష్టలను చూడడం వలన కలిగే మనోవికారమే హాస్యం" అనే అర్థం స్ఫురిస్తుంది. హాస్యానికి స్థాయిభావం హాసం, నవరసాల్లో భరతుడు హాస్యానికి రెండో స్థానం ఇచ్చినా, వెయ్యేళ్ళ తెలుగు సాహిత్యంలో ఎన్నో వేల సంవత్సరాల సంస్కృత సాహిత్యంలో కూడా కవులు హాస్యానికి పెద్దపీట వేయలేదు.నవ్వు ఏ సమయంలో ఎంత మంచిదో సమయం సందర్భం లేకుండా నవ్వితే "నవ్వు నాలుగు విధాల చేటు" అని పెద్దలంటారు. శ్రీరామ పట్టాభిషేక సమయంలో లక్ష్మణుడు నవ్వు చూసి ఆ సభలో ఉన్న ప్రతి ఒక్కరూ తమని చూసి లక్ష్మణుడు నవ్వుతున్నాడేమోనని సందేహపడ్డారే కాని నిజమైన కారణం గ్రహించలేకపోయారు.

నవ్వించే ప్రయత్నంలో సందర్భం తెలిసి నవ్వాలని, ఆ నవ్వులకి తగిన ఔచిత్యం ఉండాలని, నవ్వేటప్పుడు ఒళ్ళు దగ్గర పెట్టుకుని మరీ నవ్వాలని

"నవ్వకుమీ సభలోపల
నవ్వకుమీ, తల్లిదండ్రినాథులతోడన్
నవ్వకుమీ పరసతితో
నవ్వకుమీ విప్రవరుల నయముగ సుమతీ!!"

పరిహాసాలాడేటప్పుడు వావి, వరసలు, పెద్ద, చిన్నా చూడాలని సుమతీ శతకకర్త బద్దెన చక్కని అర్థంతో బోధించారు.

## శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులు గారి రచనల్లో హాస్యం :

సమాజంలో దురాచారాలను, మూఢనమ్మకాలను, అవినీతిని ఖండించడం కోసం హాస్యాన్ని ఆయుధంగా రచయితలు స్వీకరించారు. సామాజిక స్థితిగతులు సాహిత్యంలో చోటు చేసుకోవడమే క్రొత్త అయితే, అదీ హాస్య రూపంలో వ్యాఖ్యానించి చెప్పడం మరీ క్రొత్త అవడంతో ప్రజల్లో ఇది త్వరగా ప్రచారంలోకి వచ్చింది. పద్యం నుండి ప్రజలు నెమ్మదిగా గద్యాన్ని, వచనాన్ని చదవడానికి అలవాటు పడుతున్న కందుకూరి యుగంలో ఇది ఆచరణలోకి వచ్చింది. కబుర్లు కాలక్షేపాల ద్వారా సమాజంలోకి సులభంగా వ్యాపించింది. 1850 నాటికి వచనం, గద్యం చదవడం తెలుగు ప్రజలకు క్రొత్త.

కందుకూరి వారు వచనంలో తొలి తెలుగు నవల, కథానిక, జీవితచరిత్ర, వ్యాసం వంటి ఎన్నో సాహిత్య ప్రక్రియలకు శ్రీకారం చుట్టి అవన్నీ ఒకేసారి వ్యాప్తిలో తీసుకువచ్చి నవీన హాస్యరీతికి ఆద్యులయ్యారు. ఇది ఒక సాహితీ విప్లవం. ఉద్యమాలు రెండు విధాలు. మొదటిది వ్యక్తి నుండి సంఘానికి వ్యాపించేది. రెండోది సంఘం నుండి వ్యక్తులకు వ్యాపించేది. కందుకూరి గారు మొదటి తరానికి చెందినవారు. సమాజంలో దురాచారాలను ఎత్తిచూపుతూ ఒక్కొక్క వ్యక్తిని పట్టుకొని నిలదీసి "ఎందుకు మారరు' అని సంస్కరణోద్యమాన్ని నడిపిన మహానుభావుడు కందుకూరి. ఈ ఉద్యమాలు సంఘంలో ఎవరికోసమో కాదు, మీ కోసం, మీ కూతురి కోసం, మీ కుటుంబ సుఖ సంతోషాల కోసం అని వాదించి పోరాడేవారు.

కన్యాశుల్కం, బాల్యవివాహాలు, వేశ్యాలోలత్వం, అవినీతి, తాండవమాడుతున్న కాలం. స్త్రీలు చదువుకు అంతగా నోచుకోని కాలం. ఆ రోజుల్లో "నా భార్యని, కూతురిని అవసరమైతే అమ్మేస్తాను నువ్వెవరివి అడగటానికి" అని ప్రజలు బహిరంగంగా అనే కాలం అది. తల్లిదండ్రులని ఎదిరించి ఆడపిల్లలని వారిళ్ళలో నుండి తీసుకొని వచ్చి విద్య చెప్పించి వివాహాలు చేయించిన ఘనుడు కందుకూరి.

కందుకూరి వారి హాస్యంలో అధిక్షేపం, వ్యంగ్యం, ఎత్తిపొడుపు, హేళన తిరస్కారాలే ఎక్కువగా వినిపించేవి. తిట్లు శాపనార్థాలు కూడా కొంతమేరకు ప్రజల సమకాలీన భాష వినిపిస్తూ హాస్యం పండించారు. "రాజశేఖర చరిత్ర"లో "నాకు శిష్యులున్న గ్రామంలో అతడు శిష్యుడుగాను, అతడికి శిష్యుడున్న గ్రామంలో నేను శిష్యుడిగాను మారుతుంటాము" అని అనడంలో ఆనాడు గురు శిష్యులు సందర్భానుసారం మారిపోతూ ప్రజల నుండి లబ్ధిని పొందే వైనాన్ని వ్యంగ్యంగా వివరించారు.

కందుకూరి వారి సత్యరాజా పూర్వదేశ యాత్రలు 1891లో వచ్చిన నవల. ఈ నవల ఆనాటి స్త్రీల స్థితిగతులు, సామాజికంగా స్త్రీలు ఎదుర్కొన్న భయంకర సమస్యలు, సంప్రదాయాలు, ధర్మశాస్త్రాలు కూడా స్త్రీని ఎంతగా బానిసలా మార్చాయో స్పష్టంగా చూపిస్తుంది. అయితే ఈ సమస్యలన్నీ స్త్రీపరంగా కాకుండా పురుష పరంగా చెప్పడమే దీని ప్రత్యేకత. ఈ వ్యంగ్య అధిక్షేప నవలలో సత్యరాజు కొన్ని ప్రత్యేక పరిస్థితులలో, స్త్రీలు పరిపాలించే, పూర్తిగా స్త్రీ స్వామ్య వ్యవస్థలో నడిచే ఆడమళయాళానికి చేరుకుంటాడు. అక్కడ మొదట అతడిని నిర్బంధించిన వారే ఆ తరువాత ఆదరించి వారి భాష నేర్పి, అక్కడి ఆచార వ్యవహారాలన్నీ బోధిస్తారు.

మన దేశంలో స్త్రీలు పడే బాధలన్నీ అక్కడ పురుషులు అనుభవిస్తుంటారు. వితంతువైన స్త్రీకి తలగొరిగించినట్లే, ఆడు మళయాళంలో పత్ని మరణించినప్పుడు పురుషుడికి ముక్కు కోసివేస్తారు. దీనికి కారణం పురుషుడు చెడ్డపనులే వృత్తిగా చేసుకొని దోషాలకు పాల్పడడని, అతడిని ఏ స్త్రీ దగ్గరకు రానీయదని ఆచార నియమాలు విధించారు. మనదేశంలో పతి భక్తి ఎంత ఎక్కువో, అక్కడ సతి భక్తి అంత ఎక్కువ. సతీ నియమాలు ఉన్నట్లే అక్కడ పతికి నియమాలు ఈ విధంగా విధిస్తారు.

భార్యలు భర్తలను దండిస్తూ అదుపు ఆజ్ఞల్లో పెట్టుకోవాలి. ఇలా చేయకపోతే భర్తలు గాడిదలై చెడిపోతారట. భార్య పాదతీర్థం త్రాగి తరించాలి. నేటి తరం పురుష పుంగవులు ఎవరైనా ఈ వింత నియమాలు వింటే, ఈ విషయాలు వాళ్ళ భార్యలకు తెలిస్తే హడలిపోయి ముక్కుమీద వేలేసుకోవలసిందేనని పత్నీవ్రత ధర్మబోధినిలో వ్యంగ్యంగా వెల్లడించారు. వినడానికి చాలా హాస్యంగా అనిపించినా నిజంగా ఇవన్నీ స్త్రీలకు ఆనాడు విధించేవారని గుర్తుకు తెచ్చుకుంటే నవ్వేవారే నవ్వులు పాలవుతారు.

## శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహం గారి రచనల్లో హాస్యం :

కందుకూరి వారి ప్రేరణ పొంది సమాజంలోని దురాచార ఖండనని లక్ష్యంగా చేసుకొని హాస్య రచనకి పూనుకొన్న చిలకమర్తి వారు లలితమైన హాస్యాన్నే అందించారు. ప్రహసనాలు, రామచంద్ర విజయం, గణపతి, నవ్వులగని మొదలైన రచనల్లో ఆనాటి సామాజిక స్థితి యదార్థంగా హాస్య రూపంలో కనిపిస్తుంది. సమాజంలోని భిన్న మనస్తత్వాలు, ఆలోచనారీతులు, సంభాషణా వైవిధ్యాలు, భావ ప్రకటనలు చిలకమర్తి అధ్యయనం చేశారు. ఒక ఉద్యమస్ఫూర్తిని కందుకూరి నుండి వారసత్వంగా పొందిన చిలకమర్తి వారు తన ప్రహసనాల్లో ప్రజలు తమ జీవితాల్లో స్వార్థం కోసం ఎలా ఇతరులను ఉపయోగించుకుంటారో చక్కగా వివరించారు.

సంపూర్ణమైన హాస్యం పరిమళించిన నవల గణపతి. ఒక కథానాయకుడి పాత్ర ద్వారా పరిపూర్ణ హాస్యాన్ని అందించిన రచనలు ఇప్పుడు సాధారణంగానే కనిపించినా, ఆనాడు ఇది విశేషం. ఈ విపరీత చేష్టలు, విలక్షణ దుస్తులు, ప్రత్యేక సౌష్ఠవం కలిగిన గణపతి తెలుగు వారికి సంపూర్ణ హాస్యం అందించిన చిలకమర్తి అభినందనీయులు.

“ఉదయమే లేచి చల్దికూడు తిని గిరజాలు దువ్వుకొని, కోటు తొడుగుకొని, తెల్లపంచె కట్టుకొని పొగచుట్టనోట బెట్టుకొని, కుడిచేతితో చెంబు పట్టుకొని, ఎడమ చేతి తర్జన విద్య, అంగుళీయముతో బొగచుట్ట నోటి నుండి తీసి పట్టుకొని యుమ్మివేయుచు” పుర విహారం చేసే సుందర వదనారవిందుడు గణపతి. యవ్వన ముగ్ధమనోహర రూపాన్ని కనులకు కట్టే విధంగా చిత్రించిన ఘనుడు చిలకమర్తి.

గణపతి నవల మూడు తరాల చరిత్ర. గణపతి తాత పాపయ్య, తండ్రి గంగాధరుడు. తనయుడు గణపతి, “సింగమ్మకు వర ప్రసాదియై పప్పుబొట్ల వంశరత్నాకర పూర్ణ చంద్రుడై మన కథానాయకుడు గణపతి జన్మించెను” అని చిలకమర్తి వారు కావ్యనాయక కీర్తి ప్రతిష్ఠలను వివరించెను.

గణపతి చరిత్ర వ్రాయకపోతే ఏమవుతుందో కూడా చిలకమర్తి గారికి గణపతి కలలో కనిపించి చెప్పారు. కాశీలో గోహత్య చేసినట్లేనని, ప్రయాగలో బ్రహ్మ హత్య చేసినట్లేనని, మీరు వ్రాయని పక్షాన నేను దయ్యాన్నై మీ వంశాన్ని నాలుగు తరాల పాటు పట్టుకొని పీడిస్తానని చెప్పెను. వ్రాసిన తర్వాత ఇది చదువని వారు చెదపురుగులై పుట్టి మరొక జన్మలో దీన్ని తింటారని శాపం కూడా పెట్టారు.

ఇంతటి మహాపురుషుడి బాల్యావస్థ మహాద్భుతం. అతడు బడికి పోవడం ఒక వింత దృశ్యం. యమకింకరుల్లాంటి పిల్లలు గణపతి కాళ్ళు, చేతులు కట్టి ఈడ్చుకొని బడికి తీసుకుపోతారు. గణపతి ఆ పిల్లలని కొరికి గోళ్ళతో బరికి, గిల్లి, ఉమ్మి, నోటికి వచ్చినట్లు తిట్టి గోల చేస్తాడు. ఆ విద్యాభ్యాసమే ఒక ప్రహసనం. గణపతికి గుర్రంపై మక్కువ ఎక్కువ. అయినా స్వారీకి గుర్రం ఎక్కువేమిటి? గాడిద తక్కువేమిటి? పైగా గణపతి నవల ప్రారంభంలోనే “శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం ప్రసన్నవదనం” అనే స్తుతి

వినిపిస్తుంది. శుక్లాంబరధరం అంటే తెల్లని వస్త్రాలు మోసేది. శశివర్ణం గాడిద తెల్లగా ఉంటుంది. చతుర్భుజం అది ఎలాగు చతుర్భుజమే కదా. విష్ణుం అంటే సర్వవ్యాపి. గాడిద ఎక్కడ కావాలంటే అక్కడ కనిపిస్తుంది. పైగా గాడిద స్వారీ వలన అన్నీ లాభాలే. ఖర్చు లేదు. ఇది డబ్బులేని వారి గుర్రం. పైగా వసుదేవుడు అంతటి వాడు గాడిద కాళ్ళు పట్టుకున్నాడు కాబట్టి గౌరవానికి లోటు లేదు" అన్నాడు గణపతి. దీనికి ప్రామాణికత కోసం చిలకమర్తి వారు నిరంకుశాః కవయః అనే ఆర్యోక్తిని జ్ఞాపకం చేస్తారు.

గణపతి నవనాగరీకుడు. బ్రాహ్మణార్థం భోక్తలకు సైనుగ్గుడలు వద్దని, కోటా గుడ్డలు ఇవ్వాలనీ ఒక వర్గ నాయకుడౌతాడు. ఇటువంటి వ్యక్తి బడి పిల్లల పూర్వజన్మ సుకృతం కొద్దీ గురువు అవుతాడు. ఉదర పోషణార్థం ఉపాధ్యాయుడైన గణపతి ద్వారా వ్యంగ్య ధోరణిలో ఆరోగ్యకరమైన హాస్యాన్ని పండించారు. గణపతి సిద్ధాంతం ప్రకారం పంతులు పాఠాలు చెప్పడం కన్నా భయపెట్టడంలోనే దృష్టి పెట్టాలి. తమ గురువుల భీకర శిక్షణ వల్లనే తానంతటివాడినయ్యానంటారు. చిత్రవిచిత్ర రీతుల్లో శిక్షిస్తాడు. పిల్లలు గజగజలాడిపోతారు. కానుకలిచ్చుకొన్నవారు రక్షించబడతారు. ఆయన ఒకసారి అనివార్యంగా "శ్రీరఘురామ చారు తులసీదళదామ" అనే పద్యానికి అర్థం చెప్పవలసిన పరిస్థితి ఏర్పడుతుంది. ఆ సహజ పండితుడు దానికి ఇలా అర్థం చెబుతాడు.

శ్రీరఘురామ = శ్రీరాములవారు, చారు = ఒకనాడు పైత్యంగా ఉండి చారు కాపించుకున్నారు. ఆ దేశంలో కరివేపాకు దొరకదు కాబట్టి తులసీ దళాలే అందులో వేశారు. శమక్షమాది శృంగార గుణాభిరామ = శ్రమయావత్తు పోగొట్టగలిగి బహుశృంగారంగా ఉందట ఆ చారు. త్రిజగన్నుత శౌర్యరమాలలామ = ఆ చారు త్రాగిన తరువాత శ్రీరాముల వారికి కావలసినంత శౌర్యం కలిగిందట, దుర్వార కబంధ రాక్షస విరామ = వారందరికీ కఫం పట్టకుండా పోయిందట, భద్రగిరి = అందరికీ భద్రం కలిగిందట. ఇలా ఈ పద్యానికి విశేష పాండిత్యంతో చెప్పిన దుర్వ్యాఖ్యానం తెలుగు కావ్యాలున్నంత కాలం చరిత్రలో నిలిచిపోతుంది. ఈ విధంగా చిలకమర్తి హాస్యవ్యంగ్య చమత్కార ప్రస్థానం ఆచంద్రతారార్కంగా నిలుస్తుంది.

కందుకూరి వీరేశలింగం పంతులు గారు, చిలకమర్తి లక్ష్మీనరసింహారావు గారు తమ ప్రక్రియలన్నింటిల్లోను ముఖ్యంగా ప్రహసనాల్లో తెలుగువారి ఇంటింటి కథలని సామాజిక సమస్యలని, వ్యసనాలనీ, బలహీనతలనీ తూర్పారబడుతూ మృదుమధురమైన హాస్యాన్ని అందించారు. సంఘసంస్కరణాభిలాషులైన కందుకూరి, చిలకమర్తి ఆరోగ్యకరమైన హాస్యాన్ని ఆలంబనగా స్వీకరించి, తమ రచనా వ్యాసాంగాన్ని కొనసాగించారు. విషయాన్ని సూటిగా, స్పష్టంగా చెప్పడం కంటే హాస్యాన్ని మేళవించి రచన చేయడం ద్వారా తమ భావాలు పాఠకుల మనస్సులకు బాగా హత్తుకునేలా ఉండాలని యిరువురు గ్రహించి, సంఘ సంస్కరణే ప్రేరణగా రచనలు గావించి, సమాజాన్ని చైతన్య పరచడంలో కృతకృత్యులయ్యారు. వీరి ప్రభావంతో మొక్కపాటి, భమిడిపాటి, పానుగంటి, మునిమాణిక్యం, ముళ్ళపూడి ప్రభృతులు హాస్యంతో కూడిన మంచి రచనలు చేసి తమ ప్రత్యేకతను నిరూపించుకున్నారు.

# తెలుగు హాస్యనవలల్లో అగ్రగణ్యం-బారిష్టర్ పార్వతీశం

మామిడి మౌనిక,
పరిశోధక విద్యార్థిని,
ఆదికవి నన్నయ్య విశ్వవిద్యాలయం,
రాజమహేంద్రవరం,
చరవాణి : 9948561611.

నవరసాలలో ఒకటైన హాస్యం నిండైన మానవ జీవితానికి వినోదాన్ని ఇచ్చి ప్రధానంగా నిలుస్తుంది. నేటి ఆధునిక జీవనంలో మానవుని గజిబిజిల ప్రయాణంలో హాస్యం యొక్క ఆవశ్యకత మరింతగా పెరిగిందని చెప్పవచ్చు. దాని ఫలితంగానే ఈ లాఫింగ్ క్లబ్స్, లాఫింగ్ థెరపీ, లాఫింగ్ అవర్స్ మొదలగునవి ఆవిర్భవించాయి. ఇవన్నీ కూడా మనం హడావిడి జీవిత గమనంలో పడి నవ్వడం మరిచిపోతున్నాయనే విషయాన్ని గుర్తు చేసుకోవడానికి ఆధారాలుగా చెప్పవచ్చు. నేటి ఆధునిక కాలంలోనే ఇవన్నీ ఏర్పడ్డాయి, కానీ ముందు ఇవిలేవు. ఎందుకంటే వీటి అవసరం మన పూర్వీకులకు రాలేదు. ఆడవారు తమ ఇంటిపనులు, పొలం పనుల్లో భాగంగా కబుర్లు చెప్పుకొని నవ్వుకునేవారు. సాయంత్రం అవగానే పనులు పూర్తిచేసుకొని వచ్చిన పురుషులందరూ అరుగుపై కూర్చొని ఊళ్ళో జరిగిన విశేషాలు, శుభకార్యాలు ప్రస్తావించుకుంటూ నవ్వేవారు. పిల్లలు పాఠశాలలో విద్యనేర్చుస్తూ, సాయంత్రం ఆటలాడుకుంటూ నవ్వుతుండేవారు. రోజు ప్రారంభం అవుతూనే నాన్నమ్మ, తాతయ్య, భార్యభర్తలు, అక్కచెల్లెలు, అన్నదమ్ముల మధ్య కుటుంబంలో హాస్య సంభాషణలు జరుగుతూ ఉండేవి. అందుకనేవారు ఆరోగ్యకరమైన, ఆనందమైన జీవితాన్ని గడిపారు. నేడు మనకు సామాజిక మాధ్యమాల ప్రభావంతో చరవాణితోనే సగం రోజు గడిచిపోతుంది. ఇటువంటి పరిస్థితులలో హాస్యం యొక్క గొప్పతనాన్ని, మన జీవిత ప్రయాణంలో హాస్యం యొక్క ఆవశ్యకతను గ్రహించడం అనేది అత్యవసరంగా చెప్పవచ్చు.

"సాహిత్యం సమాజహితం" అనడానికి నిదర్శనంగా నాటినుండి నేటి వరకు మనకు లభిస్తున్న సాహిత్యమే మనలో హాస్యానికి ఒక ప్రధాన ఆధారంగా నిలిచింది. దాదాపు అన్ని భాషల్లోను హాస్యానికి విశిష్ట స్థానమిచ్చి హాస్య రచనలు వెలువడినవి. హాస్యానికి ప్రతినిధిగా విదూషకుడు అనే ప్రత్యేక పాత్రను సృష్టించిన ఘనత సంస్కృతాంధ్ర సాహిత్యానికి చెందుతుంది. అనేక హాస్య నవలలు, హాస్య కథలు, హాస్య నాటకాలు, హాస్య పాత్రల పరంగా సాహిత్యం హాస్యాన్ని వ్యాప్తి చేస్తుంది. హాస్యకథలలో తెనాలి రామలింగడి కథలు, పరమానందయ్య శిష్యుల కథలు, కాంతం కథలు, అత్తగారి కథలు మొదలగునవి ప్రసిద్ధి చెందాయి. హాస్య నవలల్లో గణపతి, బారిష్టర్ పార్వతీశం మొదలగునవి చెప్పుకోదగినవి. జంధ్యాల పాపయ్యశాస్త్రి, భానుమతి రామకృష్ణ, మునిమాణిక్యం నరసింహారావు, చిలకమర్తి నరసింహారావు, మొక్కపాటి నరసింహశాస్త్రి మొదలగు రచయితలు తమ హాస్య రచనలు, అందులో సృష్టించిన హాస్య పాత్రల ద్వారా ప్రసిద్ధి చెందారు. హాస్య నవలల్లో బారిష్టర్ పార్వతీశం ప్రత్యేకమైనది. పల్లెటూరి నుంచి బారిష్టర్ విద్యను అభ్యసించడానికి ఇంగ్లాండ్ వెళ్ళే ప్రయాణంలో పార్వతీశం పడ్డ పాట్లు హాస్యాన్ని కలిగించాయి. హాస్య నవలల్లో ప్రత్యేకంగా నిలిచిన బారిష్టర్ పార్వతీశం నవలలో హాస్య సంఘటనలను

వివరించడమే ఈ వ్యాసం ముఖ్య ఉద్దేశం.

**నవలా పరిచయం:**

బారిష్టర్ పార్వతీశం నవలను హాస్య రచయితైన మొక్కపాటి నరసింహశాస్త్రి గారు రాశారు. మూడు భాగాలుగా వెలువడిన బారిష్టర్ పార్వతీశం నవల 1925లో ప్రచురితమైనది. తెలుగు సాహిత్యంలో హాస్య రచయితగా మొక్కపాటి వారికి విశిష్ట పేరు ప్రఖ్యాతలు అందించిన నవల బారిష్టర్ పార్వతీశం. ఈ నవల మొదటి భాగంలో పార్వతీశం తమ ప్రాంతమైన నర్సాపురం పరిస్థితులను, ప్రత్యేకతలను వివరిస్తూ, తన విషయాలను ప్రస్తావిస్తాడు. రెండవ భాగంలో బారిష్టర్ విద్యను అభ్యసించడం వివరించారు. మూడవ భాగంలో పార్వతీశం ఇంటికి చేరడం, వివాహం, తాను నేర్చిన విద్యకు తగ్గట్లుగా అభ్యాసం, చివరిలో స్వాతంత్ర్య ఉద్యమంలో పాల్గొనడం, తన ఆస్తిని ఉద్యమానికి త్యాగం చేయడం మొదలగు ఆదర్శవంతమైన అంశాలలో నవల ముగుస్తుంది.

**ఇంగ్లాండ్ ప్రయాణం:**

నర్సాపురం దగ్గర మొగల్తూరు పార్వతీశం వాళ్ళ ఊరు. వీరి ఇంటిపేరు వేమూరు. తాత తండ్రులు ఊరి పెద్దలందరి గౌరవ మర్యాదలు పొందినవారు. కొన్ని పరిస్థితుల వలన చదువు మానేసి ఇంటివద్దనే కాలం గడుపుతాడు పార్వతీశం. ఒకరోజు స్నేహితుడు ఒకడు సంభాషణలో భాగంగా ఇంగ్లాండ్ వెళ్ళి చదువుకోమని సలహా ఇస్తాడు. పార్వతీశం ఇంగ్లాండ్ ప్రయాణం కోసం మంచి చెడు, కష్టసుఖాలు అన్ని ఆలోచనలు చేసి దేశాటనము మంచిదని, అందులోను అధికారుల దేశ ఆచార వ్యవహారాలు, గుట్టుమట్టు తెలుసుకుంటే స్వరాజ్య సంపాదనకు వీలుంటుందని ఇంగ్లాండ్ వెళ్ళి బారిష్టర్ చదవాలని నిశ్చయించుకుంటాడు. ఇంగ్లాండ్ ప్రయాణానికిగాను స్నేహితుని దగ్గర కొంత సొమ్మును అప్పుగా పార్వతీశం తీసుకుంటాడు. తల్లిదండ్రులకు ఈ విషయం చెపితే అర్థం చేసుకోలేరని, తిరిగి ఆపేస్తారేమో అనే ఆలోచనతో చెప్పకుండా నర్సాపురంవెళ్ళి నాలుగురోజుల్లో వచ్చేస్తానని చెప్పి బయలుదేరతాడు. ఈ విధంగా ప్రారంభమైన ఇంగ్లాండ్ ప్రయాణమనే ఆలోచన అనేక హాస్య సంఘటనలలో కొనసాగుతుంది.

**ప్రయాణానికి సిద్ధంచేసిన సామగ్రి:**

పార్వతీశం ఇంగ్లాండ్ వెళ్ళడానికి తయారు చేసుకున్న సామాగ్రి మిక్కిలి హాస్యాన్ని కలగచేస్తుంది. పాఠాలు, భూగోళ శాస్త్రాల వల్ల ఇంగ్లండ్ అంటే తెలుసుకాని అక్కడికి తీసుకువెళ్ళవలసిన సామాగ్రి పార్వతీశంకి తెలియదు. దానికోసం తెలిసినవారు లేరు, దొరలను అడిగితే నవ్వుతారేమో అని భయం. ఇలా కాదనుకొని తన బుద్ధిని వాడి కావలసిన సామాగ్రిని సిద్ధం చేసుకున్నాడు. దంతధావనానికి 10 కచ్చికలు నలిపిన పొడుము, నాలుక గీసుకోవడానికి తాటాకు ముక్కలు, ఇత్తడి చెంబు. తర్వాత స్నానానికి రెండు వస్త్రాలు, సీసాలో కొబ్బరినూనె, దేశవాళీ దువ్వెన, బొట్టుకు కొబ్బరి చిప్పలో కొంచెం చాదు, పావలా పెట్టి కొన్న చిన్నద్దం. ఇక దుస్తుల విషయానికి వస్తే నాలుగు ట్విల్ షర్ట్స్, రెండు ట్రైలు, రెండు మేజోళ్ళ జతలు (నులు), బూట్లు, చలిదేశం కదా అని 15 రూపాయలు పెట్టి మంచి గుడ్డతో సూటు చేయించడానికి ఇస్తే టైలర్ సగం గుడ్డ తీసేయడంతో చాలీ చాలకుండా తయారైన రెండు సూట్లు. ఎక్కడైనా మన వేషధారణ మనదే అనుకొని తలగుడ్డగా వాడడానికి 8 గజాల ఎర్రని జపాను సిల్కు క్లాత్.

భోజనం విషయానికి వస్తే మంచినీళ్ళకై మరచెంబు, స్వయంపాకానికి వీలుగా అన్నమెలాగు అక్కడ దొరకదు గదా! ఇక రొట్టెలే శరణ్యమని గోధుమపిండి, నెయ్యి, దానికోసం ఆవకాయ, అట్లపెనము, స్టవ్, స్టవ్‌లో పోసే కిరసనాయిలు, చిన్న సీసాలో స్పిరిటూ. ఇక చివరిగా నిద్ర విషయానికి వచ్చి మడతమంచం, బొంత, నారింజపండు రంగు శాలువా, ఇవి కాకుండా కూరోచడానికి తుంగచాప, హిందూ ధర్మానుసారంగా ఉండాలని ఆరు యజ్ఞోపవీతాల జతలు, మూడు పట్టుమెలత్రాడులు తీసుకున్నాడు. ఈ సామాగ్రి అంతా ఒక్కసారి చదివినా, ఒక వ్యక్తి వీటన్నిటిని ఒకేసారి పట్టుకున్నపుడు చూసిన ముఖంపై హాస్యం వెల్లివిరుస్తుంది. ఇదంతా చాదస్తంగా అనిపించిన వెళ్ళేది దూరదేశం ఏ వస్తువు లేకపోయినా ఇబ్బంది పడాలి, అందులోను అనవసర ఖర్చులు చేయడం నచ్చని పార్వతీశం, దూరాలోచన చేసి వీటన్నిటిని ఒక రేకు పెట్టెలో పెట్టుకొని బయలుదేరాడు. ఈ సామానంతా ఒకవైపు హాస్యం కలిగిస్తూనే మరోవైపు ఆనాటి జీవనశైలిలో ఉపయోగించే వస్తుసామగ్రిని కళ్ళకు కట్టినట్లు చూపించారు.

## రైల్వే ఉద్యోగిని విసిగించడం:

మొగల్తూరు, నర్సాపురం తప్ప చుట్టుపక్కల ప్రదేశాలు కూడా చూడని పార్వతీశం పడవపై నిడదవోలు చేరారు. స్టేషనుకెళ్ళి ఒక పెద్దమనిషిని టిక్కెట్ ఇవ్వండి అనడిగాడు. ఎక్కడికి అన్నాడు? తానెక్కడికి వెళ్తున్నాడో చెప్పే విషయం తెలిసిపోతుందిగా అందుకని ఎక్కడికైతే ఏం లెండి టికెట్ ఇవ్వండి అన్నాడు పార్వతీశం. అతను ఎగాదిగా చూసి టికెట్లు ఇచ్చే అతను రాలేదు వస్తాడని చెప్పారు. కాసేపాగి వచ్చారని తెలుసుకొని వెళ్ళి టికెట్ అడిగితే ఆయన కూడా ఎక్కడికి అన్నారు. చెప్తాలెండి, టికెట్ ఇవ్వండి అన్నాడు పార్వతీశం. ఏ వూరు పోతావయ్యా నువ్వు? ఎక్కడికి వెళ్తావో చెప్పకపోతే టికెట్ ఎలా ఇవ్వాలి నేను అని అరుస్తాడు. అక్కడి వారందరూ అర్థమయ్యేలా చెప్పడంతో ఎక్కడికి వెళ్తామో చెప్తేనే టికెట్ వస్తుందని భావించి చెన్నపట్నం అని చెప్తాడు. వెంటనే ఆయన కోపంగా ఎక్కడ నుంచి వచ్చావయ్యా నువ్వు? పట్నం బండి సాయంత్రం వరకు రాదు పోవయ్యా పో! అని పంపేస్తాడు.

కాసేపాగి నిదానంగా వెళ్ళి పట్నం బండి ఎపుడు వస్తుందండి అనడిగాడు పార్వతీశం, పనిచేసుకుంటూ సాయంత్రం అని చెప్తే అలాగా, సాయంత్రం వరకు ఉండాలా నాకు తొందరపని ఉందే అంటాడు పార్వతీశం. అపుడు ముఖం వైపు చూసి ఓ మళ్ళీ వచ్చావా! తొందర పని ఉంటే నడిచిపో అని వెళ్ళిపోతాడు. కోపంతో అలా చెప్పాడనుకొని నెమ్మదిగా వెళ్ళి ఇంకా నోరు తెరవకముందే వచ్చావా! పట్నంబండి ఎపుడు వస్తుందో తెలుసుకోవడానికి వచ్చావా! ఒకసారి చెప్తే నీకు బుద్ధిలేదు అని ప్రారంభించాడు. ఆయన్ని అంతకంటే ఏడిపిస్తే బాగోదని అబ్బే! రైలుకోసం కాదండీ మిమ్మల్ని చూస్తే ఏం జ్ఞాపకం వస్తుందో చెప్పడానికి అని పార్వతీశం అంటాడు. ఏమిటి అనడగితే మీ మొహం చూస్తే వులి ఆడిన తిగరగటి రాయి, తలకాయ చూస్తే సున్నపు పిడతా జ్ఞాపకం వస్తున్నాయి అంటాడు పార్వతీశం. అక్కడున్న నౌకరులందరూ పక్కున నవ్వడంతో ఆయనకు కోపం వచ్చి కొట్టడానికి వస్తే పార్వతీశం పారిపోతాడు. వీరిద్దరి మధ్య సంభాషణలో ఆయన అరవభాషతో విసిగిస్తే, పార్వతీశం తన అమాయకత్వంతో ఆయన్ని విసిగించి హాస్యాన్ని కలిగించాడు.

## స్టేషన్ మాష్టార్‌తో వాగ్వాదం:

పార్వతీశం హొటల్‌కు వెళ్ళి, భోజనం చేసి, సాయంత్రం వరకు ఉండి, స్టేషన్‌కు వచ్చి, టికెట్ తీసుకుంటాడు. ఒక రైలు వస్తే అక్కడున్న నౌకరుని ఈ రైలు ఎక్కవచ్చునా? అని అడుగుతాడు. మీరెక్కడికి వెళ్ళాలంటే నీకెందుకు అని వెళ్ళిపోతాడు. ఒక పెద్దమనిషి ఉంటే అదే ప్రశ్న అడుగుతాడు. ఆయన కూడా అదే ప్రశ్న ఎక్కడికి వెళ్తారు? అని అడుగుతాడు. ఇలా కాదని కోపంతో స్టేషన్ మాష్టర్ దగ్గరకెళ్ళి, ఈ రైలు ఎక్కవచ్చునా అంటాడు పార్వతీశం. ఆయన అదే ప్రశ్న ఎక్కడికి వెళ్తారని ఏదొకటి చెయ్యాలని రాజమహేంద్రవరం అని పార్వతీశం చెప్తాడు. అయితే ఎక్కండి అనగానే ఎక్కి రైలు కదలబోతుంటే "ఏమండోయ్! నేను చెన్నపట్నం వెళ్తున్నాను", రాజమహేంద్రవరం కాదని స్టేషన్ మాష్టరుతో చెప్తాడు. అతడు వెంటనే రైలును ఆపి దిగమంటాడు, నేనెందుకు దిగాలి అంటే ఇది చెన్నపట్నం వెళ్ళదు, వట్టి ఫూల్‌లాగా ఉన్నావని స్టేషన్ మాస్టర్ తిడతాడు. ఫూల్‌గీల్ అనకండి నేను దిగనంటే గార్డ్ వచ్చి బలవంతంగా పార్వతీశంను దింపేస్తాడు. పార్వతీశం దిగులు మొహం చూసి జాలిపడి స్టేషన్ మాస్టారు ఇంకో పావుగంటలో వస్తుందని చెప్తాడు. ఈ సంఘటనలో ఎవరికో బుద్ధి చెప్పాలనుకొని తాను కూర్చున్న చెట్టుకొమ్మను తానే నరుకుతున్నట్లుగా చేసికొని పార్వతీశం వినోదాన్ని పంచాడు.

## రైల్లో పెద్దమనిషి చెప్పిన జోస్యం:

రైలు ఎక్కుతూ కిందపడి, రైలు ఎక్కాక కూడా కింద పడి, కొన్ని హాస్యాస్పద సంఘటనల మధ్య కూర్చొని చూస్తుంటాడు పార్వతీశం. ఓ అయిదుగురు ఎక్కపోతుంటే వారికి ఇది సెకండ్ క్లాస్ అని బోధచేయడంతో "వట్టి పల్లెటూరి దద్దమ్మలా ఉన్నాడనుకొని" వారు లోపలికి వెళ్తారు. రైలు కదలడంతో మిగిలిన నలుగురు దిగడంతో ఈ పెద్దమనిషిని సాగనంపడానికి వచ్చారని పార్వతీవం తెలుసుకుంటాడు. అప్పటివరకు బయటకు చూస్తూ ఆ పెద్దమనిషి వైపు ఒకసారి చూస్తే ఆయన కూడా పార్వతీశం వైపు చూస్తూ మీది ఏ ఊరు అనడిగాడు. నర్సాపురమని చెప్తే ఎక్కడికి వెళ్తున్నారు? అని అడిగితే తరచుగా వెళ్తాననే భావన కలిగేట్లు కొలంబోదాకా అని పార్వతీశం అంటాడు. అప్పుడె పెద్దమనిషి అలాగా అని చూసి, కొంపదీసి ఇంగ్లాండ్ వెళ్ళడం లేదుగదా! వాలకం చూస్తే అలా అనిపించట్లేదు, కాని అలా అని కొలంబో వెళ్ళవనేం ఉండదనిపిస్తుంది అన్నాడు. పార్వతీశం స్పందించి అలాగా అండి, నా వాలకం ఎందుచేత అలా కనిపించడం లేదు? అందులో మీకేం లోటు కనబడింది అనడుగుతాడు. నిజం చెప్తే నువ్వేమైనా అనుకుంటావేమో అనంటే పర్వాలేదు చెప్పండని పార్వతీశం అంటాడు.

నీ పెట్టెను చూస్తే పల్లెటూరి వాడివని, ఎప్పుడూ దూర ప్రయాణం చేయలేదని, నేను వస్తుంటే రావొద్దన్నపుడు రైలు ప్రయాణం, అందులో సెకండ్ క్లాస్‌లో ప్రయాణం నువ్వు ఎప్పుడూ చేయలేదని, పల్లెటూరివాడవు కదా ఇంగ్లాండ్ వెళ్తున్నావేమో అనిపించింది. లేకపోతే కొలంబో వెళ్ళడానికి గల కారణాలేవి కనిపించడం లేదు అంటాడు. అందులోను నాటుకోడిపెట్ట తలలా ఉన్న నీ తలకాయ చూసి నీకు క్రాఫింగ్ తెలీదని, ఉన్న జుట్టు కూడా ఈరోజే తీయించావని తెలుస్తుంది. కొలంబో వరకైతే జుట్టు ఎందుకు తీయిస్తావు. కాబట్టి కొలంబో దాటి ప్రయాణం చేస్తున్నావని అంటాడు పెద్దమనిషి. ఇంట్లో కూడా చెప్పకుండా వెళ్తున్నావని అనుమానం, లేకపోతే బొంబాయి కాకుండా కొలంబో ఎందుకు వెళ్ళతావు? ఏమంటావు? నేను చెప్పినవన్నీ నిజమేగా అని

అడుగుతాడు ఆ పెద్దమనిషి. ఆయన చెప్తున్నవి వింటుంటే పార్వతీశానికి పై ప్రాణాలు పైనే ఎగిరిపోయినట్టు ఉన్నాడు. అరవవాడైన అఖండునిలా ఉన్న అతడు జోస్యం చెప్పినట్టు ఇన్ని విషయాలను ఏకధాటిగా చెప్పాడు. కేవలం తనను చూసి ఇన్ని చెప్పిన అతడితో అయ్యా! మీరు చెప్పింది నిజమే, నేను ఇంగ్లాండు వెళ్తున్నానని పార్వతీశం చెప్తాడు. తన అనుభవం ద్వారా అనేక విషయాలను తెలియజేసి పార్వతీశాన్ని బిత్తరపోయేలా చేసిన ఆ పెద్దమనిషి మాటలు హాస్యాన్ని మెండుగా అందించాయి.

**ముగింపు:**

ప్రతివ్యక్తి తన జీవితంలో హాస్యమును ఆకాంక్షించడమనేది సాధారణం. మానవుని ఆరోగ్య విషయంలో కూడా హాస్యమనేది ప్రముఖ పాత్ర వహిస్తుంది. అలా మనస్ఫూర్తిగా నవ్వడం అనేది మానవునికి మానసిక ప్రశాంతతను అందిస్తుంది. పార్వతీశం యొక్క ఇంగ్లాండ్ ప్రయాణ పరిస్థితులు, ఆ ప్రయాణంలో ఎదురుపడిన సంఘటనలతో అయోమయం, తోటివారు పార్వతీశం రూపాన్ని అవహేళన చేయడం, వీటన్నిటి మధ్య పార్వతీశం అమాయకత్వంతో ఈ నవల హాస్యధోరణిలో సాగింది. పార్వతీశం ఇతర వ్యక్తులతో మాట్లాడే సంభాషణలు కూడా కడుపు చెక్కలయ్యేలా నవ్వును కలిగిస్తాయి. తెలియదనే అజ్ఞానాన్ని ప్రదర్శించకూడదని తెలిసినట్లుగా ప్రవర్తించే పార్వతీశం పద్ధతి వినోదాన్ని అందిస్తుంది. ప్రతి ఒక్కరి చేతిలో ఇతడు దొరకడమో లేదా ఇతరులు పార్వతీశానికి దొరకడమో మొత్తానికి నవలని చమత్కారమైన సంభాషణలతో నడిపారు. మొక్కపాటి నరసింహశాస్త్రి. ఈ నవల పదవతరగతి విద్యార్థులకు ఉపవాచకంగా ఇవ్వబడడంతో విద్యార్థులలో సైతం ఈ నవల గుర్తుండిపోయిందని చెప్పవచ్చు. పల్లెటూరి నుండి ఒక యువకుడు బయలుదేరి పొరుగుదేశం వెళ్ళి న్యాయశాస్త్రం అభ్యసించి తన విద్యనే తన పేరు ముందు స్థిరపరుచుకుని బారిష్టర్ పార్వతీశంగా నిలిచాడు. వివిధ సంఘటనలు, విభిన్న పాత్రలు, వీటన్నిటి మధ్య పార్వతీశం చేష్టలతో "బారిష్టర్ పార్వతీశం" నవల వినోదాత్మకంగా, మరవలేనిదిగా హాస్యాన్ని పండించి హాస్య నవలల్లో అగ్రగణ్యంగా నిలిచింది.

**ఆధారం:**

1. బారిష్టర్ పార్వతీశం - మొక్కపాటి నరసింహశాస్త్రి.

# హాస్యం - జీవన రస నైవేద్యం

**డా॥ పిల్లి వాసు**
తెలుగు పరిశోధక విద్యార్థి
ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయం
చరవాణి : 88975 88579

**శ్రీమతి దాసరి విజయలక్ష్మి**
తెలుగు పరిశోధక విద్యార్థిని
ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయం
చరవాణి : 90140 82587

**హా**స్యం అంటే నవ్వు. నవ్వు వున్న చోట సంతోషం కొలువై వుంటుంది. సంతోషంగా వుండటమంటే ఆనందంతో నిండి వుండటమని అర్థం. అలా సంతోషంగా వున్న వ్యక్తిగానీ, లేదా ఆ ప్రదేశం కానీ, పరిసరాలు కానీ, ఆ పరిస్థితులు కానీ, అన్నీ దైవత్వంతో నిండివుండటమని అర్థం. ఇక్కడ దైవత్వం అంటే... దేవుడు, దెయ్యం, స్వర్గం, నరకం అనే భావనల్ని కొంచెం పక్కన పెట్టి ఆలోచిద్దాం... వాస్తవానికి పైన స్వర్గ నరకాలు వున్నాయో లేదో తెలియదు గదా, సుఖం అనేది సంతోషంతో కూడిన నవ్వును తెప్పిస్తే, దుఃఖం అనేది బాధతో కూడిన ఏడుపును తెప్పిస్తుంది. సుఖమనేది స్వర్గంతో సమానమైనదైతే, దుఃఖమనేది నరకంతో సమానమనే భావన మనందరిలో వున్నదే. ప్రస్తుతం మనిషి అనుభవిస్తున్న ఈ జీవితంలో మాత్రం అవి రెండూ తప్పనిసరిగా ప్రతి ఒక్కరికీ ఎదురయ్యే అనుభవాలే... అనుభూతులే... యిదమిద్ధంగా హాస్యమంటే నవ్వు అని, నవ్వు అంటే దైవత్వమని భావిస్తే, పుట్టిన ప్రతి మానవుడూ తాను గిట్టే వరకు, ఎన్నో వ్యయ ప్రయాసలకోర్చి, ఉరుకులు, పరుగులతో కూడిన తన మొత్తం జీవితంలో ఆరాటపడేది - సుఖాలతో కూడిన నవ్వుల స్వర్గాన్ని అందుకోవాలనే బలమైన కాంక్షతోనే.

స్వచ్ఛమైన చిరునవ్వు ఒక దైవత్వం - Pure smile is a divinity. అందమైన చిన్నపాప యొక్క చిరునవ్వు ఒక దైవత్వం - Cute small baby smile is a divinity. రంగు రంగుల పువ్వుల చిరునవ్వు ఒక దైవత్వం - Colourful flowers smile is a divinity. అందమైన ప్రకృతి యొక్క నవ్వే ఒక దైవత్వం - A beautiful nature smile is divinity. నెర్రెలిచ్చిన నేలపై చినుకు చుక్క కురిసినప్పుడు భూమి చిందించే నవ్వే ఒక దైవత్వం - When a rain drop fall on a drought land the land smile and we can see the divinity in the smile. ఆకలితో అలమటిస్తున్న పేదవాడికి పిడికెడు మెతుకులు దొరికినప్పుడు అతను చిందించే నవ్వులో ఒక దైవత్వం - The divinity seen in the laughter that arises when the starving poor man finds the bowl of rice.

రంగు, రుచి, వాసన లేనిది ఏదైనా కళావిహీనమైనదే. రంగులేని చిత్రం, రుచిలేని పదార్థం, వాసన లేని పుష్పం ఎంత నిస్సారమైనవిగా భావిస్తామో, హాస్యం అనేది లేని జీవితం కూడా అంతే నిష్ప్రయోజనంగాను, నిస్తేజంగాను, నిస్సారంగానూ వుంటుంది. అందుకే మనిషన్నాక కాస్తంత కళాపోషణ, కళాత్మక, రసహృదయం వుండాలి అంటారు. ఆ కళాపోషణ ద్వారా మలినమైన మానవ కంకాళాన్ని పునీతం చేసే రసం వుత్పన్నమౌతుంది. ఆ రసోత్పత్తి ద్వారా మనిషి ఉత్తేజితుడు కాగలుగుతాడు. ఆ చైతన్య ప్రేరణే మానవ జీవితాల్ని అమృతప్రాయం చేస్తుంది. అందుకే... నవ్వడం ఒక యోగమని, నవ్వించడం ఒక భోగమని అన్నారు. ఇవి రెండూ లేని జీవితం రోగ గ్రస్తమైనదని చెబుతూ మన జంధ్యాలవారు అన్న మాటల్లోని అంతరార్థమిదేనని మనకు చాలా సులభంగా బోధపడుతుంది. అందుకే మానవ జీవితంలో హాస్యమనేది, అంత ప్రధాన భూమికను సంతరించుకుంది.

భారతీయ ప్రాచీన అలంకారికులు చెప్పిన నవరసాలలో హాస్యం కూడా ఒకటి. హాస్యం యొక్క స్థాయీభావం హాసం. హాసం అంటే నవ్వు (Smile). మనిషికి నవ్వును పుట్టించే చర్యే హాస్యం. ఈ హాస్యమనేది ఆధునిక సామాజికునికి అత్యంత ఆవశ్యకమైనది. వేగవంతమైన పోటీ ప్రపంచంలో ఉరుకులు, పరుగుల మధ్య అవిశ్రాంత పథికులౌతున్న జీవితాలకు నవ్వనేది ఒక టానిక్‌లా దివ్యౌషధంలా పనిచేస్తుందని అనేక శాస్త్ర పరిశోధనల సారంగా వెల్లడైంది. తత్ఫలితంగానే నేడు మనం ఈ చూస్తున్న ఎన్నెన్నో కృత్రిమ లాఫింగ్ క్లబ్స్ (Artificial Laughing Clubs).

మానవ జీవితంలో దైనందిన అవసరాలైన ఆహారం, నిద్ర అనేవి ఎంత ముఖ్యమని భావిస్తామో, ఆ జీవితాన్ని కళాత్మకంగా అనుభవించటానికి, ఆస్వాదించడానికి అంత ముఖ్యమైనదే నవరసాత్మకత. ఈ ఆధునిక కాలంలో అన్ని రంగాలలోనూ హాస్యం యొక్క ప్రాధాన్యతను గుర్తించటమనేది విశేషం. వాస్తవానికి భారతీయ అలంకారికులు, సాహిత్యకారులు నవరసాత్మకమైన సాహిత్య సృష్టి ద్వారా ప్రజల్ని సంస్కరణ మార్గంలోనికి నడిపించే బృహత్తర కార్యాన్ని అనాదికాలనే ఆరంభించారు. అందుకే సహితస్య భావం సాహిత్యం అంటారు. అంటే హితాన్ని, మేలును, సామాజిక ప్రగతిదాయకమైన మార్పును కోరేది సాహిత్యం, ఆ సాహిత్యం రసాత్మకమైనదైయున్నప్పుడే దాని ప్రయోజనం సఫలీకృతమౌతుంది. "వాక్యం రసాత్మకం కావ్యం అనే మాట యొక్క అర్థాన్నిబట్టి, ఒక కావ్యానికి రసమనేది ఆత్మవంటిదనే విషయం గ్రహించగలం. ఏదైనా ఒక కావ్యసృష్టి వెనుక ప్రధాన లక్ష్యంగానీ, ప్రయోజనంగానీ చూస్తే పాఠకునికి ఆనందం కలగజేయటంతోపాటు ఆలోచనాత్మకమైన భావనలు రేకెత్తించేదై వుండటమే. పాఠకునికి ఈ విధమైన ఆలోచనలు పుట్టించడంతో పాటు ఆనందాన్ని కలిగించేది కేవలం రసాస్వాదన మాత్రమే. 1. శృంగారం, 2. వీరం, 3. కరుణ, 4. అద్భుతం, 5. హాస్యం, 6. భయానకం, 7. భీభత్సం, 8. రౌద్రం, 9. శాంతం అనే (తొమ్మిది) నవరసాలూ ఆ యా సందర్భ సన్నివేశాల ప్రస్తావనలో ప్రతిక్షేపించబడినవై పాఠకునికి ఆనందానుభూతిని కలిగిస్తాయి. ఆఖరుకి ఒక కావ్యాధ్యయనం ద్వారానో, లేక చూసిన ఒక సన్నివేశం ద్వారానో కరుణ రస ప్రధానమైన శోకముద్భవించినప్పటికీ, ఆ దుఃఖం ద్వారా కూడా రసానుభూతియైన ఆనందాన్ని పొందగలుగుతాడు. కరుణరసం కూడా చివరకు ఆనందానికి దారితీస్తుంది. ఆనంద స్వరూపమైన ఈ అపరిమిత ఆనందాన్ని కూడా ఒక రసాస్వాదనే అన్నారు. ఈ విధమైన ఆనందాన్ని కలిగించే నవరసాలలో హాస్యరసం చాలా ప్రధానమైనదిగా భావించవచ్చు.

అమితం కానిదేదైనా మితమే, మితమైనది ఏదైనా ఆనందాత్మకమే, ఆనందాత్మకమైనదేదైనా రసాత్మకమే, రసాత్మకమైనదేదైనా అమృతత్వమే, అటువంటి అమృతత్వ రసమే ఈ హాస్యం. అపహాస్యం కానంత వరకు హాస్యమేదైనా అమృతప్రాయమే. మానవునికి అమృతప్రాయమైన ఆనందాన్ని కలిగించేది హాస్యం, అందుకే ప్రాచీన కావ్యాలంకారికుల కాలం నుండి నేటి ఆధునికుల వరకూ తమ తమ కావ్య రచనలలో హాస్యరసానికి ఎంతో ప్రాధాన్యతను కల్పించారు.

నవరసాలలో హాస్యరసానికున్న ప్రాముఖ్యతను గనుక గమనిస్తే, ఈ రసాలలో ఒక్కొక్క రస భావన కొద్దిమందిలో మాత్రమే ఆ అనుభూతిని కలిగిస్తుందనేది వాస్తవం, కానీ ఆబాలగోపాలాన్నీ అలరింపజేసేది హాస్యరసమే. ఉదాహరణకు గమనిస్తే... శృంగార రసం, కొంతమంది యువతీ యువకులకు ఆనందాన్ని చేకూర్చవచ్చేమోగానీ, చిన్నపిల్లలకు, వృద్ధులకు ఎటువంటి ఆనందాన్నీ కలిగించలేదు. అదేవిధంగా మిగతా వీర, శాంత, కరుణ, అద్భుత, భయానక, భీభత్స, రౌద్రరసాలకూ కొన్నికొన్ని వయసుల దృష్ట్యా వారివారి భౌతిక శరీరవయువాల నిర్మాణ దృష్ట్యా కొన్ని కొన్ని పరిమితులు తప్పకుండా వుండటం గమనిస్తాం.

అవి కొంతమందికి మాత్రమే ఆనందాన్ని చేకూరుస్తాయి. అదే హాస్య రసం విషయానికి వస్తే ఎటువంటి పరిమితులు లేకుండా అన్ని వయసుల వారికీ ఆనందం కలిగిస్తుంది. జంధ్యాలవారన్నట్టు 'నవ్వలేకపోవడం ఒకరోగం' అనే కారణమేమైనా వుంటే తప్ప హాస్యరసం వల్ల ఆనందప్రాప్తి, నవ్వులప్రాప్తి కలుగుతుందనేది వాస్తవం. ఇక్కడ హాస్యం అనే పదానికి నైఘంటికార్థంలో ఆనందము, సంతోషము, సుఖము అనే అర్థం వుండి మూడు పదాలు ఒకటే అనే భావన స్ఫురిస్తుంది. అది వాస్తవమే అయినా ఆ మూడింటికి సంబంధించిన పద ప్రయోగాల వాడుక దృష్ట్యా కొంచెం వ్యత్యాసం కనిపించక మానదు.

ప్రాచీన సంస్కృత కావ్యాల్లో, నాటకాలలో విదూషకుడి పాత్ర, హాస్యరసాన్ని పోషించింది. సంస్కృత సాహిత్యంలో హాస్యరసానికి సముచిత స్థానం కల్పించిన మృచ్ఛకటికం రూపకం హాస్యరస విషయికంగా సమాజానికొక దర్పణం వంటిదిగా భావించవచ్చు. ఇందులో శూద్రకుడు ఆనాటి కాలంలో అల్లకల్లోలంగా వున్నటువంటి సామాజిక, రాజకీయ, ఆర్థిక పరిస్థితులను దృష్టియందుంచుకుని చేసిన రచన. కథావిషయానికి వస్తే, రాజు బలహీనుడుగా, అసమర్థుడుగా, భోగలాలసునిగా వుండటంవల్ల రాజుకు వ్యతిరేఖంగా ఒక ఉద్యమం సాగుతుంది. రాజుగారి బావమరిది శకారుడనే వ్యక్తి రాజుకు సన్నిహితంగా వుండి, స్త్రీలను బలాత్కరించడం, మంచివారికి యిబ్బందులు కలుగజేయటం వంటి చెడ్డ పనులు చేస్తూ వుంటాడు. వాడికేమీ తెలియదు కానీ అన్నీ తెలుసనుకుంటాడు. వసంతసేన అనే వేశ్యను లోబర్చుకోవడానికి ఎన్నో ప్రయత్నాలు చేస్తూ ఆమెను వెంబడిస్తూ వుంటాడు. ఒకనాడామె చారుదత్తుని యింట చేరి తనను రక్షించమని వేడుకుంటుంది, ఆ తర్వాత ఆమె అతనిపై అభిమానం, ప్రేమ కలిగి వుంటుంది. ఈ నాటకంలో చారుదత్తుని మిత్రుడు మైత్రేయుడు, ఒకసారి వసంతసేన యింటికి వెళతాడు. అది చాలా అందమైన భవనం, ఒకగదిలో వసంతసేన తల్లి వుంటుంది. ఆమె ఊహకందని విధంగా అంటే, తలుపు పట్టనంత లావుగా వుంటుంది, ఆమెను చూసి ముందుగా 'ఈమెను గదిలో వుంచి, ఆ తర్వాత తలుపులు కట్టించారా?' అంటారు. ఈవిధంగా ఈ నాటకంలో హాస్యం నామమాత్రమైనా కూడా ఒక వ్యక్తి యొక్క రూపాన్ని యధాతథంగా వర్ణించడం వల్ల కూడా హాస్యం పుట్టించొచ్చని గ్రమించగలం. అలా సంస్కృత నాటకాలలో రకరకాలుగా హాస్యరసం ప్రతిక్షేపితమౌతుంది.

ఈ హాస్యమనే ప్రక్రియ ద్వారా నవ్వు పుడుతుంది. ప్రేక్షకుడిలో, పాఠకునిలో నవ్వు పుట్టించడమనేది ఒక సృజనాత్మకమైన కళ. ఈ కళ సంస్కారయుతమైన పదజాలంతో యితరులను నొప్పించక, తన వాక్చాతుర్యాన్ని ప్రదర్శించడం సామాన్యమైన విషయమేమీకాదు. అలా సృజనాత్మక మార్గంలో ఉత్పన్నమయ్యే హాస్యం హృదయాలను తేలిక పరుస్తుంది. కాకపోతే అలాంటి సున్నితమైన పదజాలంతో హాస్యం పుట్టించడమనేది అంత తేలికైన పనేమీకాదనే విషయం గ్రహించవచ్చు. అందుకే హాస్యమనేది హృదయాల్ని తేలిక పరుస్తుంది కానీ, ఆ హాస్యం పుట్టించే క్రమంలో బాగా అవసరమైనది బలమైన ఆలోచనలతో కూడిన సృజనాత్మకతే అనేది అర్థమౌతుంది.

వాస్తవానికి మానవుని జీవన క్రమాన్ని గమనిస్తే, మనిషి పుట్టినప్పుడు ఏడుస్తూనే పుడతాడు. చనిపోయినప్పుడు పదుగురికి దుఃఖాన్ని మిగిల్చిపోతాడు. అలా పుట్టినదగ్గర నుండి పోయేదాకా మనిషి జీవితం మొత్తం దుఃఖమయంగానే కనిపిస్తుంది. అందనిదాన్ని అందిపుచ్చుకోవాలని, కోర్కెల గుర్రమెక్కి ఆధునిక పోటీ ప్రపంచంలో ఆయాసంతో కూడిన ప్రయాణమంతటిలో అతనికి/ఆమెకు ఎదురయ్యే ప్రతి మజిలీ దుఃఖప్రాయమైనదే. అటువంటి ప్రయాస ప్రయాణం మిగిల్చేది దుఃఖమే, ఆ దుఃఖం నుండి మనిషి ఉత్తేజితం కావడానికి ఆహ్లాదకరమైన హాస్యం ఎప్పటికీ అవసరమే. అందుకే ఆధునిక మానవులు

అనునిత్యం తమకు కావలసిన ఆనందాన్ని వెతుక్కోవడానికి, దానిని పదిమందికీ పంచటానికి మనిషి సాహిత్య సృష్టి చేయడం ప్రారంభించాడు. మానవుడు తాను ప్రారంభించిన ఆనందాన్వేషణ మిగిలిన జీవరాసులన్నింటి నుండీ మనిషిని వేరుచేస్తుంది, ఎందుకంటే గుర్రం జాషువా ...

"నవ్వవు జంతువుల్ నరుడు నవ్వును, నవ్వులు చిత్తవృత్తికిన్

దివ్వెలు కొన్ని నవ్వులెటుతేలవు కొన్ని విషప్రయుక్తముల్

పువ్వులవోలె ప్రేమరసముల్ వెలిగ్రక్కు విశుద్ధమైనవే

నవ్వులు సర్వదుఃఖదమనంబులు వ్యాధులకున్ మహౌషధుల్"

అంటారు.

జంతువుల నుండి మనిషిని వేరు చేసేది కేవలం నవ్వు మాత్రమే, ఆ నవ్వు పువ్వువలే మృధువైన ప్రేమరసాన్ని అందించి, దుఃఖాన్ని, రోగాల్ని దూరం చేస్తుందని కవి భావనగా, ఆలోచనగా కన్పిస్తుంది.

ఒక సినీ గేయ రచయిత 'నవ్వుతూ బతకాలిరా తమ్ముడూ! నవ్వుతూ చావాలిరా!' అన్నట్లు పుట్టేది, చచ్చేది తెలియని మనిషి ఆ రెండు ఘట్టాలకు నడుమ జీవితాన్ని నవ్వుతూ ఆస్వాదించాలని, దానిద్వారా మానవుని ఆయుః ప్రమాణం పెరుగుతుందన్న విషయాన్ని గ్రమించిన ఆధునికులు నేడు సాహిత్య రచనల్లోనేకాక సినిమాలు, బుల్లితెరలలోని సీరియల్స్ మొదలు అచ్చంగా నవ్వించే కార్యక్రమాలలో పంచ్ డైలాగులతో నిరంతరం హాస్యవర్షపు జల్లులు కురిపించే కార్యక్రమాలకు శ్రీకారం చుట్టారు. సోషల్ మీడియాలో సైతం నేడు ఈ హాస్యం విపరీతంగా పండుతుందంటే, హాస్యానికి అంటే నవ్వుకు పెరిగిన క్రేజ్ ఏ స్థాయిలో వుందో గ్రహించవచ్చు.

హాస్యం (నవ్వుల) విషయంలో ప్రాచీన కాలానికి, నేటి కాలానికీ మధ్యనున్న వ్యత్యాసం స్పష్టంగా కన్పిస్తుంది. నాడు హాస్యోత్పత్తి చేసేందుకు అనుసరించిన పద్ధతులు సంస్కారయుతమైన భాషాపదాల ప్రయోగానికి అనుగుణంగా వుంటే, నేడు సంస్కారయుత పదప్రయోగానికి (అక్కడక్కడా/అధికశాతం) తిలోదకాలిచ్చి, అశ్లీల అర్థాలనిచ్చే శ్లేషవాక్య నిర్మాణాలతో ఏ మార్గంలోనైనా సరే హాస్యం పండించాలనుకునే భావనే పరమావధిగా నేటి ధోరణి కనిపిస్తుంది. అందుకే ప్రాచీనాలంకారికుల దృష్టికోణంలో హాస్యాన్ని స్థూలంగా ఆరు రకాలుగా విభజించారు. అవి, 1. స్మితం, 2. హసితం, 3. విహసితం, 4. ఉపహసితం, 5. అపహసితం, 6. అతి హసితం యిలా ఆరు రకాలుగా చెప్పారు. వీటి అర్థాల్ని గనుక పరిశీలిస్తే...

1. దంతాలు అసలేమీ కనిపించకుండా నవ్వే మందస్మిత చిరుదరహాసమే స్మితం.

2. దంతాలు కొంచెం మాత్రమే కనిపించే విధంగా నవ్వులు చిందిస్తే అది హసితం.

3. మృధుమధురంగా (సన్నని శబ్దం) శబ్దంచేస్తూ, కనులు మూసుకుని నవ్వితే అది విహసితం.

4. భుజాలు, తల వంచుకుని, వంకర చూపులతో, ముక్కుపుటాలనెగరేస్తూ నవ్వే నవ్వు ఉపహసితం.

5. కళ్ళల్లో నీరొచ్చేలా వికట స్వరంతో, కాళ్లూ, చేతులు వూగిపోయేలా నవ్వే నవ్వు అపహసితం.

6. చెవులకు కటువుగా (కర్ణకఠోరంగా) వుండే పెద్ద శబ్దంతో, కళ్ళెంట నీరు వచ్చేలా నవ్వే నవ్వును అతిహసితం అని అంటారు.

వాస్తవానికి ప్రాచీన సాహిత్యకారులు ఈ విధమైన ఆరు రకాల నవ్వుల్లోని మొదటి రెండు అనగా స్మితం, హసితం అనేవి హాస్యానికి ఉత్తమమైన పద్ధతులనీ, ఇటువంటి నవ్వు (ఉత్తమమని) యోగ్యమైనదిగా భావించారు. ఆ తర్వాతి రెండు అంటే విహసితం, ఉపహసితం అనేవాటిని మధ్యమ హాస్య పద్ధతులుగాను, మిగతా రెండు రకాలైన అపహసితం మరియు అతి హసితం అనబడేవి అనర్ధదాయకాలని, అతి ప్రమాదభరితమైనవిగా భావించి, వీటిని అధమస్థాయి హాస్యపద్ధతులని అన్నారు.

హాస్యమనేది సున్నితంగా, మనోరంజకంగా వుండాలేగానీ, కర్ణకఠోరంగా వుండకూడదు. ఒద్దికగా వుండాలిగానీ హద్దులు దాటకూడదనేది అర్థమౌతుంది. ఈ హాస్యమనేది ఎప్పుడూ యితరులలోని దోషాలను సున్నితంగాను, సుకుమారంగాను యెత్తిచూపుతూ, వాటిని పోగొట్టుకునేలా వారిని సంస్కరించే విధంగా వుండాలేగానీ, ఎదుటివారు ముఖం మాడ్చుకునే విధంగా వుండకూడదు.

హాస్యాన్ని (నవ్వుల్ని) సాహిత్యంలోగానీ, సమాజంలోగానీ ప్రయోగించాలంటే తప్పనిసరిగా పాటించాల్సిన నియమాలు కొన్నుంటాయి. అవి, హాస్యానికి సమయ, సందర్భాలను తప్పనిసరిగా పాటించాల్సిన అవసరం వుంది. ఆ సమయ సందర్భాలు, విషాద సమయాలలో హాస్యాన్ని ప్రదర్శించకూడదు. అలాగే వీరత్వం, తీవ్ర రణం జరిగే సమయాలలో ఆవిధమైన హాస్యరసపూర్వకమైన ప్రవర్తనగానీ, ప్రదర్శనగానీ చేయకూడదు. ఉదాహరణకు ప్రస్తుతం రష్యా ఉక్రెయిన్ యుద్ధం జరుగుతూ వున్న ఈ సమయంలో, ఉక్రెయిన్ అధ్యక్షుడైన జెలెన్‌స్కీ స్వతహాగా హాస్యనటుడు, పెద్ద కమెడియన్ ఆ హాస్యనటుడైన వ్యక్తి అధ్యక్ష స్థానంలో ఒక దేశానికి నాయకుడైయుండగా, రష్యా యుద్ధంతో తమ దేశానికి తీవ్ర ఆర్థికపరమైన నష్టం, ప్రాణనష్టం సంభవించి వేలాదిగా ప్రజలు తమ దేశాన్ని విడిచి శరణార్థులుగా వలసలు పోతుంటే, ఒక ప్రక్క ఆహార కొరత, సైన్యం కొరత, ఆయుధ కొరత, నిస్సహాయత, ప్రాణహననం, వైద్యపరమైన అవసరాలు, రవాణా స్థంభన, వేలాది మరణాలతోపాటు అనునిత్యం శత్రుసేనల భీకర దాడులతో తల్లడిల్లుతూ కృంగిపోతుంటే, తనదేశ ప్రజల్ని రక్షించుకునేందుకు తమ ప్రజల్ని యుద్ధ సన్నద్ధుల్ని చేయాల్సిన సందర్భంలో హాస్యానికి తావే వుండకూడని అంశం.జెలెన్‌స్కీ చేసింది కూడా తమ దేశ ప్రజలకు అండగా నిలబడి అమితమైన ధైర్యాన్ని నూరిపోశాడు. కాబట్టి రెండు రోజుల్లో ఉక్రెయిన్ ఓడిపోతుంది అనుకున్నది దాదాపుగా మూడు వారాలకు పైనే (20-03-2022 నాటికి 25 రోజులు) బలమైన రాజ్యాన్ని సైతం ఆత్మస్థైర్యంతో యెదుర్కోగలుగుతుందంటే అందులో దేశాధ్యక్షుడైన జెలెన్‌స్కీ ప్రేరేపిత ధైర్యం పాళ్ళు మెండుగా కనిపిస్తున్నాయే తప్ప రష్యాతో ఉక్రెయిన్ హాస్యమాడుతున్నట్టుగా లేదు ఆత్మస్థైర్యంతో వున్నట్టి స్థితి కనిపిస్తుంది. *(పైన ఉదహరించిన అంశం ఆఫ్ ది రికార్డ్ అనగా, మరెక్కడా ప్రస్థావించకూడని అంశం దీనిని కేవలం వుదాహరణగా మాత్రమే ఈ సమయ సందర్భాలకు సంబంధించిన అంశంగా మాత్రమే ప్రస్థావించబడినది)* మరొక విషయం హాస్యాన్ని (నవ్వుల్ని) ప్రదర్శించే వ్యక్తి, తాను నవ్వకుండా వుంటూ ఎదుటివారిని మాత్రమే నవ్వేలా జాగ్రత్తపడాలి. తాను చేసే హాస్యానికి తానే నవ్వటం వల్ల ఆ హాస్యం అంతలా పండదు, ఎందుకంటే, తాను ఒకచేత్తో భోజనం చేస్తూ మరో చేతితో వడ్డిస్తుంటే ఎంతటి ఇబ్బందిగానూ, అపసవ్యంగానూ వుంటుందో, ఇక్కడకూడా ఆదేవిధంగా వుంటుంది కాబట్టి, హాస్య ప్రదర్శన చేసే సమయం, సందర్భం గమనించుకోవడం ఎంత ముఖ్యమో, తాను కంట్రోల్‌గా వుంటూ, ఎదుటివారిలో హాస్యం పుట్టించడమనేదే కూడా అంతే ముఖ్యం. అలాంటి నటనలో ఉత్తర కుమారుడి పాత్రలో 'రేలంగి', 'రమణారెడ్డి, 'రాజబాబు', 'అల్లు రామలింగయ్య' వంటివారి నటనా కౌశలంతో అద్భుతమైన హాస్యాన్ని పండించారు.

ఇటువంటి నియమాలను పాటిస్తూ సాహిత్యంలో ఉత్తమ హాస్యాన్ని తెలుగు సాహిత్యకారులు పండించిన సందర్భాలను పరిశీలిస్తే...

తెలుగు సాహిత్యంలో తొలి తెలుగు రచన ఆంధ్ర మహాభారతంలో కౌరవ, పాండవులందరూ గంభీరమూర్తులే కాబట్టి హాస్యరసాన్ని, భారతంలోని ఆదిపర్వంలో గరుత్మంతుని చేత పీడింపబడ్డ దేవతల పరుగుల సన్నివేశంలోగాని, బకాసురుని వృత్తాంతంలోగాని, దుర్యోధనుని భంగపాటు సన్నివేశాలలోగానీ, చూడగలం. అలాగే నన్నెచోడుని కుమార సంభవంలో మన్మధుని ప్రగల్భాలకన్నా, రతీదేవి భర్తతో వాదించటమే పాఠకునికి నవ్వును తెప్పిస్తాయి. అలాగే తిక్కన భారతంలో భీముడు నర్తనశాలలో స్త్రీ వేష సన్నివేశం, ఉత్తర కుమారుడు పొంకుపాటుతో రథం దిగి పారిపోవడం వంటి సన్నివేశ ప్రస్థావనల హాస్య రసపూర్వకమైనవి. అలాగే గౌరన నవనాధ చరిత్రలో పురోహితుడు ఎలుగుబంటితో సరసాలాడటం, హరిశ్చంద్ర వ్యాఖ్యానంలో కలహకంఠి, కాలకౌశికుల పోట్లాటలు, రోకలి బండలతో కొట్టుకోవడాలు వంటివి విపరీతంగా నవ్విస్తాయి. శ్రీనాధుని చాటు పద్యాలతో కావలసినంత హాస్యాన్ని ఆనందించవచ్చు. అదేవిధంగా పోతన రచనల్లో శ్రీకృష్ణుని బాల్య చేష్టలు మనల్ని నవ్వులతో పరవశింపజేస్తాయి. ఇక కృష్ణదేవరాయలు కాలంలోనైతే హాస్యానికి కొదవేలేదన్నంతగా నవ్వుల్ని పూయించిన తెనాలి రామకృష్ణుని చాటుపద్యాలన్నీ హాస్యభాండాగారాలే. ఇలా చూస్తే పింగళి సూరన తన కళా పూర్ణోదయంలో వైకుంఠంలో నేత్రవాసుల బెత్తపు దెబ్బలకు దడుసుకుని (జడుసుకుని) బ్రహ్మాంతటివాడే పారిపోయాడంటూ చేసిన వర్ణన హాస్య రసపూర్వకమైనట్టి సన్నివేశమే. చేమకూర వెంకటకవి చమత్కారాలు చక్కని చక్కిలిగింతలు పెడుతుంటాయి.

ఇక కవి చౌడప్ప వ్యంగ్యపూరితమైన హాస్యోక్తులకు తిరుగే లేదు. 'రొయ్యకు లేదా బారెడు మీసము', ఇచ్చేవాడికో లేక ఇప్పించేవాడికో మీసముండాలి గానీ మిగిలిన మీలాంటి వారికి మీసమెందుకు, రొయ్యలకు బారెడు మీసాలుండవా, కయ్యానికి కుందవరపుకవి చౌడప్ప అంటూ వీపులు బిట్లగొట్టే వ్యంగ్యోక్తులతో హాస్యాన్ని పండించిన కవి చౌడప్ప. ఇక 18వ శతాబ్దంలో అడిదం సూరకవిని, భార్య కన్న కొడుకుపై పద్యం చెప్పమని కోరినప్పుడు, కొడుకైన బాచన్నకు పళ్ళెత్తు, అటువంటి కొడుకు ఎత్తుపళ్ళు చూస్తే పట్టపగలే బూచిని చూసినట్లుంటుందని వ్యంగ్యంగా అంటే, బిడ్డని కన్న తల్లి పేగుమమకారం చిన్నబోయింది. అది విన్న మనకు 'అయ్యో పాపం' అనకుండా, నవ్వు పుట్టిస్తుంటి సన్నివేశ సంభాషణ. ఈవిధంగా తెలుగు సాహిత్యంలో హాస్యం పిల్ల కాలువలా 'స్మితం' నుండి మొదలై, నేడు ఉధృతనదిలా 'అతిహసితం'లా ప్రవహిస్తూ వుంది.

తెలుగు సాహిత్యంలో హాస్య కవిత్రయంగా పేరొందిన భమిడిపాటి, మొక్కపాటి, మునిమాణిక్యం వంటివారు గొప్ప హాస్య రచయితలు. ముని మాణిక్యంవారి కాంతం కథలు, మొక్కపాటివారి బారిష్టర్ పార్వతీశం, చిలకమర్తివారి ప్రహసనాలు, పానుగంటి సాక్షి వ్యాసాలు హాస్యరసాన్ని పండించాయి. ఐతే, ఇక్కడ ముఖ్యంగా మనం గమనించాల్సిన విషయమేంటంటే, మన తెలుగు సాహిత్యకారుల రచనల్లో భావ రసమేదైనా గానీ, ఆ రచనల్లో సాంఘిక ప్రయోజనమే లక్ష్యమనే భావనా పరిధికి లోబడే హాస్యాన్ని ప్రతిక్షేపించారే తప్ప, విచ్చలవిడి హాస్యాన్ని ప్రయోగించలేదు. మన తెలుగు సాహిత్యపు నైతిక విలువలు ఈ 'హాస్యం పేరిట అపహాస్యం' పాలవ్వకుండా జాగరూకత వహించారు. కానీ నేటి ఆధునిక రచనలకు చెందిన సినిమాలు, సీరియల్స్, సోషల్ మీడియా వేదికగా వచ్చే ఫేస్‌బుక్, యూట్యూబ్, ట్విట్టర్ వంటి వాటితోపాటు వెబ్ సిరీస్‌లలోనూ, వీక్లీ, మంత్లీ మొదలైన ముద్రితాల్లోను, ఇలా ఒకటనేమిటి

అన్నిరంగాలలోనూ హాస్యం మాంచి జోరుగా ఊపందుకుంది. వాస్తవానికి హాస్యం, అపహాస్యం కాకూడదనే ఉద్దేశ్యంతోనే ప్రాచీనులు 'నవ్వు నాలుగందాలా చేటు' అన్నారు. (విహసితం, ఉపహసితం, అపహసితం, అతిహసితం అనే వాటిలాగా అని మనం అనుకుంటే) నాటి ఆధునిక సాహిత్యకారులు 'నవ్వు నలభై రకాల గ్రేట్' అని నిరూపించారు. కానీ అదే నేటికాలపు సాహిత్యంలో హాస్యం జోరు పెరిగి, అశ్లీల పదజాలం, ఘాటైన వ్యంగ్యార్థాలతో కూడిన శ్లేష, పచ్చితనంతో కూడిన విచ్చలవిడి హాస్యాన్ని అక్కడక్కడా కొందరు ప్రయోగించడం లేకపోలేదు. హాస్యం ఒక మోతాదులో వున్నంత వరకే అది మానవ మనుగడకు అనేక రకాలైన మేలులను చేకూరుస్తుంది. అటువంటి హాస్యరసానికి మంచి ఉదాహరణలుగా సినీరంగంలో హాస్య చక్రవర్తులుగా వర్ధిల్లిన రాజబాబు, రేలంగి, రమణారెడ్డి, సుత్తివేలు, గుండు హనుమంతరావు, అల్లు రామలింగయ్య, బ్రహ్మానందం, వంటి ఎందరెందరో మంచి హాస్యాన్ని పండించి రంజింపజేశారు. కానీ నేడు కొన్ని రకాల రచనల వల్లగానీ, సినిమాల వల్లగానీ, సీరియల్స్ వల్లగానీ, టి.వి.ప్రోగ్రామ్స్ వల్ల గానీ అపహాస్యం పాలవుతున్న దాఖలాలే అధికంగా వుంటున్నాయనేదే అధికశాతం జనాభిప్రాయం.

హాస్యం అపహాస్యం కాకుండా, ఆరోగ్యదాయకమైన నవ్వుల్ని పండిస్తూ, మానవ జీవితాల్లో వెయ్యికాలాలు వర్ధిల్లే స్వర్గతుల్యమై, హాస్యంగా, మూడు జోకులు వేస్తే ముప్పై ఆరు పళ్ళతో నవ్వుల్ని పండిస్తూ, ఆ నవ్వులు తరం నుండి తరానికి తరలించబడే నవ్వుల జల్లుగా చిరకాలం వర్ధిల్లాలనేదే మా ఆకాంక్ష. అటువంటి ఆకాంక్షతో కూడిన హాస్యం నేటి ఆధునికుడి జీవితంలో వర్ధిల్లటం అనేదే జీవన రస నైవేద్యం, అందుకే హాస్యం-జీవన రసనైవేద్యం అన్నాను.

---

ఆధారగ్రంథాలు
1). ఆర్షవిజ్ఞానము
2). ప్రాచీనాంధ్ర కథాకావ్యాలు-నీతిబోధ - తెలుగు అకాడమి.
3). సుభాషిత రత్నావళి - రెంటాల



# ప్రహసనములు - హాస్యం

**డా॥ గూడూరి గ్లోరియానెట్**
లెక్చరర్,
కస్తూరిబాయి కాలేజి ఆఫ్ ఎడ్యుకేషన్
ఫర్ ఉమెన్, బాపట్ల.

**1. పరిచయము :** హాస్యము అనేది జీవితములో చాలా ప్రధానమైన రసం. హాస్యము (Humour or Humor) అనగా వినోదం కలిగించి నవ్వు పుట్టించే లక్షణం కలిగిన ఒక భావానుభవం. హాస్యం అంటే ఏమిటి, అది ఎలా సంభవిస్తుంది, దాని వలన ప్రయోజనాలు ఇబ్బందులు ఏమిటి అనే విషయాలపై పలు అభిప్రాయాలున్నాయి. దైనందిన జీవితంలోను, సినిమాలలోను, సాహిత్యంలోను, వ్యక్తుల వ్యవహారాలలోను హాస్యం ఒక ముఖ్యమైన పాత్ర కలిగి ఉంటుంది.

**2. హాస్యము అర్థము :** ప్రహసనము నందు హాస్యము ప్రధానమని గుర్తించి యున్నారు. విపరీతాలంకారము, వికృతాచార - అభిదాన - వేషములు, అంగవికారములు మొదలగువాని వలన జనులకు నవ్వు పుట్టించునని హాస్యమనబడును అని భరతుడు పేర్కొనెను.

**3. హాస్యం కలిగించే సందర్భాలు :**

హాస్యం "పండించే" విషయాలు

- భావాలకు, ఉద్వేగాలకు ఆ విషయం అతుకుకోవాలి.
- వాస్తవానికి కొంత పోలిక ఉండాలి కాని వాస్తవం కాకూడదు.
- అనుకోని మలుపు (surprise, misdirection, contradiction, ambiguity or paradox).

హాస్యం కలిగించే సంభాషణాంశాలు

- ఉత్ప్రేక్ష
- అతిశయోక్తి
- అసంబద్ధత (ఫార్స్)
- సందర్భం మార్పు (reframing)
- సమయస్ఫూర్తి
- శ్లేష

రోవాన్ అట్కిన్సన్ (Rowan Atkinson) అనే ప్రసిద్ధ హాస్యనటుడు ఒక ఉపన్యాసంలో హాస్యాన్ని కలిగించే హావభావాలు ఇవి అని చెప్పాడు (Mr. Bean)

- అసాధారణంగా ప్రవర్తించడం
- ఉండకూడని స్థలంలో ఉండడం
- ఉండకూడని సైజులో ఉండడం

**4. హాస్యం - ప్రహసనము :**

భరతుడు ప్రహసనమును క్రిందివిధముగా నిర్వచించెను - "ప్రహసనములు రెండు విధములు - శుద్ధము, సంకీర్ణము. భగత్-తాపస-విప్ర-శాక్యాదులను గూర్చిన హాస్యవాదములతో కూడినదియును, కుత్సితపురుషులతో నిండినదియును, పరిహాసభాషణములతో నిండినదియును, వారి భాషా-ఆచారములను యథాతథముగా ప్రదర్శించునదియును, విశిష్టభావ ద్యోతకములగు కథాఖండములను, నియతగతికల ఇతివృత్తము (ఒకేఒకని చరిత్ర)ను కలదియును 'శుద్ధ ప్రహసన' మనబడును. అనిభృతములైన వేష-పరిచ్ఛద-చేష్టితములుకల వేశ్యా-చేట-నపుంసక-విట-ధూర్త-బంధకీసంకులమగునది 'సంకీర్ణప్రహసన' మనబడును. లోకవ్యవహారసిద్ధమగు వార్తయును, దంభమును, ధూర్తుల (దొంగతాపసులు, విటులు) ప్రవివాదములును ప్రహసనము లందుండవలెను. మరియు, అవసరమునుబట్టి ఇందు వీథ్యంగములను కూర్పవలెను" (నా.శా. పుట. 527). దీనిపై అభినవగుప్తుని వ్యాఖ్య క్రిందివిధముగా నున్నది - "ప్రహసనీయమైనది, అనగా పరిహాస ప్రధానములైన ఆభాషణము లధికముగా కలది, ప్రహసన మనబడును. ప్రహసనమందు అంకసంఖ్య నిర్దేశింపబడలేదు. శుద్ధప్రహసనము ఏకాంకమనియు, వేశ్యాదిచరిత సంఖ్యాబలముచేత సంకీర్ణప్రహసన మనేకాంకమనియు కొందరందురు. కాని ఇది ఏకాంక రూపకముల మధ్య పఠింపబడుటచేత ఇదియును ఏకాంకమే అని మరికొందరందురు. ఉత్సృష్టికాంక-ప్రహసన-భాణములు, కరుణ-హాస్య-విస్మయ ప్రధానములై రంజకరస ప్రధానములగుచున్నవి. అందువలననే వీనియందు స్త్రీ-బాల-మూర్ఖాదు లధికారులుగానున్నారు. వీనియం దితివృత్తము విస్తృతముగా నుండదు; అంతియేకాదు, ఇతివృత్తవైచిత్ర్యముకూడ నుండదు" (అభినవభారతి-2వ సం. పుటలు 449-51).

ప్రహసనమనగా కవికల్పితమైన అనుదాత్తచరితమనియు, అందు ఒకటికాని రెండు కాని అంకము లుండవచ్చుననియు, అందు హాస్యము ప్రధానరసమనియు అర్వాచీనాలంకారికులందరును అంగీకరించి యున్నారు. పాశ్చాత్యుల 'ఫార్సు' లక్షణములును, భారతీయుల ప్రహసన లక్షణములును ఇంచుమించుగా సరిపోవును. కాగా, ప్రాచ్య-పాశ్చాత్యుల మతములలో ప్రహసన మందు సాహిత్యపు విలువ తక్కువ. అది ముఖ్యముగా వినోదప్రధానము; అందు విరుద్ధభావముల, విరుద్ధ సన్నివేశముల కూర్పుచేత హాస్యము జనించుచుండును. ఇందు ప్రధానముగా కుత్సితులు, కృత్రిమ-దాంభికజీవనులు, తెలిసినమూఢులు హాస్యభాజను లగుచుందురు; వారు అట్లు పరిహసింపబడుటలో తక్కివారికి ఒక హెచ్చరిక అంతర్లీనమై యుండును.

వావివరుసలకు సంబంధించిన పరిహాసములెట్లున్నను కుత్సితులను, దాంభికులను, మూఢులను

ప్రసాదగుణ మధికము. ఇంక నర్మోక్తి పలువిధములు - పైకి నవ్వులాటగానే కన్పించునుకాని, అందు అనావిష్కృతమైన సత్యము గర్భీకృతమై యుండును; ఒక్కొక్కప్పుడు గుండెను దూసికొనిపోయెడి వ్యంగ్య ముండును; మరియొకప్పుడు చెంపపెట్టుగానై కండ్లనీరు తెప్పింపవచ్చును. భరతుడు నర్మమున మూడు ప్రధాన భేదములను పేర్కొనుట స్మరింపదగును - "ఈర్ష్యనుకాని, క్రోధమునుకాని సూచించునది; పరులను ఉపాలంభించుటతో కూడినది: వంచనాపూర్వకముగా పరుల హృదయమును గ్రహించుటకు ప్రయుక్తమైనది" (నా.శా. పుట 617). పైన పేర్కొన్న భగవదజ్జుక ప్రహసన సన్నివేశమువంటి కల్పనలు సన్నివేశగత హాస్యమున కుదాహరణములు.

తెలుగులో ప్రహసనరచన కాద్యులు కందుకూరివారు. వారు బ్రాహ్మవివాహాది పెద్ద ప్రహసనములనే కాక పెక్కు చిన్న చిన్న ప్రహసనములను కూడ రచించియున్నారు; కొన్నిటికి సూత్రప్రాయముగా ఆంగ్లమాతృకలు కూడా కలవు. పంతులుగారి ననుసరించి చిలకమర్తివారు కూడ చాల ప్రహసనములను రచించియున్నారు. కాని, ఈ యిరువురి రచనలయందును కొన్ని లోపములున్నవి - హాస్యముకంటె వ్యంగ్యమధికము; పాత్రలు సార్వజనీనములుకావు (ఎవరినో దృష్టియందు పెట్టుకొని వ్రాసినట్లు కన్పట్టుచుండును). వచనరచనలో జిగిబిగువులు లేవు; కేవలం సంఘదురాచారములను దూషించునుద్దేశముతో సంవాదాత్మకముగా రచింపబడిన వగుటచేత రూపకమున కావశ్యకమైన ఇతివృత్త సంగ్రథనముకాని, పాత్ర పోషణముకాని కన్పట్టదు; కాగా, వీనిలో నిర్మాణశిల్పము కొరవడినది. ఈ ఇరువురిలోను చిలకమర్తివారి రచనలలో కొంత చమత్కారమధికము. బళ్ళారికవిద్వయము కూడ రెండుమూడేసి ప్రహసనములను రచించియున్నారు. శ్రీయుతులు మంత్రిప్రగడ భుజంగరావు, సెట్టి లక్ష్మీనరసింహం, పానుగంటి లక్ష్మీనరసింహారావు, కాళ్ళకూరి నారాయణరావు ప్రభృతులు కూడ చాల ప్రహసనములను రచించియున్నారు; కాని, అవియెల్ల తత్కాల సామాన్యవిషయములతో కూడినవై సంస్కారదృష్టితోనో లేదా కేవల పరిహాసదృష్టితోనో రచింపబడిన వగుటచేత వానియందు కళాసంపద అంతగా కన్పట్టదు. ఇట్టివే 'లొడారి బుచ్చిగాడు', 'తవిటిరొట్టె' మున్నగు రచనలు.

కాని, తెలుగులో ఉత్తమ ప్రహసనములు కొన్ని లేకపోలేదు; అట్టివానిలో పానుగంటి వారి "కంఠాభరణము" (1917) అగ్రస్థానమును వహించును. ఈ రచనకు ముందే మోలియర్ ప్రహసనములు రెండు తెలుగులోకి అనూదితములైనవి - 'విధిలేక వైద్యుడు' (1912), 'లుబ్ధా గ్రేసర చక్రవర్తి' (1914). మొదటిది నెల్లూరు మాండలికములో వెలువడగా, రెండవది విశాఖ మాండలికములో వెలువడినది. ఈ అల్పారంభము గోదావరి మాండలికములో భమిడిపాటివారి కలములో పరాకాష్ఠకు వెళ్ళినది. వీరందరును తమ అనువాదములకు దేశీయతాముద్ర వేసియున్నారు. భమిడిపాటివారు మోలియర్ రచనలను అనువదించుటయే కాక, వానితో సమానములైన పెక్కు స్వతంత్ర ప్రహసనములను కూడ రచించియున్నారు. తెలుగు సాహిత్యమున, ప్రహసనమునకు స్వతంత్రస్థాయిని కల్పించిన కీర్తి భమిడిపాటివారికే చెందును. ఈ సందర్భమున విశ్వనాథ కవిరాజుగారి రచనలు కూడ స్మరణీయములు. శ్రీపాద కామేశ్వరరావు ప్రభృతులు భారతీయ భాషలనుండి కొన్ని ప్రహసనముల ననువదించియున్నారు. వేటూరి ప్రభాకరశాస్త్రి గారు సంస్కృతము

నుండి భగవదజ్జువము (1924), మత్తవిలాసము (1935) అను ప్రహసనములను ఆంధ్రీకరించియుండుట పేర్కొనియున్నాను.

నాటక ప్రదర్శనాదులలోని అవకతవకల నాక్షేపించుచు కొన్ని ప్రహసనములు బయలుదేరుట స్మరణార్హము - బి.టి. రాఘవాచార్యులవారి సంగీత ఇంద్రసభ (1925 ప్రాంతములు), చింతా దీక్షితులు, గుడిపాటి వెంకటాచలం, వేదుల సత్యనారాయణశాస్త్రిగార్లు కలిసి వ్రాసిన 'నాటక ప్రహసనము' (మదనసాయకా కార్తవీర్యము - 1941), తిరుపతి వేంకటకవుల 'రసాభాసము' మొదలగునవిందుల కుదాహరణములు. ఇందు మొదటిది సంగీతనాటకములపై దాడి; రెండవది కాంట్రాక్టు నాటకములపై దాడి; ఇంక మూడవది నాటక సమాజములపై దాడి; ఇట్టిదే డా॥ చిలుకూరి నారాయణరావు గారి 'నాటక నాటకం'. (సంగీత ఇంద్రసభకు వ్రాయబడిన పీఠిక, నాటక ప్రహసనమునకు వ్రాయబడిన 'ఉపోద్ఘాతము' తప్పక పరిశీలింపదగినవి).

1910-20 ప్రాంతముల 'నాటకము ఫార్సులు' అను పేర పెక్కు ప్రహసనములు వెలువడినవి. పెద్దఎత్తున రంగాలంకరణముచేయవలసిన రంగములను తీర్చిదిద్దుటకు కొంత వ్యవధి కావలసివచ్చెడిది. ఆ వ్యవధికాలములో ప్రేక్షకులను వినోదపర్చుటకు ఒకరిద్దరు తెరముందుకు వచ్చి చమత్కారసంభాషణములు చేయుచుండెడివారు. ఇట్టి చమత్కారసంభాషణములు తొలుత తత్కాలకల్పితములుగా ఆరంభమైనను, పిమ్మట రచయితలు ఇట్టి ప్రత్యేకరచనలు చేయసాగిరి. (ద్రోణంరాజు సీతారామారావు ప్రభృతుల ఇట్టిరచనలు ముద్రింపబడినవి).

సమకాలీన రచయితలలోకూడ చక్కని ప్రహసనకర్తలు కలరు. విశ్వనాథ కవిరాజు గారి కుమారులు మల్లాది అవధానిగారు (అసంపూర్ణ రామాయణము మొ॥), తమ్ములు మల్లాది వేంకటకృష్ణశర్మగారు (వారసత్వం మొ॥), భమిడిపాటి కామేశ్వరరావుగారి కుమారులు రాధాకృష్ణగారు మొదలగువారు ప్రముఖముగా పేర్కొనదగినవారు. ఒకతరములోని ఆస్తివలె ఈ రచనాసంపద తరువాతి తరమువారికి కూడ సంక్రమించుట చిత్రము! పులుగుండ్ల రామకృష్ణయ్యగారి 'తుఫాను' పరిషత్తు బహుమతిపొందిన రచన. బుద్ధవరపు నాగరాజామాత్యుని 'పిచ్చివాండ్ల పంచాయితీ' మొదలగునవి కూడా పేర్కొనవలసిన రచనలు.

**5. హాస్యం గురించి సిద్ధాంతాలు :**

హాస్యం ఉత్పన్నమయ్యే పరిస్థితులు

- ఒక సందర్భంలో ఉన్న దృక్పథానికి అనుకోని మార్పు సంభవించి (shift in perception or answer), అయినా గాని పాత "మూడ్"కు సంబంధం కలిగి ఉండడం వలన.
- టెన్షన్‌గా ఉన్న స్థితినుండి ఆకస్మికంగా ఊరట లభించడం - ఈ ఊరట నిజమైనది కావచ్చును. లేదా కేవలం మాటలకే పరిమితమై ఉండవచ్చును.

- రెండు ఐడియాలు లేదా విషయాలు కలగాపులగం కావడం - అయినా వాటిమధ్య అంతరంతోపాటు సంబంధం కూడా మిగిలి ఉండడం.
- వేరొకరి పొరపాటు లేదా అజ్ఞానం లేదా దుస్థితి పట్ల మరొకరు నవ్వి వినోదం పొందటం. ఇందులో ఒకరికి ఇబ్బందికరమైన పరిస్థితి ఉంటే మరొకరికి ఆధిపత్యం కనపరచే భావం ఉంటుంది.

**ముగింపు :** ప్రస్తుత జీవన విధానంలో ఒత్తిడిని తగ్గించుటకు హాస్య నాటికలు, హాస్య పుస్తకము చదువుట మొ॥ ఒక భాగమైనవనుటకు అతిశయోక్తి కాదు.

**ఆధార గ్రంథాలు :**

1) తెలుగు నాటక వికాసం - శివాజీ ప్రెస్

2) తెలుగు సంస్కృతి - మల్లంపల్లి సోమశేఖరశర్మ

3) నా చిన్ననాటి ముచ్చట్లు - కె.యస్.కేసరి.

4) ఆంధ్ర నాటకరంగంపై పాశ్చాత్య ప్రభావం - ఆంధ్రప్రభ.

# గురజాడ కన్యాశుల్కం - హాస్య రసచిత్రణ

పట్నాన ధర్మారావు
పరిశోధక విద్యార్థి (JRF),
తెలుగుశాఖ,
ఆంధ్ర విశ్వకళాపరిషత్, విశాఖపట్నం.
చరవాణి : 81427 36190
Email : patnanadharmarao@gmail.com

ప్రాచీనకాలం నుండి ప్రాచుర్యం పొందిన కర్మ, భక్తి, జ్ఞాన, రాజయోగాలలో అందరికీ పరిజ్ఞానం ఉన్నా లేకపోయినా, ఆధునిక కాలంలో హాస్యయోగంతో మాత్రం పరిచయముంది. పాతకాలంలో 'నవ్వు నాలుగు విధాల చేటు' అని హెచ్చరించేవారు పెద్దవాళ్ళు. కానీ ఇపుడు 'నవ్వు ఎన్నో విధాల మేలు' అని ప్రోత్సహిస్తున్నారు నేటి పెద్దలు, వైద్యులు. వైద్య చికిత్సా విధానం ప్రకారం నవ్వడం వల్ల ఎండార్ఫిన్ అనే హార్మోన్లు విడుదలై మనిషి ఆరోగ్యంగా ఉండడానికి దోహదపడుతుందని వైద్యులు చెబుతుంటారు. అంతేకాదు 'నవ్వడం – యోగం', నవ్వకపోవడం – రోగం' అని నవీన మంత్రాన్ని ఉపదేశిస్తున్నారు. అందుకే పూర్వకాలంలోని ఋషులు తెల్పిన నాలుగు యోగాలను అభ్యసించడానికి సంఘాలున్నా లేకపోయినా, ఆధునిక వైద్యులు సూచించిన హాస్యయోగాన్ని అభ్యసించడానికి ఎన్నో హాస్యసంఘాలు వెలిశాయి. అయితే ఇక్కడ గమనించవల్సిన విషయమేటంటే 'సహజమైన నవ్వు మేలు చేస్తుంది. కృత్రిమమైన నవ్వు కీడు కలిగిస్తుంది' అని మరువరాదు.

నవరసాలలో అత్యంతావశ్యమైన రసముగా ప్రఖ్యాతిని గడించిన రసము హాస్యము. మానవుని ఆనందానికి బాహ్యరూపమే హాస్యం నవ్వు. మానవుని యొక్క మానసిక ప్రశాంతతకు తోడ్పడే శక్తి నవ్వులో ఉంది. హాస్యమనునది వినోదం కలిగించి మానవునికి నవ్వు పుట్టించే లక్షణం కల్గిన ఒకానొక భావానుభవం. 'అతి వికృతములయిన ఆకారము, ఆలాపములు, చేష్టితములు మొదలయిన వానిని చూచుటచే గలుగు మనోవికాసమే హాసము' అని రామరాజభూషణుడు (కావ్యాలంకార సంగ్రహం; పుట – 328) పేర్కొన్నాడు. 'వాగంగాది వికార దర్శన జన్మావికాసాఖ్యో హాస:' అనగా వాక్ వికారములను, అంగవికారములను చూచుట వలన పుట్టిన చిత్త వికాసమగు రూప వృత్తి విశేషము – హాస్యం అని జగన్నాథ పండితరాయలు తన రసగంగాధరంలో పేర్కొన్నారు. ఇంతటి ప్రాచుర్యం, ప్రాముఖ్యం కల్గి ఉన్న హాస్యరసముతో కూడిన ఆధునిక తెలుగు మహాకావ్య రచన అనదగినది. నవయుగ వైతాళికుడు రాసిన 'కన్యాశుల్కం' నాటకం. ఈ నాటకంలోని హాస్యాన్ని ఒక మాట చర్చిద్దాం.

దుష్ట సాంప్రదాయ శిలువపై తలలు వాల్చేసి, వ్రేలాడే మానవ విలువల్ని, బంధాలు, అనుబంధాలు, మమతానురాగాలు ధనానికి అమ్ముడైపోతూ ఉన్న ఒక వికార నిర్వీర్య వివాహ వ్యవస్థను దుయ్యబడుతూ, అత్యంత ప్రతిభావంతమైన శిల్పంతో పాత్రలకు ప్రాణప్రతిష్ఠ చేసి, హాస్యం ద్వారానే సమాజంలోని లోపాలను ఎత్తి చూపుతూ రాసిన రచన 'కన్యాశుల్కం'. తెలుగు సాహిత్యంలో ఒక నాటకం నూరేళ్ళు బతికి బట్టకట్టింది. అంతేగాక మరో నూరేళ్ళు ఉజ్వలంగా బతికేయటానికి కొత్త ఊపునీ, ఉత్సాహాన్ని పుంజుకుంటోంది. అటువంటి నాటకము పది అని అంటే వెంటనే వచ్చు సమాధానం కన్యాశుల్కం. ఎందుకంటే ఇందులో రచయిత ప్రయోగించిన

భాష, చిత్రింపబడ్డ మనుషులూ, వాళ్ళ వాళ్ళ సంభాషణలు, ప్రవర్తనలోంచి ఉత్పన్నమైన హాస్యము. ఇదే నాటకాన్ని సజీవం చేస్తున్నాయి. ఆంగ్ల సాహిత్యపు ప్రసిద్ధ హాస్యధోరణులైన హ్యూమర్, విట్, సెటైర్, ఐరనీ మొదలైనవి కన్యాశుల్కం నాటకంలో గురజాడ వారు ప్రవేశపెట్టి, నాటకం మొత్తం హాస్య రస ప్రధానమైనదిగా రచన చేశారు.

ఆధునిక కాలంలో 1897 ప్రాంతంలో విజయనగరంలోని మాండలిక భాషా పదాలతో, సున్నితమైన భావాలతో హాస్యధోరణిలో తెరకెక్కించిన మహనీయులు గురజాడ వేంకట అప్పారావు. ఆంగ్ల సాహిత్యంలోని ప్రసిద్ధ హాస్యధోరణులు ద్వారా రచించి నాటి సమాజంలోని మూఢనమ్మకాలను, దుష్టఆచారాలను, తల్లి గర్భం నుంచి బయటకు రాకుండానే ఆడబిడ్డను కొనడానికి బేరసారాలు సాగే సమాజంలోని దుస్థితిని ఇందులో ఎంతో విమర్శనాత్మకంగా వివరించారు. ఆ ఆంగ్ల పద్ధతులలోని హాస్య ధోరణులను పరిశీలిద్దాం.

**విట్ : (తెలివి తేటల్లోంచి పుట్టిన హాస్యం - విట్)**

ఈ ఆంగ్ల ప్రసిద్ధ హాస్య ధోరణిని గురజాడ రాసిన కన్యాశుల్కం నాటకం తృతీయాంకంలో ప్రవేశపెట్టారు. గిరీశం బుచ్చెమ్మతో కబర్లు చెబుతుంటే గిరీశం శిష్యుడు వెంకటేశం జామచెట్టు ఎక్కి పళ్ళు కోస్తుంటాడు. సరిగా ఆ సమయానికి అగ్నిహోత్రవధాన్లు రావడాన్ని గమనించి వెంకటేశం సూచన చేస్తాడు. గిరీశం వెంకటేశాన్ని దట్టంగా ఉన్న ఆకుల మధ్య దాక్కోమని చెప్పి యాతాం తోడడం ఆరంభిస్తాడు.

అగ్ని : గిరీశంగారు నీరు తోడతున్నారండీ? అసిరిగాడు తోడుతాడే. యింగిలీషు చదువుకున్న వాళ్ళు మీకెందుకా శ్రమ?

గిరీశం : పనివంటి వస్తువ లోకంలో లేదండి, ఊరికే కూచుంటే నాకు వూసుపోదు. గవునరు, తొట్లో గొప్పు తవ్వుతాడు. సీవరాణీ వారు బీదలూ, సాదలకి యివ్వడానికి బట్టలు కుడతారు. యింగిలీషువాడు సోమరితనం వొప్పడండి. చెట్లూ చేవలూ యెక్కడం వొహటి వాళ్ళలో గొప్ప విద్య అని చెట్లెక్కడం గూర్చి చెబుతాడు.

అగ్ని : దొర్ల తరిఫీదంతా అదో చిత్రం. వెంకడు రాసుకుంచున్నాడా, చదువుకుంచున్నాడా అండి?

గిరీశం : యింతసేపూ చదువు చెప్పి 'చెట్లు చేవలూ యెక్కి ఆడుకో' అని తోలేశాను.

అగ్ని : మీకేం మతిపోయిందా యేవిటండి? కాలూ చెయ్యి విరుచుకుంటే?

గిరీశం : రేపు మనవాడికి గుణుపురం తాసిల్దారీ అయి అడివిలో కమాను వెళ్లుతూ వుండగా పెద్ద పులొస్తే చెట్లెక్కలేక కాళ్లు వొణికి చతికిలబడాలని మీ అభిప్రాయవా యేవిటి?

అగ్ని : మనవాడికి తాసిల్దారీ అవుతుందండి?

గిరీశం : యెందుకాక్కూడదూ; గుఱ్ఱా లెక్కడం, చెట్లెక్కడం మనవాడు నేర్చకపోతే "నాయనా నువ్వు కమాన్లకి పనికిరావు, డసుకు దగ్గర కూచుని గుమస్తా పని చేసుకో, తాసిల్దారీ గీసిల్దారీ తలపెట్టకు" అని దొర్లంటారు.

అగ్ని : అప్పైతే చిన్న చెట్టెక్కించండి గానీ పెద్ద చెట్లప్పుడే యక్కనియ్యకండి.

గిరీశం : అంచేతనే జామచెట్టు యక్కమన్నాను. చూశారా?

పై సంభాషణలో చెట్లెక్కడం చదువులో ఒక భాగమని, చెట్లెక్కడము రాకపోతే ఉద్యోగ ప్రాప్తి కలగబోదు అని గిరీశం తన తెలివితేటలతో వెంకటేశం తండ్రి అగ్ని హోత్రావధానుల్ని నమ్మిస్తాడు. పాఠకులను, ప్రేక్షకుల్ని నవ్వించే ఈ సన్నివేశం విట్ తరహాకి చెందిన హాస్యంగా చెప్పవచ్చు. వ్యాస నిడివిని దృష్టిలో ఉంచుకుని మిగతా వాటి భావాలను మాత్రమే వ్యక్తం చేయగలను.

**హ్యూమర్ : (ఊహించని సంఘటనల సహజత్వం)**

నాటకంలోని ప్రథమాంకంలో మధురవాణి ఇంట్లో రామప్పంతులు గిరీశాన్ని గురించి అవాకులూ చవాకులూ పేల్తూ ఉండగా ఇంతలో గిరీశం తలుపు కొడతాడు. గిరీశాన్ని చూసిన రామప్పంతులు మంచం కింద దాక్కుంటాడు. వెను వెంటనే గిరీశం లోపలికి ప్రవేశించడం ఆ వెంటనే పూటకూళ్ళమ్మ గిరీశాన్ని వెంటాడుతూ తలుపు కొడుతుంది. అంతే గిరీశం కూడా రామప్పంతులు దూరిన మంచం కిందకే దూరతాడు. ఇవన్నీ ఊహించని సంఘటనలే కానీ సహజమైనవి. ఇంట్లో ప్రవేశించిన పూటకూళ్ళమ్మ వేసిన చీపురు దెబ్బ, గిరీశం కొట్టిన దెబ్బ (జెల్ల కాయ రెండూ రామప్పంతులకే తగుల్తాయి. సచ్చాన్రా నాయనా అంటూ రెండు చేతులతో) పట్టుకుని బాధపడే ఈ సన్నివేశం హ్యూమర్ పద్ధతికి చెందిన హాస్యంగా మనము భావించవచ్చును.

**సెటైర్ : (మూర్ఖం, నీతి బాహ్య ప్రవర్తనపై హేళన)**

మూర్ఖమూ, నీతి బాహ్యమూ అయిన ప్రవర్తనని హేళన చేసేది సెటైర్. ఈ పద్ధతి హాస్యంలో ప్రేక్షకులని రంజింప చేసారు గురజాడ. ఈ నాటకంలో మూఢనమ్మకాలూ, దొంగ సాక్ష్యాలూ, ప్లీడర్ల అవినీతి మొదలైనవి ఈ తరహాలో రచించారు. రామచంద్రాపురం అగ్రహారం సారాయి దుకాణం వెనక తోటలో మునసబూ, బైరాగి, వీరేశం, మనవాళ్లయ్య, దుకాణదారు వీళ్ళంతా సారాయి తాగుతూ మాట్లాడుతుంటారు. వీళ్ళ మాటల్లో మత విశ్వాసాలు మూఢనమ్మకాలుగా మారి మనిషిని ఎంత నీచ స్థాయికి దిగజారుస్తాయో అవగతమవుతుంది. దుకాణాదారుడు మాటల్లో 'నీ శివుడూ నిజమే, అడుగో ఆ సీసాలో యెలుగుతున్నాడు. నీ రాముడూ నిజమే. అడుగో ఆ సీసాలో యెలుగుతున్నాడు. వినలేదా తత్త్వం' అని అద్వైత బోధనలో గురజాడ అప్పారావు సెటైరు పద్ధతి హాస్యాన్ని కళ్ళకు కట్టించారు. పోలీసువాడు భైరాగిని నమ్మడం, వాడి సాక్ష్యం, వారి హరిద్వార మఠము అన్నీ మూఢ నమ్మకాలు. పైన పేర్కొన్న సంభాషణలు సెటైర్ పద్ధతికి చెందిన ఉదాహరణగా అభివర్ణించవచ్చు.

**ఐరనీ : (నిందాస్తుతి) (మనసులోని భావానికి వ్యతిరేకమైన మాట ప్రయోగం)**

మనస్సులోని భావాన్ని వ్యతిరేకార్థం వచ్చేలా మాటని ప్రయోగించడం – ఐరనీ. సప్తమాంకంలో సౌజన్యారావు ఇంటికి మధురవాణి కొత్త మనిషిగా ప్రవేశిస్తుంది. అపుడు గిరీశం సౌజన్యారావుతో ఆ వచ్చిన కొత్త మనిషి వివరాలు నేను తెలుసుకుని తమతో ఉదయం చెబుతాను అని అంటాడు. జరూరు పని మీద వచ్చిన వారు, పేరు కూడా చెప్పనివారు మీతో వచ్చిన పని గూర్చి చెబుతారా అని ఆశ్చర్యం వ్యక్తపరుస్తాడు సౌజన్యారావు. అంతలో కొత్త మనిషి రూపంలో ఉన్న మధురవాణి ప్రవేశించి "గిరీశం గారు లోకోపకార

పరులు" అని అంటుంది. ఈ సంభాషణలో మధురవాణి గిరీశం గారు లోకోపకారపరులు అనడంలో మనసులోని భావాన్ని వ్యతిరేకమైన అర్థం వచ్చేలా ప్రయోగించి నవ్వు తెప్పించిన సన్నివేశమిది. గిరీశం గూర్చి తానెరిగినదై కాబట్టి ఈ విధమైన పద ప్రయోగం చేయించి హాస్యాన్ని పుట్టించారు.

**ఫన్ : (రెండర్థాలు వచ్చే మాటల ప్రయోగం)**

రెండు అర్థాలు వచ్చేలా మాటలని ప్రయోగించి నవ్వు పుట్టించడం ఫన్. నాటకం సప్తమాంకంలో డిప్యూటీ కలెక్టరు కచేరీలో నాయుడు కలెక్టరు గారితో అగ్నిహోత్రవధాన్లు గురించిన సన్నివేశం ఎంతో హాస్యాన్ని పుట్టిస్తుంది. "కృష్ణరాయపురం అగ్రహారం కాపురస్థుడు, నులక అగ్నిహోత్రావధానులు గారు. వీరు తమవంటి ఆఫీసర్లకి తరచుగా పని కలగచేసి ప్లీడర్లని పోషిస్తూ ఉంటారు. వీరి యోగ్యత లేమి, వీరి దయాంత:కరణలేమి, వీరి సరసతలేమి మరి యెన్నడ మునకు శేషుడికైనా అలవికాదు" అని విరసంగా చెప్పి నవ్వి కూర్చుంటాడు. కలెక్టరు బలే శెభాష్ అని ఆనందిస్తాడు. యోగ్యతలేమి అని ఫన్ ఉపయోగించడం ద్వారా అగ్ని హోత్రావధాన్లు యొక్క జీవన విధానాన్ని హాస్యస్ఫోరకంగా వివరించారు.

"ఉత్తమమైన ప్రయోజనం లేనిదే ఉత్తమమైన ఆనందం రాదు. ఉత్తమమైన హాస్యం కాదు" అని కొడవటి గంటి కుటుంబరావు పేర్కొన్నారు. బుద్ధిని వికసింపజేసేదీ హాస్యం. ఆద్యంతం నవ్వు తొణికిసలాడేటట్టు గంభీరమయిన ఇతివృత్తాన్ని నిర్వహించడం అంత తేలికైన పనికాదు అని గురజాడ వారు చెప్పుకున్నారు. అద్భుతమైన హాస్యాన్ని ప్రవేశపెట్టి నాటకాన్ని పండిత పామరం చేసిన ఘనత గురజాడ వారికే దక్కుతుంది. కన్యాశుల్కం వంటి గొప్ప ప్రక్రియ ఆవిర్భవించటానికి మూలహేతువులుగా ఆనాటి సాంఘిక, మత రాజకీయ వ్యవస్థలలోని అల్లకల్లోల పరిస్థితులే కారణమై ఉంటాయని ఫ్రెంచి విమర్శకుడు 'పాల వాన్ టై ఘెమ్' ఈ విధంగా పేర్కొంటాడు. "each emotional taste, each social or religious need is the root of a different genre which blossoms more or less happy" కన్యాశుల్కం నాటకంలో గురజాడవారు ప్రయోగించిన హాస్యం మానవ మనస్తత్వంలో మార్పుని కోరుతుంది. అటువంటి మార్పుని కోరే ఈ నాటకం తెలుగు సాహిత్యంలో హాస్యానికి పెద్ద పీట వేసింది.

**ఆధార గ్రంథాలు :**

1) కన్యాశుల్కం మొదటి కూర్పు
2) కన్యాశుల్కం రెండవ కూర్పు
3) ఉచిత గురుకుల విద్యా ఫౌండేషన్
4) నూరేళ్ళ కన్యాశుల్కం
5) కావ్యాలంకార సంగ్రహం

# ''भासमहा कवि रुपकेषु विदूषकस्य हास्य पात्र परिशीलनम्''

Two days National Seminar
March 25-03-2022, 26-03-2022
ACHARYA NAGARJUNA UNIVERSITY
Nagarjuna Nagar - 522 510
Number
Guntur District - AP

**Dr. Smt. P.Kotiratnam,** M.A. San., M.A. Tel., B.Ed., M.Phil.,Ph.D.
Lecturer in Sanskrit
SRI SARADANIKETHANAM ORIENTAL COLLEGE
2/14, Brodipet, GUNTUR
Cell : 9701674557 Mail ID : parikotiratnam30@gmail.com

# भासमहाकवि परिचयः

संस्कृतरूपककर्तृषु उपलभ्यमानेषु भास एव आदिमः । वाल्मीकिव्यासयोः अनन्तरं लौकिकवाङ्मये कालिदासः एव आद्यः कविरिति आलङ्कारिकाणां चिरं निश्चयः आसीत् । परम् ऊनविंशतितम शताब्दारम्भात् प्राक् केवलं भासस्य नाम कालिदासस्य मालविकाग्निमित्रे, श्रीहर्षस्य हर्षचरिते, जयदेवस्य प्रसन्नराघवे, राजशेखरस्य काव्यमीमांसायां श्रुतचरम् आसीत् । अस्मिन्नेव एकोनविंशे शताब्दे आचार्यगणपति शास्त्रिभिः तिरुवनन्तपुरनगरवासिभिः त्रयोदश रूपकाणि भासकृतानि सम्पादितानि प्रकाशितानि च । तदनन्तरवर्तिभिः साहित्यकारैः कीथ् मेक्डोनाल्ड् प्रभृतिभिः तानि रूपकाणि भासकृतानीति अङ्गीकृतानि ।

महाकविर्भासस्तु लौकिकवाङ्मये रूपकाणाम् आद्यः कर्ता इति वक्तुं शक्यते ।

**कालिदासः** मालविकाग्निमित्रप्रस्तावनायां स्वपूर्वजान् कवीन् स्मृत्वाऽपि स्वस्यैव मालविकाग्निमित्रं तान्यतिरिच्य वर्तते इति गूढगर्वं प्रकटयामासा तदीये नाटके एव रसिकाः श्रद्धां दर्शयन्तीति कालिदासः प्राह -

**'पुराणमित्येव न साधु सर्वंन चापि काव्य नवमित्यवद्यम् ।**
**सन्तः परीक्ष्यान्यतरद् भजन्ते मूढः परप्रत्ययनेयबुद्धिः ॥'[1]**

अनेन कालिदासवजनेन तस्मात् प्रापक् रूपकस्थितिः रूढा । अपि च इमानि रूपकाणि सर्वाणि एककर्तृकानीति निश्चयेन वक्तुं शक्यते ।

# भासमहाकवि त्रयोदश रूपकाणि परिचयम्

किस्तोः परं १९०६ तमे वर्षे श्रीमता गणपतिशास्त्रिमहोदयेन भासमहाकविरचितानि त्रयोदश रुपकाणि तिरुवनन्तपुरात् प्रकाशितानि । तानि च क्रमशः १)अभिषेकनाटकम्, २) प्रतिमानाटकम्, ३) बालचरितम्, ४) पञ्चरात्रम्, ५) मध्यमव्यायोगः, ६) दूतघटोत्कचम्, ७) दूतवाक्यम्, ८) कर्णभारम्, ९) ऊरुभङ्गम्, १०) प्रतिज्ञायौगन्धरायणम्, ११) स्वप्नवासवदत्तम्, १२) अविमारकम्, १३) चारुदत्तम् चेति ।

भासमहाकविः आहत्य चतुर्विंशति रूपकाणि रचयामास इति अन्या काचित् प्रतीतिरस्ति । भासः एव धावगः इति केषाञ्चन पण्डितानां तर्कः । तदुक्तम् -

**भाषासु लभ्या गैर्वाणी तस्यां काव्यं मनोहरम् ।**
**तत्रापि रूपकं रम्यं तत्र भासकवेः कृतिः ॥**
**धावकापरनामायं भासो भासयते जगत् ।**
**तत्वैरिवादिपुरुषश्चतुर्विंशतिरूपकैः ॥[2]**

---

१) द्र.कालिदासः - मालविकाग्निमित्रम् - १/२ - पृ. ३

२) द्र.मल्लादिसूर्यनारायणशास्त्रि - संस्कृतलौकिक - वाङ्मयचरित्र (तेलुगु) - द्वितीयसम्पुटः - ३६७

## हासः षड्विधः

हासितम्, उपहासितम्, अपहासितम्, विहसितम्, स्मितम् अतिहासितम् इति ।

## विदूषकः

भासनाटकेष्वपि एवंविधानि लक्षणानि विदूषके दृश्यन्ते । विदूषकगतः हास्यः सामाचिकेषु प्रतीयते ।

वस्तुतस्तु सामाजिकगतः हास्यरससंस्कारः विदूषकदर्शनेन जागृतः भवति ।

**विदूषकशब्दस्योत्पत्तिः** :-विदूषयति इति विग्रहे दुष-वैकृत्ये इति धातोः (दिवादि परस्मैपदि अनिट्) 'हेतुमति च'[1] इति णिच् प्रत्यये ततः 'दोषौ णौ'[2] इति सूत्रेण उपधायाः ऊकारे, 'ण्वुल्तृचौ'[3] इति ण्वुल् प्रत्यये 'युवोरनाकौ'[4] इत्यनेन अकादेशे विदूषक इति रूपं भवति।

## विदुषकस्य वासवदत्तया सह सम्बन्धः

प्रायशः महाकविनाटकेषु विदूषकस्य राज्ञा सहैव सम्बन्धः वर्णितो भवाति । किन्तु भासनाटकेषु कालिदासनाटकेषु च विदूषकः अन्तः पुरजनेषु अन्यतमः भवति । विशेषतः भासनाटकेषु वासवदत्ता विदुषकं बहुधा सत्करोति स्म । इति नाटके स्पष्टम् उपवर्णितम् । अवकाशवादिनः राजसेवकाः यथावसरं राज्ञः बन्धुजनान् अपि सेवन्ते । यदि तेषां राजबन्धूनां (कथामपि न) सेवया न प्रयोजनं यद्वा बन्धूनाम् अधिकाराद्भयात्, मृतिर्वा भवति, सेवकाः राजबन्धूनां कथामपि न स्मरन्ति । परन्तु मृतामपि वासवदत्तां विदूषकः वारं वारं स्मरति । इत्यनेन वासवदत्तायां तस्य प्ररूढः आदरः व्यक्तो भवति । अन्यथा पूर्वसुकृतसंगेन निस्संगया भक्त्या न स्मरति । पद्मावतीविवाहानन्तरम् उद्याने पद्मावती-वासवदत्तयोः का ते प्रियतरा भवति इति विदूषकः राजानं निर्बन्धेन पृच्छति । राजा वासवदत्ता प्रियतरेति भणति ।

पद्मावती बहुमता मम यद्यपि रूप शीलमाधुर्यैः ।
वासवदत्ताबद्धं न तु तावन्मे मनो हरति ॥[5]

लतान्तरिता वासवदत्ता राज्ञः सखात् तत् तद्वाक्यं श्रुत्वा अज्ञातवासव्यथां न गणयति । सत्येवम् आत्मगतं तर्कयति --

'भवतु भवतु दत्तं वेतनमस्य परिखेदस्य । अहो! अज्ञातवासोऽप्यत्र बहुगुणः सम्पद्यते ।[6]'

---

1. द्र. प्रामिनिः - अष्टाध्यायी - ३ - १ - २३ - पृ . ९३
2. द्र. प्राणिनिः - अष्टाध्यायी - ६ - ४ - ९० - पृ . ११
3. द्र. प्राणिनिः - अष्टाध्यायी - ३ - १ -१३३ - पृ .१५
4. द्र. प्राणिनिः - अष्टाध्यायी - ७ - १ - १ - पृ . २५
5. द्र. भासः - स्वप्नवासवदत्तम् - IV/4 - पृ. ७०
6. द्र. भासः - स्वप्नवासवदत्तम् - IV - पृ. ७०

एवं वासवदत्तायाः दुः खोपशमः परोक्षतया विदूषकेण एव कृतः । अपिच पञ्चमाङ्के वासवदत्ता राजानं चिरं पश्यति इत्यत्राऽपि "राज्ञः स्थिरानुराग एवमभिवर्तते' इति वासवदत्तायां निश्चयस्य विदूषककृतः निर्बन्ध एवं कारणमृर । अपि च वासवदत्ता प्रतिदिनं स्निग्धेन भोजनेन सम्भावयतीति विदूषकः यत् प्रीतिकारणं वदति, तत् गौणमेव । विदूषकः स्पष्टमेतत् वदति ।

**विदूषकः :-** इदानीं शृणोतु भवान् । तत्रभवति वासवदत्ता मे बहुमता । तत्रभवती पद्मावती तरुणी अदर्शनीया अकोपना अनहङ्कश मधुरवाक् सदाक्षिण्या । अयं चापरो महान् गुणः स्निग्धेन भोजनेन मां प्रत्युद्गन्धति वासवदत्ता कुत्र न खलु गता आर्य वसन्तक[1]। इति ।

**वासवदत्ता :** भवतु भवतु वसन्तक स्मरेदिदानीमेतत्[2] । इति ।

यद्यपि राज्ञः आश ंित विदूषके वासवदत्तायाः तादृशः आदरः तथाऽपि अहेतुक एव । अत एव द्वितीयः तत एव मृतायां मन्यमानायामपि वासवदत्तायां विदूषकः बद्धादशेऽभूत् । वासवदत्तामारणं न तत्र प्रतिघातहेतुः । आहुः महाकवयः - -

**अहेतुपक्षपाते यः नास्ति तस्य प्रतिक्रिया ।**

**स हि स्नेहात्मकस्तन्तुः अन्तः मर्माणि सीव्यति[3] ॥**

## प्रतिज्ञायौगन्धरायणे विदूषकपात्रपरिशीलनम्

प्रतिज्ञायौगन्धरायणे तृतीयाङ्के एव विदूषकपात्रप्रस्तावः दृश्यते । अल्पीयस्यपि अवकाशे तस्य पोषणम् अनल्पतया दृश्यते । उज्जायिन्याः राजा चण्डमहासेनापरनामकः प्रद्योतः स्वगजशिक्षार्थम् उदयनं कूटोपायेन बद्धवा स्वगरं निनाय ।

उदयनस्य मन्त्री यौगन्धरायणः केनाप्युपायेन विना प्रतिष्ठाहानिम् उदयनं मोचयित्वा कौशामबीम् अनेष्यामि इति कृतसङ्कल्पः । तदर्थं राज्ञः आत्मीयान् केनाऽपि व्याजेन प्रद्योतस्यास्थाने प्राप्तावकाशान् अकरोत् । तादृशेषु आप्ततमेषु विदूषकः अन्यतमः । स च राज्ञः कालोचितकृत्य - निर्वहणपरिशीलनार्थं साहायार्थं च यौगन्धरायणेन व्यापारितः अस्मिन्नेव सन्दर्भे विदूषकस्य प्रज्ञाविशेषाः बहुधा व्यज्यन्ते । तत्राऽपि राजकुलेनास्य सम्बन्धोऽपि व्यक्तः भवति ।

### राज्ञश्च आप्ततमः

साधारणदिनेषु राज्ञः विदूषकस्य सम्बन्धः कथमासीदिति यौगन्धरायण नाटकमनुसृत्य वक्तुं न शक्यते । किन्तु अयम् आपत्सु राजानम् अनुसरति इति अनेन राव अस्य आप्तता सूचिता । अदः विदूषकः प्रज्ञावाान् राजनि भक्तिमान् इति वक्तुं शक्यते । यश्च भृत्यः केवलराज भक्तियुतः कष्टकाले सम्प्राप्ते न तेन राज्ञः प्रयोजनं यः केवलं

1. द्र. भासः - स्वप्नवासवदत्तम् - IV - पृ.७३
2. द्र. भासः - स्वप्नवासवदत्तमट् - IV - पृ.७३
3. द्र. भवभूतिः - उत्तररामचरितमट् - V/17 - पृ.१७७

ఉత్తరకుమారుడు కురుసైన్యమును జయించి గోవులను మరలించుకొస్తాను అనే సందర్భంలో ఈ క్రింది పద్యం ఎంతో చమత్కారాన్ని, చతురతను కలిగిస్తుంది.

" కురుపతి భీష్మ కర్ణ కృపకుంభజ ముఖ్యులు మత్స ముద్యను

స్ఫురణము సూచి పార్థుడను బుద్ధి గలంగగ బెట్టు

గరుమున నోర్చి యేలుసులగ్రమ్మఱదేరకయున్న నన్ను భూ

వరుడు సుహృజ్జనండు బరివారముజిత్తములందు మెత్తురే."

ఈ పద్యము ద్వారా ఉత్తరకుమారుడు తన ప్రతాపాన్ని తన అర్హతను మించి ఏవిధంగా ప్రదర్శించాడో అవగతమవుతుంది. దుర్యోధనుడు, భీష్ముడు మొదలైన వారు తన విజృంభణను చూసి అర్జునుడే యుద్ధం చేస్తున్నాడు, అనే విధంగా యుద్ధం చేస్తానని పలకడం ఉత్తర కుమారుని యొక్క అమాయకత్వానికి నిదర్శనం. వారందరినీ జయించి గోవుల్ని మళ్లించుకోని రాకపోతే, రాజు ,మిత్రులు, పరివారం మెచ్చుకుంటారా? తన శక్తిని ఇతరులు మెచ్చుకోవాలనే తాపత్రయం ఇక్కడ ఉత్తరునిలో కనిపిస్తుంది.ఉత్తరుని నోట పలికే ఈ ప్రగల్భాలు పాఠకులకు మానసిక ప్రశాంతతను చేకూరుస్తాయి.

కౌరవులసైన్యాన్ని జయించడానికి సరైన రథసారధి లేడని ఉత్తరకుమారుడు సాకుగా చూపగా ఉత్తరుడికి సైరేంధ్రి భృహన్నలను సారధిగా ఉండటానికి అంగీకరింపజేశానని చెప్పగా ఉత్తరడు సైరేంధ్రితో పలికిన మాటలు హాస్యాని పండిస్తాయి.

"పట్టుదలతో పరాక్రమాన్ని ప్రదర్శించడానికి నేను వెళుతున్నాను. ఇలాంటి స్థితిలో భృహన్నల నా రథసారిధి అయితే లోకం నవ్వదా? పేడివాడయినా భృహన్నలే రథసారధిగా దిక్కా? ఈ పట్టణంలో రథంనడిపే వాడే లేడా? అని సైరేంధ్రినితో ఉత్తరకుమారుడు పలికిన పలుకులు హాస్యాన్ని పండిస్తాయి.

బృహన్నల రావడాన్ని దూరం నుంచి గమనించిన ఉత్తరుడు రథసారధిగా ఉండమనగా రథసారధిగా చేయడానికి తనని అడగడం, తగదని బృహన్నల పలికినపుడు ఉత్తరుడు బృహన్నలతో పలికిన పలుకులు హాస్యాస్పదంగా ఉంటాయి.

"ఖాండవ మేర్చునప్పుడు దగన్ రథ చోదక వృత్తి సల్పి, యా
ఖండల సుతికినే జయము గల్గ నొనర్చిన యట్టి బుద్ధియున్
దండి తనంబు నీ యెడన తక్కినె నాదెగు మైత్రి పెన్పు మిం
కొందొక మాట దక్కుము రణోత్సహనం బొనరింపు గ్రక్కునన్."

ఖాండవ వన దహన సమయంలో అర్జునునికి విజయం సాధించి పెట్టింది, బృహన్నల అనే విషయాన్ని సైరేంధ్రి ద్వారా అంతకు ముందే విన్న ఉత్తరుడు, ఆ విషయం తనకు ముందే తెలుసు అన్నట్లు బృహన్నలతో పలకడం ఉత్తరునికి గల ప్రత్యేక వ్యక్తిత్వం పాఠకులను రంజిపజేస్తుంది. భూమండలం కుంగిపోయేటట్లు నడుస్తున్న కౌరవసైన్యాన్ని చూసి ఉత్తరుని పరిస్థితి మారిపోయింది. అంత:పురకాంతల మధ్య పలికిన ప్రగల్భాలు ఆవిరై పోయాయి. అపారమైన కౌరవ సేనావాహినిని సమీపించడమే తనకు సాధ్యం కాదన్నాడు.

"ఎత్తునగొందు గౌరవులెల్లను మార్కొరినేని" అని పలికిన నోటితోనే అకృతాస్త్రుడా, బాలుడునని తనస్థితిని ప్రకటించాడు. "భీతియడరేడు తోడ్తన్" అనడంతో తనస్థితిని తాను తెలుసుకుని భయపడ్డాడు. ఇక్కడ ఉత్తరుడు మాటలవాడే కాని చేతలవాడు కాదని పాఠకుడికి స్పష్టమవుతుంది, దానితో పాఠకుని పెదవుల పైన నవ్వుల పువ్వులు పూయిస్తాయి.

అంత:పురకాంతల ముందు పశువులను క్షణంలో మళ్ళించి తీసుకోస్తానని పలికి రధమెక్కి వచ్చి సైన్యాన్ని చూసి భయపడిపోవడం తగునా? అని బృహన్నల పలకడంతో

" పసుల దయ్య మెఱగు బడుతుల సంతోష
మేల నాకు? ననికి జాల నేను"

వెంటనే ఉత్తరుడు వణుకుతున్న గొంతుతో పశువులమాట దేవునికి తెలుసు. స్త్రీల సంగతి నాకెందుకు నేను యుద్ధం చేయలేను అని పలికాడు.ఈ సందర్భంలో ఉత్తరుని తప్పించుకునే తనం , చేతకాని తనం పాఠకునికి అవగతమై ఉత్తరకుమారుని మాటలు వట్టి నీటిమూటలని, ఉట్టికి ఎగరలేనమ్మ ఆకాశానికి ఎగురుతా అనే చందంగా పాఠకుడు భావించి మానసిక ఉల్లాసాన్ని పొందుతాడు.

కవి బ్రహ్మ తిక్కన సోమయాజి విరాటపర్వంలో ఉత్తరకుమారుని ప్రగల్భాలద్వారా హృదయోల్లాసాన్ని కలిగించే పాత్ర చిత్రణ చేశారని చెప్పవచ్చు. విరాటపర్వంలో ఉత్తరకుమారుడు తన అమాయకత్వంతో చతురతతో, పిరికితనంతో, అసమర్థతతో పక్కన ఉన్న వారు తనను తక్కువగా ఎక్కడచూస్తారన్న అనుమానంతో పాఠకులను పరవశింపజేస్తాడు.

## ముగింపు:-

"నవ్వవు జంతువుల్, నరుడెనవ్వును, నవ్వులె చిత్తవృత్తికిం

దివ్వెలు ,కొన్ని నవ్వులెటు తేలవు, కొన్ని విషప్రయుక్తములు

పువ్వుల వోలె ప్రేమరసముంగురిపించు విశుద్ధమైన లే

నవ్వులు సర్వదు:ఖ దమనంబులు,వ్యాధులకు న్మహౌషధుల్"

నవయుగకవి చక్రవర్తి గుర్రం జాషువా చెప్పినట్లుగా జంతువులు నవ్వవు కేవలం మనుషులు మాత్రమే నవ్వుతారు, నవ్వటం అనేది ఒక కళ. నవ్వు ఆనందానికి, ఆరోగ్యానికి, సంతోషానికి, సంతృప్తికి గుర్తు. అందుకే నేటి ఆధునిక ప్రపంచంలో హాస్యం మానవాళికి ఎంతో అవసరం. అందుకే ప్రతి మనిషి తాను నవ్వుతూ ఇతరులను నవ్విస్తూ సంతోషకరమైన జీవితాన్ని గడుపుతూ ఉండాలి. నవ్వు అలసిన మనస్సుకు ఒక టానిక్ ఈనవ్వుల టానిక్ ఎన్నో రకాల క్రానిక్ వ్యాధులకు దివ్యౌషదంగా పనిచేసి మానవునికి దీర్ఘాయుష్షును ఇస్తుందని చెప్పటంలో అతిశయోక్తి లేదు.

# సంసార సాగరంలో కుటుంబ వ్యవస్థ

కె. ఏసురత్నం
తెలుగు పరిశోధక విద్యార్థి
ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయము
cell:9059111040
E-mail:yasuratnam.k@gmail.com

**ఉపోద్ఘాతం:**

నూరేళ్ళు దాటిన తెలుగు నవల పుట్టు పూర్వోత్తరాలు తెలుసుకోవటం అవసరం. ఇంత విస్తృత నవలా సాహిత్యరంభం అర్థం కావటం చాలా అవసరమే ! అందువల్ల తెలుగులో నవలు విస్తృతంగా తెలియటం అవసరమే.కాని అంతకు పూర్వం ఇంగ్లీషులో నవలలు ఉన్నాయని, వాటి కారణంగా తెలుగులో నవలా రచన ప్రారంభమైందని అందరికీ తెలుసు.

రచయితలకు తెలుసో తెలియకో ప్రత్యక్షంగానో పరోక్షంగానో ప్రతి నవల ఏదో ఒక జీవిత భాగాన్ని ,జీవిత సమస్యల్ని చిత్రీకరించటం ఆధారపడి ఉంటుంది ఆ నవల.

క్రీ.శ.19వ శతాబ్దం ఉత్తర భాగంలో భారతదేశం సాంస్కృతికంగా, రాజకీయంగా అనేక మార్పులు లోనయ్యింది.పాశ్చాకత్య సాహిత్య, సంస్కృతుల ప్రభావంతో ప్రజల ఆలోచనా సరళిలోనే గొప్ప మార్పు సంభవించింది. తత్ఫలితంగా కావ్యాలు, ప్రబంధాలకే పరిమితమైంది.తెలుగు రచయితలు పాశ్చాత్య సాహిత్యంలోకి ప్రక్రియలో నవల అత్యంత ప్రధానమైన ప్రచారం పొందింది.పాశ్చాత్య సాహిత్యంలో నవలా ప్రక్రియ నిలదొక్కుకున్న తరువాతనే భారతీయ భాషల్లోకి ప్రవేశించింది.జాతీయ భావ ప్రేరణ కలిగిన తరువాత ఆలోచన సరళిలో అనేక మార్పులు చోటుచేసుకున్నాయి.ఆ మార్పు సాహిత్యంలో వివిధ ప్రక్రియలుగా ప్రకాశించింది.ఆ సందర్భంలో అవిర్భవించింది.నవల సాంఘిక సమస్యలను దృష్టిలో పెట్టుకుని అనేక మంది నవలా రచయితలు మంచి నవలలు రాశారు.

సమాజంలో వ్యక్తులు కోరిక విధానాన్ని చిత్రీకరించడానికి సంఘంలో వ్యక్తులు అచార వ్యవహారాలను సహజంగానే వర్ణించటానికి నవల ఒక సాధనమని చెప్పవచ్చు. ఆ తర్వాత ఎన్నో సిద్ధాంతాల్లో విభిన్న ధోరణలు నవల సాహిత్య వింత వింత పోకడలు పోతూ ఎంతో విస్తృతి చెందింది.

జీవితాన్ని సర్వసమగ్ర రీతిలో సులువైన రీతిలో చెప్పగలిగిన ఏకైక ప్రక్రియ నవల. ఇందులో తరాల తరబడి ఎదిగిన కథ ఉంటుంది.ఆ నవలలో ఎన్నెన్నో పాత్రలన్నీ కల కలిపేందుకు ఎన్నో సంఘటనలు తోడ్పడతాయి.ఇలాంటి ఉత్తమ నవల చదివినప్పుడు మనసు కెంతో ఆహ్లాదం కలుగుతుంది.తెలుగు నవలా సాహిత్యం వటవృక్షంలా విస్తరించింది.తెలుగు సాహిత్యంలో ఎంతో మంది రచయితలు అనేక నవలలు రచించారు.వారిలో సి. ఉమాదేవి గారు ఒకరు.సమాజంలో జరుగుతున్న అనేక విషయాలను ఆమె రచనల ద్వారా తెలియజేస్తున్నారు.

**రచయిత్రి పరిచయం:**

సరస్వతీదేవి ,నారాయణరెడ్డి దంపతులు కుమార్తె సి.ఉమాదేవి గారు ఫిబ్రవరి 4, 1947 , ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం, తిరుపతి దగ్గర మదనపల్లిలో జన్మించారు. సి ఉమాదేవి గారు విశాఖపట్నంలో ఎం.ఏ , బి.ఇడి. పూర్తి చేశారు.విద్యా రంగంలో పదిహేడు సంవత్సరాలు శ్రీ నగర్ లో విద్యానికేతన్ ప్రారంభించి , ఆ కళాశాల ప్రిన్సిపాల్ గా విధులు నిర్వర్తించారు.రచన వ్యాసంగం ప్రవృత్తిగా సి.ఉమాదేవి గారు అనేక కథలు , నవలలు రచించారు

వీరి నవలలు 'శిలాపుష్పాలు', 'సాగర కెరటం' , 'కేర్ టేకర్' , కథాసంపుటాలు 'చిన్నగుండె చప్పుళ్లు', 'మాటే మంత్రం' ,ఉన్నాయి.సి.ఉమాదేవి గారి రచనల్లో 'అమ్మతనం' కవితకు డా॥ పోతుకూచి సాహితి అవార్డు, 'మానవతకు చిరునామా' కవితకు ఎక్స్రే అవార్డు వచ్చాయి.సాహిత్యబుధిలో నీటి బిందువు కావాలన్నది సి.ఉమాదేవి గారి ఆకాంక్ష.

**సాగర కెరటం ఇతివృత్తానుశీలన:**

రచయిత్రి ఈ నవలకు పేరు ఎన్నుకోవటమే ఉమ్మడి కుటుంబాల పరిస్థితులను సూచిస్తుంది. తల్లిదండ్రులు పిల్లల మీద ఎన్నో ఆశలు పెట్టుకుని వాళ్ళకోసమే కష్టపడతారు.సంసార సాగరమే మాట వాడుకలో స్థిరపడిపోయింది. సముద్రానికి ఆటు,పోట్లు ఉన్నట్లే సంసారాన్ని కూడా ఒడిదుడుకులు ఉంటాయి.సంసారంలోని కష్టాలను ఆహ్లాదాన్ని కష్టసుఖాలను,ఆలోచనలను అన్నిటినీ సమన్వయం చెయ్యడానికి ఎన్నుకున్న పేరు సాగర కెరటం అని అర్ధమవుతుంది.

జనార్ధనం రాజ్యలక్ష్మి దంపతులు. వాళ్లకు ముగ్గురు పిల్లలు జగన్, పూజా,పవన్.జనార్ధనం చేసే చిన్న ఉద్యోగింతోసే పిల్లలను స్థిరపడేటట్లు చెయ్యాలనుకున్నాడు. ఆడపిల్ల విషయంలో మాత్రం అందరిలాగే ఆలోచించాడు. డిగ్రీ చదివించి పెళ్లి చేస్తే చాలనుకున్నాడు.నవల కథ నడవటం కోసం ప్రవేశపెట్టిన మరొక పాత్ర చలపతి.చలపతి సంపన్నుడు,జనార్ధనానికి అవసరమైనప్పుడల్లా డబ్బులు సర్దుబాటు చేస్తుంటాడు.అది తిరిగి తీసుకోవలసిన పట్టుదల కూడా చలపతికి లేదు.పూజను డిగ్రీ వరకు చదివించి మధు అనే అబ్బాయికి ఇచ్చి పెండ్లి చేశాడు. జగన్ కు ఇంజనీరింగ్ లో ఎంట్రెన్స్ సరైన ర్యాంకు రానందువల్ల చలపతి ఆర్థిక సహాయంతో ప్రైవేట్ కాలేజీలో చేర్చి ఇంజనీరింగ్లు పూర్తి చేశారు.పవన్ కూడా చలపతి సహాయం తో అమెరికాకు పంపి చదివించారు. మధు మెడికల్ షాపు పెట్టుకుని స్థిరపడి పూజను పి.జి. చేయించాడు.

పక్క వీధిలోనే ఉన్న సంపన్నుడు(చలపతి) జగన్ కు పిల్లనిచ్చి ఇల్లరికం తీసుకుపోయాడు.జగన్ మొదట ఇల్లరికానికి వెళ్లటానికి బెట్టు చేసినా తరువాత ఆర్థిక పరిస్థితికి లోబడి శిల్పాతో సర్దుకుపోయాడు. అత్తగారికి అనుకూలంగా మారాడు కానీ.శిల్ప వదిన శ్వేత నెమ్మదిగా శిల్పకు అర్థమయ్యేట్లు నచ్చజెప్పి అత్తగారింటికి వెళ్ళేటట్లు చేసింది.శిల్ప తల్లి ఈ సంఘర్షణకు చమత్కారమే

పరిష్కారంగా కూతురికి,అల్లుడికి ఫ్యాక్టరీ దగ్గరలో ఇళ్లు కట్టించి వేరే కాపురం పెట్టించింది.ఈ సందర్భాలకు సర్దుబాటు కాలేని రాజ్యం మానసిక క్షోభతో అనారోగ్య సమస్య కూడా కలిగింది.పవన్ కూడా మంచి సంబంధమే చూసి పెళ్లి చేసుకున్నాడు.జగన్ పరిస్థితులన్నీ చూసి సర్దుబాటు చేసి తిరిగి తల్లిదండ్రులకు దగ్గరయ్యారు. రాజ్యం మనస్సు కెరటాలు తగ్గిన సముద్రంలాగా ప్రశాంమైంది.

**ఉపసంహారము:**

మధ్యతరగతి జీవితాన్నే ప్రధానమైన ఇతివృత్తంగా ఎంచుకున్నారు.కధాంశం లో సంపన్నులతో సంబంధం వర్ణించిన మధ్యతరగతి వారి ప్రభావం సంపన్నుల మీద పడేటట్లు వారి స్వభావమే వీరికి అనుకూలంగా మారేటట్లు వర్ణించారు.నీతి సూత్రాలు,సాంఘిక మర్యాదలు మధ్యతరగతి వారు పాటించినట్లుగా అట్టడుగు వర్గం వారు గానీ, ఆర్థిక స్థితి ఉన్న వారు గాని పాటించలేదు అని వర్ణించాడు.

కల్తీ లేని మధ్యతరగతి పాత కాలపు ఇల్లాలు రాజ్యం.ఒక పక్క భర్తకు ఇష్టమైనట్లుగా ప్రవర్తించడం.ఒక తల్లిగా పిల్లలకు కావాల్సినవి వండిపెట్టి వాళ్లు తింటుంటే ఆనందించటం. తన వంటలు ఎవరైనా మెచ్చుకుంటే సంబరపడిపోవడం.కొన్ని సందర్భాల్లో పిల్లలకు, తల్లిదండ్రులకు ఎడబాటు తప్పదు. పిల్లల అల్లరి అన్ని దూరమవుతున్నారని రాజ్యంలో పూడ్చలేని వెలితి ప్రవేశించింది.ర్యాంకు తెచ్చుకోలేక దూరములో ఉన్న కాలేజీల్లో జగన్ చేరాడు. ర్యాంకు వచ్చి ఉన్నత చదువుల నిమిత్తం విదేశాలకు బయలుదేరాడు పవన్.పిల్లల మీద బెంగతో రాజ్యం మానసిక క్షోభతో జబ్బుపడింది."సాగరాన్ని వీడిపోలేని కెరటం కీరవాణి రాగమాలపిస్తోంది".తన పిల్లలు తన విడిచి పోరు. నా దగ్గరికి తిరిగి వస్తారు ఎప్పటికైనా.వీళ్ళు కెరటాలు.పూజ చెప్పింది నిజమే. ఆమె ముఖంలో ప్రసన్నత చూసి అందరూ సంతోషించారు.డాక్టరుకు థ్యాంక్యూ చెప్పి తల్లి మంచం దిగుతుంటే చేయందించాడు ప్రేమగా ఫరవాలేదు నేను నడవగలను.రాజ్యం సున్నితంగా అడుగు ముందుకేసింది.అమ్మా మేమున్నాము అని అల్లరిగా

నవ్వుతూ ఇద్దరు వచ్చి చెయ్యందించారు.సాగరం కెరటాన్ని వెనకకు రాకుండా ఆపగలదా?. బంధాలు బాంధవ్యాలు మనసు లోపలి పొరలలో నిక్షిప్తమై, వెలువడినప్పుడు మాత్రం కెరటాల ఉధృతిని గుర్తుకు తెస్తాయనేది మాత్రం కాదనలేని సత్యం.ఏ సాహితీ ప్రక్రియకైనా ఇతివృత్తమే ప్రధానం అనే విధంగా సాగర కెరటంలోని ఇతివృత్తాన్ని మలిచి సమాజానికి సందేశాన్ని అందించిన  రచయిత్రి సి.ఉమాదేవి గారు తెలుగు సాహితీ జగత్తులో సుస్థిర స్థానాన్ని సంపాదించుకున్నారు.

**ఆధార గ్రంథాలు :**

1. శిలాపుష్పం -సి.ఉమాదేవి విశాలాంధ్ర పబ్లికేషన్స్ (2006)
2. సాంఘిక నవల -కథా శిల్పం -సి మృణాళిని విల్ కమల్ పబ్లికేషన్స్
3. నవలా శిల్పం -పల్లపాటి వెంకటసుబ్బయ్య విశాలాంధ్ర పబ్లికేషన్స్ (2006)
4. సాగర కెరటం మ-సి.ఉమాదేవి విశాలాంధ్ర పబ్లికేషన్ (2008)

# "స్వభాష" వ్యాసంలో సభాధ్యక్షుని పరభాషా వ్యామోహమును జంఘాల శాస్త్రి అధిక్షేపించిన తీరులోని హాస్యం

**శ్రీమతి సుశీల్ ప్రత్యూష దాసరి**
ఎమ్.ఎ(తెలుగు), ఎమ్.ఎ.(సోషియాలజీ), ఎమ్.ఇడి.(పి.హెచ్.డి)
తెలుగుశాఖాధిపతి
అక్కినేని నాగేశ్వరరావు కళాశాల (అటానమస్)
గుడివాడ.
చరవాణి: 8142678009

సాక్షి వ్యాసాలలో అరవైతొమ్మిదవ వ్యాసం "స్వభాష" సాక్షి వ్యాస రచయిత శ్రీ పానుగంటి లక్ష్మీనరసింహారావు. పానుగంటి లక్ష్మీనరసింహారావు గారు11 ఫిబ్రవరి 1865వ తేదీన రాజమహేంద్రవరం సీతానగరంలో జన్మించారు. వారి తల్లిదండ్రులు రత్నమాంబా, వేంకట రమణయ్యలు. పానుగంటి వారికి ఆంధ్రా ఎడిసిన్, గీతకవి, ఆంధ్రా షేక్స్పియర్, అభినవ కాళిదాసు అనే బిరుదులు కలవు.

పానుగంటి వారు సంఘంలోని అవినీతిని, మూఢనమ్మకాలను సమకాలీన అంశాలను, చతురోక్తులతో తీవ్రంగా విమర్శిస్తూ రచనలు చేసిన రచయిత. పానుగంటి వారి సాక్షి వ్యాసాలకు మార్గదర్శకం స్పెక్టేటర్. సాక్షి వ్యాసాలు 1913-14లో సంవత్సరాల మధ్య సువర్ణలేఖ పత్రికలో ప్రచురితమైనాయి.

సాక్షి సంఘం 1913లో ఆవిర్భవించినది ఈ సంఘంలో ఐదుగురు సభ్యులు. సాక్షి అనే వ్యక్తి సంఘ స్థాపకుడు. కాలాచార్యులు, జంఘాల శాస్త్రి, వాణీదాసుడు, బొఱ్ఱయ్య సెట్టి.

సాక్షి సంఘ సభ్యులందరూ ప్రతిరాత్రి సమావేశమై అనేక అంశాలపై చర్చ సాగిస్తారు. జంఘాల శాస్త్రి ఉపన్యాస చతురుడు. ఎదుటి వ్యక్తిని ఆలోచింపచేసి తమవైపు త్రిప్పుకునే నైపుణ్యం ఉంది. భాషలో వ్యంగ్యం, హాస్యం, మృదువైన మందలింపు జంఘాల శాస్త్రి ప్రత్యేకత.

"స్వభాష" వ్యాసంలో మాతృభాషా ప్రాశస్త్యం, మాతృభాష చదువవలసిన ఆవశ్యకత, మాతృభాషలో చక్కగా మాట్లాడటం, వ్రాయటం మొదలైన అంశాలను గురించి వివరించటం జరిగింది. మాతృభాషను చిన్నచూపు చూచేవారు ఎంతటి విద్యాధికులయినా, గౌరవనీయులు కాదని వ్యంగ్యంగా తెలియచేస్తూ వ్యాసాన్ని రచించారు.

**హాస్యము :**

నవ్వు పుట్టించేది హాస్యము. సహృదయుడు, ఆరోగ్యవంతుడు, నాగరీకుడు అయిన వాణ్ణి నవ్వించేదే హాస్యము.

## స్వభాష వ్యాసంలో అధ్యక్షుని, జంఘాల శాస్త్రి అధిక్షేపించిన తీరులోని హాస్యం :

ప్రముఖులు నిర్వహించే విద్యాలయంలోని ఒక కార్యక్రమానికి తెలుగు మాతృభాషగా గల న్యాయవాద వృత్తిలో రాణించిన ఒక విశిష్ట వ్యక్తిని ఆహ్వానించారు. ఆ సమావేశానికి పురప్రముఖులు కూడా విచ్చేసారు. వారిలో జంఘాల శాస్త్రి ఒకడు. ఆహ్వానింపబడిన ఆ న్యాయవాది అధ్యక్ష స్థానం అలంకరించాడు. ఏ కార్యక్రమానికి తన్ను ఆహ్వానింపబడ్డాడో ఎవరిని ఉద్దేశించి ప్రసంగించాలో తెలిసిన వ్యక్తి.

అతడు ఆంధ్రుడు. కృష్ణానదీ తీరంలో జన్మించినవాడు. శుద్ధ శ్రోత్రియ కుటుంబంలో పుట్టిన వాడైనా తనకు తెలుగు రాదని ఆంధ్రభాషలో ప్రసంగించలేనని, ఇష్టమయితే ఆంగ్లంలో మాట్లాడగలననే అర్థంలో సంభాషణ మొదలుపెట్టాడు. పావుగంట సేపు గడిచింది. పిల్లలు బిక్కుబిక్కుమంటూ భయంతో వింటున్నారు. అధ్యక్షుడు తన ప్రసంగం ఆపి చివరకు "విల్ ఎనీ జెంటిల్మెన్ కం ఫార్వర్డ్ టు స్పీక్" అని ప్రశ్నించాడు. ఎవరూ లేవలేదు అపుడు జంఘాల శాస్త్రి శ్రోతల నుండి లేచి వేదికవైపు అడుగులు వేశారు. జంఘాల శాస్త్రిని వేదికనెక్కి అధ్యక్షుల వారిని వ్యంగ్యంగా, అతనిలో అంతర్మథనం కలిగేలా కర్తవ్యం నిశ్చయించుకునేలాగా శ్రోతలకు కర్ణపేయంగా ఉపన్యసించాడు.

## సందర్భశుద్ధి లేని న్యాయవాది ప్రసంగం – హాస్యము :

సందర్భ శుద్ధి లేని ప్రసంగంలో ఉండే వికృతి నవ్వుకు కారణం అవుతుంది. స్వచ్ఛమైన, కల్మషంలేని విద్యార్థుల శుభకరమైన సభా కార్యక్రమానికి ఆహ్వానించబడిన న్యాయవాది ఆంగ్లంలో పావుగంట సేపు ప్రసంగించటం పిల్లలు బిక్కుబిక్కుమంటూ ఏమీ అర్థంగాక మౌనంగా ఉండటం, అంతేగాకుండా సభను ఉద్దేశించి ఇంకా ఎవరైనా మాట్లాడతారా? అని ఆంగ్లంలో "విల్ ఎనీ జెంటిల్మెన్ కం ఫార్వర్డ్ టు స్పీక్" అని ఆహ్వానించటం జరిగింది. ఆ ఆహ్వానాన్ని కూడా అర్థం చేసుకోలేని పిల్లలందరూ మౌనంగా ఉంటే శాస్త్రి గారు వేదికను ఎక్కి ఉపన్యాసం ప్రారంభించటం ఇవన్నీ వింటుంటే నవ్వు రాకుండా ఉండదు. అయితే ఆ నవ్వు నిర్మలం కాదు. రసజనకమైన చిత్తవృత్తిని ఆశ్రయించినదీ కాదు అయినా అది హాస్యమే. సందర్భ శుద్ధి లేని ప్రసంగాలు హాస్యానికి కారణము.

## శాస్త్రి గారి ఉపవ్యాసం – హాస్యము :

శాస్త్రి గారి ఉపన్యాసం ఆద్యంతం ఆసక్తికరంగా సాగింది. న్యాయవాది మాతృభాషలో మాట్లాడలేను అనటం శాస్త్రి గారికి చాలా బాధను కలిగించినది. కష్టం కలిగించిన విషయమును మృదువైన (మెత్తని), కఠినమైన  మాటలతో చెప్పే విధానంలో హాస్యం అనేది కలిగిస్తుంది.

"అధ్యక్షులు ఆంధ్రభాషలో మాటలాడలేననటం వింతగా ఉంది. అతడు నంగికాదు. మూగవాడు కాదు. ఆంధ్రదేశంలో పుట్టినవాడు "మ్యావు మ్యావు మనటం పిల్లికి ఏలాగో, కిచకిచలాడటం కోతికి

సహజమెలాగో, పుట్టగానే క్యారుమనడం పురిటి బిడ్డకు ఏలాగో, ఆలాగే పుట్టుక నుండి తెలుగుభాషా పరిచయం ఏర్పడుతుంది. అయినా దేశీయుల దౌర్భాగ్యంతో తెచ్చుకున్న నైచ్యతతో, కులహీనతతో తెలుగువాడినని చెప్పుకోవటానికి సిగ్గుపడటం తగదు. స్వభాషను వదలి పరభాషను, పరభాషీయుల అలవాట్లను నేర్చుకోవటం తగదు. తండ్రిని తన్నిన తనయుడు మామగారి ముఖానికి హారతి పట్టినట్లే స్వభాషను మరచి అన్యభాషను ఆదరించటం.

జస్టిస్ హాలోవే జడ్జిమెంట్ చెప్పగలవారు జనక చక్రవర్తి ప్రవచించిన నీతి తెలియదనటం వింత, సివిల్ ప్రోసీజర్కోడు లేటెస్టు ఎడిషన్‌కు కర్త ఎవడో తెలుసుకున్న వ్యక్తికి సీతారామాంజనేయం రచయిత తెలియదనడం తెలుసుకోకపోవటం వింతలో వింత.

ఒక అంశాన్ని ఆంగ్లంలో చెప్పినప్పుడే అర్థమవుతుందనుకోవడం కూడా పొరబాటే అని శాస్త్రిగారు చెప్తూతూ ఒక ముష్టివాడు – “బాయ్ రూములో నున్న పాట్‌లో రైస్” యేమైనా ఉన్నదేమో, కైన్డ్లీ గెటిట్ హియర్ థాంకు యూ ఇన్ ఆంటిసిషేషన్” అంటే వినేవారికి ఎంతో ఆసహనం కలుగుతుంది. ఈ విధంగా స్వభాష వ్యాసంలో జంఘాల శాస్త్రి ఉపన్యాసం – ఒక వైపు వ్యంగ్యంతో అధ్యక్షుల వారిని విమర్శిస్తూనే మరొక వైపు భాషాభిమానాన్ని పెంచుకోవటానికి ఉద్వేగము, ఉత్సుకతతో జంఘాల శాస్త్రి గారి ప్రసంగంలో ఎన్నో ఛలోక్తులు వింటుంటే ఆశ్చర్యాన్ని కలిగి నవ్వును కలిగిస్తున్నది.

**ముగింపు :**

పానుగంటి వారిని హాస్య వాఙ్మయ నిర్మాతగా చెప్తుతారు. సాక్షి వ్యాసాలలోని హాస్యం జంఘాల శాస్త్రి సంభాషణలో తెలుసుకోవచ్చు.

# మాధవీ సనారా 'హైకూదీవి' –హాస్యం

డా॥పులపర్తి శ్రీనివాసరావు
అసిస్టెంట్ ప్రొఫెసర్(పి)
పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం
సాహిత్యపీఠం, బొమ్మూరు-533124
తూ॥గో॥జిల్లా, చరవాణి:8309742248

**ఉపోద్ఘాతం:**

'నవ్వడం ఒక భోగం, నవ్వించడం ఒక యోగం, నవ్వలేకపోవడం ఒక రోగం' అని అంటారు జంధ్యాల పాపయ్య శాస్త్రి. ఇది అక్షర సత్యం. దీన్ని రచయిత మాధవీ సనారా శతశాతం అనుసరించారని ఆయన హైకూ కవితల్లో తెలుస్తుంది. కేవలం సమాజం, ప్రజలు, వారి కష్టాలు, వారి చైతన్యం అని మాత్రమే కాకుండా మనిషికి మానసిక ప్రశాంతత అవసరం అనే ఉద్దేశ్యంతో పాటు ఆలోచన తీసుకువచ్చేలా హైకూలు రాశారు. అలాగే అవకాశం ఉన్నంత వరకు రచయిత తన కవితల్లో హాస్యాన్ని పండించే ప్రయత్నం చేశారు. 'నవ్వు నాలుగు విధాల చేటు' అనేది పాత సామెత అయితే, ప్రస్తుతం వేగవంతంగా సాగిపోతున్న సాంకేతికమైన జీవిత విధానంలో మాత్రం 'ఒక్కరోజైనా నవ్వని రోజు అన్ని రోజుల కంటే నష్టపోయిన రోజు' అనేది కొత్త సామెత. దీనిని రచయిత దృష్టిలో పెట్టుకుని హైకూలను రచించారనిపించింది. ఈయన హైకూ కవిత్వంలో ఏవిధమైన హాస్యం ఉందో పరిశీలించి తెలియజేసేదే ఈ వ్యాస ఉద్దేశ్యం.

**రచయిత పరిచయం:**

'మాధవీ సనారా' అసలు పేరు శిలపరశెట్టి సత్యనారాయణ. ' మాధవీ సనారా అనేది ఈయన కలం పేరు. ఖరగ్‌పూర్‌లో పట్టణంలో సనారా తండ్రిగారు అయిన రాములు రైల్వే ఉద్యోగిగా పని చేసేవారు. సనారా తల్లి పేరు అప్పలనరసమ్మ. సనారా తాను చదివిన ఆంధ్ర హైస్కూల్ మ్యాగజైన్‌కి ఒక కథ రాశారు. అప్పట్లో ఆంధ్రప్రదేశ్ మ్యాగజైన్‌లో కూడా వార్తా కథనం రాశారు. ఇవన్నీ చూసి సనారాగారు రచనా రంగంవైపు అడుగులు వేశారు. కథలు పుస్తకాలు మీద ఎక్కువ మక్కువ ఉండటంతో 'విరేచనాల మందు' 15 మార్చి 1962లో 'చిత్రగుప్త' పత్రికలో వాళ్ళ చెల్లి త్రివేణి పేరు మీద రాశారు. తరువాత తరువాత హాస్యపత్రికల్లో కథలు రాసేవారు. ఆయన మొదటి కవితా సంపుటి 'గమనిక'. ప్రస్తుతం ఇది లభించుటలేదు. అందులో కొన్ని కవితలు మాత్రంకానవస్తున్నాయి. 'హైకూలు', 'రెక్కలు గుర్రం', 'అమ్మమ్మ చేతి కడియాలు', 'అధరం మధురం' మొదలైనవి మినీ కవితా సంకలనాలు.'వెంకటేశ్వరశతకం', 'షిరిడిసాయి శతకం', 'అమల అంతరంగం' చిన్నకథల సంపుటి. 'నడక' మనిషి నుండి మనీషికి, 'మనోగవాక్షం', 'నిప్పుబొమ్మ' మొదలైన రచనలు చేశారు.

**హైకూ కవిత్వం– నేపథ్యం:**

ఆధునిక తెలుగు సాహిత్యంలో ఎన్నో నూతన ప్రక్రియలు చోటు చేసుకున్నాయి. ఒక నూతన ప్రక్రియ ఆవిర్భవిస్తుందంటే దాని విస్తార, వికాస, పరిణామ, ప్రయోగ, ప్రసార దశల్ని ఒడిసి పట్టుకొనే రాశీ సమూహం ఒకటుంటుంది. ఈ తరుణంలో రుబాయి, గజల్, మినీకవిత, హైకూ, నానీ మొదలైన ప్రక్రియలు తెలుగు కవులకు అత్యంత సన్నిహితంగా వచ్చి చేరాయి. అటువంటి వాటిలో 'హైకూ' ప్రక్రియ కొంత ప్రాధాన్యతను సంతరించుకుంది. జెన్ తత్వం ఆధారంగా జపాన్ కవులు ఈ హైకూ ప్రక్రియకు శ్రీకారం చుట్టారు. అతి తక్కువ సమయంలో పండితులతోపాటు, సామాన్యుడిని సైతం అతి దగ్గరగా ఆకర్షించిన

రచయితలు హైకూ రచయితలు. అతి తక్కువ పదాలతో ప్రభంజనాన్ని చూపించే ఈ ప్రక్రియ ఆధునిక సాహిత్యంలో ఒక ముద్ర వేసుకుంది. హైకూ అనేది పదిహేడు అక్షరాల్లో దర్శమిచ్చినా, దాని భావం విస్తృతంగా ఉంటుంది.

హైకూ తెలుగులో అడుగు పెట్టిన సమయంలో కేవలం 'అనుభూతి' మాత్రమే ఉండేది. ఇంకా చెప్పాలంటే ప్రాకృతికమైన అనుభూతి ప్రధానంగా ఉండేది. ఆ తరవాత కాలంలో అన్ని భావాల వాహికగా పరిణమించింది. సమాజంలో ఉన్న అన్ని అంశాలను వీటిలో నిక్షిప్తం చేస్తూ భావాంతరంగాన్ని ఆవిష్కరిస్తున్నాయి. తరువాత కాలంలో హైకూలు ఉద్యమరూపంలో కూడ వెలువడ్డాయి. సామాజిక భావాలతోపాటు విప్లవాత్మకమైన భావాలను కూడా కవులు హైకూల ద్వారా వ్యక్తీకరించడానికి ప్రయత్నం చేస్తున్నారు.

హైకూ రచనలో ప్రకృతి అంశాలతో పాటు మానవ జీవితంలో హాస్యానికి ప్రాధాన్యాతాంశాలను కూడా పొందుపరుస్తూ హైకూలు రచిస్తున్నారు. రచయితలు ఏదీ ఏమైనా సాహిత్యం అంటే బ్రహ్మానందం, సమాజహితం, సమాజానిక మంచి చేకూర్చేదేదైనా సాహిత్యంగా రావడం మంచిదే. ఇలా ప్రతీ అంశంతో ముడిపెడుతూ హైకూ రచన చేయడం తెలుగు కవులకు పరిపాటిగా మారడం అనేది శుభసూచికంగా గుర్తించాలి. రచయిత మాధవీ సనారా కూడా హైకూ రచనకు ప్రాధాన్యం ఇచ్చారు. ఈయన హైకూల్లో హాస్యానికి ప్రధానమిచ్చారు. కాబట్టి వస్తు పరంగా హాస్యంతో కూడిన హైకూలు ఏవిధంగా ఉన్నాయో ఈ వ్యాసంలో పరిశీలిస్తాను,

**హైకూలు – హాస్యం:**

ఈ కింది హైకూలో బట్టతలను వ్యంగ్యంగా చిత్రిస్తూ హాస్యంగా ఇలా తెలియజేశారు. కాలంలో వచ్చిన మార్పుల వల్ల ప్రస్తుతం తల మీద జుట్టు ఉండటమే పెద్ద గగనం అయిపోయింది. ఎన్ని రసాయనాలు వాడినా ఊడకుండా మాత్రం చూడలేకపోతున్నాం. ఈ కింది చమత్కారాన్ని పరిశీలిస్తే దానిలోని హాస్యం అర్థమవుతుంది.

"కోడి గుడ్డుతో
పోటీ పడింది చూడు
నీ బట్టతల" (హైకూ దీవి : మాధవీ సనారా, హైకూ సంఖ్య-23)

కోడిగుడ్డుతో పోటీపడినట్టుగా మన జుట్టును మనమే ఊడగొట్టుకుంటున్నామని రచయిత చాలా హాస్యం పండించారు. నేడు ఎవరి నెత్తిమీద కాస్త అయినా జుట్టు ఉంచుకోవడం చాలా కష్టంగా ఉంది. ప్రజా జీవనంలో వచ్చిన మార్పులే దీనికి కొంత కారణంగా చెప్పుకోవచ్చు. మనిషికి పెరిగిన ఒత్తిడి మరో కారణం ఏదిఏమైనా వయసు మీరకుండానే జుత్తు ఊడటం మాత్రం నిజం. ఇంతకు ముందు తలస్నానం చేయడానికి కుంకుడుకాయలు వాడేవారు. అంతేకాకుండా పౌష్టికాహారం తినేవారు. కాబట్టి ఆరోగ్యం బాగుండేది, ఆ జుట్టు కూడా పొడవుగా ఆరోగ్యంగా ఉండేది. కాని ప్రస్తుతం రోజు తింటున్న తిండిలో ఏ విధమైన పోషకాలు, విటమిన్సు లేవు. దానివల్ల శరీర సమతాస్థితి కోల్పోతుంది. దీని వలన కూడా జుత్తు జీవంలేనిదిగా తయారవుతుంది. అందుకే రచయిత ఇంత వ్యంగ్యంగా, హాస్యంగా చెప్పారనిపిస్తుంది.

బట్టతలను కోడిగుడ్డుతో పోల్చి, పోటీపడిందని చమత్కారంగా చెప్పారు. అంటే అసలు తలమీద ఏ విధమైన జుట్టులేదని అర్థమవుతుంది. బట్టతల ఉన్న వాళ్లు ఈ మధ్య విగ్గులు కూడా వాడటం గమనించదగినది. వాళ్ళను చూసినా కొంచెం నవ్వురాకమానదు. తలని నిలబెట్టుకోవటానికి ఎన్ని డబ్బులు ఖర్చుచేసినా షాంపూలు, నూనెలు మొదలైన మెరుగులు దిద్దుతున్నాం. కాని వీటికి ఫలితం లేదు. ఉన్నా వెంట్రుక కూడా ఊడిపోతుంది.

అందుకే కోడిగుడ్డు ఎంత నున్నగా ఉంటుందో మన తల కూడా అలా ఉండటానికి దానితో పోటీపడుతున్నాం అని చాలా హాస్యంగా చెప్పడం ఈ హైకూలో చూడదగినది.

సంవత్సరంలో ఏదైనా ఉత్సవాలు జరిగినట్లు అయితే అక్కడికి విగ్రహాన్ని నిలబెట్టి రోడ్డుపై వచ్చే వారికి, వెళ్ళిపోయే వారికి డబ్బులు అడిగి విరాళాలు రూపంలో అడుగుతుంటారు. దాన్ని కూడా వ్యంగంగా చిత్రించే ప్రయత్నం చేశారు. వాటి గురించి రచయిత హైకూలో ఇలా వర్ణించారు.

"పూజలు కదా
రోడ్డుపై తైతక్కలు
చందా డబ్బాలు" (హైకూ దీవి : మాధవీ సనారా, హైకూ సంఖ్య-39)

పూజలు వలన రోడ్డుపై చందా డబ్బాలు తైతక్కలు ఆడుతున్నాయని హాస్యంగా పేర్కొన్నారు. వినాయకచవితి, దసరా మొదలైన ఉత్సవాల్లో పిల్లలు విగ్రహాల్ని నిలబెట్టి వాటికోసం అందరి దగ్గర విరాళాలు సేకరిస్తూ ఉంటారు. అప్పుడు ఆ డబ్బులుకోసం చిల్లర డబ్బాలన్నీ తైతక్కలు వేస్తున్నట్టుగా రచయిత కనిపించాయన్నట్లుగా చిత్రించడంలో అతని ఆలోచనా దృక్పథం ఎలాంటిదో అర్థం చేసుకోవచ్చు. ఈ వాక్యాలు నిజంగా హాస్యాన్ని తలిపిస్తున్నాయి. ఒక సామాన్యమైన విషయంలో ఇంత చక్కటి అర్థాన్ని ఇచ్చి చాలా చక్కగా వర్ణించారు. చందా డబ్బాలు నాట్యం చేస్తున్నాయని వెల్లడించడమే గొప్ప కవితాత్మక ఆలోచనగా చెప్పొచ్చు. ఇది సున్నితమైన హాస్యాన్ని పండించేలా విశేషంగా ఉంది.

మరో హైకూని పరిశీలిస్తే, చలికాలంలో చలిని తట్టుకోలేక దుప్పటి కప్పుకుంటాం. కాని చలికాలం అయిపోయాక కప్పుకునే రగ్గు కాస్త మూలన పెడతాం. దాన్ని చమత్కారంగా చెప్పారు రచయిత. ఏ కాలంలో చలి వేస్తుందో వివరిస్తున్న సందర్భంలో ఈ హైకూను గమనించాలి.

"పెట్టెలో రగ్గు
కాళ్ళు చాపుకుంటుంది
హేమంతంలోనే" (హైకూ దీవి : మాధవీ సనారా, హైకూ సంఖ్య-40)

ఋతువులు అన్నీ కూడా ఒక్కొక్క కాలానికి ఒక్కోలా ఉంటాయి. శీతాకాలంలో దుప్పట్లు, రగ్గుల అవసరం ఎంతో ఉంటుంది. ఆ కాలం వెళ్ళిపోయే సరికి వాటిని మడతపెట్టి ఏ పెట్లోనో పెట్టి మూలన పడేస్తాం. దాన్ని దృష్టిలో ఉంచుకుని కొంత హాస్యాన్ని జోడించి 'పెట్టెలో రగ్గు కాళ్ళు చాపుకుంది' అని వ్యాఖ్యానించారు. అది కూడా హేమంతంలోనేనని చెప్పడం ఆ రుతువు వెళ్ళాక రగ్గుల పరిస్థితిని చమత్కారంగా చెప్పడంలో హాస్యం దర్శనమిస్తుంది. కాలాన్నిబట్టి వాతావరణం ఉంటుంది. అలాగే ఎక్కడైనా బట్టలు కాళ్ళు చాపుకుంటాయా? అంటే కేవలం ఇది కవిసమయం మాత్రమేనని గుర్తించాలి. దీన్నిబట్టి ఆయనకి ఉన్న హాస్యగుణం ఎటువంటిదో అర్థం చేసుకోవచ్చు. ఇది చదివిన వెంటనే నవ్వు వచ్చేలా ఉంది. అప్పటి వరకూ దాచిన రగ్గును చలికాలం వచ్చినందున తీయడం జరిగిందనే విషయాన్ని చక్కటి వర్ణనతో హాస్యంగా చెప్పారు.

మరో హైకూ కవితలో పుస్తకాల భద్రతకు సంబంధించిన అంశాలను తెలియజేశారు. పుస్తకం పదికాలాలు పాటు ఉండాలంటే దానికి ఇరువైపులా అట్ట ఉండాలి. అప్పుడే ఎంతకాలం అయినా ఉంటుందని తెలుసుకునేలా ఈ హైకూ సాగింది. దాన్ని పరిశీలిస్తే-

"పుస్తకానికి
రెండు వైపులా అట్ట
కాపలా కోసం" (హైకూ దీవి : మాధవీ సనారా, హైకూ సంఖ్య-42)

పుస్తకానికి కాపలా ఏంటి అని నవ్వురాకమానదు. కాని దీనిలో అర్థవంతమైన భావం దాగి ఉంది. ఒక పుస్తకానికి అట్ట ఉంది అంటే అది దాని రక్షణ కోసమే. అందుకే రచయిత హాస్యంగా పుస్తకానికి రెండువైపులా అట్ట కాపలాకోసం ఉందన్నారు. బాల్యంలో ఒక అట్టవేసి ఉన్నా మళ్ళీ దానిమీద మరొక అట్ట వేస్తుంటాం. దానిని హాస్యంగా వ్యక్తీకరించడం ఈ హైకూలో చూడొచ్చు. ఒక ఇంటిని రక్షించడానికి ఏ విధంగా అన్నివైపులా తలుపులు పెడతామో, అలాగే అంత లావుపాటి పుస్తకాన్ని రక్షించడానికి ఒక చిన్న అట్టలు వేయటమా! అని రచయిత ఆశ్చర్యంతో కూడిన చమత్కారాన్ని కవిత్వీకరించారు.

చెట్టు వలన అనేక ఉపయోగాలున్నాయి. అలాగే ఒక చెట్టు మీద ఎన్నో జీవరాశులు ఆధారపడతాయని, అవి ఏవిధంగా ఉంటాయో రచయిత మరో హైకూలో చమత్కారంగా తెలియజేశారు. ఈ హైకూని విశ్లేషణ చేస్తే విషయం అర్థమవుతుంది.

"చెట్టు జుట్టులో
జీవరాశుల పేలు
చెట్టు గోక్కోదు" (హైకూ దీవి : మాధవీ సనారా, హైకూ సంఖ్య-50)

మనిషికి తలలో పేలు ఉంటాయి కదా! అదే విధంగా చెట్టుజుట్టులో కూడా జీవరాశులు అనే పేలు ఉన్నాయన్న ఆ చెట్టు గోక్కోదు అని రచయిత ఎంత చమత్కారాన్ని చెప్పారో అనిపిస్తుంది. ఒక చెట్టుమీద వివిధ రకాల పక్షులు, పురుగులు మొదలైనవి అన్నీ ఆ కొమ్మల మీద నివాసం ఉంటాయి. కాని చెట్టుకి చేతులు లేవు కాబట్టి గోక్కోలేదేమో అని మనందరికీ అనిపించవచ్చు. సరిగ్గా ఈ విధంగానే వృక్షంమీద ఒక హాస్యాన్ని చెప్పడం జరిగింది. ఇలా రచయిత చిన్నచిన్న అంశాలను తీసుకొని కనిపించని మంచి హాస్యాన్ని పండించగలిగే సామార్థ్యం ఉన్నట్లు అనిపిస్తుంది. చెట్టుకి జుట్టు ఉన్నట్టు, దానిలో పేలు అనే జీవ రాశులు ఉన్నట్టు చెప్పడం మరింత హాస్యం సంతరించుకుంది.

బావిలో నీళ్ళు తోడితే చేదలోకి వస్తాయి. కాని ఆకాశంలో ఉన్న జాబిల్లి రావటం లేదు అని అంటున్నారు. అది ఎందుకో వివరిస్తున్న సందర్భంలో ఈ హైకూను పరిశీలిస్తే తెలుస్తుంది.

"ఎంతతోడినా
చేదలోకి రాలేదు
జాబిలి పిల్ల" (హైకూ దీవి : మాధవీ సనారా, హైకూ సంఖ్య-74)

సింహాన్ని చంపటానికి ఒక కుందేలు బావిలో తన నీడను చూపించి ఉపాయంతో చంపడమనే కథను వినే ఉన్నాం. కొంచెం అలాంటి విషయాన్ని చెప్పేదే ఈ హైకూ కూడా. హాస్యాన్ని పండించి చాలా సున్నితంగా నవ్వు పుట్టేలా అక్షరీకరించారు. ఎంత తోడినా చేదలోకి జాబిలి పిల్ల రాలేదని చెప్పడంలో, నీటిలోని ప్రతిబింబం మన ముందే ఉన్నట్లుంటుంది. కానీ అది చలనం లేనిది. ఆకాశంలో ఉన్న చంద్రుడు కదిలితేనే నీటిలో కనిపించే ప్రతిబింబం కదులుతుంది. బావిలో నీళ్ళు కోసం చేదను వేస్తే, దానిలో నిక్షిప్తమైనట్లు చంద్రుడు కనిపిస్తాడు. కానీ అది నిజ దృశ్యం కాదు. అందుకే నీరు తోడుతుంటే రాత్రిపూట ఆకాశం మీద జాబిల్లి ఆ బావిలో నుండి రావడంలేదని హాస్యభరితంగా వ్యాఖ్యానించారు. అందులోకీ జాబిల్లి పిల్ల అని సంబోధించి ఇంకొంచెం చమత్కారంగా ఉండేలా చిత్రించడం హాస్యాస్పదంగా ఉంది.

భూమి అనేది గుండ్రంగా తిరుగుతుంది. అలాగే ఏమైనా భూకంపాలు వస్తే కదులుతుంది. ఇవేమీ కాకుండా కూడా కదులుతుందని రచయిత తెలియజెప్పారు. అదెలాగో ఈ కింది హైకూని పరిశీలించాల్సిందే.

"వాడొక్కడికే
కదులుతోంది భూమి
దేవ దాసులే!" (హైకూ దీవి : మాధవీ సనారా, హైకూ సంఖ్య-80)

వాడొక్కడికే కదులుతోంది భూమి దేవదాసులే అని రచయిత అంటున్న విధానం చూస్తుంటే ఇక్కడ దేవదాసులు అంటే మన సినిమా భాషలో 'తాగుబోతులు' అని అర్థం. ఒక్క తాగిన వారికే భూమంతా కదిలినట్టు కనిపిస్తుంది. కాని ఇక్కడ చమత్కారం ఏంటంటే, దేవుడికి దాసులు కాబట్టే భూమిని కదిలించారని ఎంతో సాధారణంగా, సున్నితమైన హాస్యాన్ని ఈ కవితలో జోడించారు. ఇందులో చాలా గొప్ప హాస్యం పండించబడింది. తాగుబోతులను పొగుడుతూనే, తిడుతున్నట్టు అనిపించింది. దేవునితో ఉండే వారిగా వీరిని పోల్చి వారి వలన భూమి అంతా తిరిగిపోతుందని చెప్పే విధానం చాలా బాగుందని పించింది. ఇక్కడ వాళ్ళకి మాత్రమే కదులుతుందనే వ్యంగ్యమే హాస్యానికి ఆధారం.

బాల్యంలో పిల్లలు అన్నింటికన్నా ఆటలకి ఎక్కువ ప్రాముఖ్యం ఇస్తుంటారు. చదువుకంటే ఆటలలోనే ఎక్కువ మునిగిపోతారు. అలాంటి పిల్లలను ఏ విధంగా వెంటబడుతున్నారో మరో హైకూలో వివరణ ఇచ్చారు.

"గిల్లీ దండాలు
వెంట బెడుతున్నాయి
పిల్ల కాయల్ని" (హైకూ దీవి : మాధవీ సనారా, హైకూ సంఖ్య-84)

ఆటలు పిల్లలని మానసికంగా, శారీరకంగా ధృడంగా తయారుచేస్తుంది. అందువలన చిన్నప్పుడు ఆడిస్తారు. దానిని రచయిత గిల్లీ దండాలు వెంటబెడుతున్నాయని పిల్లకాయల్ని అంటున్నారు, ఆడ, మగ, పిల్లలు కలిసి లేదా ఎక్కువగా మగపిల్లలు ఒక చిన్న కర్రని గుంటలా చేసి, పెద్ద కర్రతో వాటిని కొడుతూ వెనకాల పరుగెడుతూ ఉంటారు. వీటిని గిల్లీ దండాలుగా పిలుస్తారు. ఇక్కడ చమత్కారం ఏమిటంటే గిల్లీదండాలు వెనుక పిల్లలు పరుగెడతారు. కాని గిల్లి దండాలే పిల్లల్ని వెంటబడుతున్నాయని చెప్పడంలో హాస్యాన్ని గమనించవచ్చు. ఆ కర్ర ఎక్కడికి వెళితే అక్కడికే వెళ్ళి దానిని తెచ్చి మళ్ళీ ఆడుతుంటారు. చిన్న ఆటను తీసుకొని ఇంత హాస్యాన్ని జోడించి తెలపడం అనేది రచయిత రచనా నైపుణ్యాన్ని తెలుపుతుంది.

కాలాలు అన్ని ఒకే విధంగా ఉండవు. ఒక్కొక్క కాలాన్ని బట్టి అప్పటి వాతావరణం ఉంటుంది. అలానే మాఘమాసంలో మనుషులకు ఏ విధంగా ఉంటుందో ఈ కింది హైకూను పరిశీలిస్తే అర్థం చేసుకోవచ్చని తెలుస్తుంది.

"ఇంటిలో చలి
బైటకి వెళ్తే వేడి
మాఘ మాసమా!" (హైకూ దీవి : మాధవీ సనారా, హైకూ సంఖ్య-88)

మాఘమాసం అంతా చలిగా ఉంటుంది. కొంచెం పొద్దుపోయాక వెళ్తే అంతా వేడిగా ఉంటుంది. దానిని ఇంటిలో చలి, బైటకి వెళ్తే వేడి మాఘమాసమని అన్నారు. రాత్రి ఎక్కువ చలి, తెల్లవారిన తర్వాత బయటకి వెళ్ళినప్పుడు కళ్ళు తిరిగేంత ఎండ ఉంటుంది. అటువంటిదే మాంసం తిన్నప్పుడు కూడా కొంచెం ఇటువంటి ప్రభావమే కనిపిస్తుందని చెప్పడం విశేషం. కాలానికి అనుగుణంగా మనుషులు తమ పరిస్థితులను మార్చుకుంటారు. అలానే మాఘ మాసానికి ఎంతో విశిష్టత ఉంది. చాలా మంది వ్రతాలు, పూజలు ఆచరిస్తారు. అందరూ పవిత్రస్నానాలు ఆచరిస్తారు. అందుకే రచయిత ఇంట్లో చలి, బయట వేడి అన్నారనిపిస్తుంది. ఏదైనా ఈ కవితలో మంచి చమత్కారం కనిపించింది.

మనకి మంచి జరగడంకోసం దేవుడి దగ్గరికి వెళ్తుంటాం. దానికోసం కొబ్బరికాయ కొడతాం. దాని గురించి రచయిత కొంచెం హాస్యంగా వివరించిన ఈ హైకూను పరిశీలించాలి.

దేవుడి కోసం
తలచిట్లి చచ్చింది
కొబ్బరికాయ" (హైకూ దీవి : మాధవీ సనారా, హైకూ సంఖ్య-90)

దేవుడి దగ్గర కొబ్బరికాయ కొట్టడం సర్వసాధారణం. అయితే అది పగిలిన విధానాన్ని మాత్రం హాస్యంగా చెప్పడం విశేషం. కొబ్బరికాయ రెండు చెక్కలైందని అనడం మానేసి దాని తల చిట్లిందని, దానితో అది చచ్చిపోయిందని ఆలోచన చేయడం రచయిత రచనా నైపుణ్యానికి నిదర్శనం.

దేవుడికోసం కొబ్బరికాయ తలచిట్లించుకొందని కొత్తకోణంలో కొబ్బరికాయ కొట్టడాన్ని కొత్తగా ఆవిష్కరించి హాస్యాన్ని పండించారు.

చెట్టు పచ్చగా ఉంటేనే అందరూ పట్టించుకుంటారు. దాని దగ్గర అందరూ నీడను కాచుకుంటారు. ఉపయోగించుకుంటూ ఉంటారు. అదే చెట్టుకి ఆకులు ఎండిపోతే ఎవరూ పట్టించుకోరని రచయిత ఆవేదనగా వ్యక్తం చేస్తున్న ఈ కవితలో చాలా అంతరార్థం గమనించవచ్చు.

"ఎండినాకుల్ని
తరువు ఛీఛీ అని
తరిమేసింది" (హైకూ దీవి : మాధవీ సనారా, హైకూ సంఖ్య-93)

చెట్టుకు ఉన్న ఎండిన ఆకులు రాలిపోవడం సహజం. దాన్ని రచయిత కొంచెం చెమత్కారంగా మలిచారు. ఎండిన ఆకుల్ని ఆ చెట్టే తన నుండి దూరంచేసి తరిమేసిందని పేర్కోవడమే ఇందలి విశేషం. పచ్చగా ఉన్నంతసేపు చెట్టుని పట్టుకొని ఉన్న ఆకులు, ఎండిన తరవాత అవే ఆకులు ఆ చెట్టుని పట్టుకుని ఉండలేవు. కాబట్టి అవి రాలిపోవడం జరుగుతుంది. చెట్టు తరిమేస్తే పోతున్నాయి చెప్పడం చాలా చమత్కారం అనిపిస్తుంది. అంత సహజమైన ప్రకృతి అందాన్ని ఇంత చక్కగా వర్ణించడం చాలా బాగుంది. రాలిన ఆకులు చెట్టుకింద కూడా ఉండవు కాబట్టి ఛీ ఛీ అని తరిమేసిందని దాని తాలూకు దృశ్యాన్ని మన కళ్ళకి కట్టినట్లు చూపించడం రచనా వైశిష్ట్యానికి నిదర్శనంగా చెప్పుకోవచ్చు.

కొన్ని వస్తువులు ఒకదానికొకటి కలిస్తే నాశనం అవుతాయి. మరికొన్ని మంచిగా ఏర్పడతాయి. కాని భోగి మంటలు ఏర్పడడానికి గల కారణాలను రచయిత ఇలా ఆలోచనాత్మకంగా వివరిస్తూ హాస్యాన్ని పండించారు.

"కర్ర పిడక
సహగమనంచేస్తే
భోగీమంటలే" (హైకూ దీవి : మాధవీ సనారా, హైకూ సంఖ్య-97)

భోగిమంట ఏర్పడే విధానం గురించి చమత్కారంగా హాస్యం జోడించి ఈ హైకూలో వెల్లడించారు. భోగీమంటలనేలవి కర్ర పిడక కలిసి సహగమనం చేస్తే పుడతాయని చెప్పడం చూస్తే రచయిత తాలూకు ఆలోచన ఎంతో కవితాత్మకంగా ఉందనిపించింది. ఇక్కడ రెండు విభిన్న వస్తువులు కలవకూడదని తెలిసినా కలిసాయి అని చెప్పడంతో అవి నష్టానికి కారణం అవుతాయి. కొన్ని వ్యతిరేక శక్తులు కలిసినట్లయితే మంటలు వస్తాయని పరోక్షంగా చెప్పినట్టు తెలుస్తుంది. కర్రలను, పిడకలు కాలిస్తే భోగీమంటలే రావు. ఏ మంట అయినా వస్తుంది. కాని ఇంతకు ముందు పిడకలు చేసి ఎక్కువ కర్రలు పోగుచేసి మంటలు వేస్తే అది భోగి మంట అవుతుంది. ఎప్పుడు పడితే అప్పుడు కర్రలు, పిడకలు వేస్తే అది భోగిమంట అవదు కదా! అందువలన

ఈ విషయం కొంచెం హాస్యంగా చెప్పినట్టు అనిపిస్తుంది. సాధారణవస్తువులు తీసుకొని వర్ణన, చేయడం చాలా బాగుంది.

సంతోషమైన సంబరాల్లో వాయిద్య పరికరాలు అయిన తబలాను వాయించడం జరుగుతుంది. కొంచెం హాస్యభరితంగా తబలా గురించి రచయిత ఇలా వర్ణించారు. దీనిలో హాస్యం దర్శించవచ్చు.

"తబలా పిల్ల
మొట్టికాయలేనేమో
రోజు కోరేది" (హైకూ దీవి : మాధవీ సనారా, హైకూ సంఖ్య-147)

తబలా వాయించాలంటే దాని మీద వేళ్ళతో అదమాలి. అంటే ధ్వని పుట్టేలా కొట్టాలి. దీన్ని రచయిత తబలాకి రోజూ మొట్టికాయలేనని, బహుశా అది అలా కోరుకుంటుందేమో అని చెప్పడం విశేషం. తబలా మీద చేతితోనే వాయించాలి. కొడితేగాని అది మోగదు. అందు వలన అది మొట్టికాయలు తింటున్నట్టు భావించి భావుకత అందించేలా ఆలోచనాత్మకంగా చిత్రించడం ఈ హైకూలో హాస్యానికి నిదర్శనం.

**ముగింపు:**

ఈవిధంగా హాస్య సంబంధం హైకూల్లో వస్తువు ఏమీ స్పష్టంగా కనిపించకపోయినా పాఠకులను, ప్రేక్షకులను నవ్వించడమే ప్రధానంగా రచయిత చేసిన ప్రయత్నం ఎంతో ఆకట్టుకునేలా ఉంది. హైకూలను వ్యంగ్యంగా చెప్పినా, చిన్న పదాలతో, రోజువారీ వాడే వస్తువులలో ఇంత హాస్యాన్ని పండించగలగడం రచయితకే సాధ్యమని ఆయా హైకూలను పరిశీలిస్తే తెలిసింది.

**ఆధార గ్రంథాలు:**


1. చినవీరభద్రుడు - వందేళ్ళ తెలుగు కవిత, ఎమెస్కో ప్రచురణ, విజయవాడ, 2001
2. నరసింహం. కె.వి.ఆర్. - ఆధునికాంధ్ర కవితా సమీక్ష,గంగాధర పబ్లికేషన్స్,విజయవాడ, 1982
3. మాధవీ సనారా -హైకూ దీవి ఇండియన్ హైకూ క్లబ్ ప్రచురణలు, కొత్తూరు, విశాఖపట్నం, 2003
4. రామ్మోహన్‌రాయ్. కడియాల- తెలుగు ఆధునిక కవితా వికాసం(1947-1980).
5. సిమ్మన్న. వెలమల - తెలుగు సాహిత్య విమర్శ, సిద్ధాంతాలు, విశాఖపట్నం, 2005
6. సుబ్బారెడ్డి మద్దూరి - తెలుగులో ఆధునిక కవితా రీతులు, సికింద్రాబాద్, 1965.


-o-o -

# మల్లవరపు జాన్ రచనలో హాస్యోక్తి

కె. గిడ్డమ్మ, పరిశోధక విద్యార్థిని
తెలుగుశాఖ, ఆచార్య నాగార్జున విశ్వ విద్యాలాయం, గుంటూరు

'హాసము' అంటే నవ్వు ఆ నవ్వును పుట్టించేది హాస్యము. అసహజమూ విపరీతమూ అయినది ఏదైనా సరే దాన్ని చూసి మనము నవ్వుతాము. వేషం విపరీతంగా ఉంటే, నవ్వుతాము. అలాగే చేసే చేష్టలు విపరీతంగా ఉన్నా నవ్వుతాము. మాట్లాడే మాటలు వంకరగా ఉంటే, నవ్వుతాము. 'నవ్వు' అనేదాన్ని మనిషి కొత్తగా నేర్చుకోలేదు. ఏడ్వటం మనిషి ఎలా సహజమో, నవ్వడం కూడా అలాగే సహజము.

నవ్వుకు కారణమైనది హాస్యము. నవ్వించేది హాస్యము సహృదయుడూ, ఆరోగ్యవంతుడూ, సంస్కారము గలవాడు. నాగరికత కలవాడు అయిన వ్యక్తిని, నవ్వించేదే హాస్యము. ఉత్తమ హాస్యములో సంస్కారం లేనివాడినీ, అనాగరికునీ కూడా నవ్వించే విషయాలు ఉంటాయి. ఈలాంటి ఉత్తమ హాస్యని తన రచనల ద్వారా పండించిన కవులు, రచతలు, సాహిత్య విమర్శకులు ?మన మల్లవరపు జాన్‌గారు. ఆయన తన "సూక్తి శతకము" అనే శతక సాహిత్యంలో అధిక్షేపనగ, వ్యంగ్యంగా, దూషణంగా, విమర్శనంగా, నీతి సూక్తులు ప్రబోధించడమే కాకుండా హాస్యని పండించే విధంగా కూడా కొన్ని పద్యలను రచించారు. వాటి కొన్నింటి మంచుకకు పరికించి చూద్దాం.

"మేడమీద మేడలేదు గట్టిన వాని
పాపమేమొ గాని బి.పి వచ్చి
ఎక్కలేదు మెట్ల నెక్కినా దిగలేదు
సజ్జనాను రక్తి జాను సూక్తి"

సమాజంలోని కొందరు వ్యక్తులు అన్యాయంగా అక్రమంగా సంపాదించి మేడల మీద మేడలు ఏడు గట్టిన వాని పాపమేమొ గాని బి.పి. వచ్చి మేడ మెట్లు ఎక్కలేదు దిగలేదు హాస్యంగా కవి వర్ణించాడు. నిజమే నేడు ప్రపంచములోని చాలా మంది మనుషులు అవినీతిగా అన్యాయంగా తప్పుడు దారిలో సంపాదించి మేడలు కట్టించుకొన్నారు. అంతేకాదు అనేక రకాలైన వస్తువులను తెచ్చుకొని ఆ మేడలను అలంకరించుకొన్నప్పటికిని వాటిని అనుభవించలేక బి.పి., షుగర్ మొదలైన రోగాలకు గురియైయి దేవుని దగ్గరికి వెళ్ళి పాప, పుణ్యముల నిమిత్తం తీర్పు పొంది అనుభవించాల్సినటువంటి పాపఫలితాన్ని ఈలోకంలోనే అక్రమంగా సంపాదించిన సొమ్మును అనుభవించలేక రోగాల రూపములో ఫలితాన్ని పొందుతున్నారని హాస్యస్పదంగా మానవులలో వున్న అవినీతి అక్రమాలను ఎత్తి చూపారు.

ఒక విషయంలో ఉండే అసహజత్వమూ, వైపరీత్యమూ నవ్వును పుట్టిస్తాయి. సహజంగా జరగవలసిన పని అట్లా జరక్క ఇంకొక విధంగా జరిగితే విపరీతంగా ఉంటే నవ్వుతాము. ఉదాహరణకు

"టక్కు జేసి టిపప్పటాపుతో నొక్కందు
క్రిందబడి వస్తువందు కొనగ
పేంటు జారిపోయె పిఱ్ఱలపై నుండి
సజ్జనాను రక్తి జాను సూక్తి"

ఒక్కడు చక్కగా వస్త్రాలను ధరించి టక్కు చేసి టిప్పుటాపులో సహజగా చాలా హుందాగా వుండాల్సిన వ్యక్తి దారిలో క్రిందపడిన వస్తువు అందుకొనడానికి అసహజగా, వైపరీత్యముగా ప్రవర్తించినాడు అందువలన అతని పేంటు పిఱ్ఱలపై నుండి జారిపోయెను. అప్పుడు అందరికీ నవ్వు కలుగుతుంది. సమాజంలో మనుషులకు ఎంతో సమృద్ధి కలిగియున్నప్పటికీ "పొరిగింటి పుల్లకూర రుచి అనట్లుగా" పొరుగువారి సొమ్మును విడిచి పెట్టుటకు మానవులు ఇష్టపడరు. ఈ నీతి సూక్తిని కవిగారు హాస్యభరితంగా వివరించి నవ్వు కలిగించారు.

ఆశ్చర్యము వల్ల, ఆనందం కలుగుతుంది. ఆకస్మికంగా కలిగే ఆనందానుభూతి వల్ల నవ్వు వస్తుంది. మనము ముందుగా ఊహిస్తాము కాని దానికి బదులుగా చివరలో అనుకున్నదానికి వ్యతిరేకంగా జరిగితే, ఆశ్చర్యం పుట్టి నవ్వు వస్తుంది.

"ప్రజలు క్రిక్కిరిసిన బస్సెక్కి ముందున్న
చెలువ మీద తులువ చేయు వేసె
ఆమె యతని భార్యయగుట పండ్లికిలించె;
సజ్జనాను రక్తి జాను సూక్తి"

ప్రస్తుత పరిస్థితులను గమనించి చూస్తే కొందరు పురుషులు ప్రక్కన ఉన్న భార్యను పట్టించుకోకుండా వేరొక స్త్రీలను చూస్తు కాలక్షేపము చేస్తుంటారు. పురుషుడు పరాయిస్త్రీతో శారీరక సంబంధం పెట్టుకోవడమే పాపము కాదు, పరాయిస్త్రీని మోహపు చూపుతో చూడడం కూడా పాపమేనని నీతియుక్తమైన విషయాన్ని తెలియజేయడానికి కవిగారు నవ్వును పుట్టించే విధంగా "ప్రజలు క్రిక్కిరిసిన బస్సెక్కి ముందున్న స్త్రీ మీద పురుషుడు చేయి వేసే తీర చూస్తే ఆమె అతని భార్యయగుట వలన అతను ఏమిచేయలేని పరిస్థితులలో ఆమెను చూసి పండ్లికలించెను. కవి వర్ణించిన విధానము కన్నుకు కట్టినట్లుగా ఉండడం వలన మనకు కూడా నవ్వు కలిగిస్తుంది. ఇదే విషయాన్ని మన ఏనుగు లక్ష్మణ కవిగారు తన సుభాషిత రత్నవలిలో గంభీరంగా ఇలా అంటున్నారు. "కులశీల వివేకంబులు.... నందాకనంత నిలువంగలవే" అనే పద్యములో మన్మదాగ్నిలో ప్రవేశించినంతకాలం జ్ఞానం, శీలం నిలుస్తాయి. ఆ వ్యామోహంలో చిక్కుకుంటే పూర్ణ పురుషుడు కాస్తా శూన్య పురుషుడవుతాడని పరస్త్రీతో సంబంధం మంచిదికాదని మనసుకు హత్తుకొనే విధంగా వివరిస్తే మన కవి హాస్యస్పందముగా భర్త వెక్కిరి చేష్టలు భార్యకు తెలిస్తే ఆమె యెదుట పండ్లికడిచడం తప్పితే ఇంకేమి చేయలేరని విషయాన్ని పురుషులు గ్రహించి వారి ప్రవర్తనను జాగ్రత్తగా చూసుకోవాలని సున్నిహితంగా నవ్వును పుట్టించే విధంగా తెలియజేశారు.

"అసలు పిచ్చికోతి, ఆపైన కల్లావె,
తోక తేలు గుట్టి త్రొక్కి నిప్పు
కుప్పిగంతులేసె కోపిష్ఠి విధమున

సజ్జనాను రక్తి జాను సూక్తి"

సందర్భ శుద్ధిలేని సంభాషణలో ఉండే వికృతి, నవ్వుకు కారణం అవుతుందనట్లుగానే జాన్ కవిగారు కోపిష్ఠయైన వ్యక్తి గురించి ఇలా అంటున్నారు. అసలే పిచ్చికోతి ఆపైన కలుత్రాగింది. తోకకు తేలు గుట్టింది. అంతమాత్రమే కాకుండా నిప్పుకూడా త్రొక్కి కుప్పిగంతులు వేసేవానిగా ఉంటాడు. కొందరి వ్యక్తులకు కోపం సంభవించినప్పుడు సందర్భ శుద్ధిలేని సంభాషణతో వికృతి రూపంగా ప్రవర్తిస్తూ ఏమి చేస్తారో ఏమి చెప్తుతారో వారికే అర్థం కాకుండా ప్రవర్తిస్తూ ఉంటారు. అలాంటప్పుడు కూడా మనకు హాస్యం కలుగుతుందనే విషయాన్ని కవిగారు చక్కగా వివరించారు.

కవి ఎన్ని కావ్యాల్లో వ్రాసినా అతని ప్రతిభకు గీటురాయి నాటక రచనే అన్న అభిజ్ఞుల మాటను దృష్టిలో పెట్టుకొని మల్లవరపు జాన్ కవిగారు తన తొలి ప్రయత్నమే మరపురానిదిగా నిలిచి పోవడానికి నాటక రచననే ఎంచుకొన్నారు. ఇది ఒక విధంగా సాహసమనే చెప్పాలి. అందులోను విషాదాంత వస్తువును ఎన్నుకోవడము దానిలోనే హాస్యని పండింపజేయడం ఒక గొప్ప విషయం. ఈయన వ్రాసిన నాటకమైన సాంసను – దెలీలా మూలము పరిశుద్ధ గ్రంధములోని పాత నిబంధనలో న్యాయాధిపతులు అన్న గ్రంథములో 13,14,15,16 అధ్యాయంలో ఉంది. ఫిలిష్తీయులకు, ఇశ్రాయేలీలకు బద్ధవైరము ఫిలిస్తీయుల అధికార బలముతో ఇశ్రాయేలీయులను ఆక్రమించి వారిని చిత్రహింసలు పెడతారు. వారి ఆస్తులను దోచుకుంటారు. వారి దాస్య విమోచన కోసము యెహోవా దయవలన ఒక ఇశ్రాయేలీల స్త్రీకి సాంసను అనే బలశాలి పుడతారు. అతడు వైశ్యలోలుడై చివరకు ఫిలిస్తీయులను తుదముట్టించి తాను చనిపోవడము ఇందులోని కథ దీనిని కవి 5 అంకాల నాటకంగా రచించాడు. ఇందలి కథ సంగ్రహంగా ఇలా ఉండంగా కవిగారు మూలములోని పేర్లులేని పాత్రలకు, తాను సృష్టించిన పాత్రలకు తెలుగు పేర్లు పెట్టి నాటకానికి తెలుగుదనము తెచ్చారు. మూలంలో మనోహ, అతని భార్య, సాంసను ఫిలిస్తీయుల కుమార్తె (అంటే సాంసన్ భార్య) ఆమె తండ్రి దెలీలా పాత్రలు మాత్రమే ఉన్నాయి. కథా గమనము సాఫీగా నడవడానికి జాన్‌గారు క్రైస్తవుల మనోభావాలకు అనుగుణమైన కొన్ని సహాయ పాత్రలను సృష్టించారు. అవి ఫిలిస్తీయుల రాజు, మంత్రి, సత్యవాది, మంగలి లింగన్న, ఇద్దరు పౌరులు, ఇద్దరు సర్దారులు.

నాటకంలో ఉత్తమ పాత్రలకే శిష్టవ్యావహారిక భాషకు దగ్గరగా ఉన్న సులభ గ్రాంధిక భాష వుపయోగించబడింది. నీచ పాత్రలకు జీవత్వము గల గ్రామ్య, భాష ప్రయోగింపబడింది. ఇది నాటకాన్ని సామాజికులకు మరింత చేరువ చేసింది. మంగలి లింగన్న పాత్ర స్వభావము మాటతీరు అతని మాటలలోని పలుకుబడులు సజీవంగా కన్పిస్తాయి. అతని హాస్యము గిలిగంతలు పెడుతుంది.

మంగలి వాళ్ళమంటే ఈనాటి అలుసైపొయ్యాంగాని, రాజ్యం పాలించే రాజులకు, మాకు తప్ప కత్తిచేతపట్టగల నిబ్బరం ఎవడికుంది? పూర్వం మేము మారాజులతో సరితూగే వాళ్ళం నిజంగా చెప్పాలంటే గొప్పతనమంటే మాదే! ఎంత గొప్పోడితలైనా నా యెడమచేతి కిందకి రావాల్సిందే గదా! పూర్వం మా తాత మారాజుగారికి తలగొరుగుతుంటే కత్తిపిడి కాస్త సళ్ళుబోయిందట అప్పుడు మాతాత యేంజేశాడో! తెలుసా మా రాజు గారి తలపై కటిక్కుమని కత్తిపిడి తట్టి బిగించుకొన్నాడంట. ఆ కత్తి పిడిపోటుతో ఎన్నాళ్ళనుంచో మా రాజుగోరుకున్న పార్శపు తలనొప్పి మాయమై పోయిందట. ఆ దెబ్బతో మా తాతకు గొప్ప పేరొచ్చింది. మారాజు

గారి తలపోటు మరలా కనపడకుండా పోయినందుకు మా తాతను మెచ్చుకొని పదెకరలా మాన్యం పారేశాడంట మాతాత పేరు ప్రతిష్ఠలు విన్న పార్శ్వపుతల నొప్పొళంతా మాయింటి ముందు చీమల బారులాగా తిరుగుతుండే వాళ్ళు.

అయితే! మారాజు గారిచ్చిన మాన్యమిప్పుడుందా! లేదు మాయబ్బ హాయంలో కల్లమ్మే కనక దుర్గమ్మకు తాగుడు కింద జమ కట్టేశాడు. లేకుంటే ఇట్టా ఉండే వాడినా? పొది చేత బట్టేవాడినా! అంటూ లింగన వారిగొప్పతనం చెప్పుతూ హాస్యన్ని పండించారు.

భటు దొరకు 'లింగన్నా బొత్తిగా కనబడ్డం లేదు. ఏం చేస్తున్నావు' అని అడిగాడు అప్పుడు లింగన్న జవాబు చూడండి.

"లింగన్న: ఓ.... రాజభటులా! దండాలయ్యా! అప్పుడే గుడ్డిదనం వచ్చేసిందా! కనబడ్డ లేదంటున్నావు కండ్లు వైదుకుడికి కన్నా చూపించక పోయావా?[1]

అని అమాయకంగా హాస్యం పండిస్తాడు. వెంటనే మరలా పొదస్తమానం నీకు కనబడతా వుంటే పొట్ట జరగొద్దా అని అంటాడు. ఈసారి భట్టుడు పొట్టపెరగొచ్చు లేదా తరగొచ్చు కానీ జరగడం నేను కూడా చూడలేదని ఇంకాస్త హాస్యాన్ని రంగలించాడు. ఇలా తెలుగు నుడికారము మీద జాన్‌గారు పండించిన హాస్యము కితకితలు పెడుతుంది. భాషాభిమానము కలిగిస్తుంది. భాష గొప్పతనాన్ని తెలుపుతుంది.

## సమ్మెట ఉమాదేవి గారి 'మనసు నిండింది' కథ – హాస్యం

**కె.పుణ్యవతి**
పరిశోధక విద్యార్థిని,
ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయం,
గుంటూరు – 522 510.
చరవాణి: 8500035719

**వికృతాకార వాగ్వేష చేష్టా దేర్నర్త కార్ట్సవేత్**
**హాస్యోహాసః స్థాయిభావః**

అన్నాడు సాహిత్య దర్పణకారుడు దీనివల్ల మన పూర్వులు మూడు రకాల హాస్యం వున్నట్లు చూపారని వ్యక్తమవుతున్నది. వికృతాకారమూ, వికృతమైన వాక్కు, వికృతమైన చేష్టా హాస్యాన్ని పుట్టిస్తది. ఆకార చేష్టాదుల వల్ల జీవించేది బహిరమైనదనీ, వాక్కువల్ల జనించేది అంతరమైనదని చెప్పవచ్చు.

హాస్యము అనేది జీవితములో చాలా ప్రధానమైన రసం. హాస్యము అనగా వినోదం కలిగించి నవ్వు పుట్టించే లక్షణం కలిగిన ఒక భావానుభవం. దైనందిన జీవితంలోను, సినిమాలోను, సాహిత్యంలోను, వ్యక్తుల వ్యవహారంలోను హాస్యం ఒక ముఖ్యపాత్ర కలిగి ఉంటుంది. మనిషి ఈ భూమ్మీదకు వచ్చేటప్పుడు ఏడుస్తూ వస్తాడు. వెళ్ళేడప్పుడు అందరినీ ఏడిపించి వెళ్తాడు. ఈ మధ్య ఉన్న జీవితంలో తనకు కావలసిన ఆనందాన్ని వెతుక్కోవడానికి మనిషి సాహిత్య సృష్టి చేశాడు. ఆధునిక సాహిత్యంలో హాస్య ప్రాధాన్యత పెరగడంతో ఈ కాలపు రచయితలు తాము చెప్పదలచిన విషయాన్ని సున్నితంగా, సరసంగా, ఆకర్షణీయంగా చెప్పడానికి తమ రచనలకు హాస్యాన్ని జోడిస్తున్నారు. రచయిత్రి సమ్మెట ఉమాదేవి కూడా కొన్ని హాస్య కథలను వినూత్న పద్ధతిలో రచించారు. అందులో ఒకటి 'మనసు నిండింది' కథ.

శ్రీమతి సమ్మెట ఉమాదేవి ఖమ్మం జిల్లా, కామేపల్లి మండలంలోని భాసిత్ నగర్‌లోని జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాలలో ఆంగ్ల ఉపాధ్యాయురాలిగా పనిచేసి ఇటీవలే పదవీ విరమణ పొందారు. ఇప్పటి వరకు ఆమె దాదాపు 100 కథలు పైగా రాశారు. కొన్నింటికి బహుమతులు పొందారు. ప్రస్తుతం పత్ర సమర్పణకు ఆమె రచించిన 'జమ్మిపూలు' కథా సంపుటిలోని 'మనసు నిండింది' కథను స్వీకరించడం జరిగింది.

ఈ 'మనసు నిండింది' కథలో రచయిత్రి ప్రమేయం ఉండదు. పాత్రలకు పేర్లు ఉండవు. పూర్తిగా ఒక ప్రయోగ పూర్వకంగా వ్రాయబడింది. ఈ కథ సంక్షిప్తంగా చెప్పాలంటే ఇద్దరు తండ్రీకొడుకులు ఉంటారు. తండ్రి భిక్షమెత్తుకొని జీవనం సాగిస్తుంటాడు. వారి కుటుంబమంతా కూడా అదే వృత్తిలో ఉంటారు. అయితే అతని కొడుక్కి మాత్రం భిక్షమెత్తుకొని జీవించడం ఇష్టం ఉండదు. ఒకరోజు అతను తండ్రి దగ్గరకు వెళ్ళి "బాపూ నాకు చదువుకోవాలని ఉంది. నేను భిక్షమెత్తుకోను. నన్ను సర్కార్ బళ్ళో చేర్పించు" అని అడుగుతాడు. తండ్రి అందుకు ఒప్పుకోకుండా ఎన్నో కారణాలు చెప్పనప్పటికీ చివరకు

కొడుకు తన తండ్రిని ఒప్పించి బడిలో చేరతాడు. అయితే ఈ క్రమంలో ఆ తండ్రికొడుకుల మధ్య సాగే సంభాషణలతోనే కథంతా నడుస్తుంది.

రచయిత్రి ఈ సంభాషణలకు హాస్యాన్ని జోడించి తెలంగాణా మాండలికంలో కథను కొనసాడించారు. ఈ కథలో కొడుకు తండ్రి వద్దకు వచ్చి తనను సర్కారోళ్ళ బళ్ళో జేర్పించమన్నప్పుడు తండ్రి...

"అరె వారి .... మా తాత, ఏంజేసేటోళ్ళో ఏరికేనారా?", నవాబు తరీక అడుక్కుదినేటోళ్ళు" అని చెప్తాడు. ఆ మాటలకు "నవాబులు అడుక్కుతింటరా ఏద్నన్న" అని అడుగుతాడు కొడుకు.

"లేకుంటే బండ గొట్టి సంపాదిస్తారనుకున్నావురా... కాకుంటే మనుషులను బెట్టి అడిగిపెంచే టోళ్ళు" పన్నులని అదని... ఇదని అడుక్కుదినేటోళ్ళు... లేకుంటే ఆడకేడ నుంచి వస్తయిరా పైసల్" అని భిక్షగాళ్ళే కాదు నవాబులకు కూడా అడుక్కుదింటేనే పైసలు వస్తాయని చెప్తాడు. అంతే కాకుండా ఎలక్షన్ల సమయంలో రాజకీయ నాయకులు ఓట్లు అడుకుంటారని, కాలేజీల్లో సదివినోళ్ళు నౌఖరి కోసం, కొలువు కోసం, వాళ్ళనీ, వీళ్ళని అడుక్కుంటారని చెప్పే సందర్భంలో మనకు హాస్యం కనిపిస్తుంది.

మరి అక్కలేం జేస్తరు బాపు? అని కొడుకు అడిగినపుడు తండ్రి....

"ఏం జేస్తరురా అడుక్కుదింటారు. నీ తీరు ఆవారాగాని లెక్క తిరుగుతరనుకున్నావా ఏంది? మనకన్నా నయమే ఆళ్ళకు సిన్నప్పటి సంది మంచి పాటలు నేర్పింది మీ అవ్వ. ఆళ్ళు మంచిగరాగం దీసి పాడ్తుంటే మస్తు పైసలేస్తరు" అని చెప్తాడు.

"మరి బావలేంజేస్తరు?" అని అడుగుతాడు కొడుకు. "ఏం జేస్తరురా... ఒగడేమో ఒగకన్ను మూస్కుంట తెరుసుకుంటా బసిస్టాండుల అడుక్కుతింటాడు, ఇంకోడు నేల మీద దేక్కుంటా చారేమినార్ కాడ అడుక్కుదింటడు. నీ అక్కలు రైల్‌స్టేషన్ల అడుక్కుదింటరు. నీ అన్నలు ఈడ అడుక్కుదింటరు. అడుక్కుదిన అనే బద్మాష్ గాడివి నీ వొక్కడివే అయినా మన కోసం ఎవరు ప్రత్యేకంగా వండిపెట్టడం లేదురా వారు తినగా మిగిలింది పారేయడమెందుకని మనకు పెడ్తున్నారు. పాపం తగలకుండా దేవునికి పూజలు చేస్తే, పుణ్యం వస్తుందని మనకు దానం చేస్తారు. అందుకే దేవుని తరువాత మనమే దేవుళ్ళంతటోళ్ళం అంటాడు." ఇలా భిక్షగాడు తన కూతురు, అల్లుళ్ళ గురించి చెప్పేటప్పుడు, ఆ పాత్రలు మన కళ్ళముందు ప్రత్యక్షమై మనకు నవ్వు పుట్టిస్తాయి.

ఎంతకీ తన మాట తండ్రి చెవిన పెట్టకపోవడంతో కొడుకు "బాపు.... ఎట్లన్న మన బతుకు రోత బతుకులు బాపూ మొన్న ఐలయ్య సచ్చిపోతే ఏంజేసింద్రు... సర్కారోళ్ళు వచ్చి బండ్ల దీస్కబోలేదా... ఆడ ఆళ్ళు ఆ శవాన్ని ఏమి జేసింద్రో....? అని అంటాడు.

"అరె! సర్కారోళ్ళు ఎవరెవర్కి సావులుజేస్తరో ఎర్కనారా? మినిష్టరోళ్ళకు... మన బిచ్చపోళ్ళకి జేస్తరు, సూసినావా మనం గూడా సర్కారోళ్ళంత గొప్పోళ్ళం" అని ఇంకా గొప్పగా చెప్తాడు తండ్రి. ఇలా భిక్షగాళ్ళకు, గొప్ప గొప్ప రాజకీయవేత్తలకు మాత్రమే ప్రభుత్వ లాంఛనాలు జరుగుతాయని చెప్పడంలో హాస్యం జనిస్తుంది.

తండ్రికి ఒక బంగ్లా చూపిస్తూ "నీకు గిట్ల మంచిగా బంగ్లా కట్టాలని ఉండదా? అని అడుగుతాడు కొడుకు ఆ మాటలకు...

"ఎందుకురా బంగ్లా.... నీకు నీ అన్నలకు భాగాలు పంచనా... ఇప్పుడైతే బాపు... అని ప్రేమగ తిరుగుతున్నారు. నువ్వూ, నీ అన్నలు. నా గిట్ల బంగ్లాలుంటే గాప్రేమంతా నా మీదగాదు నా బంగ్లాల మీద ఉంటుండే. గిప్పుడైతే నేను సస్తే అయ్యో! బాపు సచ్చిండు  అని ఏడుస్తరు. నాగిట్ల బంగ్లాలుంటే మా బాపింక ఎపుడు సస్తడా, ఎప్పుడు పంచుకుందామా అని ఎదురు చూసేటోళ్ళు అని అంటాడు.

ఇక తన తండ్రితో వాదించలేనని తెలుసుకుని కొడుకు "నేను పుట్టుడే బిచ్చపోనిగ బుట్టలే బిచ్చపోనికి పుట్టిందానికి నన్ను బిచ్చపోన్నిజేస్తున్నవ్ నువ్వు" అని తండ్రిని కసురుకుంటాడు.

చివరికి కొడుకు పోరు పడలేక తండ్రి ఒకరోజు కూలికి వెళ్తాడు. ఆ రాత్రి భోజనం చేసిన తర్వాత కొడుకు తండ్రితో "ఏంది బాపూ? కష్టమనిపిస్తోందా? నా మీద కోపమొచ్చిందా" అని అడుగుతాడు.

"లేదురా కొడుకాష సేతులున్నయి సెయి జాపి అడుక్కుదింటానికి గాదురా....! సెమటోడ్చి పని జేస్తానికని నాకియ్యాలనే ఎర్కైందిరా....!

"రోజూ అడుక్కుదింటే కడుపు సగమే నిండుతుండే ఇయ్యాల కష్టం జేసి సంపాదించుని తింటే మనిసే నిండిపోయింది. ఇయాల నాకెంతో సంబరంగా ఉందిరా!" అని సమాధానమిస్తాడు.

ఈ విధంగా 'మనసు నిండింది' కథలో తండ్రీ కొడుకుల మధ్య జరిగిన ప్రతి సంభాషణలోను హాస్యము చాలా చక్కగా పడింది. వాస్తవానికి రచయిత్రి సమ్మెట ఉమాదేవి రచించిన కథలలో ఎక్కువ ఆడబిడ్డల కష్టాల కడగండ్లు, శ్రామిక జీవుల బతుకు వెతలు ఎక్కువగా మనకళ్ళ ముందు ప్రత్యక్షమవుతాయి. కానీ ఆమె రచించిన ఈ మనసు నిండింది కథలో పండిన హాస్యాన్ని, కథను నడిపించిన తీరును గమనిస్తే ఉమాదేవి గారు కూడా విభిన్న దృక్పథాలలో రచనలు చేయగల ప్రజ్ఞాశీలి అని తెలుస్తుంది. అలాగే ఆధునిక సాహిత్యంలో పి.యస్.అప్పారావు గారు హాస్యాన్ని గురించి చెప్పినట్లుగా హాస్యానికి లోనైన వారిని చూసి అవహేళన చేయకుండా వారు ఆవిధంగా హాస్యానికి గురి కావడానికి గల ప్రధాన కారణాన్ని గ్రహించి తక్కిన వారు కూడా పరిహాసానికి గురి కాకుండా జాగ్రత్తగా నడుచుకోవాలనే హెచ్చరిక సమ్మెట ఉమాదేవి రచించిన హాస్య కథలలోను కనిపిస్తుంది.

# హాస్యము - పరిణామం

గంగవరపు అశోక్ రాజు,

పరిశోధక విద్యార్థి,

తెలుగు మరియు ప్రాచ్య భాషా విభాగం,

ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయం.

చరవాణి : 9676295097.

ఉపోద్ఘాతం : హాస్యము అనేది జీవితంలో లో చాలా ప్రధానమైన రసం. హాస్యము అనగా వినోదం కలిగించే నవ్వు పుట్టించే లక్షణం కలిగిన ఒక భావానుభవం. హాస్యం అంటే ఏమిటి అది ఎలా సంభవిస్తుంది దాని వలన ప్రయోజనాలు ఇబ్బందులు ఏమిటి అనే విషయాలపై పలు అభిప్రాయాలున్నాయి. దైనందిన జీవితంలోను, సినిమాలలోనూ, సాహిత్యంలోనూ, వ్యక్తుల వ్యవహారాలలోనూ హాస్యం ఒక ముఖ్యమైన పాత్ర కలిగి ఉంటుంది.

## హాస్యం గురించి సిద్ధాంతాలు

హాస్యం ఉత్పన్నమయ్యే పరిస్థితులు

1.అరిస్టాటిల్:- జుగుప్స కలిగించని అందవిహీనత హాస్యానికి ప్రాథమిక ఉపకరణం.

2. టెన్షన్ గా ఉన్న స్థితి నుండి ఆకస్మికంగా ఊరట లభించడం. ఈ ఊరట నిజమైనది కావచ్చును లేదా కేవలం మాటలకే పరిమితమై ఉండవచ్చును.

## నవ్వు - రకాలు

నవ్వులో చాలా రకాలు ఉన్నాయి. మన ప్రాచీనులు నవ్వును ఆరు రకాలుగా విభజించారు.

1.స్మితం

2.హసితం

3.విహసితం

4.అవహసితం

5.అపహసితం

6.అతిహసితం

శ్రేష్ఠులకు స్మిత హసితాలు,మధ్యములకు విహసిత,అవహసితాలు, అనుమతులకు అపహసిత,అతిహసితాలు అని కేటాయించారు. దూషణ లక్ష్యంగా పెట్టుకోక,మర్యాద మరువక ,శృతి మించనీయక చేసే హాస్యమే నిజమైన హాస్యం.

## హాస్యం - భేదాలు

హాస్య భేదాల గురించి ఏ లక్షణ గ్రంథమూ లేదు. అసలు బేధాలు ఉన్నట్లే ఎవరూ గుర్తించలేదు.అలంకారాలలో శబ్దాలంకారాలు,అర్థాలంకారాలు ఉన్నాయి.అలాగే హాస్యం లోనూ భేదాలున్నాయి. వీటిని ఎవరూ గుర్తించక పోవడం వలన మునిమాణిక్యం గారు వాటిని గుర్తించి పరిశీలించి తెలియజేశారు.

శబ్దాశ్రయం :-

వాక్కుగత హాస్యాన్ని శబ్దాశ్రయం,భావాశ్రయం,అర్థాశ్రయం అని మూడు భాగాలు చేశారు మాస్టారు. శబ్దాల కూర్పుతో వికృతి చూపించవచ్చు. ఉచ్చారణలో తేడా,ఇతర భాషా ప్రయోగాలు,అస్తవ్యస్త పదప్రయోగం, అశ్లీల,అసభ్య ప్రయోగం, క్లిష్ట, శ్లిష్ట ,విశ్లథ పద ప్రయోగం వలన వికృతి వస్తుంది. ఇదంతా శబ్దాశ్రయహాస్యం.

భావాశ్రయం:-

భావాశ్రయంలో ఒక మెలిక ఒక వైపరీత్యం,ఒక విచిత్రం,వింత పోకడ, విరోధ భావాలకలయిక, వేర్వేరు అర్థాలు కల మాటలకలయిక వలన భావాశ్రయ హాస్యం వస్తుంది. రసం,కారణం,అలంకారం భావాలు అభాస రూపంలో నవ్విస్తాయి. ఇవి భావాశ్రయ హాస్యంలో అంతర్భాగాలు.

అర్థాశ్రయం:-

జుగుప్స కలిగించనిదీ, రమణీయార్థంతో ఉన్నదీ, అలంకారంతో ఉన్నదీ,ధ్వని వ్యంజకంగా ఉండేదీ, వికార రహితమైనదీ, రసానుభూతి కలిగించేదీ, క్షుద్రభావం లేనిదీ, చిత్తవృత్తికి కారణమైనదీ,ఆనందమే హద్దుగా ఉండేదీ అర్థాశ్రయహాస్యం.అర్థాశ్రయ హాస్యం హృదయానికి సంబంధించినది.ప్రేమ సానుభూతి మొదలైన మానవీయ లక్షణాలకు సంబంధించింది. ఆశ్రయంలో భాగమైన ఉక్తి విశేషాలు నిశితమైన మేధ వలన ఏర్పడినవి. ఈ ఉక్తులు రసభావనా సామర్థ్యం కలవి అంటారు మాస్టారు. కనుక అర్థాశ్రయ హాస్యం హృదయానికి, మేధస్సుకు సంబంధించింది అని తేల్చారు మాస్టారు. అందుకే ఇది అత్యుత్తమ హాస్యం అని విశ్లేషకులు ధ్రువీకరించారు.

## ఆంధ్ర సాహిత్యం - హాస్యం

తిక్కన రచనలో వ్యంగ్యం ఎక్కువ. నర్తనశాలలో స్త్రీ వేషంలో ఉన్న భీముడు కీచకుని తో "నన్ను ముట్టి నీవు చెండి వనితల సంగతికి పోవు వాడవే" అని గూఢంగా అంటాడు. ఇలాంటి వాక్యాలు చిరునవ్వుకి పుట్టినిల్లు అవుతాయి. ఇక ఉత్తరకుమారుని ప్రగల్భాలు తీరా కురు సైన్యాన్ని చూశాక "ప్రాణములు తీపి యన వినవే" అనే అతని గోల బాగా నవ్విస్తాయి. అంతేకాదు "పసులదయ్య మెరుగు పడతుల సంతోషమేల నాకు యనికి జాల నేను" అని రథం మీద నుండి క్రిందికి ఊరికి పరిగెత్తడం కడుపుబ్బా నవ్విస్తుంది.తిక్కన తన పాత్రల చేత నవ్వించిన నవ్వులు లెక్కలేనన్ని. తిక్కన పేర్కొన్న నవ్వుల జాబితా తయారు చేయడం గొప్ప ఆసక్తికరంగా ఉంటుంది.ఇన్ని రకాల నవ్వులు ఉంటాయా అని మనకు ఆశ్చర్యం కలుగుతుంది. అయితే ఏ నవ్వు పాత్రౌచిత్యాన్ని భంగం చేయదు అది విశేషం.

గౌరన నవనాథ చరిత్ర లో పురోహితుడు ఎలుగుబంటి తో సరసాలు ఆడటం, హరిశ్చంద్ర వ్యాఖ్యానంలో కలహ కంఠి, కాలకౌశికుల పోట్లాటలు,రోకళ్ళతో కొట్టుకోవడం విపరీతంగా నవ్విస్తాయి. కేయూరబాహు చరిత్ర లో జంతు

పాత్రౌచిత్యమైన మాటలు, చేష్టలు విక్రమార్క చరిత్రలోని కొన్ని సన్నివేశాలు కొంత హాస్యరస స్ఫోరకాలే.

శ్రీనాధుని హరవిలాసంలో మాయా బ్రహ్మచారి పార్వతిని పరీక్షించాలని వచ్చి ఆమె ఎదుట శివుని నిందిస్తూ, వారి కళ్యాణాన్ని నిరసిస్తూ చేసిన ప్రసంగం " రాయంచ యంచు చీరెక్కు జోకయగుగాక పచ్చి మెనిక తోలు పచ్చడంబు...." వంటి వ్యంగ్యాలు హాస్య రసాన్ని అందిస్తాయి శ్రీనాధునివిగా ప్రసిద్ధి చెందిన చాటు పద్యాలలో కావలసినంత హాస్యం మనకు కనిపిస్తుంది. ఒకసారి పల్నాడుకు వెళ్ళిన శ్రీనాధునికి మంచినీళ్లు కావలసి వచ్చి తన ఇష్ట దైవం శివుణ్ణి ఇలా దబాయించాడట " సిరిగలవానికి చెల్లును తరుణులు పదియారువేలు తన పెండ్లాడన్... తిరిపెమున కిద్దరాండ్రా పరమేశా గంగను విడుము పార్వతి చాలున్..." నీళ్ల కోసం అం ఇలా గడుసుగా విసిరిన చమత్కారానికి ఎంత మాడుపు మొహమైన వికసించిన తప్పదు. శ్రీనాధునిదే మరొక పద్యం "పూజారి వారి కోడలు తాజారగబిందె జారీ దబ్బున పడియన్ మైజారు కొంగు తడిసిన బాజారే తొంగిచూసి ఫక్కున నగియెన్....".

శ్రీనాధుని యుగంలోనే అనంతామాత్యుడు భోజరాజీయము అనే కథాకావ్యం వ్రాశాడు.సున్నితమైన హాస్య రస పోషణలో అనంతుడు సిద్ధహస్తుడు. మూషిక కన్య వృత్తాంతం, ఎండ్రిపిల్ల కాశి యాత్రకు ఉబలాటపడడం హాస్యరసాన్ని చిందించే ఘట్టాలు. బ్రహ్మను హేళన చేస్తూ శివుడు విష్ణువుతో "వింటికదా నీ తనయుని కొంటెతనము ఇటువంటివి పో పెక్కునోళ్ళ వారల మాటల్".. అంటాడు.భక్త కవి పోతన శబ్దాలతో ఆడుకుంటాడు. ఆ శబ్ద క్రీడ మన మనసుని తాకి హాయినిస్తుంది.శ్రీకృష్ణుని బాల్య చేష్టలు మనల్ని నవ్వించి పరవశింపజేసే హాస్య ప్రసంగాలు.

ఇక రాయల కాలం అన్ని రసాలకి స్వర్ణయుగం. తెనాలి రామకృష్ణుడివిగా చెప్పబడే చాటు పద్యాలు హాస్య భాండాగారాలు. ఒక నాడు శ్రీకృష్ణదేవరాయలు సభలో " ధనము లక్కర గల నాటికి దాత కమలగర్భుని విషమే "అని సమస్య ఇస్తే... "నెల నడిమినాటి వెన్నెల యలవడునే గాదెవోయె యమవస నిశికిన్ " అని పెద్దన పూరించాడు. 'అమవసనసికి ' నచ్చని తెనాలి రామకృష్ణుడు హేళనగా "ఏమిటివి సెప్పితివి కపితము బెమపడి నెరి పుచ్చుకాయ నడితిని సెపితో ఉమెతక్కయ తినిసెపితో అమవసనిసికి యనుమాడి అలసని పెదనా!" అన్నాడు వికటకవి... ఈ వెక్కిరింతకు ఆనాటి సభలోని వారికే కాదు మనకూ నవ్వు రాక మానదు. రామకృష్ణకవి అద్భుత కృతి పాండురంగ మహత్మ్యం.అందులో నిగమ శర్మ అక్క మరువలేని తెలుగింటి ఆడపడుచు.దుష్ట సావాసాలు చేస్తున్న తమ్ముడిని బాగుచేయడానికి పుట్టింటికి వచ్చిన ఆవిడ తమ్ముణ్ణి దగ్గర కూర్చోబెట్టుకుని ఎన్నో నీతులు చెబుతుంది.వాడు అన్ని విన్నట్లే విని ఒక రోజు రాత్రి ఇంట్లో వస్తువులు పట్టుకుపోతూ పనిలోపనిగా అక్కగారి ముక్కుపుడక కూడా పట్టుకు చక్కా పోతాడు. తెల్లవారిన తరువాత విషయం తెలిసిన ఆవిడ,తమ్ముడు తన మాటలు తలకెక్కించుకోలేదన్న బాధ కన్నా తన ముక్కుపుడక పట్టుకుపోయాడని గొల్లుమనడం రసాభావమై పఠితల్ని ఫక్కున నవ్విస్తుంది.

రాయలవారి స్వీయుక్తి ఆముక్తమాల్యద,అందులో విల్లిపుత్తూరు విశేషాలు హాస్యాన్ని కలిగిస్తాయి. విల్లిపుత్తూరు చుట్టుపక్కల ఉన్న పొలాల్లో వరిమళ్ళకు కాలువలు తీశారు. ఆ కాలువల నడుమ వేకువ సమయంలో బాతులు తమ రెక్కల సందుల్లో తలలు దూర్చి పడుకున్నాయి. నగర రక్షకులు వాటిని చూసి "తెల్లవారుజామున కాలువకు స్నానానికి వచ్చిన బ్రాహ్మణులు స్నానం చేశాక తమ వస్త్రాలను నీళ్లలో ముంచి తీసి పిండివేసి ఆ తడి ముద్దల్ని అక్కడ మర్చిపోయి ఇంటికి పోయారు" అని భావించి వాటిని వారి వారి ఇళ్లకు చేర్చడానికి రేవులో దిగారు.ఆ చప్పుడుకి చటుక్కున లేచి వేగంగా పరిగెత్తుతున్న బాతులను చూసి వరిపైరుకు కాపలాగా ఉన్న స్త్రీలు నవ్వాలంటే.ఈ భ్రాంతిమదాలంకారం మనల్ని నవ్వించి మానదు.

కళాపూర్ణోదయంలో పింగళి సూరన వైకుంఠంలో నేత్రహస్తుల బెత్తపు దెబ్బలకు జడిసి బ్రహ్మగారె పారిపోయారని చేసిన వర్ణన హాస్యస్ఫోరకమే.క్షీణయుగంలో హాస్యం తన ఔచిత్యాన్ని కోల్పోయిందనక తప్పదు.చేమకూర వేంకట కవి చమత్కారాలు మాత్రం చక్కిలిగింతలు పెడతాయి.

ఇక శతక కర్తలు చాలామంది హాస్య ప్రియులు. తెలుగు వారి హాస్యం శతకాల్లో ఎక్కువగా దర్శనీయమవుతుంది. వేకువలో సున్నితమైన సునిశితమైన హాస్యం ఉంది. మచ్చుకి రెండు పద్యాలు

"కోతిని పట్టి తెచ్చి కొత్త పుట్టము గట్టి

కొండముచ్చు లెల్ల కొలిచినట్లు

నీతిహీనునొద్ద నిర్భాగ్యులుందురు

విశ్వదాభిరామ వినర వేమ"...అన్నా

"పాలసంద్రము నందు పవ్వళించిన హరి

గొల్ల యిండ్లకు పాలు కోరనేల

యెదుటివారి సొమ్ము యెల్ల వారికి తీపి

విశ్వదాభిరామ వినురవేమ"...అన్నా

సునిశితమైన హాస్యం  సంఘజీవనంతో ముడిపడి శాశ్వతత్వాన్ని సంపాదించుకుంది.

ఉన్నంతలో దానం చేయడం, ఇతరులచే దానమిప్పించడం పురుషలక్షణం.అటువంటి వారికే మీసం అలంకారం అంటూ కవి చౌడప్ప చెప్పిన పద్యం వాడిగా వేడిగా హాస్యాన్ని అందిస్తుంది.

"ఇయ్యక ఇప్పించగలడు

అయ్యలకే కాని మీసమందరికేలా

రొయ్యకు లేదా బారెడు

కయ్యానికి కుందవరపు కవి చౌడప్పా..."

ఆడింది సూరకవి 18 లో శతాబ్దంలో విజయనగర రాజుల సంస్థానంలో ప్రసిద్ధి కెక్కిన కవి.ఒకరోజు ఆయన భోజనం చేస్తుండగా ఆయన భార్య ప్రక్కన కూర్చుని విసురుతూ గోముగా " అందరి మీదా పద్యాలు చెప్తున్నారు కదా? మన అబ్బాయి బాచన్న మీద ఒక పద్యం చెప్పవచ్చు కదా?" అని అడిగింది.తరతమ బేధాలు లేని కవిగారు ఈ క్రింది పద్యంలో భార్య ముచ్చట తీర్చారట.పద్యం విని ఆవిడ ముఖం చిన్నబోయింది.

" బాబా బూచుల లోపల

బాచన్నే పెద్ద బూచి పళ్ళున్ తానున్న

బూచంటే రాత్రి వెరతురు

బాచన్నను జూచి పట్టపగలే వెరతురు."

కవి ఎంత నిరంకుశుడో చూడండి.ఎంత పళ్ళు ఎత్తు అయితే మాత్రం కన్న కొడుకు బూచి కన్నా భయంకరంగా ఉన్నాడని భర్త వర్ణిస్తే ఏ కన్నతల్లి మనసు చిన్నబోదు? అయినా మనకి జాలి కలగకపోగా కవిగారి చమత్కారానికి ఫక్కున నవ్వొస్తుంది.

ఇలాంటి వెటకారపు పద్యాలు,వ్యంగ్య బాణాలు,చతురోక్తులు ఆధునిక తెలుగు సాహిత్యంలో కోకొల్లలు.

వాస్తవానికి ఆధునిక యుగం లోనే హాస్య ప్రాధాన్యత ఆంధ్రులకు బాగా తెలియవచ్చిందనవచ్చు.ఇంగ్లాండ్, ఫ్రాన్స్, అమెరికా దేశాలు హాస్యానికి నెలవు కాగా ఆయా దేశాల్లో పుట్టిన సాహిత్యంలో హాస్యం రాజ్యమేలింది. ఆంగ్ల భాషతోనూ ఆ సాహిత్యంతోను భారతీయులకు పరిచయమేర్పడ్డాక మన సాహిత్యంలో కొత్త ప్రక్రియలు ఏర్పడ్డాయి. ఎక్కడ మంచి ఉన్నా గ్రహించి సాహిత్యం ద్వారా పఠితలకు అందించాలనే తపన మన కవులకున్న సుగుణం.అలాగే మార్క్ ట్వేయిన్, డికెన్స్, మొలియర్ వంటి హాస్య వేత్తల మార్గంలో ఒకరిద్దరు తెలుగు రచయితలు హాస్యాన్ని అందలమెక్కించే ప్రయత్నం చేశారు.

ఆధునిక యుగంలో సుప్రసిద్ధులైన కవి,రచయిత కీ.శే. చిలకమర్తి వారు హాస్య ధోరణిలో పకోడీలను వర్ణిస్తూ పద్యాలు చెప్పారు వాటి సారాంశం...

'కోడి'తినని శాకాహారులకు వాని రుచిలో సమానమైన 'పకోడీ' ని బ్రహ్మ సృష్టించాడు. పెళ్ళిళ్ల సమయంలో అక్షింతల వాడుక ఎక్కువగా ఉంటుంది కదా. పూజకి, ఆశీర్వచనానికి,తలంబ్రాలకి ఇలా చాలా చోట్ల వాడతారు. అయితే మంగళప్రదమైన ఈ అక్షింతలు తలమీద నుండి క్రిందికి పడుటచే కాళ్ళక్రింద పడి నలిగి పోతుఉంటాయి. కాబట్టి అక్షింతలకు బదులుగా మనం పకోడీలను వాడితే వచ్చిన వాళ్ళు వాటిని తొక్క కుండా జాగ్రత్తగా తింటూ హాయిగా కూర్చుంటారని,పెళ్లి పీటల మీద కూర్చున్న వధూవరులకు పకోడీల దండ వేయిస్తే వాళ్ళు ఆ ఘుమఘుమలను ఆఘ్రాణిస్తూ అవకాశం వస్తే ఒకటి రెండు నములుకుంటూ కాలక్షేపం చేస్తారని ఆయన సూచన హాస్యరసాన్ని పుష్కలంగా అందిస్తుంది.

అభ్యుదయ కవిగా, విప్లవ కవిగా ప్రసిద్ధి కెక్కిన శ్రీశ్రీ కూడా తన శతకాల్లో అక్కడక్కడ హాస్యాన్ని మెరిపించారు.

"దయ్యాలను చూపిస్తా

నయ్యారమ్మనుచు నొక్క ఆసామి నా

కయ్యో తన కూతుళ్ళను

చెయ్యూపుచు పిలిచి చూపె సిరిసిరిమువ్వా".

ఇక పేరడీ అనేది ఫక్కున నవ్వించే ప్రక్రియ "అప్పిచ్చువాడు వైద్యుడు" అనే పద్యానికి శ్రీశ్రీ పేరడీ ప్రసిద్ధమైనది.

"ఎప్పుడు పడితే అప్పుడు

కప్పెడు కాఫీ నొసంగ గలిగిన సుజనుల్

చొప్పడిన యూరకుండుము

చొప్పడకున్నట్టి యూరు చొరకుము మువ్వా"

శ్రీ శ్రీ రాసిన ' ఏ దేశ చరిత్ర చూసినా ' కవితకు మాచిరాజు దేవీప్రసాద్ గారి పేరడీ...

" ఏ రోడ్డు చూసినా ఏమున్నది గర్వ కారణం

రహదార్ల చరిత్ర సమస్తం ధూళి దోస పరివ్యస్తం."

## ముగింపు

కీ.శే. భమిడిపాటి, మొక్కపాటి, మునిమాణిక్యం గారు తెలుగులో హాస్య కవిత్రయం. మునిమాణిక్యం గారి కాంతం

కథలు, మొక్కపాటి వారి ఇ బారిష్టర్ పార్వతీశం చిలకమర్తి వారి ప్రహసనాలు పానుగంటి వారి సాక్షి వ్యాసాలు ఇలా ఎన్నో రచనలు హాస్యరసాన్ని పండించాయి అయితే మన కవులు రచయితలు తమ రచనలు ప్రధానమైనవి అయినా వాటికి సాంఘిక ప్రయోజనం ఉండాలని లక్ష్యంతో హాస్యాన్ని హద్దుల్లోనే ఉంచారు మన నైతిక విలువలు హాస్యం పేరుతో దెబ్బతినకూడదని భావన సుమారు పాతిక సంవత్సరాల క్రితం వరకు ఉన్నదని చెప్పవచ్చు.

ఆమోదయోగ్యమైన హాస్యాన్ని ఆనందంగా అనుభవిస్తేనే ఆహ్లాదం ఆరోగ్యం.

కీ.శే.జంధ్యాల వంటి రచయితలు హాస్యాన్ని అంగి రసంగా ఎన్నో రచనలు చేశారు. అగ్రస్థానంలో నిలబడ్డారు.ఆరోగ్యకరమైన హాస్యం అన్నివేళలా అపురూపమే. ఆ ఆవశ్యకతను తెలిసికొని నిపుణులైన రచయితలు, కవులు తమ సృజనాత్మక శక్తితో రచనలు చేస్తే గొప్ప సంఘ సేవ చేసినట్టే.

ఇది హాస్యరసాన్ని గూర్చి కేవలం విహంగవీక్షణం మాత్రమే. పద్యాలతో, వచనాలతో, కవితలతో పరమాద్భుత విన్యాసాలు చేసి పఠితుల్ని పరమానందభరితుల్ని చేసిన ఎందరో హాస్యరస పోషకులు ఇంకా ఉన్నారు. అయినా ఇంకా మరెందరో వస్తేనే సమాజం సుహాసిని అవుతుంది.

అశ్లీల, అసభ్య, అసహ్య, జుగుప్స కలిగించే హాస్యాన్ని వ్యతిరేకించి ,ఆమోదకరమైన ,ఆరోగ్యకరమైన హాస్యాన్ని ప్రోత్సహించాలని ఆకాంక్షిస్తున్నాను.

# చాదస్తపు బ్రాహ్మణుడు జానపద హాస్య కథ

డా. పెనుమాక రాజశేఖర్
తెలుగు ఉపాధ్యాయుడు
మేరీమాత ఇంగ్లీష్ మీడియం స్కూల్
తుళ్ళూరు. ఫోన్: 9493924634

**ఉపోద్ఘాతం:**

జానపద సాహిత్యంలో కథలు చాలా ప్రసిద్ధి చెందినవి. ఆబాలగోపాలాన్ని అలరించేవి కథలే. కథలు గద్య రూపంలో ఉంటాయి కాబట్టి, అర్థమయేందుకు సులభంగా ఉంటాయి. కాబట్టి కథలను పిల్లలు, పెద్దలు అందరూ కోరుకుంటారు. పల్లెటూర్లలో ఉమ్మడి కుటుంబాలలో ఈ కథలకు నాడు పెట్టింది పేరుగా ఉండేవి. కుటుంబంలోని వృద్ధులైన తాతయ్యలు, నాయన్మలు, అమ్మమ్మలు వారి ఖాళీ సమ యాన్ని కుటుంబంలోని పిల్లలతో సరదాగా గడుపుతూ ఉండటం, మధ్యమధ్యలో వారికి నీతితోనూ, విలువలతో కూడిన కథలను చెప్పటం ఆనవాయితీగా వస్తుంది. ఈ కథలు ద్వారా పిల్లలైన వారు చి న్ననాటి నుండే విలువలు పెంపొందించుకుని, సమాజంలో ఉత్తమ పౌరులుగా ఎదిగేందుకు ఉపయోగపడేవి. ఉత్తమ కుటుంబ నిర్మాణంలో జానపద కథలకే ఎక్కువ ప్రాధాన్యత ఉ ంది.

**చాదస్తపు బ్రాహ్మణుడు కథ:**

"అనగనగా ఒక ఊరిలో ఒక బ్రాహ్మణుడు ఉండేవాడు. అతను నిత్యం పంచాంగం చూస్తూ, త న జీవితంలో ఏం జరిగినా దానికి పరిష్కారాన్ని పంచాంగం ద్వారా వెదుక్కుంటూ ఉండేవాడు. అలా ఒక రోజు పంచాంగంలో లెక్కలు చూసుకుంటూ ఉండగా అతని భార్య మంచినీళ్లు ఇవ్వడానికి వచ్చింది. ఆ బ్రాహ్మణుడు నీళ్ళు తాగుతున్న సమయంలో భార్య గట్టిగా తుమ్మటం వల్ల ఆమె నోటి తుంపరలు కొన్ని బ్రాహ్మణుడి నోటిలోపడ్డాయి. దాంతో ఆయన ఒక్కసారిగా ఛీదరించుకుని ఆ దోషా నికి పంచాంగంలో ఏం పరిష్కారముందో అని చూశాడు. చూడంగా, చూడంగా గంగానదిలో మూడుసార్లు మునగాలి అని ఉంది. అయ్యో! పెద్ద పనే పడింది అనుకుని, భార్యను నాలుగు తిట్టి మ ూటాముల్లె సర్దుకుని కాశీకి ప్రయాణమయ్యాడు.

చాలా దూరం ప్రయాణించాక పొద్దుపోయి, చీకటి పడటంతో ఏదైనా పూటకూళ్ళ వారి ఇంటికె ళ్ళి తిని, విశ్రాంతి తీసుకుందామని వెళ్ళాడు. అక్కడ ఒక పూటకూళ్ళామె ఆయనకు భోజనం వడ్డించి ంది. అంతా తిని చక్కగా బ్రేవ్‌మని తేన్చి, ఆకుముడుస్తుంటే, ఆ స్త్రీ వచ్చి ఆగయ్యా ఆగు! ఆకు ముడ వమాకు, అసలే ఆకులు లేవు. నీ తరువాత తినాల్సిన వాళ్ళు చాలా మంది ఉన్నారు అని అంది. ఆ మాట వినగానే బ్రాహ్మణుడికి గుండెలో రాయి పడ్డట్లయింది. ఏమ్మా అందరూ ఈ ఆకులోనే తింటు

న్నారా! అని అడిగాడు బ్రాహ్మణుడు. అవునండి నిన్న, ఇవాళ ఈ ఆకే అందరికి అని సమాధానమిచ్చి ంది. అయ్యో! నోటి తుంపరలు పడితేనే సహించలేకపోయాను మరి దీనికేం పరిష్కారముందోనని మ ళ్ళీ పంచాంగం తీసి, పరిష్కారం కోసం వెదికాడు. దానిలో ఇలాంటి సమస్యకి ఆరుసార్లు గంగలో మ ునగాలి అని రాసి వుందంట. ఇందాక మూడుసార్లు, ఇప్పుడు ఆరుసార్లు మొత్తం తొమ్మిది సార్లు ము నగాలి అని అనుకుంటూ ఈసారైనా జాగ్రత్తపడాలని అనుకుంటూ వెళ్ళాడు.

మరి కొంత దూరం వెళ్ళంగా వెళ్ళంగా మరొక ఊరు చేరాక ఆ ఊరిలో మళ్ళీ ఆకలేసి పూటక ూళ్ళ వారి ఇంటికి వెళ్ళాడు. ఎందుకైనా మంచిదని అక్కడ అరటి ఆకులు సరిపడా ఉన్నాయో, లేదో, ఎందుకైనా మంచిదని అని తనే ఆకు తీసుకొచ్చుకున్నాడు. చక్కగా ఆమె వడ్డించిన ఆహారపదార్థాలు అన్నీ తిన్న తరువాత తాంబూలం వేసుకుంటే బావుంటుందని, అక్కడ స్త్రీని పిలిచి వక్క ఉందా అని అడిగాడు. ఆ పూటకూళ్ళామే ఒక పోక చెక్కను తెచ్చి ఇచ్చింది. దానిని బ్రాహ్మణుడు గట్టిగా కొరకగానే ముక్కలైంది. దానిని చూసి ఆ స్త్రీ 'అబ్బా పంతులు గారు మీ పళ్ళెంత గట్టివండి..... ఇప్పటికి ఎంతో మంది దానిని కొరికారు కాని ఎవరికీ నలగలేదు. కాని మీరు కొరకగానే నలిగింది' అని అనగానే బ్రాహ్మణుడు ఆశ్చర్యపోయాడు. ఛీ! అంటే దీనిని అం దరూ కొరికారా? అని అడిగాడు. అవునండీ, వేరే ఇంకేమీ లేవు అని అంది.ఛీ ముదనష్టపుదాన ఎం త పని చేశావే! అని తిట్టుకుని మళ్ళీ పంచాంగంలో దీనికేమైనా పరిష్కారం ఉందో, లేదోనని చూశా డు. దీనికి ఏడుసార్లు గంగానదిలో మునగాలని రాసి ఉండటంతో అవీ, ఇవీ లెక్కలేసుకొని బయల్దేరా డు.

ఇంకొంచెం దూరం వెళ్ళాక మళ్ళీ ఆకలేసి, ఈ సారి పూటకూళ్ళ వాళ్ళను నమ్మరాదని తనే స్వ యం పాకం చేసుకునేందుకు కావల్సిన సరుకులు తెచ్చుకున్నాడు.వండుకోవటానికి పాత్రలు లేక దగ్గ ర్లో ఒక ఇల్లు ఉంటే అక్కడికి వెళ్ళి ఒక స్త్రీని పిలిచి పాత్రలు అడిగి తీసుకున్నాడు. ఆ ఇల్లాలు ఆ ఇం టికి కొత్తగా వచ్చిన కోడలు.

ఈ బ్రాహ్మణుడు అన్నం వండుకుని తిని, పాత్రలు తిరిగి ఇచ్చే సమయానికి అక్కడ అత్త కోడలి ని పిలిచి, కోడలా! ఇక్కడ కుక్కల కోసం వాడే గిన్నెలు ఏవని అడిగింది. ఆ విషయం అనుకోకుండా విన్న ఆ బ్రాహ్మణుడికి మళ్ళీ గుండె జారిపోయింది. ఛీ ఛీ ఎంత పని చేశావమ్మా! అని అనుకుని దా నికి దోష నివారణ చేసుకోవడానికి పంచాంగం చూశాడు. ఈసారి 9 సార్లు మునగాలని వ్రాసి ఉండ టంతో మొత్తం అన్నీ లెక్కించుకుని గంగానది చేరాక దానిలో మునిగాడు. అన్నిసార్లు మునిగి లేచేసరి కి నడుం పట్టేసి, మళ్ళీ దానిలో నుండి లేవలేకపోయాడు. చివరికి బ్రాహ్మణుడు నదిలోంచి బయటకు రాలేదు.[1]

**విశ్లేషణ :** సమాజంలో ఆచారాలు, మడికట్టు సాంప్రదాయాల పేరుతో ఉన్నతంగా జీవిస్తున్న బ్రాహ్మ ణులతో కొందరు వాస్తవికతకు దూరంగా కొన్ని విశ్వాసాలను మూఢంగా అమలు చేసే వారుంటారు.

---

[1] **కథ చెప్పినవారు, విప్పర్ల జయమణి, సాతులూరు గ్రామం, గుంటూరు జిల్లా**

సదాచారం పేరుతో పూర్వీకులు కొన్ని నియమాలను మానవ జీవితానికి విధించినా కాలానుగుణంగా వాటిలో మార్పులు చేసుకోవటం, వాస్తవికతకు దగ్గరగా ఉండేలా చూసుకోవటం అనేది చాలా అవసరం. కాని కొందరు చాదస్తంగా వ్యవహరిస్తుంటారు. అలా వ్యవహరించటం వల్ల ఎన్నో సమస్యలు ఎదుర్కొవాల్సి వస్తుందని ఇలాంటి కథలు హెచ్చరిస్తుంటాయి. అదే సమయంలో తగినంత ఆనందాన్ని, హాయిని తనివితీరా అందిస్తాట. కథలోని పాత్రలను కూడా సందర్భానికి తగిన విధంగా ఎంచుకోవడం అనేది జానపదుల ప్రత్యేకత.

ఈ కథలో హాస్యరస పోషణ చక్కగా జరిగింది. హాస్యరస సంఘటనలు చాలానే దీనిలో కనిపిస్తాయి. తుమ్మటం, తుమ్మినప్పుడు నీటి తుంపరలు రాలటం వంటివి సర్వసాధారణం. ఇటువంటివి మీదపడితే ఎవరైనా ఇబ్బందిపడతారు. అది సర్వసాధారణం. ఇలాంటివి పడితే దానిని విపరీతంగా భావించటం, పంచాంగంలో పరిష్కారం కోసం వెదకటం, చిన్నచిన్న విషయాలకే గంగలో మునగటానికి యాత్రకు పూనుకోవడం వంటివి విపరీతంగా కనిపిస్తుంది.

ఈనాడు కాశీ ప్రయాణం గొప్పేమీ కాకపోవచ్చు. కానీ ఆనాడు అది చాలా వ్యయప్రయాసలతో కూడుకున్నది. అయినప్పటికీ అన్నింటికీ భరించే ప్రయాణమయ్యాడు బ్రాహ్మణుడు. అన్ని రోజులు మనవి కాదన్నట్లు దేశకాల పరిస్థితులకు అనుగుణంగా స్థితులు మారుతుంటాయి. పూటకూళ్ళ వారి ఇళ్లలో జరిగిన సంఘటనలు మనకు హాస్యాన్ని కలిగిస్తాయి. ఒకరి దగ్గర ఒక ఆకే అందరికీ, మరొక చోట ఆ సమస్య రాకూడని బ్రాహ్మణుడు ముందు జాగ్రత్తతో ఆకు తెచ్చుకుంటే, తాంబూలంలో వక్క దగ్గర సమస్య. అందరూ ఎంగిలి చేసిన దానిని తినాల్సి వచ్చింది. ఇవన్నీ కాదని తెలివిగా ప్రవర్తించి, స్వయంపాకం చేసుకోవాలన్న ఆలోచన రావడం ఉత్తమమైనది.

కానీ అక్కడ కూడా చుక్కెదురైంది. కుక్కలకు పెట్టే పాత్రలో వండుకోవాల్సి రావడం నవ్వు తెప్పించే మరొక సంఘటన. కానీ వీటన్నింటికీ పంచాంగంలో పరిష్కారాలు వెతుక్కుని ఖచ్చితంగా ఆచరించే ప్రయత్నం చేయడం అనేది చాదస్తానికి ప్రతీక. గంగానది పవిత్రమైనదే కాని మూడుసార్లు మునగడం ఎంతైనా శ్రేయస్కరం. ఎన్ని దోషాలైనా కడగబడతాయి అనే నమ్మకం జానపదుల్లో కనిపిస్తాం ఐ. అలాంటప్పుడు ఒకసారి మునిగినా ఫలితం లభిస్తుంది. కాని అన్నింటినీ లెక్కించుకుని అన్ని సార్లు మునగటం వల్ల ప్రాణాలు కోల్పోవలసి వచ్చింది.

ఈ కథలో మరో విషయం గమనించాలి. జానపదులు సరి సంఖ్యల కన్నా బేసి సంఖ్యలకు ఎక్కువ ప్రాధాన్యత ఇస్తారు అనే విషయం స్పష్టమవుతుంది. ఇలాంటి కథలు పిల్లలకు హాస్యంతోపాటుగా, నీతిని బోధిస్తాయి. దీని ప్రకారం మనిషికి ఆచారం ముఖ్యమేగాని గుడ్డిగా నమ్మడం, మూర్ఖంగా ప్రవర్తించడం చేయకూడదు వంటి విషయాలు నేర్చుకోగలుగుతారు.

## ఉపసంహారం:

ఇలాంటి ఎన్నో హాస్య కథలు జనపదులలో కనిపిస్తాయి. చాదస్తాలకు పోతే ఎలాంటి నష్టాలు ఎదురావుతాయన్న విషయాన్ని ఈ కథ ద్వారా తెలియజేశారు. జానపదులు చెప్పుకునే చాలా కథల లో ఇలాంటి నీతి, విలువలు ప్రధానంగా కనిపిస్తాయి. తమ భవిష్యత్ తరాలకు మంచి చెడు అనే వి చక్షణను తెలుసుకునేలా జానపదుల కథలుంటాయి.

**ఆధార గ్రంధాలు:**

1. **జానపద సాహిత్యం – హాస్యం - డా. దాసరి రమేష్**
2. **ఆంధ్రుల జానపద విజ్ఞానం – ఆర్. వి. ఎస్. సుందరం**

# జానపద ప్రాణి పాటలు – హాస్యం

డా. దాసరి రమేష్
తెలుగు మరియు ప్రాచ్య భాషా విభాగం
ఆచార్య నాగార్జున విశ్వ విద్యాలయం
నాగార్జున నగర్
ఫోన్: 9951854571

## ఉపోద్ఘాతం:

గ్రామాలలో నివసించే ప్రజలను జానపదులు అంటాం. జానపదులు తమ పనులు చేసుకునేతప్పుడు కానీ విరామ వేళల్లో కానీ చక్కగా పాటలు పాడుకుంటూ ఆనందిస్తారు. వారి మౌకిక సాహిత్యంలో పాటలు, కథలు, సామెతలు, పొడుపు కథలు అనేకం కనిపిస్తాయి. వాటన్నింటిలో పాటలు చాలా రమ్యంగా అనిపిస్తాయి. హృదయాలను ఆకట్టుకునేలా ఆశువుగా దేనిగురించైనా పాడుకోగలరు. వారు పాడుకునే పాటల్లో రసావిష్కరణ ఎక్కువగా ఉంటుంది. ముఖ్యంగా హాస్యం బాగా పండించగలరు. జానపదులు వివిధ జంతువులు, పక్షులను వస్తువుగా స్వీకరించి హాస్యాత్మకంగా పాడగలరు.చెప్పదలుచుకున్న విషయాన్ని సూటిగా,వ్యంగ్యమగా చెప్పగలరు. ఈ వ్యాసంలో అలా కొన్ని ప్రాణులు గురించి హాస్యాత్మకంగా పాడుతున్న విధానం కనిపిస్తుంది.

### కోడిపిల్ల పాట :

కోడిపిల్లను, చేప పిల్లలు వంటి వాటిని తీసుకుని, వాటిలోని స్వభావాన్ని, అమాయకత్వాన్ని చూపిస్తూ, నష్టపోతున్నా సంతోషంగా జీవించాలనే దృక్పథాన్ని అభివృద్ధి చేసేందుకు ఈ పాటను ఉపయోగించినట్లుగా కనిపిస్తుంది. ఈ పాటను నవ్వులాటగా స్వీకరించినా, కొంత విషాదం కూడా కనిపిస్తుంది.

"కుయ్యం కుయ్యంకుమని కోడి కూత మానేసి
కైలాసమేదో పోయినానంటదే – ఆ మాటలంటది ఈ మాటలంటదీ
కోడిపిల్లా .......                    ॥కుయ్యం॥

1. దాన్ని ఇంటెనక్కి తీసుకుపోయి ఈకతోకా పీకుతుంటే
   మంగలి సుబ్బన్న నాకు సవరం చేసెనన్నదే
   ఆ మాటలంటది ఈ మాటలంటది కోడిపిల్ల                    ॥కుయ్యం॥
2. దాన్ని పొయ్యి కాడికి తీసుకుపోయి తిప్పి, తిప్పి కాలుస్తుంటే

చిత్త స్వాతి కార్తెల్లో చలికాగానన్నదే కోడిపిల్ల
ఆ మాటలంటది ఈ మాటలంటది కోడిపిల్ల　　॥కుయ్యం॥

3. దాన్ని పీట మీదకు తీస్కపోయి కాళ్ళు కీళ్ళు లాగుతుంటే
కలకత్తా బొంబాయి చూసివచ్చానంటదే కోడిపిల్ల
ఆ మాటలంటది ఈ మాటలంటది కోడిపిల్ల　　॥కుయ్యం॥

4. చట్టిలోన ముక్కలేసి ఉప్పు కారం జల్లుతుంటే
పునుగు బుక్కాయి పూసుకున్నానన్నదే కోడిపిల్ల
ఆ మాటలంటది ఈ మాటలంటది కోడిపిల్ల　　॥కుయ్యం॥

5. వడ్ల బియ్యం కూడు వండి కూటి మీద కూర వేస్తే
పూలపాన్పు పైన పండుకొన్నానన్నదే కోడిపిల్ల
ఆ మాటలంటది ఈ మాటలంటది కోడిపిల్ల　　॥కుయ్యం॥

6. దాన్ని చేతిలోకి తీసుకుని ముద్ద చేసి మింగుతుంటే
చీకటి కోనేరులన్నీ చూసివచ్చానన్నదే కోడిపిల్ల
ఆ మాటలంటది ఈ మాటలంటది కోడిపిల్ల　　॥కుయ్యం॥"[1]

దీనిలో కోడిపిల్లను వండే రీతిని చూపిస్తున్నా అంతర్లీనంగా కొందరు వ్యక్తులు గొప్పలు చెప్పుకునే రీతిని దెప్పిపొడస్తున్నట్లుగా ఉంటుంది. ఇది మనకు హాస్యరసాన్ని అందిస్తుంది.

**చేప పాట:**

కోడిపిల్ల మీద పాటున్నట్లే చేపను కూడా వస్తువుగా స్వీకరించి పాటను అల్లిన విధానం జాన పదులలో కనిపిస్తుంది. చేప, కోడి రెండూ మాంసాహారానికి ఉపయోగపడేవి, రెండూ శుభ్రపరిచే విధానం కూడా ఇంచుమించు ఒకేలా ఉండటం వల్ల కూడా పేరడీలా కనిపిస్తుంది.

"అట్టట్టమన్నదయ్యో - అలాగుమన్నదయ్యో
ఏందే మట్టగుడిశ - కాదు బొమ్మిడాయి

1. ఇసురొల వేసి నేను - ఇరగదీసి దాన్నిబడితే
బురద కోనేరులోన - బుసలు గొట్టానంటది　　॥అట్టట్ట॥

[1] పి. రామకృష్ణ, సహోధ్యాయి, స్కూల్ స్థాయి, పల్లపట్ల గ్రామం, గుంటూరు జిల్లా

2. రాతిమీనకి దీసకెళ్ళి – కుమ్మికుమ్మి తోముతుంటే
   కోరమేని తాపుడీకి రాటుదేలేనంటదీ　　　　　　　॥అట్టట్ట॥
3. కత్తితోను ముక్కలు గోసి – కూరాకు సట్టినేస్తే
   కుతకుతా ఉడుకు నాకు – కొత్తగాదనంటది　　　　　　॥అట్టట్ట॥
4. పంటికింద దాన్ని బెట్టి పరపరా నములుతుంటె
   కడుపులోన బతికి నేను కతలు జెప్తానంటదీ　　　　　　॥అట్టట్ట॥"[2]

పై పాటలో హాస్యాన్ని అందించే విధంగా చమత్కారంతో కూడిన చేప పొగరుబోరుతనం, అమాయకత్వం కలిసిన విధానం కనిపిస్తుంది. పేరడీ అయినా కైకట్టు అయినా, జానపదులు అలవోకగా చేయగలరనీ దీని ద్వారా గ్రహించవచు.

## నక్కపై పాట:

జానపదులు జంతువులపై కూడా సందర్భానికి తగినట్లుగా హాస్యరసాత్మకంగా పాటలను సృష్టించగలరు. అడవి జంతువుల్లో అతి తెలివికి, దొంగతనానికి ప్రతీకగా కనిపించే జంతువు నక్క. ఆ నక్కను గూర్చి ఇలా పాడుతున్నారు

"నక్క నక్క నీయక్కని దెంగ
పప్పు దోసకాయెక్కడిదే
　　బావ బావ నీకు
　　దండం పెడతా
　　బజారు కోటయ్యదే"[3]

ఈ పాటలో ఒక నక్క దోసతోటలోని దోసకాయలను దొంగిలించి తీసుకెళ్తుంది. దానిని ఓ రైతు గమనించాడు. తన చేలోనివేమోనని అనుమానం వచ్చి అడుగుతున్నాడు. ఆ నక్క తెలివితో వేరే వాళ్ళ చేలోదని చెప్పి తప్పించుకుంది. బూతుపదాలు వాడినా మనకు మాత్రం నవ్వు వస్తుంది

[2] **బతుకుపాట, డా॥ యు. దేవపాలన, పుట.94**

[3] **పాడినవారు : కొడిదెల నాగేంద్రమ్మ, తాడేపల్లి గ్రామం, గుంటూరు జిల్లా**

**ఉపసంహారం:**

జానపదులు కేవలం వీటిమీదనే కాకుండా దేనిమీదైనా పాడగలరు.ఏ రసం పండించాలన ుకుంటారో ఆ రసం ఆవిష్కరించగలరు.జానపదులకు జంతువులతో చక్కని బంధం ఉంది.వ్యవసా యానికి ఉపయోగపడటానకి మాత్రమే కాకుండా పశువులను పోషించటం కూడా చేస్తారు. కోళ్ళను, ఇతర పక్షులను పెంచటం చేస్తారు. వాటితో వారికున్న అనుబంధం వల్ల వాటి మీద పా టలు పాడుకోగలరు. ఇలాంటివి అనేకం కనిపిస్తాయి. వాటిని పరిశోధనల ద్వారా వెలికి తీయాలి.

**ఉపయుక్త గ్రంథ సూచీ**

1. తెలుగు జానపద గేయ సాహిత్యము – బిరుదురాజు రామరాజు
2. బతుకు పాట – డా. యు దేవపాలన

**తెలివిని ఎత్తుకెళిన గాలి దెయ్యాలు**
**జాతీయ సదస్సు**
**(నిర్వహణ)**
**ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయం,తెలుగు విభాగం**

**పత్ర సమర్పణ**

**ఎస్.శివయ్య నాయక్,**
**తెలుగు శాఖాధిపతి,**
**కె.బి.యన్.కళాశాల,**
**విజయవాడ,**
**9949126140.**

**పరిచయం ÷**

తెలుగు వనంలో మూడు పువ్వులు ఆరుకాయలుగా వెలుగొందు సాహిత్య ప్రక్రియ కథ. మౌఖికంగా " కథ " అనే విషయం తెలుగునాట అనాదిగా ఉంటూ వచ్చింది. నవల, నాటకం , కావ్యం పురాణ గాధ వంటి రూపాలలో కథ తెలుగు భాషకు సుపరిచితమే . నవరసాలలో హాస్యం ఒకటి.హాస్యము అనేది జీవితములో చాలా ప్రధానమైన రసం. హాస్యము అనగా వినోదం కలిగించి నవ్వు పుట్టించే లక్షణం కలిగిన ఒక భావానుభవం. నవ్వు ఆనందానికి, ఆరోగ్యానికి సంతోషానికి సంతృప్తికి గుర్తు " నవ్వడం ఒక భోగం నవ్వక పోవడం ఒక రోగం " అనే అక్షరానికి సత్యం చేస్తూ ఇటు కథనుఅటు హాస్యమును జోడించి హాస్య గుళిక పరమానందయ్య శిష్యుల కథలు . అందున " తెలివిని ఎత్తుకెళ్ళిన గాలి దెయ్యాలు "హాస్యకథ ఒకటి.

**తెలివిని ఎత్తుళ్ళిన గాలి దెయ్యాలు – హాస్య పరిశీలన ÷**

క్రొత్తింటిలో దిగాలుగా ఓ మూల కూర్చున్న గురువు గారిని చూసిన శిష్యులకి దుఃఖం ఆగలేదు ఏమైంది గురువు గారు అలా మొగుడు చచ్చిన ముండలా మూలకుచేరిపోయారు.కొంపదీసి మీకు గాని మొగుడు చచ్చిపోయాడావని శ్రవణుడు అడిగాడు. అప్పటికి తేరుకున్న పరమానందయ్య ఓరి అప్రాచ్యులారా ! నేనేమిటి మూల కూర్చోవడం ఏమిటి ? ఏదో భార్య , బిడ్డలు గుర్తుకు రాగా వారి గురించి ఆలోచిస్తుంటే ఏదేదో వాగుతున్నారు. అయినా మగవాడికి మొగుడు ఏమిటి రా బుద్ధిహీనులారా తప్పుడు కూతలు కూయకండి పోండి అవతలకి అని గురువు గదమాయించారు.శిష్యులు నోళ్ళు మూసుకుని బయటికి వెళ్ళి వరండాలో కూలబడి , అయినా మన పిచ్చి గాని మొగుడుచచ్చి గురువు కూర్చుంటే కదా పెద్ద మనసుతో పలకరించాము.ఇకనుంచి ఎక్కడ ఎలాంటి ముండమోపిలపు మనంగా పట్టించుకోవద్దు పలకిరించవద్దు అని

శిష్యులు అన్నారు.

అయితే వారికి తోడుగా పన్నెండుమంది సిపాయిలను కొత్వాల్ పంపెను.గురుపత్ని పేరు సర్వమంగళ ఆమె పేరు మాత్రమే చెప్పారు.అలా ప్రయాణ చేస్తూ చీకటి పడే సరికి ఒక కొండ గుహ ముందుఆగారు. అక్కడ విడిది చేయడానికి శిష్యులు నిర్ణయం చేశారు.తప్పని స్థితిలో సిపాయిలు తలూపారు.సిపాయిలూ ఆ మంతనాలు కట్టబెట్టి తిని నిద్రపోండి దివిటీలు వెలిగఒచవలెను.చీకటిలోపడుకుంటే ఏమ్మృగానికి కనిపించం సిపాయిలు అయోమయంగా చూశారు.సిపాయిలు ఉపాయం చేసి అయ్యా శిష్యులు మీ అంత తెలివైన వాళ్ళం కానీ వారం మాదోక మనవి చుట్టూ కనీసం కొన్ని దివిటీలు పెట్టుకోవాలి లేకుంటే గాలి దెయ్యాలు మీ తెలివిని ఎత్తుకెళ్ళితాయి అప్పుడు మీరు మా కంటే బుద్ధి హీనులు అవుతారు అని చెప్పారు.

ఒక శిష్యుడు గాలి దెయ్యాలకు నా తెలివి అంటే గొప్ప పిచ్చంటా అందుకే దొంగలించుకుపోయాయి మొన్న మా నాయనమ్మ కలలో కనించి ఒరేయ్ సమవర్తి ! నీకు బుర్ర తక్కువ బుద్ధులే మిగిలాయి రా నీ తెలివి దెయ్యాలు పాలయ్యింది అని చెప్పింది. రా వారి మాటలు విన్నసిపాయిలు నవ్వుతుంటే మా తెలివిని తిరుగులేని తెలివితో చెలరేగి పోతాం అని 12 దివిటీలు వెలిగించారు.ముంచుకొస్తున్న నిద్రను ఆపు కొని మరీ చూడసాగారు.ఒక దివిటీచమురులేక ఆరిపోయింది.అంతే వామశ్రవణుడు ఎగిరి గంతేసి నా దివిటీ ఆరిపోయింది.నా తెలివి నాకు ఇచ్చి పోయింది గాలి దెయ్యాం. అని కేకలే పెట్టి ఆనందించు సాగాడు అందరూ వాణ్ణి పట్టుకుని ఓరి పిచ్చోడా ఇలా కేకలు పెడితే ఎలా రా మిగిలిన దెయ్యాలు మా తెలివి వదిలి పోవాలి కదా అని చెప్పారు.

తెల్లవారేసరికి ఒక్కొక్కటి దివిటీలే ఆరిపోయాయి.గాలి దెయ్యాలు మా తెలివిని వదిలిపోయాయి.కాదు కాదు తోకముడిచాయని గర్వంగా చెప్పాడు.శిష్యులు అనిచెప్తున్నా శిష్యులను చూసి సిపాయిలు నవ్వసాగారు ఆకాశం నుంచి ఎవరో మాట్లాడుతున్నట్లు చెట్టు మీద ఆగుహలో సింహిల గుంపు ఉంది.అవి మమ్మల్ని తినాలని ప్రయత్నిస్తే మేము చెట్టెక్కి దాక్కున్నాం.ఈ పంతులు గోలకు అవి గుహలో నుంచి రాలేకపోయాయి.అని చెప్పేసరికి సిపాయిలు భయపడి అక్కడి నుంచి వెళ్ళిపోయారు.మాతెలివికి భయపడి అవి రాత్రంతా గుహలోని తలదాచుకున్నాయి.మేం గొప్పా అని గర్వంగా బదులిచ్చారు పరమానందయ్య శిష్యులు.

చివరికి మధ్యాహ్నం ఓ గ్రామానికి చేరుకునాౖఉ.ఆ గ్రామ నాయకుడు మహామండలాధీశుడు వీరికి స్వాగతం పలికాడు.ఈ విషయం శిష్యులకు చెప్పారు.మేము తినం మా గురువు గారు ఎక్కడ ఎంగిలి పడవద్దు అని చెప్పారు.మాకు సరిపడా తినుబండారాలు మూటగట్టి తెచ్చుకున్నాం ఆతిధ్యం ఇచ్చే వాడు దానశీలి లేదా అని తెలుసుకోవాలి అని చెపారు. ఒక వైపు ఆకలి మరో వైపు ఈ పిచ్చి వారి నిబంధనలు తల తిరిగిపోయింది సిపాయిలకు.

కొంతమంది సిపాయిలు అన్నానికి కూర్చున్నారు.అంతలోని శిష్యులు విచ్చేసి ధనపిశాచి అందర్నీ పీడిస్తూ ఉంటాడు కావున ఇతని ఆతిథ్యం స్వీకరించరాదని చెప్పేసరికి సిపాయిల ఖంగుతిని అయోమయంలో పడ్డారు.నోటిముందు కూడు తీసేస్తున్నారని లోపల బాధపడుతూ జమ్మి చెట్టు క్రింద భోజనం ఆరగించారు.ఏయ్ సిపాయిలు కొంప మునిగిపోయింది. మనలో తినేటప్పుడు ఐదుగురు తక్కువ అయ్యారనగానే సిపాయిలు

బహుశా ఆ మహామండలాధీశుడు విందు ఇస్తానని చెప్పి ఐదుగురిని చంపి ఉంటాడు అని చెప్పారు. ఈ విషయం విన్న సిపాయిలు ఏడ్వాలో నవ్వాలో తెలియలేదు. మనుషుల్ని చంపి ఎవరైనా వండుతారా అని అనుకున్నారు. శిష్యులందరూ ఊర్లో ఉన్నవాళ్ళ అందరికీ వెళ్లి మండలాధీశుడు విందు పెడతానని చెప్పిన ఐదుగురు సిపాయిలనను చంపి వడ్డించాలని చూశారని చెప్పార. ఊరంతా ఏకమైఇంటి మీదకు వచ్చారు. పారిపోతుంటు రచ్చబండ కట్టేశారు. కనిపించకుండాపోయిన సిపాయిలు ఎక్కడ? ఇదే విషయం గ్రామంలో ప్రతి వారు చర్చించుకుంటున్నారు.

ఆ గ్రామం వైద్యుడు వచ్చి విష పాత్రలు విషతుల్యం అవ్వడం వల్ల ఐదుగురు విష ఆహారాన్ని భుజించి ఈ ప్రమాదానికి గురయ్యారు. విషపు పాత్రలో వంటలు వండించడం బాధ్యత లేని మండలాదీశుడు. ప్రాణాలు కోల్పోయిన వాళ్ళం కదా! శిష్యుల చాదస్తం మనకు ప్రాణ దానం చేసింది అని శిష్యులు కాళ్ల మీద పడ్డారు. సిపాయిలు,మహామండలాధీశుడు కూడా శిష్యుల కాళ్ళ మీదపడది జంతువులు కోసం విషాహారం పాత్రలో పెట్టి అది కడగడం మరిచాను అని మహామండలాధీశుడు చెప్పాడు దానికి శిష్యులు ఇకనుంచి నీకు మంచి ఆహారం పెట్టినా ఆ జంతువులు తినవు ఆ నోటా జంతువుల చెవి వరకు వెళ్ళిపోయింది. కనుక నిన్ను జంతువులు నమ్మవు. వాటికంటే ముందు నీ పంటలను నీవు నీ పిల్లలు కలిసి మేసివెయ్యండి ఆ తర్వాత అవి వచ్చినా నచ్చిందా మేము ఏదైనా సలహా ఇచ్చాము అంటే తిరుగుండదు మండలాధీశుడికి మతికిపోయింది. గర్వంగా గత రాత్రి నుంచి తాము గొప్ప తెలివయిన వారు అయ్యామని మురిసిపోయారుపరమానందయ్యగారి శిష్యులంటే సిపాయిలకు ఎనలేని గౌరవం పెరిగింది. ఎందుమననగా వారి అమాయకత్వం తమ ప్రాణాలను కాపాడిననది


<u>ఆధారగ్రంథములు</u>÷

**1. పరమానందయ్య శిష్యుల నూతన హాస్య కథలు.**
**2. తెలుగు సాహిత్య చరిత్ర – డా. ద్వానా శాస్త్రీ.**



<u>పత్ర సమర్పణ</u>
**ఎస్. శివయ్య నాయక్,**
**తెలుగు శాఖాధిపతి,**
**కె. బి. యన్. కళాశాల,**
**విజయవాడ,**
**9949126140.**


********************

# కథాసాహిత్యం లో హాస్యరస పోషణ

Y.BUJJI
LECTURER IN SANSKRIT
GOVT.DEGREE COLLEGE FOR WOMEN
SRIKALAHASTI
9550554154
bujjiyadla91gmail.com

హాస్యం వ్యక్తుల జీవితాలలో ప్రధానమైన రసం .హాస్యము.అనగా మనిషికి వినోదం కలిగించి నవ్వు పుట్టించేలక్షణం కలిగిన ఒక భావానుభావం.మనదైనందిన జీవితం లోనూ,సినిమాలలోను,సాహిత్యంలోను, వ్యక్తుల వ్యవహారాలలోను హాస్యం ప్రముఖ పాత్ర పోషిస్తుంది. నవ్వు అనేది హాస్యా న్ని కలిగించే ఒక ముఖ్య లక్షణం అని "ఎడ్వర్డ్ వాన్ గ్రూజనర్" అన్నా రు. హాస్యా న్ని గురించి కొన్ని సిద్ధాంతాలు ,హాస్యం ఉత్పన్నమయ్యే పరిస్థితులు  గురించి 1.ఒక సందర్భంలో ఉన్న దృక్పదానికి అనుకోని మార్పు సంభవించి(shift in perception or answeఅయిన గాని పాత మూడ్ కు సబంధం కలిగిఉండడం వలన. 2.టెన్షన్ గ ఉన్న పరిస్థితినుండి ఆ కస్మి కంగా ఊరట లభించడం.ఈ ఊరట నిజమైనది కావచ్చు ను లేదా కేవలం మాటలకే పరిమితమైఉండవచ్చు ను. 3.రెండు ఐడియాలు లేదా విషయాలు కలగాపులగం కావడం అయిన వాటిమధ్య అంతరం తో పాటు సంబంధం కూడా మిగిలి ఉండడం. 4.పేరొకరిపొరపాటు లేదా అజ్ఞానం లేదా దుస్థితి పట్లమరొకరు నవ్వి వినోదం పొందడం.ఇందులో ఒకరికి ఇబంధికరమైన పరిస్థితి ఉంటె ఆధిక్యత కనబరచేభావం ఉంటుంది. హాస్యం గురించి "ప్లేటో" ఇలా అన్నా రు(సోక్రాటీస్ చెప్పినట్లుగా)ఒకరిపట్ల వ్యంగ్యంగా పవర్తించినపుడు రెండవవాడు దానిని తిప్పికొట్టలేని పరిస్థితి ఉంటుంది.దానిని అర్థం చేసికోలేకపోవడమే వ్యంగ్యం." అరిస్టాటిల్  కూహాస్యాన్ని గురించి ఇలా అన్నా రు "జుగుప్స" కలిగించని అందవిహీనత హాస్యా నికి ప్రాధమిక ఉపకరణం.

.హాస్యా నికి అసంబద్ధత(incongruity theory)కారణం అని "కాంట్" అభిప్రాయం ఒక నిచ్చి తమైన ఫలితం లేని పరిస్టితి హాస్యం అవుతుందని."henry bergson" విపులీకరించారు. 1.ఈ సిద్ధాంతాలపై అనేక పొడిగింపులు,వివరణలు ఉన్నా యి.2.మోరిఎల్ అను విశ్లేషకుడు ఏక కాలపు కలగాపులగం(simultaneous juxta positions)  హాస్యం అనేఅంశానికిప్రాధాన్యత ఇచ్చా రు.3".లాట్ల"

అనేకాస్త్రజ్ఞులు మాత్రం ఒక పరిస్థితిలో ఒక పజిల్ కు సమాధానం లభించినపుడు కలిగేదృక్పదపు మార్పు హాస్యానికి పద్ధానమైన అంశం అన్నా డు. హాస్యం కలిగించేసందర్భా లు :- 1.హాస్యం పండించేవిషయాలు, 2.భావాలకు,ఉద్వేగాలకు ఆ విషయం అతుక్కు పోవాలి 3.వాస్తవానికి కొంత పోలిక ఉండాలి కానీ వాస్తవం కాకూడదు. 4.అనుకోని మలుపు(surprise,misdirection,contradiction,ambigity or parodox). ఇలాంటి సందర్భా లలో హాస్యా న్ని పండించవచ్చు . హాస్యం కలిగించే సంభాష ణాంశాలు 1.ఉత్ప్రేక్ష 2.అతిశయోక్తి 3.అసంబద్ధత(ఫార్స్ ) 4.సందర్భం మార్పు (reforming) 5.సమయస్ఫూ ర్తి 6.శ్లేష మొదలగు వాటి వలన హాస్యాన్ని ప్రదర్శించవచ్చు. రోవాన్ అట్కిన్సన్(rowan atkinson)అనే పస్రిద్ధ హాస్య నటుడు తన ఉపన్యా సం లో హాస్యా న్ని కలిగించే హావభావాల గురించి ఇలా చెప్పా రు, అసాధారణంగా పవ్రర్తించడం, ఉండకూడని స్థలంలో ఉండడం ఉండకూడని సైజులో ఉండడం. ఈ విధంగా హాస్యాన్ని అనేక రకాలుగా మనము చెప్పుకుంటూ పోవచ్చు.

ఈ విధంగా హాస్యా న్ని పండించడంలో మన తె లుగు కధా సాహిత్యంలో అనేకమంది కవులు ఉన్నారు వారిలో మధురాంతకం రాజారాం ఒకరు.ఇతను తాను సమాజంలో , తాను చూసిన అనేక విషయాలను ఆకళింపు చేసికొని తనకు తెలిసిన వారిని పాత్రలుగా మలచి కధల ద్వారా హాస్యాన్ని పండించినారు. భారతదేశం కధలకు పుట్టినిల్లు. కధను ఒకరు చెప్తుంటేమరొకరు వూకొడుతుంటారు .ఈ కధలను కల్పించి తమకు నచ్చి న పాత్రలను పెట్టుకొని తమకు నచ్చి నట్లుగా కధను మలచుకొని చెప్తుంటారు దీని ద్వా రా మనము ఎంతో హాస్యా న్ని పండించవచ్చు . నవ్వడం ఒకయోగం నవ్వి ంచడం ఒక భోగం నవ్వలేకపోవడం ఒక రోగం అని జంధ్యా ల గారు అన్నట్లు మానవులు ఎప్పుడు నవ్వుతు వుంటే అందంగా ఆరోగ్యంగా ఉండవచ్చు.

ఒకరోజు ఉదయం వేపచెట్టు యొక్క చల్లని గాలులను ఆస్వాదిస్తూ వాసంతి తోటలో క్రోటన్ మొక్కల గుండా సన్నని బాట పైన మెల్లగా నడిచి వెళ్తూ ఉంది. పల్లెటూళ్ళలో నివసించే గ్రామీణులు వేపచెట్టు కింద నడవడం, అలసట తీర్చు కోవడం ఒక మధురమైన అనుభవం అని చెప్పవచ్చు.పభ్రాత వేళ చల్లని గాలులు వీచుచున్నవి.సూర్యో దయం అయినది గాని ఎండ ఇంకా చిటారు కొమ్మలతోను సాధోపరిభాషూలతోను దోబూచులాడుతుందనే చెప్పాలి. తోటలోని రకరకాల పూల మొక్కలు సువాసనలతో చక్కని ఆహ్లాదాన్ని ఉత్సాహాన్నీ కలిగించుచున్నవి కానీ వాసంతికి ఏదోతెలియని కొరత ఉన్నట్టు తోచడమే ఆశ్చర్యము.ఆమెకి కొరత ఎక్కడ ఉందో తనకే తెలుసు.

ఆసమయమున ఆమె వేసుకున్న తెల్లటి చలువ దుస్తులు వాసంతి సౌందర్యా న్ని ఎంతవరకు దాచిపెట్టాలో అంతవరకే దాచిపెడుతున్నా యి.ఆమె అందచందాలను నిలువుటద్దము పస్రుతించని రోజు లేదు.తన స్నేహితులు కూడా ఆమె యొక్క సౌందర్యా న్ని ఉపమాన వస్తువుగా వాడుకొనుచు వుంటారు.కాని ఆ గర్వం కాస్త కర్పూ రంలా కరిగి కాలగర్భం లొ నిలిచి పోయింది. ఎందుకనగా ఆమె బావ తన కోసం వేచి చూసి వేరే పెళ్లి చేసుకున్నా డు.ఒక హెల్త్ ఇన్స్పె క్టర్ తనపై మనసుపడి మజ్జి ల తయారై చేతులు కాలకముందే ఆకులు పట్టుకుని తనకు నచ్చి న అమ్మా యిని పెళ్లి చేసుకుని సంతోషం గా వున్నాడు.వారు మాత్రం ఎంతకాలం తమ హృదయ ద్వా రాల దగ్గర ప్రేమ భిక్ష కోసం పడిగాపులుపడతారు?వంతెన కింది నది పవ్రాహంలా కాలంతోపాటు

మనము వెళ్లిపోవాలి కదా.జీవితం నది లాంటిది.నదికి ఆనకట్టతీసి పంటలు పండించ్చు కోవచ్చు . ఆ పంటను మనము కనుచూపు మేరా సస్యశ్యా మలం చేసుకోవచు.ఆ వ్యు హాలో ఒక పెను తుఫానుల తన మనశ్శా ంతిని ఎక్కు వ పాడుచేస్తుంది అనేభయం వాసంతిని పట్టిపీడిస్తుంది .మనసు చాలా చెడ్డది దానికి హద్దులేర్పరచడం చాలా కష్టం. ఆ సమయమున కాలవగట్టున ఉన్న పిట్టగోడపైకూర్చొ ని ఎప్పు డు చుడనివాడిలా ఆసుపత్రిని పరికించి చూస్తున్న ఒక యువకుడు కనిపించాడు ఆమెకి.అతడు అందంగా ఉన్నా డు.అతనితీరులో హుందాతనం ఉంది.కాని అతనిలో నచ్చనిది గడ్డం.దానికి రెండు మాసాలు వచ్చి ఉండవచ్చు

.వాసంతికినచ్చని వాటిలో ముఖ్యమైనదిగడ్డం. పూర్వం మహర్షులు గడ్డం పెంచుకునేవారంటే అందుకు అడవుల్లో సెలూన్లు లేకపోవడమే కారణమని వాసంతి భావిస్తుంది.గడ్డం చేయించుకోవడానికి నెల నెల సుంకాలు చెల్లించడానికి బద్ధకించడం ఇందుకు కారణమై ఉంటుందేమో.విద్యలో ఎవరికివారేనిపుణులైపోవడానికి వీలుగా షెవింగ్ కిట్లు చౌకగా లభ్యం కావడం ప్రారంభమైన తర్వా త స్వా ములవార్ల చెంపలగుండా సముద్రపు కెరటం పరామర్శించిపోయిన ఇసుక వాలులా శుభ్రంగా ఉండడం నేర్చు కున్నా యి.ఇలాంటి పరిస్థితుల్లో ఒక యువకుడు బిరుతు గడ్డంతో సహజీవనం చేయగలడమే విడ్డూ రంగా ఉంది. వాసంతి డ్యూటీ కి వచ్చి స్టాఫ్ నోట్బు క్ లో సంతకం చేసిన తరువాత తనకు చార్జిఇచ్చి వెళ్తున్న కమలమ్మ రాత్రి అడ్మిట్ ఐన పేషెంట్ గురిఒచి చెప్పి వెళ్ళి ంది.తరువాత వాసంతి వివరాల కోసం రిజిస్టర్ తెరిచి patients వివరాలను చూసి వారిలో ఒకరైన ,పేరు సక్కు భాయి వయసు23 భర్తపేరు చంద్రమో హన్. కాలం లో రాయబడిన పేరుని బట్టిచూస్తే ఈ case ఒక జబ్బు ల గుట్టలా ఉంది.

మూడవ నంబ ర్ బెడ్ దగ్గరకు వెళ్ళీసక్కు భాయి వైపుకు చూసింది. ఆమెదగ్గర చూపరులను ఆకర్షించే లక్షణాలు ఏమి లేవు కాని దూరం నుండి చూస్తె కాస్తఅందంగా ఉంది. పక్కనున్న అతనిని చూస్తే పేరు అందం అన్ని బాగానేవున్నా యి కాని అతనిలో నచ్చనిది గడ్డం ఒక్కటే .వాసంతికి ఒకసారి మూడవ నంబెర్ బెడ్ వైపు చూడాలనిపించి చూసేసరికి ఒక కుర్రవాడు ఆసుపత్రి ఇనుపకమ్మీలనుపట్టుకొని వేల్లాడుతున్నా డు. పేషెంట్ కు మాత్రం BED దొరికింది. సక్కుబాయి భర్త ఒక అరగంట సేపు వాసంతికి కనిపిన్ంచక పోయేటప్పటికి ఇతదు కూడా భార్యను చూడకుండా ఉండగలడనుకోంది. కొద్దిసేపటి అతడు భార్యకు TIFFIN FRUITS పట్టుకొని చకచక నడుచుకుంటూ,FEMALE WARD అని చూడకుండా ఒక వార పత్రిక పట్టుకొని వారి మధ్యనుండి నడిచి వెళ్తున్నా డు.ఆసుపత్రి నిబంధనలను ఏ మాత్రం పాటించకుండా లోనికి వెళ్తున్నా డు.అతని చేతిలో ఉన్న వార పత్రికను చూచి ఈరోజుదేనా అని అడిగింది వాసంతి. అతను అవునండి మా ఆవిడకి వార పత్రికలంటే చాల పిచ్చి అని చెప్పగానే వాసంతికి కోపం వచ్చి తన మనసులో పత్రికలు చదివే అలవాటు ఇతని భార్యకొక్క దానికే ఉంటుంది కాబోలు.

ఇతడెం మనిషి అందం చందం తెలియదు, సభ్యత సంస్కా అంతంత మాత్రమే.చేయిచాచి పేపర్ అడిగిన ఇవ్వలేదు అని తన మనసులో అనుకుని సాయంత్రం 4 గంటలకు DUTY దిగి తన QUARTER కు వచ్చి ంది.తనకు పరాభవం జరిగినట్టు ఆలోచించుకుంటూ ఉంది.అబ్బో రాత్రి మనిషి ఒక ఐదు నిముషాలు

మాట్లాడిస్తే ఎం పోయింది? ఎల్.ఐ.సి. లో ఉద్యోగం చేస్తూ బాగానే సంపాదిస్తున్నా వు.కొరతలేని జీవితం ఉంది కానీ నీకు ఇలాంటి భార్య ఏమిటి?ఇవిడ జబ్బు ఏంటో డాక్టర్లు తేల్చలేకపోతున్నారు.ఎన్ని మందులు వాడిన గురి పెట్టలేని బాణాలేకదా!అయ్యో !పాపం ఎంత కష్టం నీకు వచ్చి నది.ఎవరి బుద్ధివాళ్ళకు వచ్చి ఎవరికీ నచ్చిన జంటను వాళ్ళు ఎన్ను కునేదాక మన సమాజంలో తల్లిదండ్రులు ఊరుకోవడం లేదు.ఆ తొందరపాటు ఫలితం ఇది.జరిగిపోయినదాని గురించి ఆలోచించవద్దు అల ఆలోచిస్తూ కూర్చుంటే మొదటికే మోసం కదా... మగాడిని ఇలా హడలు గొట్టించి దిగులు పుట్టించి చివరకు తామే ఓదార్చా లన్న కోరిక సహజంగా ఆడవాల్లందరికీ ఉంటుందేమో తెలియదుగాని చంద్రమోహన్ ఇలాంటి పస్రంగాన్ని ఇంతవరకు హర్షించగలడు అనే సందేహము వాసంతిది,తరువాత రోజు వాసంతిని చంద్రమోహన్ పలకరించాడు.మీరు పత్రిక కావాలన్నా రు కదండి మా ఆవిడ నిన్న చదివేసింది అని అన్నా డు.

అతని మాట విని కోపంతో ఉన్న వాసంతి పరిచయం ప్రారంభం లో ఉంది అని ఊరుకుంది లేకపోతె ఆ పత్రికను దూరంగా విసిరిపడేసేదేమో! ఆతను బాగా పరిచయం అయ్యేసరికి గతుకులు లేని రోడ్డు మీద పరిగేతుకుంటూ మోటారు బైకు వెళ్లినట్టు చంద్రమోహన్ తో చక్కగా జంకు బొంకు లేకుండా వాసంతి అతనితో మాట్లాడుతూ,అతనితో ఏమండీ నాకు మిమల్ని చూస్తుంటే జాలేస్తుంది అంది. వెంటనే అతను ఆమెతో ఎందుకండి ఇలా అడుగుతున్నారు అన్నా డు చంద్ర మోహన్.ఆమె లేకపోతే ఎంటండి జబ్బు మనిషితో ఎంతకాలం వేగుతారు మీరు.ముసలివాళ్ళు ,అయాలు,నుర్సు లు చేయాల్సి న పని ఇది కాని .మీరు శక్తీ వంచన లేకుండా ఎంతో అవస్థ పడుతు చేస్తున్నా రు మీరు ఈమెను ఆసుపత్రిలో ADMIT చేసారు.ఈమెకు వైద్యం చేయడానికి DOCTORS అందరు ఉన్నా రు. మీరు మరేం పర్వా లేదు అనుకుంటున్నా రు కానీ వైద్య శాస్త్రం రసాధించే విజయాలకు ఒక హద్దు అంటూ ఉంటుంది కదా,అని ఆమె అలా మాట్లాడుతుంటే ఆమెవైపు ఆశ్చర్యంగా చూస్తూ ఇదేంటండి ఇలా చెప్పేసారు. నాకు ఆంధప్రద్రేశ్ అవతరణ పదిరోజులలో జరుగుతుందనగా మాకు పెళ్లి చేసారు.ఈ పన్నెండు ఏళ్ళల్లో నా భార్యకు MEDICAL AID అవసరం రాలేదు. ఆమె ఎల్లప్పు డూ ఆరోగ్యంగా ఉంటుంది .నాకు మాత్రం జలుబు, దగ్గు లాంటివి అప్పుడప్పుడూ వస్తూ ఉంటాయి వాటిని నా భార్య వెంటనే నయం చేస్తుంది .

నా భార్య నన్ను మీరు బాగున్నా రు కదండి అని అడిగి మనం అలా పార్కు దాక వెళ్దాం అని మొదలు పెట్టి తర్వా త గుడి వరకు, అక్కడికి వెళ్ళి న తర్వా త సినిమాకు వెళ్దాం అని అలా రాత్రి పదిగంటల వరకు తిరిగి తిరిగి ఎప్పటికో ఇల్లు చేరుకోసేవాళ్ళం మేము.ఈ మాయదారి జబ్బు ఏంటో నాకు అర్థం కావడం లేదు ఆకలి వేయదు,లేచి కుర్చో నివ్వదు,ఓపిక కూడా ఉండదు.మీరు చూస్తున్నా రుగా ఇప్పు డు ఆవురావురు మంటూ ఆకలి వేయడము. రెండు రోజులనుండి ఆకలి వేయడం.మనిషికి ఆకలి వెయడం ఆరోగ్య లక్షణం కదా.పది రోజులలో ఈమె ఆరోగ్యము కుదుట పడడం ఖాయం అప్పు డు నేను మీ అందరికి కృతజ్ఞతలు తెలియజేసి గుడిలో కొబ్బరి కాయ కొట్టి మేము సంతోషంగా ఇంటికి వెళ్ళడం మీరు చూస్తూ నే ఉంటారు.వాసంతి గారు ఖచ్చి తంగా ఇది జరుగుతుంది అని చెప్పారు.అతను చెప్పే ప్రతి విషయమును వాసంతి వింటుంది కాని

ఆమె బుర్రలోకి వెళ్తున్నయో లేదో తెలిదు కాని చివరి పయ్త్ర త్నం మీద మాములు స్థితిలోనికివచ్చి ఆలోచిస్తూ నే అతనితో మీ ఆవిడకు జబ్బు చేసి రెండు మాసాలు అయ్యిందా  అని ఆలోచిస్తూ, తరువాత ఆమె అతని గెడ్డం వైపు చూస్తూ అడిగింది

అతడు అవునండి ఆమె చాలా పేద పిల్ల .మా సక్కు కు నేను తప్ప ఎవరు లేరు.నాకు తల్లిదండ్రులు ఉన్నా రు కాని ఎక్కడో దూరంగా ఉన్నా రు.ఇక్కడ నాకు ఈ సక్కు కు నే నే దిక్కు .అతను అలా చెబుతుంటే క్రమంగా వాసంతి మౌనంగా ఉండిపోయినది.సక్కు భాయి ఆరోగ్యా నికి సంబంధించి ఊహించని దానికన్నా ఆమె భర్త ఊహించినదే నిజమైనది.పదిహేను రోజులలో ఆమెఆరోగ్యము కుదుట పడినది.తరువాత ఆసుపత్రి నుండి సె లవు తీసుకొని చంద్ర మోహన్ వాళ్ళు వెళ్ళే టప్పు డు వాసంతి డ్యూ టీ కిసెలవు పెట్టినది.చంద్రమోహన్ వాసంతికి కృతజ్ఞతలు చెప్పమని MARGARET కి చెప్పి వారు వెళ్ళి పోయినారు.కొన్ని రోజులు గడచిన తర్వా త ఒకరోజు సాయం సమయమున వాసంతి బజారుకు వెళ్ళు చుండగా సక్కు భాయి బట్టల షాపు లోనుంచి బయటకు వెళ్తూ కనిపించింది.ఆమెను చూచి వాసంతికి చక్కని చుక్క కాదనడానికి ధైర్యం చాల లేదు . ఎందుకంటే ఆమె వెన్నంటి మెట్లు దిగుచున్న వ్యక్తిని పరిశీలించి చూడగా అతను చంద్రమోహన్ అని పోల్చు కోలేక పోయినది.ఎందుకనగా అతనికిప్పు డు గడ్డం లేదు. సక్కు భాయి తన మొహం చూసుకోవడానికి ని కిప్పుడు నిలువుటద్దం అక్కరలేదు. ఆ చేక్కుటద్దాలే చాలు!

# జానపద సాహిత్యము - హాస్య రసపోషణ

పరిశోధక విద్యార్థి : వి . లక్ష్మీ కుమారి,

ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయం

చరవాణి: 8328359005

## జానపద సాహిత్యం పరిచయం :

జానపద సాహిత్యం అత్యంత ప్రాచీనకాలానికి సంబంధించిన సాంప్రదాయిక విజ్ఞానం. అది సజీవశిలాజం ఏ భాషలో అయినా మొట్టమొదట జానపద సాహిత్యమే పుడుతుంది. ఇది మౌఖిక సాహిత్యం అంటే ముఖస్థంగానే ప్రాచుర్యం పొందింది. ఆ తర్వాత లిఖిత సాహిత్యం వెలువడుతుంది. దీన్ని శిష్ట సాహిత్యంగా పరిగణిస్తారు. 'జనపదం' అంటే గ్రామం. ఇది పల్లెవాసుల సాహిత్యంగా స్థిరపడింది. పల్లెల నుంచి, సామాన్యుల నుంచి పుట్టిందే జానపద సాహిత్యం. తెలుగు వారికి అపూర్వమైన జానపద కళావారసత్వము ఉన్నది. జానపద కళా సాహిత్యము ద్వారా జాతి సంస్కృతి తెలుస్తుంది. సంస్కృతిని నాగరికతకు ఒక పర్యాయపదంగా చెబుతారు. ఈ సంస్కృతిలో జానపదుల జీవనానికి సంబంధించిన కథలు, పాటలు, హాస్యము, గేయాలు మొదలైనవన్నీ జానపద సాహిత్యంలో ఒక భాగములే.

## జానపదసాహిత్యంలో హాస్యరసపోషణ :

హాస్యము అనేది జీవితంలో ప్రధానమైన రసం. హాస్యము అనగా వినోదం కలిగించి నవ్వు పుట్టించే లక్షణం కలిగిన ఒక భావానుభవం. హాస్యం అంటే ఏమిటి, అది ఎలా సంభవిస్తుంది, దాని వలన ప్రయోజనాలు ఇబ్బందులు ఏమిటి అనే విషయాలపై పలు అభిప్రాయాలున్నాయి. దైనందిన జీవితంలోను, సినిమాలలోను, సాహిత్యంలోను, వ్యక్తుల వ్యవహారాలలోను హాస్యం ఒక ముఖ్యమైన పాత్ర కలిగి ఉంటుంది.

### కాంతం కథలలో ఉన్న హాస్యం :

మునిమాణిక్యం నరసింహారావు తెనాలి తాలూకా, సంగం జాగర్లమూడిలో మార్చి 15, 1898 న జన్మించారు. ఈయన తల్లిదండ్రులు వెంకాయమ్మ, సూర్యనారాయణ. ఈయన తెనాలిలో ఇంటర్మీడియెట్ చదివారు. డిగ్రీ చదవడానికి తాహతు లేకపోతే కొండా వెంకటప్పయ్య గారి ఆయన సహాయం వల్ల బి.ఎ చదివారు.ఆయన భార్య కాంతం. ఆయనకు బందరు హిందూ హైస్కూలులో ఉద్యోగం

వచ్చింది. ఆంధ్రసారస్వత పరిషత్తులో ఉపాధ్యాయుడిగా, ఆకాశవాణిలో కూడా పనిచేశారు. ఆయన రాసిన మొదటి నవల 'టీకప్పులో తుఫాను'. ఇందులోనే మొట్టమొదటిగా కాంతం పాత్ర కనపడుతుంది. కాంతం కుటుంబం పేద కుటుంబం. కాంతం కథలలో ఒకటి ఆయన రేడియో నాటకంగా రాస్తే, ఆయన కుమార్తె "కాంతంగా" వేసి అందరినీ మెప్పించింది.

ఆయన "కాంతం కథల" కి ఆయన భార్యే ప్రేరణ, స్ఫూర్తి. నిజ జీవితంలోనే దాంపత్య సన్నివేశాలను, చిన్న సంఘటనలను ఆధారంగా చేసుకుని రాసినవి కాబట్టే ఇప్పటికీ కాంతం కథలు నిత్య నూతనమనిపిస్తాయి. ఇటువంటి 'కాంతం' చనిపోగానే ఆయన చాలా దిగులు చెందారు. వెంటనే ఎక్కువగానే ప్రేమించే పెద్దమ్మాయి రుక్కుతల్లి మరణించింది. దాన్ని తట్టుకోవడానికి రచనలు చేసేవారనిపిస్తుంది. కొంతకాలానికి రాజ్యలక్ష్మిని రెండవ భార్యగా చేసుకున్నారు.

తన రచనల ద్వారా మధ్యతరగతి సంసారంలోని సరిగమల్ని ఎన్నింటినో వినిపించాడు మునిమాణిక్యం. తెలుగు హాస్యరచయితలలో మునిమాణిక్యం గారికి ఒక విశిష్టస్థానం ఉంది. మునిమాణిక్యం కేవలం హాస్యరచయిత మాత్రమే కాదు. మంచి హాస్యోపాసకులు కూడా. విభిన్న వ్యక్తుల మనసులను అలరించే హాస్యోక్తులుహాస్య సన్నివేశాలు ఎక్కడ ఆయన దృష్టికి తెచ్చినా వాటిమీద మక్కువతో అనువదించి గాని, అనుసరించిగాని, భాషను కొంచెం తమాషాగా, మార్చి తెలుగుపాఠకులకు అందజేసేవారు.

ఒకసారి విశ్వనాథ సత్యనారాయణ మునిమాణిక్యాన్ని ముట్నూరి కృష్ణారావు దగ్గరకు తీసుకువెళ్లి పరిచయం చేస్తుంటే ఆయన వెంటనే *కాంతం భర్త కాదూ* అన్నాడట. ఈ ఉదాహరణ తెలుగునాట కాంతం ఎంత ప్రసిద్ధి చెందిందో తెలియజేస్తుంది.

కాంతం కథల్లో ఆయన నిజజీవితంలో జరిగిన సంభాషణలు స్ఫూర్తిగా రాసేవాడు. ఉదాహరణకు ఆయన ఓ సారి భార్యని పిలిచి *నా కలం కనపట్లేదు,వెతికి పెట్టమంటే* ఆవిడ వంటింట్లోనుంచి *నాకు అట్లకాడ కనపడడం లేదు కాస్త వెతికిపెట్టండి* అందంట. ఇలా నిజ జీవితంలోనే దాంపత్య సన్నివేశాలను, చిన్న సంఘటనలను ఆధారంగా చేసుకుని రాసినవి కాబట్టే ఇప్పటికీ కాంతం కథలు నిత్య నూతనమనిపిస్తాయి.

కాంతం భర్తతో చాలా చమత్కారంగా మాట్లాడుతుంది. సన్నివేశాన్ని బట్టి, అవసరాన్ని, అవకాశాన్ని బట్టి చతురోక్తులు విసురుతుంది. ఉదాహరణకు- కొండపల్లి వెళితే మీకు కొయ్యబొమ్మలు కనపడతాయా... అంటే అక్కడ కూడా అమ్మాయిలను చూస్తుంటారు కదా! అని ఆమె ఉద్దేశ్యం. ఆ అమ్మాయిని అంతధైర్యంగా ప్రేమించేశారేం... మరి ఆ సమయంలో మీ దగ్గర అద్దం లేకపోయిందా.., అలానే మరోచోట- మా వాళ్లందరూ తోకలేని కోతులా.. పాపం మీవాళ్లకు ఆ లోటు కూడా లేదులేండి అంటుంది. మరికొన్ని వాక్యాలలో నరసింహారావు హాస్యం చాలా గొప్పగా ఉంటుంది. ఇక కొన్ని కథల్లో కాంతం భర్త వెంకట్రావు మాటలైతే ఆయనకు భార్యపై కోపాన్ని చతురోక్తులతో చెప్తాడు మునిమాణిక్యం- కోతి కనిపించే సరికి మాఆవిడ

గుర్తుకొచ్చింది. నేనా పిల్లను ఆటపట్టిద్దాం అనుకున్నాను, కానీ నా ఊహల్లో మా కాంతం ముఖం సూపర్ ఇంపోజ్ అయింది. ఇలా ఎన్నో సున్నితమైన హాస్యపు చెణుకులు వారి కథల్లో మనకు కనిపిస్తాయి.

అసలు కాంతాన్ని పెళ్లిచేసుకున్న కొత్తల్లో భర్త వెంకట్రావే పైచెయ్యి సాధించేవాడు. భార్య ఎంత లొంగదీసుకోవాలన్నా కుదిరేది కాదు. అసలు కాంతం దగ్గరకు వస్తేనే చిర్రుబుర్రు లాడేవాడు. కానీ క్రమంగా కాంతం మచ్చికచేసుకుంది, లొంగదీసింది. ఇక అమాయకుడైన వెంకట్రావు సాధుజీవిలా మారిపోతాడు. కాంతం చిరునవ్వుకు అర్థం ఇదే నట. ఇలా కథలన్నీ సున్నితమైన హాస్యంతో పాఠకుల పెదవిపై చిరునవ్వు చెరగనివ్వవు. మిగిలిన పాత్రలు కూడా సందర్భోచితంగా వచ్చిపోతున్నా, కథలో హాస్యానిదే రాజ్యం. అందుకే ఇవి ఏవో టైంపాస్ కథలు కావు. చదివిన ప్రతి కథను గుర్తుపెట్టుకొని మీమీ జీవితాల్లో ఎదురయ్యే సన్నివేశాలకు, సంఘటనలకు ఆపాదించుకుంటుంటే జీవితమే హాస్యపు జల్లులా కురుస్తుంది. నవ్వు కరువై, తోటి మనుషులతో మాట్లాడే తీరికే లేని నేటి అత్యాధునిక బిజీ సమాజానికి మునిమాణిక్యం నరసింహారావు కథలు తేనెపట్టులాంటివి. హాస్య రసమాధుర్యాన్ని పంచే మందుల్లాంటివి. అందుకే నేటి యువతీ యువకులు  ప్రతిఒక్కరూ చదవాల్సిన మంచి కథలు ఇవి.

## <u>చమత్కార పద్యంలో ఉన్న హాస్యం :</u>

నవ్వించడమనేది ఒక సృజనాత్మక కళ. సంస్కారయుతమైన పదజాలంతో ఇతరులను నొప్పింపక తన వాక్చాతుర్యాన్ని ప్రదర్శించడం సామాన్యమైన విషయం కాదు.  అడిదం సూరకవి  ఒకరోజు ఆయన భోజనం చేస్తుండగా ఆయన భార్య ప్రక్కన కూర్చొని విసురుతూ గోముగా “అందరిమీదా పద్యాలు చెప్తున్నారు కదా? మన అబ్బాయి బాచన్న మీద ఒక పద్యం చెప్పవచ్చు కదా?" అని అడిగింది.

తరతమ భేదాలు లేని కవిగారు క్రింది పద్యంలో భార్య ముచ్చట తీర్చారట. పద్యం విని ఆవిడ ముఖం చిన్నబోయింది.

“బాబాబూచులలోపల
బాచన్నే పెద్దబూచిపళ్లున్నానున్
బూచంటేరాత్రివెరతురు
బాచన్ననుజూచిపట్టపగలేవెరతురు”

కవి ఎంత నిరంకుశుడో, కన్నకొడుకు బూచి కన్నా భయంకరంగా ఉన్నాడని భర్త వర్ణిస్తే ఏ కన్నతల్లి మనసు చిన్నబోదు? అయినా మనకి జాలి కలగకపోగా కవిగారి చమత్కారానికి ఫక్కున నవ్వొస్తుంది.

ఆంధ్రులు హాస్యప్రియులు వదినా మరదళ్ల సరసాలు, పెళ్లిళ్లలో ఇరుపక్షాలవారి పరియాచకాలు,ఒకటేమిటి అడుగడుగునా, అనుక్షణమూ తెలుగువారి బ్రతుకుదారుల్లో హాస్యరసం జాలువారుతూనే ఉంటుది. తెలుగునాట వినోదాత్మక ప్రదర్శనల నిండా హాస్యమే కనిపిస్తుంది.

**హాస్యగీతం.**

నిలబడుమామో జెరనిలబడుమామా ||2||

సీరా గట్టిందాక రైకె దొడిగిందాక

నిలబడుమామో జెరనిలబడుమామా

నిలువనె పిల్లో నేనిలువనెపిల్లా

చీరాగట్టిందాక రైకేదొడిగిందాక

నిలువనె పిల్లో నేనిలువనెపిల్లా ॥2॥

నిలబడుమామో జెరనిలబడుమామా ||2||

బొట్టు బెట్టిందాక కాటుక దిద్దిందాక నిలువనె పిల్లో నేనిలువనెపిల్లా ॥2॥

కొప్పు గట్టిందాక పూలు బెట్టిందాక

నిలబడుమామోజరా నిలబడు మామ ॥2!!

కొప్పు గట్టిందాక పూలు బెట్టిందాక

నిలువనె పిల్లో నే నిలువనె పిల్లా ॥2॥

పోడరు వేసిందాక ఫోజులు పెట్టేదాక

నిలుబడు మామో జెరా నిలబడు మామో ॥2॥

పోడరు వేసిందాక ఫోజులు పెట్టేదాక

నిలువనె పిల్లో నే నిలువనె పిల్లా ॥2॥

గాజులు దొడిగించాక గంధము దీసిందాక

నిలబడు మామో జెరా నిలబడుమామా ||2||

గాజులు దొడిగిందాక గంధము దీసిందాక

నిలువని పిల్లో నేనిలువని పిల్లా ॥2॥

అద్దము జూసిందాక అత్తరు రుద్దిందాక

నిలబడు మామో జెరా నిలబడు మామో ॥2॥

అద్దము జూసిందాక అత్తరు రుద్దిందాక

నిలువని పిల్లో నే నిలువని పిల్లా ॥211

పర్సు దీసిందాక పైసలు వేసిందాక

నిలబడు మామో జెరానిలబడు మామా ||2||

పరసు దీసిందాక పైసలు వేసిందాక

నిలువని పిల్లో నేనిలువని పిల్లో ॥2॥

**ముగింపు :**

మన ప్రాచీనాలంకారికులు చెప్పిన నవరసాల్లో హాస్యం కూడా ఒకటి. హాసం అంటే నవ్వు. ఆ నవ్వును పుట్టించేదే హాస్యం. కీ .శే. జంధ్యాలవంటి రచయితలు హాస్యాన్ని అంగిరసంగా ఎన్నో రచనలు చేసారు. అగ్రస్థానంలో నిలబడ్డారు. ఆరోగ్యకరమైన హాస్యం అన్నివేళల అపురూపమే.

# बाणभट्टकादम्बर्याम् हास्यरसः

**BORUGADDA SUKANYA**
RESEARCH SCHOLAR
UNDER THE GUIDENCE OF
Prof.**P.VARAPRASADA MURTHY**
ACHARYA NAGARJUNA UNIVERSITY,
NAGRJUNA NAGAR

रसशब्दस्य आस्वादः आनन्दः इत्यादयो बहवो अर्थाः प्रसिद्धाः । लौकिकाः रसाः षडेव तेषाम् अन्योन्यमिश्रणेन कोपि विलक्षणः आस्वादो भवति तथा काव्यरसानामपि मेलनेन आस्वादवैचित्री भवत्येव । नवरसेष्वपि केषाञ्चिदेव अन्योन्यं मेलनं आस्वादयोग्यं भवति यथा वीरश्रृङ्गारयोः, वीराद्भुतयोः, श्रृङ्गारहास्ययोः समागमः आस्वादने स्वादिष्टो भवति । विशेषतः श्रृङ्गारहास्ययोः समागमः मनोरञ्जकः भवति । प्रायशः श्रृङ्गारप्रधानेषु सर्वेषु काव्येष्वपि हास्यरसोपि अङ्गतया निबद्धो भवत्येव । एषा रीतिः पद्यकाव्येषु अधिका दृश्यते, गद्यकाव्येष्वपि श्रृङ्गारप्रधाने बाणभट्टविरचितकादम्बरी काव्ये श्रृङ्गारहास्ययोः मेलनं आलौकिक चमत्कारकारि वर्तते ।

कादम्बरी कथा बाणभट्टविरचिता अपूर्णापि तत्पुत्रः तां कथां पूरयित्वा काव्यं सुखान्तं कृतवान् इति श्रृङ्गारः एव मुख्योरसः केवलबाणभट्ट कृतभागे नायकयोः लोकान्तरगमनेन करुणोरसः अङ्गीभवति तथापि उत्तरार्धे कथासमाप्तौ नायकौ पुनः स्व स्व नायिकाभ्यां सङ्गताविति काव्यं श्रृङ्गारप्रधानमेवेति निश्चिनुमः ।

## हास्यस्वरूपम्

हास्यरस उदाहरणनिरूपणात् प्राक् हास्यरसलक्षणं तत्स्वरूपमपि निरूपणीयमेव । रसप्रकरणे रसपदेन तदुपाधिः स्थायीभावः एव गृह्यते । हास्यरसस्य **"वागङ्गविकारदर्शनादि जन्मा विकासाख्यः चित्रवृत्तिविशेषः हासः"** स्थायीभावः । हासोपि पात्रोचितः तत् तत् पात्राणां उदात्तादि प्रकृतित्वमनुसृत्य अनुभावरूपोपि भवति । आत्मस्थः परसंस्थः चेति हास्योरसः मुख्यतया द्विविधो भवति आत्मस्थः

विभावनदर्शनमात्रेण द्रष्टरि जायते । परसंस्थः हसन्तमितरं दृष्ट्वा उत्पद्यते । हासोपि उत्तम, मध्यम, अधमभेदेन त्रिविधो भवति।

**स्मितं च हसितं प्रोक्तमुत्तमे पुरुषे बुधैः ।**

**भवेद्विहसितं चोपहसितं मध्यमे नरे ।।**

**नीचेपहसितं चातिहसितं परिकीर्तितम् ।**

**ईषत्फुल्लकपोलाभ्यां कटाक्षैरप्यनुल्बणैः ।।** रसगङ्गाधरः, 1-195

**हास्यस्यावसरः**

दुःखार्तान् प्रशान्तमनस्कान् कर्तुं हास्योरसः दिव्यमौषधं भवति कदाचित् तीव्रतरः मनः खेदकारी विषयोपि मृदुना हास्येन परस्य मनसः पीडां विनैव बोधयितुं हास्यरसः साधनं भवति । तीव्रतरः अधिक्षेपोपि हास्येन सूचयितुं शक्यते । कदाचित् चिरपरिचितेष्वपि व्यक्तिषु एकत्र समाविष्टेषु वक्तव्यांशस्य कथनं केनापि कारणेन न कृतमपि तेषां मध्ये मौनं भेदयितुं हास्यः समर्थो भवति । एवं बहूनि प्रयोजनानि हास्येन साध्यानि । न केवलं विषण्णानां विनोदन साधनं, सुखितानां अपि मनांसि विकासयितुं हास्योरसः अलं भविष्णुः । कादम्बर्यां हास्येन एवं विधानि सर्वाणि प्रयोजनानि हास्यरसस्य वर्णितानि । तत्र.....

**1.उद्वेजितां मनोविनोदजनकः हास्यः**

महाश्वेता अच्छोदसरसः तीरे पुण्डरीकं दृष्ट्वा तस्मिन् अनुरक्तापि स्वानुरागं वक्तुमसमर्था गृहं प्रतिनिवृत्ता । किं कर्तव्यता मूढा चिरं तस्थौ अत्रान्तरे सायंकाले कपिञ्जलनामकः पुण्डरीकस्य सखा महाश्वेतायाः समीपमागत्य पुण्डरीकस्य विषमावस्थाम् उक्तवान् । अर्धरात्रे सख्या तरलिकया चोदिता महाश्वेता पुण्डरीकं अभिसर्तुं तरलिका द्वितीया गृहात् निष्कान्ता । तथापि मार्गमध्ये तां उद्विग्नां दृष्ट्वा तरलिका मृदुना परिहासेन महाश्वेतां उद्वेगात् निवर्तयितुं कृतयत्ना तया एवं परिहासेन आश्वासिता महाश्वेतापि कथञ्चित् पुण्डरीकान्तिकमाजगाम । तरलिकायाः वाक्यानि तस्मिन् सन्दर्भे

सुदीर्घान्यपि कानिचित् उदाहियन्ते । अयि तरलिके अपि नाम मामिवायमिन्दुहतकस्तमपि करेण कचग्रहाकृष्टममिमुखमानयेत् इत्येवं वादिनीञ्च मामसौ विहस्याब्रवीत् – भर्तुदारिके मुग्धासि, किमस्य तेन जनेन । अयमात्मनैव तावन्मदनातुर इव भर्त्तृदारिकायां तास्ताश्चेष्टाः करोति । तथाहि प्रतिबिम्बच्छलेन स्वेदसलिलकणिकाचितं चुम्बति कपोलयुगलम्, लावण्यवति पयोधरभारे, निपतति, प्रस्फुरितकरः स्पृशति रसनाविलमणीन्, निर्म्मल-नख-लग्नमूर्तिः पाद्योः पतति किञ्चास्य रसनावलिमणीन्, मदातुरस्येव वपुस्तापाच्छुष्कचन्दनानुलेपपाण्डुतां वहति ।

चन्द्र एव त्वयि आसक्तः इव लक्ष्यते इति तरलिकायाः परिहासेन उद्विग्नायाः महाश्वेतायाः मनः तदानीं प्रशान्तमभूत् ।

## 2.तीव्रतरस्याधिक्षेपस्य मृदुभिः वाक्यैः सूचनं हास्येन साध्यम्

नायकः चन्द्रापीडः समाप्तविद्यः कुलागतं अमात्यं वृद्धं शुकनासं द्रष्टुं ययौ पट्टाभिषेकयोग्यं तं निवीततरं कर्तुं शुकनासः विनयमुपदिदेश । किन्तु चिरपरिचितं पुत्रसदृशमपि तं सात्रात् हितमुपदेष्टुं शक्तोपि प्रभुभिः एवं गर्वान्धैः न भाव्यमिति तीक्ष्णम् उपदेशं मृदुना परिहासेन सूचितवान् मदान्धाः राजानः अनुचरैरपि प्रतारिताः परिहसिताश्च भवन्ति इति तेषां हास्यास्पदत्वं वर्णयित्वा त्वं परिहास्यः मा भूः इति सिद्धान्तरूपेण उपदिदेश ।

**शुकनासकृतोपदेशः अपि विस्तरतरः इति तस्यैकदेशः अत्रोदाहियते ।**

**आत्मविडम्बनां चानुजीविना जनेन क्रियमाणामभिनन्दन्ति, मनसा देवताध्यारोपणप्रतारणा सम्भूतसं भावनोपहताश्चान्तः प्रविष्टापरभुजद्वयमिवात्मबहुयुगलं सम्भावयन्ति त्वगन्तरिततृतीयलोचनं स्वललाटमाशङ्कन्ते ।.. अन्तः स्वयमपि विहसद्भिः ।**
इत्यादि शुकनासवाक्यैः ससर्वोपि परिहासः इत स्पष्टं भवति । उपदेशान्ते उपसंहाररूपेण यथा न च प्रतार्यसे विटैः न प्रहस्यसे कुशलैः ....इत्यादि शुकनासवाक्येषु प्रभूणां वर्तनं परिहासास्पदं हास्यकारणं चेति स्पष्टम् ।

## 3.मनोविनोदहेतुः

हास्योरसः सुखिनामपि मनोविकासजनकः भवतीति शुकसारिका वृत्तान्तेन स्पष्टम्। महाश्वेतां दुखितां दृष्ट्वा महाश्वेतायाः विवाहपर्यन्तं अहमपि पाणिग्रहणं नाङ्गीकरोमि इति कादम्बरी कृतनिश्चयाभूत् । तामनुनेतुं कादम्बर्याः पितृभ्यां आहूता महाश्वेता हेमकूटं जगाम । चन्द्रापीडं दृष्ट्वा कादम्बर्याः निश्चये परिवृत्तिः भवेदिति आशयेन सा चन्द्रपीडमपि हेमकूटं नीतवती । गृहागतं चन्द्रापीडं ताम्बूलदानादिना कादम्बरी सत्कृतवती । ताम्बूलदानान्तरं सा लज्जिता किमपि वक्तुं न शशाक । चन्द्रापीडोपि वाचामवसरं अलब्ध्वा तूष्णीमासीत् । एवं सर्वेषु विरतवचस्सु तेषां मध्ये अनपेक्षितं किमपि गाम्भीर्यम् आविष्कृतम् । श्रृङ्गाररसपोषणे तादृशसन्दर्भः रसछेदाया भवति । तादृशं सन्दर्भं भेदयितुं बाणेन हास्योरसः साधनीकृतः । शुकः भिन्नजादीयः, शुकी च शुकश्च शुकौ शुकदम्पत्योः अनुरागः लोकोत्तरः इति प्रसिद्धः । सारिकापि भिन्नजातीय किन्तु शुकसारिके दम्पती इति कविसमयः, अत्र हास्यरसपोषणार्थं बाणेन गृहीतः । कादम्बरी गृहे परिहासनामकः शुकः कालिन्दी नाम्नी सारिका च दम्पती आस्ताम् । तौ दम्पती कादम्बर्या पालितौ, कादम्बरी तयोः विनाहमपि कारयामास । एवं स्थिते परिहासः कादम्बर्याः ताम्बूलदायिन्यां तमालिकायां अनुरक्तः कालिन्दीं न गणयति गतान्यपि दिनानि न वेत्तीति । तदा तयोः वृत्तान्तमाकर्ण्य चन्द्रापीडः स्वेषां स्वेषां मध्य स्थितं मौनं भग्नं कुर्वन् तत्कालोचितैः आलापैः सर्वासां मनांसि हास्येन प्रसन्नानि कृतवान् तदेव अवसरं मत्वा कविः सापत्न्यकरणनामकं सांघिकदुराचारमपि हास्यरसं साधनीकृत्य बहुधा निराकृतवान् । एषा कथा सुदीर्घतरा इति तत्रस्थः हास्यजनकः भागः एव निरूप्यते ।

एतदाकर्ण्य स्फुटस्फुटरितकपोलोदरश्चन्द्रापीडो मन्दं मन्दं विहस्याब्रवीत् – अस्त्येषा कथा श्रूयत एवैतद्राजकुले कर्णपरम्परया परिजनोप्येवं मन्त्रयति – एवं बहिरपि जनाः कथयन्ति । एवं दिगन्तरेष्वप्ययमालापो वर्तते – एवमस्माभिरप्येतदाकर्णितमेव ।

यथा किल – देव्याः कादम्बर्यास्ताम्बूलदायिनीं तमालिकां कामयामानः परिहासनामाशुको मदनपरवशो गतान्यपि दिनानि न वेत्तीति ।

चन्द्रापीडस्य परिहासगर्भितानि वाक्यानि श्रुत्वा शुकः इयमपि जानात्येव परिहासनजल्पितानि इति स्पष्टं वदति । अनेन वाक्येन सर्वोपि एष परिहासः हास्यपोषकः इति स्पष्टम् ।

अपि च कादम्बरीगृहात् चन्द्रापीडस्य उज्जयिनीगमनसमये विन्ध्याटव्या कश्चन जरत् द्रविडधार्मिकः चन्द्रापीडेन दृष्टः । द्रविडधार्मिकवर्णने निध्यन्वेषणादय बहवो अन्धविश्वासाः हास्यरसपोषणेन निराकृताः ।

**उपसंहारः**

अद्यतनकालेपि शरीरोल्लाघाय मनोविकासाय प्रयुज्यमानः हास्यचिकित्सा पुरापि बहुधा प्रयुक्ता इति कादम्बर्या मदलेखा चन्द्रापीडसम्भषणेन स्पष्टमभिव्याक्ता । एवं हास्योरसः अनेक प्रयोजनयुक्तः कादम्बर्यां परिपुष्टः ।

**उपयुक्तग्रन्थसूची**

1.रसगङ्गाधरः – B.H.UNIVERSITY, वारणासी - 1968

2.कादम्बरी – वाविल्लरामस्वामिशास्त्रुलु अण्ड् सन्स् चेन्नपुरी - 1951

## కూనలమ్మ పదాలు – ఆరుద్ర సరదాలు

**డా. అందుగులపాటి శ్రీనివాసరావు**

**ఉపాధ్యాయుడు,**

**ఫోన్:9490497316**

"కవిత కోసం నేను పుట్టాను

క్రాంతి కోసం కాలం పట్టాను" అని పలికిన ఆరుద్ర వాక్కు అద్భుతమైనది. సమగ్ర ఆంధ్ర సాహిత్యాన్ని మనకందించిన సరస్వతి పుత్రుడు ఆరుద్ర.

"సాహిత్యం అర్ణవమైతే

ఆరుద్ర మథించని లోతుల్లేవు

సాహిత్యం అంబారమైతే

ఆరుద్ర విహరించని ఎత్తుల్లేవు"

అతడు పట్టి బంగారం చేయని సాహిత్య శాఖ లేదు. ఆ శాఖపై అతడు పూయించని పువ్వుల్లేవు.

కేవలం కవిత్వాన్నే తీసుకున్న అతడు చేసినన్ని ప్రయోగాలు, అంత అందంగా చేసిన వారు ఆధునిక కవుల్లో మరొకరు లేరేమో! కవిత్వం కాక కథలు, నవలలు, నాటకాలు, పత్రికా వ్యాసాలు, పరిశోధనలు.. ఇలాగ అతని రచనా వ్యాసంగం బహుముఖంగా జరిగింది. సంప్రదాయ ప్రయోగం, పాత్రోచిత భాషా ప్రయోగం, అంత్యప్రాసలు ఆయన ప్రత్యేకతలు. సామ్యవాదాన్ని పాటల్లో ఎలా వండగలరో.. భక్తి భావాన్ని కూడా అంతే బాగా పుట్టించగలరు.

ఇక్కడ రెండు విషయాలు గుర్తుపెట్టుకోవాలి. హాస్యము, వ్యంగ్యము రెండు వేరు వేరు. హాస్యం కేవలం నవ్వు పుట్టిస్తుంది. వ్యంగ్యం నవ్విస్తూనే విమర్శిస్తూ ఉంటుంది. బారిష్టర్ పార్వతీశం నవల, ముళ్ళపూడి రచనలు హాస్య స్ఫోరకాలు అయితే ఆరుద్ర గారి కూనలమ్మ పదాలు వ్యంగ్య పూరితం.

ఆరుద్ర గారి కూనలమ్మ పదాలు ప్రతిపద రమణీయం. పదపద చమత్కారం. సమకాలీన జీవితం మీద చురుకైన విసుర్లతో కరుకైన కసుర్లతో ఈ పదాలు రసప్రదాలు.

భాష అనేది మనసులోని భావాన్ని తెలియజేయాలి. మంచిని పెంచాలి. అలా చేయకపోతే అది వట్టి సముద్రపు హోరులాగా అర్థం లేనిది అవుతుందని ఆరుద్ర గారు తన పదాలలో తెలిపారు.

"మనసు తెలుపని భాష

మంచి పెంచని భాష

ఉత్త సంద్రపు ఘోష

ఓ కూనలమ్మ!"

ఇతరులను విమర్శించడం వల్ల, తన బలాన్ని పొగుడుకోవడం వల్ల మంచి పేరు రాదు అనే విషయాన్ని మరో పదంలో తెలిపారు.

"పరుల తెగడుట వల్ల

బలిమి పొగడుతావాళ్ళ

కీర్తి వచ్చుట కల్ల

ఓ కూనలమ్మ!"

చెడ్డవారితో స్నేహం గుండెలో గుచ్చుకున్న ఈటె వంటిది, గొంతులో అడ్డుపడ్డ ఎముక వంటిది. ఎప్పుడూ ఇబ్బంది పెడుతుంది. కనుక చెడ్డవారితో స్నేహం తగదు. ఈ విషయాన్ని ఆరుద్ర అలతి అలతి పదాలతో చెప్పారు.

"గుండెలో శూలమ్ము

గొంతులో శల్యము

కూళతో స్నేహమ్ము

ఓ కూనలమ్మ!"

మరొక చోట మనిషి మనసు ప్రశాంతంగా ఉండే మార్గం చెప్పాడు.

"తీర్చినట్టి బకాయి

తెచ్చిపెట్టును హాయి

అప్పు మెడలో రాయి

ఓ కూనలమ్మ!"

అప్పు మెడకు తగిలించుకున్న బండరాయి వంటిది. అప్పు తీర్చి వేస్తే మనస్సు ప్రశాంతంగా ఉంటుందనే సత్యం తెలుస్తుంది.

అల్పాక్షరాలలో అనల్పార్థాన్నిచ్చే హాస్యం పుట్టించడంలో ఆరుద్రది అందె వేసిన చెయ్యి. స్త్రీలు సౌందర్యానికి, చక్కని అలంకరణకు అధిక ప్రాధాన్యత ఇస్తారని ఆరుద్ర గారు చెప్పకనే చెబుతున్నారు.

"రెండు శ్రీలు ధరించి

రెండు పెగ్గు బిగించి

తెలుగు శబ్ద విరించి

ఓ కూనలమ్మ!"

మన తెలుగు వారికి శకునాల మీద నమ్మకం ఎక్కువ. ఏదైనా పని ప్రారంభించాలన్నా, ఏదైనా ప్రయాణానికి బయలుదేరాలన్న శకునం చూస్తారు. ఏదైనా ఒక పని ప్రారంభించే ముందు తుమ్మితే దానిని అశుభంగా భావిస్తారు. దీనిని ఆరుద్ర గారు హాస్యాత్మకంగా చెప్పారు.

"బహు దినములు వేచి

మంచి శకునము చూసి

బయలుదేరగా హా - చ్ఛీ

ఓ కూనలమ్మ!"

కుటుంబంలో భార్య భర్తల మధ్య అనురాగ ఆప్యాయతలు ఉండాలి. ఒకరి ఇష్టాలు ఒకరు గౌరవించుకుంటూ ఉండాలి. చిన్న చిన్న కారణాలకు రోషావేశాలకు గురికాకూడదు. ఇదే విషయాన్ని ఆరుద్ర గారు తెలిపారు.

"భార్య పుట్టిన రోజు

భర్త మరచిన రోజు

తగ్గెననుకో మోజు

ఓ కూనలమ్మ!"

న్యాయ వ్యవస్థల తీరును కూడా ఆరుద్ర గారు వ్యంగ్యంగా చిత్రించారు.

"కోర్టుకెక్కిన వాడు

కొండనెక్కిన వాడు

వడి వడిగా దిగిరాడు

ఓ కూనలమ్మ!"

ఈ విధంగా ఆరుద్ర గారు జీవిత సత్యల సారాన్ని కూనలమ్మ పదాలలో వ్యంగ్యంగా చిత్రించారు.

# ముని మాణిక్యం కథలు - హాస్య రసగుళికలు

దారపురెడ్డి కనకమహాలక్ష్మి
తెలుగు అధ్యాపకురాలు
ఎస్.సి.ఐ.ఎమ్. ప్రభుత్వ డిగ్రీ కళాశాల
తణుకు
చరవాణి : 9959327185
email: kanaka84maha@gmail.com

నవరసాలలోనూ హాస్యానిది ఒక ప్రత్యేక స్థానం. హాస్యం లేనట్లయితే మన జీవితం విషాదంతో ఉంటుందని చెప్పను గానీ, సంతోషం ఉండదని మాత్రం చెప్పగలను. మన నిత్య జీవితంలో అకస్మాత్తుగా జరిగే సంఘటనల నుండి కానీ, వేరొకరి పొరపాటు లేదా అజ్ఞానం లేదా దుస్థితి పట్ల మరొకరు నవ్వి, వినోదం పొందడం ద్వారా కానీ హాస్యం జనించవచ్చు. అటువంటి హాస్య రచనలు రాసిన వారిలో మునిమాణిక్యం నరసింహారావు గారు ఒకరు.

మునిమాణిక్యం నరసింహారావుగారు బహుముఖ ప్రజ్ఞులు, మితభాషి, అయినా మాటకలిస్తే అమితంగా మాట్లాడే సంభాషణా చతురులు. ఆయన నవలలు, కథలు, పద్యాలు, నాటకాలు వ్రాసారు. ఈ రోజుకూ మనకు హాస్య రచన అనగానే మొదట గుర్తుకు వచ్చేది ఆయన కథలే. ఈ కథల ద్వారా ఆయన వ్రాసినవి రాశిలో గాని, వాసిలోగాని తక్కువేమి కాదు. ఆయనను తెలుగు పాఠకులు, విమర్శకులు హాస్య రచయితగానే పరిగణించారు. హాస్యము రాయటం ఎంతకష్టమో, రాసి మెప్పించటము మరీ కష్టం.

నిండైన గృహస్థ జీవితాన్ని అనుభవించేటందుకు, జీవితము పట్ల సమరస భావాన్ని పెంచుకునేందుకు అవసరమైన మనోధైర్యాన్ని పాఠకులలో పెంచేందుకు తన రచనల ద్వారా కృషిచేసిన వ్యక్తని ప్రముఖులచేత ప్రశంసలు పొందిన వ్యక్తి మునిమాణిక్యం నరసింహారావుగారు. ఈయన తన కథలలో తన వృత్తిని, ప్రవృత్తిని జోడించి రంగరించి, తన జీవితాన్ని, ఉపాధ్యాయవృత్తిని, మధ్యతరగతి కుటుంబాల పరిస్థితిని, కథా వస్తువుగా తీసుకుని అతి సున్నితమైన చిన్న విషయాలను కూడా ఎంతో ఉదాత్తముగా మనకు కానుకలుగా అందించారు.

తోటి మనుషులతో మాట్లాడే తీరికే లేని నేటి ఆధునిక హడావిడి సమాజానికి మునిమాణిక్యం నరసింహారావు కథలు తేనెపట్టులాంటివి. హాస్య రసమాధుర్యాన్ని పంచే రసగుళికల్లాంటివి. అందుకే వయోభేదం లేకుండా, ప్రతి ఒక్కరూ ఆయన రచనలు చదవాలి, చదివించాలి. మునిమాణిక్యం రచనలలో అధిక భాగము ప్రధానముగా ఆత్మ కథా సదృశ్యమైనవి. అంటే తన వాస్తవానుభవాలను, మానసిక అనుభూతులను కథలుగా, నాటికలుగా, నవలలుగా మలిచారు.

“దారి పొడగునా గుండె నెత్తురులు తర్పణ చేస్తూ పదండి ముందుకు” అంటాడు శ్రీశ్రీ. ఆ విషయమై మునిమాణిక్యం గారిని ఒకరు ప్రశ్నిస్తే దానికి ఆయన సమాధానం చూడండి. “నేను ఎక్కడికీ పొమ్మనను. ఇంట్లోనే ఉండమంటాను. ఒకవేళ ఏదైనా పనిమీద బయటకు వెళ్లినా, సాయంత్రానికి ఇంటికి వచ్చి, ఆవిడ ఇచ్చిన కాఫీ పుచ్చుకుని, పిల్లలతో హాయిగా ఆడుకుంటూ కాలం గడపమంటాను.”

“ప్రొద్దస్తమానం చేలల్లో పనిచేసి, సాయంత్రానికి ఇళ్లకు వస్తారు వనితలు. వాళ్లు రంగు రంగుల చీరలు కట్టుకుని నవ్వుతూ, పేలుతూ, ఒకరిపై ఒకరు పడుతూ నడుస్తున్నారు. వదినా మరదళ్ళ మధ్య, అత్తా కోడళ్ళ మధ్య జరిగే సరసాభిరామమైన హాస్యాలు, పలుకులు వినాలి. ఇటువంటివి చూచి, బ్రతకడానికి కావలసిన ధైర్యాన్ని సంపాదించుకోవాలి. మిగతాదంతా ఏద్పేగా” అంటారు మునిమాణిక్యం గారు. జీవితానికి తృప్తి, ఆనందము దేనివలన వస్తాయో దానినే

కథా వస్తువులుగా తీసుకోవాలి అంటారాయన. ఆ వరసలో హాస్య ప్రధానంగా వచ్చిన కథలలో "అల్లుళ్ళు" కూడా ఒకటి. దీనిలో దొంగ పెద్దమనిషి, సుందరమ్మ అల్లుడు అనే కథలను గురించి తెలుసుకుందాం. "దొంగ పెద్దమనిషి" అనే కథలో ఆ వూరిలో దొంగల హడావుడి ఎక్కువగా ఉండడంతో మాస్టారు గారు, అతని భార్యాపిల్లలూ, ఇంకా వారి ఇంట్లో అద్దెకు వుండే రామకృష్ణయ్య గారూ ఈ దొంగల బారి నుండి ఎలా తప్పించుకోవాలా అని ఆలోచిస్తుంటారు. అందరూ మేలుకుని కూర్చుందాం అనుకుంటారు కానీ అది సాధ్యమయ్యే పనికాదు కదా! పైగా దొంగలు మనింటికి వస్తారో రారో కూడా తెలియకుండా మేలుకొని వుంటే శ్రమ అంతా వృధా అవుతుంది అనుకుంటారు. మళ్ళీ "ఈ ఇంట్లోకి రాత్రిళ్ళు అనుజ్ఞ లేకుండా వచ్చినవాళ్లు శిక్షించబడుదురు "అని రాసి బోర్డు పెడదామనుకుంటారు. మళ్ళీ దొంగలెవరైనా అనుమతి తీసుకుని వస్తారా? అని అనుకుంటారు.

ఈ విధంగా వారి ఆలోచనలు అన్నీ మనకు నవ్వు తెప్పిస్తాయి. చివరికి "ఈ ఇంట్లో భయంకరమైన కుక్కలున్నవి. కొత్త మనుష్యులను పీకి చంపును" అని బోర్డు రాసి పెడతారు. అయితే అక్కడ కూడా వీరికి మరో సమస్య ఎదురవుతుంది. ఏమిటంటే ఆ దొంగ ఈ బోర్డు చూడకుండా లోపలికి వచ్చేస్తే ఎలా అని, దానికి వారు ఒక కోడిగుడ్డు లాంపు వెలిగించి, గేటు దగ్గర వేలాడదీయడం అనేది వారి అతి జాగ్రత్తగా కనిపిస్తుంది. మళ్ళీ అసలు ఆ కాగితం దొంగలు చదివినా, కుక్కలున్నాయని నమ్మాలి కదా అనిచెప్పి, అందరూ కుక్కల్లాగా వివిధ రకాల అరుపులు అరుస్తారు. తర్వాత ఇక భయమేమీలేదనుకుని నిద్రకు ఉపక్రమిస్తారు.

రాత్రి 2 గంటల సమయంలో గదిలోకి దొంగ రాగానే ఎందుకు వచ్చావు అని అడుగుతాడు మాష్టారు. ఆ దొంగ ఇతని అమాయకత్వానికి నవ్వుకుని, "నిన్ను చూసి, అంతా కులాసాగా వున్నారా" అని అడగడానికి అనగానే మాష్టారు రామకృష్ణ గారిని కూడా లేపి, ఇతను చాలా మంచి దొంగ అని పరిచయం చేస్తాడు. సరేమరి మేము కుక్కలున్నాయని బోర్డు రాసిపెట్టాం చూడలేదా? అంటే ఆ దొంగ అప్పుడు చూడడమే కాదు, వాటి అరుపులు కూడా విన్నాను. అరిచే కుక్క కరవదు అని తెలుసు. పైగా ఆ కుక్కలు మాట్లాడుకోవడం కూడా విన్నాను అనడం మనకు నవ్వు తెప్పిస్తుంది. చివరికి ఆ దొంగ ఇంట్లో ఏమీ విలువైనవి అంటే డబ్బు, బంగారం లేవని తెలుసుకుని వెళ్ళిపోతాడు కానీ, మన మాస్టారు కుటుంబం మాత్రం విలువైన బంగారం లాంటివి మాత్రమే దొంగతనం చేసే ఆ దొంగ మనింటికి వచ్చాడంటే, ఖచ్చితంగా మన ఇంట్లో మనకు తెలియకుండా ఎక్కడో ఒకచోట విలువైన వస్తువో, బంగారమో వుండే ఉంటుంది అని వారందరూ వెదకడం వారి అమాయకత్వాన్ని తెలియజేస్తుంది. వారి ఇంట్లో విలువైన వస్తువులు ఏమీ లేకపోయినా, ఒకవేళ దొంగలు వస్తే ఏం చేయాలి, దొంగలు పడకుండా ఇంటిని ఏ విధంగా కాపాడుకోవాలి అనే తపన, ఆత్రం మనకు ఈకథలో కనిపిస్తాయి. అలాగే సునిశితమైన హాస్యం మనకు ఈ కథలో కనిపిస్తుంది.

" సుందరమ్మ అల్లుడు" అనే కథలో 20 సంవత్సరాల వయసున్న శర్మ అనే కుర్రవాడికి వివాహమవుతుంది ఆ అబ్బాయికి అసలే సిగ్గెక్కువ. శర్మ తన భార్య పుట్టింటికి వెళ్తుంటే ఆమెను రైలెక్కించడానికి వెళ్లగా, అతని భార్య మీరు శనివారం రండి, నేను వచ్చేస్తాను, అక్కడ అన్నప్రాసన అయిన తర్వాత పెద్దగా పనేమీ ఉండదు అనగా శర్మ కుదరదు, నాకు పరీక్షలు దగ్గరకు వచ్చినవి అంటాడు. ఎందుకంటే ఆ అమ్మాయి కొత్తగా కాపురానికి వచ్చినప్పటికీ భర్త దగ్గర సిగ్గుతో కానీ, భయ భక్తులతో కానీ ఉండకపోవడం, అతను రాత్రుళ్ళు పొద్దెక్కినా ఇంకా చదువుతూవుంటే ఇక చాలు పడుకోండని దీపం ఆర్పేయడం చేస్తుంది. కాబట్టి ఆమె ఇప్పుడు పుట్టింటికి వెళ్తుంది కదా, బాగా చదువుకుందాం అనుకున్నాడన్నమాట. కానీ ఆ రోజు రాత్రి అతనికి సరిగా నిద్ర పట్టలేదు. తనను అన్నం తినడానికి ఎవరూ పిలవలేదు, తానే వెళ్లి తల్లిని అడిగి పెట్టించుకుని తిన్నాడు. కాలేజీకి వెళ్ళాడు కానీ, రోజులా కాకుండా ఈ రోజు శర్మ చాలా చిరాకుగా వున్నాడు. సాయంత్రం గజిబిజిగా పడివున్న పుస్తకాలు చూసి, కొద్దిగా సర్దు, నా కలం

ఎక్కడుంది అని తల్లినడిగితే నాకేం తెలుసు? అన్నీ కోడలే చూస్తుండేది అనడంతో ఆమె లేని లోటు అతనికి తెలిసివస్తుంది. కానీ తనంతట తాను అత్తగారింటికి వెళ్లి, భార్యను పంపించమంటే అందరూ లోకువగా చూస్తారని అనుకుంటాడు. కానీ, అతని చదువు సరిగా సాగడంలేదు. అన్ని అవసరాలూ భార్య వున్నపుడు చక్కగా తీర్చేది. కానీ ఇపుడు అతనికి చాలా చిరాకుగా వుంది. అద్దం, దువ్వెనకు కూడా నేను లోకువైపోయాను, తనున్నపుడు ఎక్కడ పెడితే అక్కడ ఉండేవి అనుకోవడం అతని పసితనపు ఛాయలు ఇంకా పోలేదనిపిస్తుంది. ఇలా ఉండగా అతని తల్లి "కోడలు అక్కడుంటే ఇక్కడ ఎట్లా జరుగుతుందిరా?" అనే మాట అనడంతో అతనికి తనంతట తాను కాకుండా, తన తల్లి చెప్పింది కాబట్టి వచ్చానని చెప్పుకోవచ్చు అనుకుని అత్తగారింటికి బయలుదేరి వెళతాడు.

అక్కడ మామగారు ఉదయమే 10 గంటలకల్లా భోజనం చేసి బయటకు వెళ్లే అలవాటు, కానీ ఇతనికి ఉదయానాన్నే ఫలహారంగా ఇడ్లీలు తినకపోతే ఏదో వెలితిగా ఉంటుంది. ఇది తెలియని అత్తగారు అతను అక్కడకు వెళ్ళేటప్పటికే 9.30 ని. అవడంతో మరో అరగంటలో భోజనం చేస్తారు కదా అని కాఫీ మాత్రమే ఇస్తుంది. ఇతను బయట ఎవరినో కలవాలి అనే సాకుతో హోటల్‌కి వెళ్లి ఇడ్లీలు తినేసి వస్తాడు. వచ్చిన వెంకటనే అత్తగారు భోజనం వడ్డించడంతో తినలేక అవస్థపడుతుండటం చూసి ఏమైంది నాయనా అని అడిగితే, ప్రయాణం చేసి వచ్చానుకదండీ, అందుకే ఆరోగ్యం సరిగా లేదని తప్పించుకుంటాడు. కొద్దిగా పెరుగుతో అయినా తినమనేసరికి, ఒక ముద్ద నోట్లో పెట్టుకునేసరికి అతనికి ఆకలి అనిపిస్తుంది. కానీ మళ్ళీ అన్నం వేయించుకోవడానికి మొహమాటపడతాడు.

మొత్తానికి శర్మ తెలివితక్కువవాడు. ఎదుటివారు తన గురించి ఏమనుకుంటారోనని తన ఆకలిని దాచుకుంటాడు. కానీ ఆకలికి ఆగలేని ప్రాణం. ప్రయాణ బడలికతో ముసుగుతన్ని పడుకుంటాడు. దానితో అతను బాగా నిద్రలో ఉండగా మరదలి పిల్ల వచ్చి, అతనిని లేపుదామని చెయ్యి పట్టుకునేసరికి ఒళ్ళు వెచ్చగా ఉండడంతో బావగారికి జ్వరం వచ్చిందని తల్లితో చెబుతుంది. దాంతో ఆవిడ అతని పరిస్థితి గురించి చుట్టుపక్కల వారికి చెప్పగా, దీనికి పథ్యం ఒకటే మార్గమని చెప్పడంతో సాయంత్రం కూడా అతనికి కేవలం కాఫీ మాత్రమే ఇస్తారు.

శర్మ భార్య కనుక ఒకసారి అతని దగ్గరకు వస్తే అసలు విషయం చెప్పేవాడే, కానీ ఆ పిల్లను ఇతనికి ఆరోగ్యం బాలేదని అతని దగ్గరకు వెళ్లొద్దని ఆమె తల్లి చెప్పింది. రాత్రికి కూడా అతనికి భోజనం పెట్టకుండా పాలు మాత్రమే ఇచ్చేసరికి, ఉదయం నుండి ఆకలితో వున్న శర్మకు నిద్రపట్టలేదు. కొంచెంసేపటికి భార్య ఇతనిని చూద్దామని ఎవరూ చూడకుండా వస్తుంది. భార్య రాగానే నవ్వుతూ పలకరిస్తే, తనకేమీ జబ్బు చేయలేదని అనుకునేది. కానీ భార్య రావడం గమనించి, మళ్ళీ తెలివితక్కువ తనంతో ముసుగుతన్ని అటువైపుకి తిరిగి పడుకుంటాడు. చివరికి జరిగిన విషయం చెబుదామన్నా సిగ్గుతో చెప్పలేక, తనకు ఆకలిగా వుంది అని మాత్రం నెమ్మదిగా చెబుతాడు. అలా నెమ్మదిగా చెప్తే ఆపిల్ల అసలు నమ్మదు. కాబట్టి అతను గట్టిగా మళ్ళీ నాకు ఆకలిగా వుంది అంటాడు. కానీ ఆ అమ్మాయి మరో విధంగా అర్థం చేసుకుని అక్కడినుండి వెళ్ళిపోతుంది. తర్వాతి రోజయినా అతనికి అన్నం పెట్టారా, లేదా అనేది మాత్రం కథకుడు చెప్పలేదు. కానీ శర్మ వంటి తెలివితక్కువ వాళ్ళు ఈ ప్రపంచంలో ఎలా బ్రతుకుతారా అనేదే ప్రశ్న. ఈ కథలో మనకు శర్మ అత్తగారింటి దగ్గర మొహమాటం, తెలివితక్కువ తనం తోనూ పడేపాట్లు పాఠకులకు వినోదంతో పాటు, మనకు అతనిపై జాలిని కూడా కలిగిస్తాయి. ఏం చేస్తే ఎవరేమనుకుంటారో అనే బిడియం, లేనిపోని డాంభికం మనకు నవ్వు తెప్పిస్తాయి.

ఈ విధంగా మునిమాణిక్యంగారి కథలలో పాత్రలన్నీ పాఠకులకు హాస్యాన్ని అందించి, ఆనంద పరవశులను చేస్తాయి. మనసుకు ఆహ్లాదాన్నందిస్తాయి. ఆయన కథలు చదువుతున్నంత సేపూ మన పెదవులపై చిరు మందహాసం నాట్యం చేస్తున్నదన్న మాట.

ఆధార గ్రంథం: అల్లుళ్ళు – ముని మాణిక్యం నరసింహారావు

# పొత్తూరి విజయలక్ష్మి రచనలు – హాస్య పరిమళం

డిట్టకవి తిరుమల శ్రీనివాస్
పరిశోధక విద్యార్థి
తెలుగు ప్రాచ్యభాషా విభాగం
ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయం,
గుంటూరు, ఆంధ్రప్రదేశ్
సెల్ నెం.9491511015

**ఉపోద్ఘాతం:-**

మనిషి సంఘజీవి, తన జీవన పోరాటంలో ఎన్నో సమస్యలు, శారీరకంగా, మానసికంగా అలసిపోతున్నాడు. కష్టసుఖాల మేళవింపుతో కాలంతో పరుగులు తీస్తున్నాడు. కాస్తంత సేద తీరాలి. ఊరట పొందాలి. విశ్రాంతి కావాలి. ముకుళించిన ముఖం విచ్చుకోవాలి. ఏదో తెలియని ఆనందానుభూతి చెందాలి. ఈ సమయాన తప్పనిసరిగా ఓ నవ్వు కావాలి. ఓ నవ్వు నవ్వాలి.

"శృంగార హాస్యకరుణ రౌద్ర వీర భయానకాః
భీభత్సాద్భుత శాంతాశ్చ నవనాట్యే రసాస్మృతాః"

అని నవరసాలను ఆలంకారికులు నిర్ణయించారు. ఒక్కొక్క రసము స్థాయీ భావములను ప్రకటిస్తూ విశ్వనాథుడు తన సాహిత్య దర్పణంలో 'హాస్య రసానికి' హాసమని పేర్కొన్నాడు.

" మన స్థితికి, వాతావరణానికి మధ్య అసాంగత్యం ఉండి, దాని ఫలితంగా ఘర్షణ సాగినప్పడే హాస్యం ఉత్పత్తి అవుతుంది." అని కొడవటిగంటి కుటుంబరావు గారి భావన.

తెలుగు సాహిత్యంలో హాస్యరచనలను పరిశీలిస్తే గురజాడ అప్పారావు గారి 'గిరీశం' ; చిలకమర్తి గారి 'గణపతి' మొక్కపాటి నరసింహశాస్త్రి గారి 'పార్వతీశం' ; పాత్రలు చేసిన అల్లరి పఠితల హృదయాలను పరవశింప చేశాయనడంలో అతిశయోక్తి లేదు.

సంస్కృతాంధ్ర అవధాన ప్రక్రియ 'అప్రస్తుత ప్రసంగం' నవ్వుల పరిమళాలను వెదజల్లుతూనే ఉంది.

సున్నితంగా హాయిని గొల్పే హాస్యాన్ని పండించినవారిలో సినీ రచయిత దర్శకులు హాస్య బ్రహ్మ 'జంధ్యాల' సాధించిన విజయం అపూర్వం.

తెలుగుసాహిత్యంలో హాస్యరచయితల రచనలు విరివిగా లభిస్తున్నాయి. కానీ రచయిత్రులు హాస్యరచనలు చేయటం అరుదుగా కనిపిస్తుంది. 'అత్తగారి కథలు' తో భానుమతీ రామకృష్ణగారు చక్కని హాస్య రచన చేసి పేరుపొందారు.

అశ్లీలతకు, అపహాస్యానికి తావు లేకుండా హాస్యరచనలు చేసిన వారిలో 'పొత్తూరి విజయలక్ష్మి' గారు ప్రసిద్ధి చెందారు.

**రచయిత్రి - జీవనరేఖలు**

పొత్తూరి విజయలక్ష్మిగారు 18-07-1953న గుంటూరు జిల్లా, బాపట్ల తాలూకా యాజలి గ్రామంలో జన్మించారు. సత్యవాణి, వెంకటకృష్ణమూర్తి వీరి తల్లిదండ్రులు. 1982లో రచనా వ్యాసంగం ప్రారంభించారు. మొదటి నవల 'ప్రేమలేఖ' ఈ రచన 'శ్రీవారికి ప్రేమలేఖ' సినిమాగా వచ్చి విజయం సాధించింది. వందల కొద్దీ హాస్యకథలు, నవలలు, రేడియో ప్రసంగాలతో, విశేషకీర్తిని పొందారు. తన రచన పటిమతో పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం వారి ధర్మనిధి పురస్కారం, శేషారత్నం స్మారక హాస్యకథాపురస్కారం అందుకొన్నారు.

**హాస్య పరిమళం :**

పొత్తూరి విజయలక్ష్మిగారు తన తొలి కథను 'స్క్రిప్ట్ సిద్ధంగా వుంది - సినిమా తియ్యండి' అనే పేరుతో వ్యంగ్య రచన చేశారు. హాస్యాన్ని అపహాస్యం చేయకుండా ఆరోగ్యకరమైన హాస్యం రాసి చదువరులను ఆకట్టుకోవాలనే కారణంతో హాస్యరచనలు చేశానని, అందువలన తనపై హాస్యరచయిత్రిగా ముద్రపడిందని విజయలక్ష్మిగారు చెప్పారు.

" చిన్నతనం నుండి హాస్యపూరితమైన వాతావరణంలో పెరిగినందువలన హాస్యం నా జీవితంలో ఓ భాగం అయిపోయింది. ఆ ప్రభావం నా రచనల్లో కనిపిస్తుంది" అని రచయిత్రి ప్రకటించారు.

"చేతికి చెప్పు తొడుక్కోవాలి' ఈ శీర్షిక చూడగానే గమ్మత్తుగా ఉందనిపిస్తుంది. జూలకల్లు పలనాడు ప్రాంతంలో వుంది. అక్కడ ఎఱ్ఱతేళ్ళు ఎక్కువగా కనిపించేవట. తేళ్ళు కాళ్ళకింద మాత్రమే ఉండవు. అలమరాల్లో, పెట్టెల్లో, పుస్తకాల మధ్య 'ఇందుగలవు అందులేవు" అన్నట్లు ఎక్కడ చూసినా ప్రత్యక్షం. కిం కర్తవ్యం? "ఉపాయం తెలియని వాడిని ఊళ్ళోంచి వెళ్ళగొట్టండి" అని సామెత చెప్పినట్లు నాన్నగారు ఉపాయాలకు పెట్టింది పేరు. ఏ సమస్యకైనా పరిష్కారం ఆలోచించేవారు. ఆ క్రమంలోనే చేతులకు సరిపడే చిన్న సైజువి కొనుక్కొచ్చి ఇంట్లో పెట్టారు. అందరం చేతికి చెప్పు తొడుక్కొని తేలు సంహారం చేయాలి". రచనలో సహజత్వం, సరళత కనిపిస్తాయి. హాస్యానికి పెద్దపీట వేస్తాయి.

- సంప్రదాయ కుటుంబాలలోని ఆత్మీయతలు, ప్రేమలు, పెద్దవారి ఛాదస్తం, కుర్రవాళ్ల కోపతాపాలను వండి వడ్డించిన విజయలక్ష్మిగారి రచనా శైలి అద్భుతం. గాడి పొయ్యిమీద వంటలు, మూడు రోజుల పెళ్లి, ఆరుపూటలా వేసినవి వెయ్యకుండా వుండాలి. రకరకాల కూరలు పచ్చళ్ళు, పిండివంటలు, ఏ పూట ఏ వండాలో పెద్దలు వంటవాళ్ళు కలిసి రౌండ్‌టేబుల్ సమావేశం. నిజంగా చెప్పాలంటే విజయలక్ష్మిగారి రచన "గాడిపొయ్యి" వంట పసందుగా ఉంది.

- రచయిత్రి గారి చిన్నతనంలో కరెంటు ఉండేది కాదు. కోడిగుడ్డు దీపాలు. లాంతర్లు, " ఆ కరెంట్ ప్రమాదకరమైనదిట కదా! మన పార్వతమ్మ వదినగారి చుట్టం బెడవాడలో కరెంట్‌కి అతుక్కుపోయి గుటుక్కుమన్నారట".

ఇలాంటి మాటలను మనం వింటూనే ఉంటాం. అమ్మమ్మ పాత్ర హాస్యాన్ని ప్రదర్శించింది. మొదటగా కరెంట్‌ను ఇష్టపడని అమ్మమ్మ, కరెంట్ వెలుగులో తన హోదా పెరిగినట్లుగా భావించడం నవ్వు తెప్పిస్తుంది.

'కారులో షికారు' కథలో కారు పదే పదే చెడిపోవడం; 'కరణంగారి అల్లుడు గారి కారొచ్చింది' అని చుట్టుప్రక్కల చేలల్లో పనిచేసే జనం వచ్చి ఊళ్ళోకి కారును తోసుకుంటూ రావడం పాఠకులను కడుపుబ్బ నవ్విస్తాయి.

'చదువు మధ్యలో ఏదో కాస్త'హ - కథ ఆద్యంతంగా నవ్విస్తుంది. అమ్మమ్మ తిండి విషయంలో మనవరాలిని సమర్థించడం, చిరుతిళ్ళు, మరచెంబు, వంటి వాటిని చెబుతూ 'శతకోటి దరిద్రులకు అనంతకోటి ఉపాయాలు' అంటూ రచయిత్రి నవ్వు పుట్టించారు.

'మా మహిళాదినోత్సవం' రచన ఆసక్తికరంగా సాగింది. ప్రత్యేకమైన కార్యక్రమం చేయాలనుకున్న మహిళలు సమావేశమయ్యారు. ఏదేదో చెయ్యాలనుకొన్నారు. ఎవరి అభిప్రాయాలు వారు చెప్పారు. చర్చించారు. ఇంతలో ఫోన్ వచ్చింది. పనిమనిషి రాలేదని చెప్పింది. మరొకరి ఇంట్లో పనిమనిషి రెండురోజుల దాకా రానని ఫోన్ చేసింది. అందరూ నిట్టూర్చారు. విజయలక్ష్మి గారు ఈ రచనలో మహిళల ఆలోచనలకు ప్రాతిపదికగా తీసుకొని హాస్య చతురతను ప్రదర్శించి మాటలు కోటలు తప్ప చేతలలో ఏమీ లేదన్న సత్యాన్ని వ్యంగ్యంగా చెప్పారు.

తాతయ్యలు, అమ్మమ్మలు, నాయనమ్మలు దగ్గరి బంధువులు, చిన్ననాటి ఆటపాటలు; ఆప్యాయతలు అనుబంధాలకు ప్రాధాన్యమిచ్చే గొప్ప మనసున్న వ్యక్తులు ; పండుగలు, పెళ్లిళ్ళు, వేడుకలు - నిర్మలమైన మనసులు ఇవే పొత్తూరి విజయలక్ష్మిగారి రచనలలోని పాత్రలు. హాస్యం అంటే వెకిలితనం, అపహాస్యం కాకూడదని, సున్నితమైన హాస్యం మనిషికి

స్వాంతన ఇస్తుందని విజయలక్ష్మిగారి విశ్వాసం.

మన కవికోకిల గుర్రం జాషువా గారు నవ్వును గూర్చి చెప్పిన పద్యం.

"నవ్వవు జంతువుల్, నరుడు నవ్వును నవ్వులె చిత్తవృత్తికిం
దివ్వెలు కొన్ని నవ్వు లెటు తేలవు కొన్ని విషప్రయుక్తముల్
పువ్వుల దోలె ప్రేమ రసముం గురిపించు విశుద్ధమైన లే
నవ్వులు సర్వదుఃఖ దమశంబులు వ్యాధులకున్ మహౌషధుల్"

ఈ సృష్టిలో ఏ జంతువు నవ్వలేదు. మనిషి మాత్రమే నవ్వగలడు. నవ్వులు మనోవికాసానికి దివ్వెలు. కొందరు ఎందుకు నవ్వుతారో తెలియదు. కొన్ని నవ్వులు విషపు నవ్వులు. పువ్వుల్లా ప్రేమరసాన్ని కురిపించే విశుద్ధమైన లేతనవ్వులు సమస్త దుఃఖాన్ని పోగొడతాయి. అని వ్యాధులకు ఔషధాలుగా పనిచేస్తాయి.

**ఉపసంహారము :**

నేటి యువత వెకిలితనాన్ని హాస్యమని భ్రమించి సున్నితమైన హాస్యాన్ని ఆస్వాదించలేకపోతున్నారు. పవిత్రంగా, నిష్కల్మషంగా, పరిశుద్ధంగా, సహజమైన రీతిగా మనలో నుండి మన చుట్టూ ఉన్న సమాజంలో నుండి మన కుటుంబం నుండి ఇచ్చి పుచ్చుకొనే హాస్యం రావాలి. పొత్తూరి విజయలక్ష్మిగారు ఇదే ఒరవడితో తన సాహిత్యాన్ని హాస్యరసప్లావితం చేశారు. తెలుగు సాహితీనందనోద్యాన వనంలో హాస్యరస పరిమళాలను వెదజల్లిన రచయిత్రిగా పొత్తూరి విజయలక్ష్మి గారు చిర యశస్వి అయ్యారు.

**ఉపయుక్త గ్రంథసూచిక:**


1. పొత్తూరి విజయలక్ష్మి హాస్య కథలు - పొత్తూరి విజయలక్ష్మి
   ప్రచురణ - శ్రీ రిషిక పబ్లికేషన్స్, హైదరాబాద్
2. కొంచెం ఇష్టం కొంచెం కష్టం - పొత్తూరి విజయలక్ష్మి
   ప్రచురణ - శ్రీ రిషిక పబ్లికేషన్స్, హైదరాబాద్
3. జ్ఞాపకాలు జావళి - రచన - పొత్తూరి విజయలక్ష్మి
4. హాస్యకుసుమావళి - మునిమాణిక్యం నరసింహారావు
   - మానస పబ్లికేషన్స్
5. సాహిత్య సోపానములు - రచన - దివాకర్ల వెంకటావధాని
6. జాషువ రచనలు - మూడవ సంపుటం - కొత్తలోకం
   - విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
   హైదరాబాద్

# భమిడిపాటి సోమయాజి కథలు - హాస్యరస పోషణ

**మొండి స్వామి**
పరిశోధక విద్యార్థి,
తెలుగుశాఖ,
ఆంధ్ర విశ్వకళాపరిషత్, విశాఖపట్నం.
చరవాణి : 89852 53647
ఇ-మెయిల్ : swamychinna76@gmail.com

*"శృంగార హాస్యకరుణ రౌద్ర వీర భయానక:*
*భీభత్సాద్భుత శాంతశ్చనవనాట్యే రసా:స్మృతా"*

అని చెప్పిన నవరస సిద్ధాంతంలో భరతముని శృంగారానికి ప్రథమ స్థానం ఇస్తే, హాస్యానికి ద్వితీయ స్థానం ఇవ్వడం జరిగింది. ఈ హాస్యాన్ని

*"వికృతాకార వాగ్వేష చేష్టాదే ర్కుకాద్భవేత్*
*హాస్యోహాస: స్థాయీ భావ"* అని సాహిత్య దర్పణం పేర్కొంది. హాస్యానికి స్థాయీ భావం హాసం. ఈ హాసం అనేది విభావానుభావ వ్యభిచారీ భావాల కలయిక వలన సామాజికునిలో పైన చెప్పినట్లు వికృతమైన ఆకారము, భాష, వేషము, చేష్టలు మొదలగు వాటి వలన కలుగుతుంది. సామాజికుడు పైన చెప్పిన వికృతాకార వాగ్వేష చేష్టలు గల ఎవరిని చూసి నవ్వుతాడో వారే ఆలంభన విభావం, వారి చేష్టలే ఉద్దీపనా విభావం, కళ్ళు మూసుకోవడం నవ్వడం మొదలగునవి వ్యభిచారీ భావాలు. ఈ అనుభవాలను బట్టి ఈ హాస్యం ఆరు విధాలు అని ఉత్తములకు స్మితము – హసితము, మధ్యములకు విహసితము – అవహసితము, నీచులకు అపహసితము – అతిహాసితము కలుగుతాయని లాక్షణికులు పేర్కొన్నారు. ఈ హాస్యం ప్రతీ భాషలోనూ లిఖిత అలిఖిత సాహిత్యంలో గమనించవచ్చు. ముఖ్యంగా వాగ్రూపమైన అంశాలలో గేయాలు, సామెతలు, జాతీయాలు, వెటకారపు పలుకుబడులు, మొదలైన రూపాల్లో ఉంటే, సాహిత్యంలో కావ్యాలు, ప్రబంధాలలో రేఖామాత్రంగా ఉన్న హాస్యం నాటకం, నాటిక మొదలైన రూపక ప్రక్రియల్లో కేవలం హాస్యం కొరకు మాత్రమే కొన్ని పాత్రలు ప్రవేశపెట్టడం జరిగింది. అదే విధంగా హాస్యం ప్రధాన రసంగా ప్రత్యేకంగా కొన్ని శతకాలు, నవలలు కథలు రాయడం జరిగింది. తెలుగు సాహిత్యంలో వివిధ సంఘటనల ఆధారంగా వివిధ పాత్రల ద్వారా హాస్యం పుట్టించడం కోసం అనేకమైన ఇతివృత్తాలను కల్పిస్తూ ఎంతోమంది కవులు కథలు రాయడం జరిగింది. ఈ కథలలో జంట పాత్రల ద్వారా అనగా అత్తా కోడళ్ళు, బావ బావమరుదులు, స్నేహితులు, గురుశిష్యులు ఇలా అనేకమైన పాత్రలు ద్వారా హాస్యాన్ని సృష్టించడం గమనించవచ్చు. అత్తాకోడళ్ళ కథలకు భానుమతి గారి అత్తగారి కథలు, భార్య మీద మునిమాణిక్యం గారి కాంతం కథలు మొదలైనవి ముఖ్యమైనవి. అయితే కుటుంబ ఇతివృత్త చిత్రణతో రచయిత "భమిడిపాటి సోమయాజి" గారి "శిష్యునికి పంగనామాలు" అను కథల సంపుటి కూడా సునిశితమైన హాస్యంతో రాసిందనే చెప్పవచ్చు.

హాస్య రసపోషణలో భమిడిపాటి సోమయాజిగారు విలక్షణమైన ఇతివృత్తాలతో కథలు రాయడం

జరిగింది. ఈయన పుట్టుక, విద్యాభ్యాసం రాజమండ్రిలో జరిగింది. ఈయన పూర్తి పేరు భమిడిపాటి దత్తాత్రేయ సోమయాజి శాస్త్రి. బి.ఎ. చదివిన ఈయన సీనియర్ ఆడిట్ ఆఫీసర్‌గా హైదరాబాద్‌లో పని చేసారు. ఈయన ఆగష్టు 2003లో కథలు రాయడం ప్రారంభిస్తే మొదటి కథ ఆంధ్రభూమి మాసపత్రికలో మార్చి 2004లో అచ్చయింది. ఆ విధంగా మాసపత్రికలు, వార పత్రికలు, ప్రత్యేక సంచికల్లో ఫిబ్రవరి 2007 నాటికి ఏబై నాలుగు కథలు అచ్చయినాయి. అదే విధంగా కొన్ని జోక్స్, కొద్దిపాటి కవితలు కూడా వివిధ పత్రికల్లో ముద్రితమైనవి. సోమయాజిగారు కుటుంబ నేపథ్యాన్ని ప్రధాన ఇతివృత్తంగా గ్రహించి చక్కని హాస్యంతో పాఠకులను నవ్వించడంలో విజయవంతమైనారు. ఈయన కథలు సరళభాషలో చిన్న చిన్న ఇతివృత్తంతో, తక్కువ నిడివితో కథలు రాస్తూ చెప్పదలుచుకున్న అంశంలోనే హాస్యాన్ని విరభూస్తూ రచించడంలో సోమయాజిగారు నిష్ణాతులనే చెప్పవచ్చు. ఈయన కథల్లో కొన్నింటిని గమనించినట్లయితే

స్వగృహ సంగీతోత్సవాలు కథలో శాస్త్రీయ సంగీతం నేర్చుకున్న పెద్దకోడలు సంగీత లక్ష్మి వేకువజామున చేసే సంగీత సాధన మామయ్య పరబ్రహ్మానికి ప్రాణ సంకటంగా మారుతుంది. ఒకసారి కోడలు అత్తగారితో “మనకి ఇంత పెద్ద హాలు వుంది కదా! యీ ఏడాది త్యాగరాజోత్సవాలు మనింట్లో చేద్దామండి” అంటుంది. దానితో గుండె గుభేలయిన మామగారు రోజూ నువ్వేపాడితే ఆరాధనోత్సవాలు రక్తి కట్టవనీ, ఆ విధంగానైనా ఆపేయ వచ్చనే ఉద్దేశం. దానితో కోడలు మా అక్క చెల్లెళ్ళు, మా మేనత్తలు కూడా సంగీతంలో ప్రావీణ్యం కలవారే అనీ, వాళ్ళని ఒక పది రోజులు దింపేస్తాను అంటుంది. సరే అనక తప్పలేదు పరబ్రహ్మంకి. స్వగృహ సంగీతోత్సవాలు పేరుతో బోర్డు పెట్టి మొదటి రోజు గడిచిన తరువాత రెండవనాడు మొదటి రోజు వచ్చిన వారిలో మచ్చుకైనా ఎవరూ రాలేదు. కోడలి మేనత్త త్యాగరాజ కీర్తన అంటూ “ఏ తీరుగ నను దయ చూసెదవో” అనగానే ప్రేక్షకుల్లో ఎవరో అరిచారు అది త్యాగరాజ కీర్తన కాదు, భక్త రామదాసు కీర్తన అని, దానితో ఆవిడ ఏదో ఒకటి విని చావండి! ఆ కాఫీ టిఫిన్లెందుకు పెడుతున్నారనుకున్నారు. ఇలాంటివి సర్దుకుపోవడానికే అంటుంది. మర్నాడు కోడలు రెండవ మేనత్త అన్నమయ్య కీర్తన అని “ఎందరో మహానుభావులు” కీర్తన పాడగానే అది త్యాగరాజు రాసిన పంచరత్న కీర్తనల్లో ఒకటని అరిచారు శ్రోతల్లో ఒకరు. ఈ విధంగా అపశ్రుతులతో అబాసుపాలైన సంగీతోత్సవాలను అర్ధాంతరంగా ఆపివేస్తాడు పరబ్రహ్మం. ఇక రెండవ కొడుక్కి మాత్రం శాస్త్రియ సంగీతం వచ్చా? లలిత సంగీతం వచ్చా? అసలు పాడగలవా? అని అనేక ప్రశ్నలు వేసి గొంతు విప్పలేదని చాలా రూఢిగా తెలుసుకుని ఒక పిల్లని కోడలిగా తెచ్చుకున్నారు పరబ్రహ్మం దంపతులు.

అదే విధంగా పెళ్ళి ముచ్చట్లు అన్న కథలో ఉష తన భర్త కృష్ణవంశితో కలసి చెల్లెలి పెళ్ళికి వస్తుంది. ఆమె భర్తకు మెల్లకన్ను, నిద్రలో నడిచే అలవాటుతో పాటు “మ” పలకలేక “క” ఉచ్చరిస్తాడు. దానితో పెళ్ళిలో జరిగిన సంఘటనలలో అనుమాన ప్రమాణ రీతిలో జరిగిన హాస్యం ఎంతో చక్కగా వుంటుంది. అమెరికా నుంచి వచ్చిన ఉష మేనత్తకి మగాళ్ళ మీద సదభిప్రాయం లేకపోవడంతో కృష్ణవంశీ యొక్క చేష్టలు ఆవిడకు అనుమానం కలిగిస్తూ పాఠకులను హాస్యంతో ముంచెత్తుతాయి. ముఖ్యంగా మొదటి రోజు అందరూ మేడ మీద పడుకోగా కృష్ణవంశీ నిద్రలో నడిచి అత్తయ్య పక్కనే పడుకోవడం, అదే విధంగా కృష్ణవంశీ టీ అందిస్తుండగా కొంచెం టీ చుక్కలు ఆమె తెల్లచీరపై పడగా అక్కడ పాలు వేస్తే మరకలు తొందరగా పోతాయని అనగానే, పక్కనే అంత్యాక్షరి పాటలు పాడుకుంటున్న పిల్లలు “పాలు కావాలా మురిపాలు కావాలా” అని పాడితే మరొకడు “తెల్ల చీర కట్టుకున్న దెవరి కోసమో, మల్లెపూలు పెట్టుకున్న దెవరి కోసమో” అంటూ పాడుతుంటే ఇదంతా కృష్ణవంశీ చేయిస్తున్నాడేమో! అనే అనుమానం కలుగుతుంది అత్తయ్యకు, అదే విధంగా పెళ్ళి నుండి వీడ్కోలు

సమయంలో ఉష అత్తయ్యతో "చాలా సంతోషం అత్తయ్య, నువ్వు ఈ పెళ్ళికైనా వచ్చావు అంటుంది. దానితో అక్కడకు వచ్చిన వంశీ అత్తయ్యతో మీరు సంతోషించాలి. మనం ఒకర్నొకరు కిస్ చేసుకోనందుకు అనగానే అత్త ఓపిక నశించి సాచి దవడపై ఒక లెంపకాయ లాగింది. దానితో అవాక్కయిన ఉష అత్తయ్యతో "మ" పలకడం రాదని చెపితే ఇక అత్తయ్య అవాక్కయ్యారు.

ఇక మానస రమణీయం కథలో కూడా సోమయాజీ గారు కుటుంబంలో ఉన్న వ్యక్తుల మధ్య గల అంతరాలను తెలియజేస్తూనే హాస్యం పుట్టించారు. మానసను మేనత్త కొడుకు జానకికి ఇద్దామని ఆనంద్ భార్య ఆశాలతతో అంటే, ఆనంద్ అక్క మాత్రం జానకి అమెరికా వెళతాడనీ, వీసాకు డబ్బులు లేవని ఫోన్ చేయగానే ఆశాలత కల్పించుకుని మీ అక్క పని నేను పడతాను అంటూ ఫోన్ చేసి, మానసకు అమెరికా సంబంధం వచ్చిందని చెప్పగానే కట్నంకు ఆశపడి పోతే ఉన్నదీ పోతుందని భయంలో మానసతో జనకీ రమణ పెళ్ళికి అంగీకరిస్తారు. అదే విధంగా మంగపతే తంగవేలు కథలో మంగ తన మేనకోడలు స్నేహితురాలి పెళ్ళికి వెళుతూ, తన హోదా, దర్పం చూపించి మగపెళ్ళివారిని చిత్తు చేయమని పెళ్ళి కూతురు చెల్లెలు అడగగానే ఏమీ తోచని మంగ తన భర్త మంగమతిని తనకు అటెండరుగా తంగవేలు పేరుతో అరవ మనిషిగా పంచెతో ముస్తాబు చేసి పెళ్ళిలో చేసిన హంగామా అంతా ఇంతా కాదు. పెళ్ళి రోజు రాత్రి కార్తీకమాసపు చలిలో వణుకుతున్న తంగవేలు. పడుకోవడానికి మంగ గదిలోకి వస్తానని అంటే అయ్యో! మీ విద్దూరం మండా? ఎవరైనా చూస్తే నా పరువేం గాను? మీతో అక్రమ సంబంధం ఉందని నా మొహం మీద ఉమ్మేస్తారు అంది మంగ. నీ మొహం మండా! మొగుడుతో అక్రమ సంబంధం అనుకోవడమేమిటీ? అని "ఎంకి పెళ్ళి సుబ్బి చావుకు వచ్చిందనీ "ఏడుస్తుంటే అదే పెళ్ళిలో మంగపతి బాల్య స్నేహితుడు ఆర్ముగం మంగపతిని చూస్తూ తన స్నేహితుడు పతి అని అనుమానిస్తూ ఉండడం వంటి సంఘటనలు కూడా పాఠకులను హాస్యంతో ముంచెత్తుతాయి.

మరొక కథలో పెళ్ళై సంవత్సరం అయిన వేణు తన భార్య వసుంధర యొక్క నూతన వంటల ప్రయోగాలతో చిక్కి శల్యమవడం, ఆ వంటలు తిని ఆఫీసు స్నేహితులు కూడా మరి జన్మలో ఇంటికి రాకపోవడం వంటి సమస్యలతో ఒకరోజు వాసు గుమ్మంలోకి అడుగు పెట్టగానే చేతిలో కప్పుతో చెంచా పట్టుకుని నిలబడి ఉన్న వసుంధరని చూస్తూనే గుండె జారినంత పనయింది. చెంచాతో ఆ పదార్థం కొంచెం రుచి చూసి మైసూర్ పాక్‌లానే ఉందనుకున్నాడు. కానీ తను తినే పదార్థాలు ఏమిటనే నిశ్చయానికి వేణు తనంతట తాను రాడు, అంతకుముందు తను చెప్పిన పేర్లు తప్పని తేలింది అందుకు ఈసారి కూడా వసుంధరనే అడిగాడు. వసుంధర అది "ఎల్.ఎల్.పి" అనగానే అది ఏమైనా ఇంగ్లీష్ డిష్షా? అంటే "కాదండీ మన ఇండియాదే లిక్విడ్ లక్నోపాక్ అంటుంది, ఆ వంటలు పాపం కుక్కలు ముట్టవు. అందుకే వేణు "ఏది ఏమైనా ఒక కొత్త ఐటమ్స్ చేయడం, బారసాల చేయడం, శునకాల సహనం పరీక్షించడం చెయ్యకే? వసుంధర అంటే భూమి అని అర్థం కథా ఈ భూమ్మీ దున్న ప్రాణికోటిని రక్షించు" అంటూ వాపోయాడు పాపం. అదే బ్రహ్మ పదార్థాన్ని పని మనిషికి ఇస్తే అది తిన్న ఆ కుటుంబం మొత్తం గుజ్యా జ్వరం వచ్చినంత బాధపడ్డారు. అప్పటి నుండి ఆ పని మనిషి పని మానేస్తే వేణూయే ఇంట్లో అంట్లు తోమేవాడు.

జీవితంలో మనుషులకు ఎన్నో పనులు, ఒత్తిడి వ్యాపకాలతో గందరగోళంలో పడిపోతున్న వారికి, మన నిత్య జీవితంలో కొంతవరకు ఊరట అందించి బ్రతుకును ముందుకు సాగేలా శక్తినిస్తుంది హాస్యం. ఈ

సంపుటిలో శర్మ గారు మన చేత చదివిస్తున్న కథలేవీ పెద్దవి కావు. సుదీర్ఘ వర్ణనలతో సాగదీసి విసిగించవు. నిత్య జీవితంలో మన అనుభవాల్లోని సంఘటనలే తేలికపాటి హాస్యంతో మనకు గుర్తు చేసి మన కళ్ళముందు నిలిపి ఎంతో ఉపకారం చేస్తాయి. ఇలాంటి రచనలు ఈ రోజుల్లోని నిరామయ జీవితానికి అవసరమనే చెప్పవచ్చు.

ఎందుకంటే ఈ కథల్లోని విలక్షణమైన పాత్రలు వాటి మాటతీరు మధ్యలో రచయిత వ్యాఖ్యానాలు బరువైన మనసుల్ని తేలికపరుస్తాయి. ఈ కథల్లో ముఖ్యంగా కొన్ని ప్రత్యేక పాత్రలుగా...

కాపురానికి వచ్చాక స్వీట్ల తయారీలో సరికొత్త సాహస ప్రయోగాలు చేస్తూ భర్త చేత అంట్లు తోమించే వసుంధరలు, వారం రోజులు పాటు తిష్ట వేసి భోజన పానీయాలే కాక, దక్షిణ తాంబూలాలతో ఉడాయించిన బంగారు మామలు, క్లినిక్‌లో పని పక్కన పెట్టి కథలు రాసి లోకాన్ని కష్టాలు పాలు చేస్తున్న భర్తకు కర్తవ్య భోద చేసిన శ్రీమతి శంకర్‌లు, ఇల్లరికంలో ఉన్న మజాని ఆస్వాదిస్తూ, మార్బుల్ గచ్చు తుడిచే కామేశులు, భర్తను రచయితగా చూడాలని ట్రైనింగ్ ఏర్పాటు చేసి, ట్రైనర్ చేతిలో డబ్బులు మోసపోయిన పంకజాలు, వేపుకు తినే ఇద్దరు అల్లుళ్ళతో వేగలేక విసిగి మూడో అల్లుడిగా వెర్రిబాగుల వెంకన్న అయినా ఊపిరి పీల్చుకోవచ్చునని రాజీపడే అత్తమామలు, స్వదేశీ రుచులకు మొహం వాచి వచ్చినప్పుడల్లా తన భార్యను వేదిస్తున్న అమెరికా అబ్బాయిలకు గుణపాఠం చెప్పిన అమల మామగారు, కుందనపు బొమ్మను విడిచిపెట్టి ఇచ్చిన మాట మార్చి ఆదాయం కురిసే మరో బొమ్మకు ఓటు వేసిన పండితాధములు, ఒక టీవి సెట్‌లో ఒకే సమయంలో ఎవరిక్కావలసిన చానెల్ వాళ్ళు చూసుకునే సౌలభ్యం లేక వచ్చిపడ్డ ఇక్కట్ల కథ మహారాజశ్రీ మనవలు, పెళ్ళయిన వెంటనే ఉద్యోగం, ఉద్యోగం దొరికిన వెంటనే ఊరు వదిలి సుదూరంగా బదిలీ చేయించుకోగల వ్యూహంలో తల్లిని మించి పోగల సుపుత్రుని కథ శుభకార్యేషు మంత్రి, పేకాట ప్రియుడు మూర్తి ముచ్చటగా సెల్‌ఫోన్ కొనుక్కుంటే వచ్చిపడ్డ ఇబ్బందుల కథ, సవరంతోనే వయ్యారాలు ఒలకబోస్తూ నిజం బయటపడేసరికి ఖంగుతిన్న జలజలు, వచ్చీరాని ఇంగ్లీషుతో పెళ్ళిలో హడావుడి చేసిన ఉషలు, పూజా కార్యక్రమాలతో భర్తను విసిగిస్తూ, నగలు పోయినా పర్వాలేదు పూజ పూర్తి చేస్తే చాలుననే గాయత్రిలు, ఇలా ఈ కథల నిండా ఎన్నో పాత్రల ద్వారా సోమయాజగారు పాఠకులను హాస్యంతో ముంచెత్తడంలో కృతకృత్యులయ్యారు.

ఈ కథలు ముఖ్యంగా వ్యక్తుల యొక్క దౌర్బల్యాలు, మానసిక చంచలత్వాన్ని మరియు వ్యక్తుల మధ్య గల వ్యంగ్యాత్మకమైన సంభాషణా చాతుర్యంతో పాటు పాత్రల యొక్క భాషా విధానం, వేషణ మొదలైన కారణాలు కూడా హాస్యరస పోషణలో తోడ్పడ్డాయని చెప్పవచ్చు. ముఖ్యంగా ఈ కథల యొక్క నిర్మాణ వైవిధ్యం, పాత్ర చిత్రణ, కథా సంవిధానంతో పాటు చిన్నపాటి ఎత్తుగడలు కథలను మలుపు తిప్పుతూ పాఠకులకు విస్మయంతో పాటు చిరుధరహాసాన్ని కలిగించడంలో ఉపకరిస్తున్నాయని చెప్పవచ్చు. ఈ విధంగా కవి హాస్య కథలలో సంపూర్ణ రసపోషణతో విజయవంతమైనారని భావించవచ్చు.

**ఆధార గ్రంథాలు :**

1) శిష్యునికి పంగనామాలు – భమిడిపాటి సోమయాజి
2) తెలుగు సాహిత్య విమర్శ – డా॥ బూదాటి వెంకటేశ్వర్లు
3) మన హాస్యం – ముని మానిక్యం
4) తెలుగు సాహిత్య సమీక్ష – డా॥ జి. నాగయ్య

# తెలుగు సాహిత్యంలో హాస్య పరిణామ వికాసం

**పంపోతు నాగేశ్వరరావు**
పరిశోధక విద్యార్థి,
తెలుగుశాఖ,
ఆంధ్ర విశ్వకళాపరిషత్, విశాఖపట్నం.
చరవాణి : 96030 65303
ఇ-మెయిల్ : nageswararaop06@gmail.com

తెలుగు సాహిత్యంలో కాని, సంస్కృత సాహిత్యంలో మరేతర సాహిత్యంలోనైనా అందరి యొక్క ఆదరణను పొందిన రచనా విభాగం ఒకటుంది అదియే హాస్యం. అది పండితుడు నుండి పామరుడు వరకు దాని విధి చదివిన వ్యక్తిని సంతోషంగా ఉంచడం. అందుకు కారణం అందులో హాస్యం తెప్పించే సంభాషణలు గానీ, పాత్రల యొక్క ప్రవర్తన గానీ, వారి హావభావాలను చదివి ఊహకల్పన చేసినప్పుడు వారి యొక్క ప్రతిరూపం తెరవెనుక కదిలే బొమ్మల రూపంలో మన మనస్సులో నాటుకుంటుంది. ఇలా నవ్వు తెప్పించే సందర్భాలు అనేక రూపాల్లో మనకు దర్శనమిస్తుంది. వాటిలో భాగంగా చెప్పినట్లయితే ముఖ్యంగా కథ, నవల, నాటకం, నాటిక, ప్రహసనం, వ్యాసం, కావ్యాలు, ప్రబంధాలు మొ॥ వాటిల్లో సందర్భానుసారంగా మరియు జానపద సాహిత్యంలో ప్రధానంగా ఈ హాస్య సంబంధ ఛాయలు మనకు దర్శనమిస్తాయి. ప్రస్తుత ఈ వ్యాస రచనా పరిధిని దృష్టిలో ఉంచుకుని తెలుగుదేశంలో జరిగిన హాస్య రచనా విధానాన్ని సూక్ష్మంగా అందించే ప్రయత్నం చేస్తాను.

గాంధర్వ వేద సృష్టికర్తగా పేర్గొంచిన భరతుని నాట్యశాస్త్రమున “శృంగార హాస్య కరుణ రౌద్ర వీర భయనకా:” మొదలగు రసముల్లో హాస్యమును ద్వితీయ ప్రాధాన్యతను కల్పించి తన లక్షణ గ్రంథమున పేర్కొన్నాడు. అసలు హాసము అంటే నవ్వు, దానిని నుండి వచ్చునది హాస్యము. హాస్యము దేని నుండి వస్తుంది వికృతాకార వాక్కు మరియు చేష్టలు వలన జనిస్తుంది. అందుకే ప్రముఖ లాక్షిణికుడైన విశ్వనాథుడు “వికృతాకార వాగ్వేష చేష్టా దేర్నర్త కాద్భవేత్ హాస్యో హాస స్థాయి భావ”[1] అని చెప్పియున్నాడు. కాబట్టి హాస్య సాంప్రదాయం మనకు ప్రాచీన కాలమునందు ఉన్న దాఖలాలు కనిపిస్తున్నాయి. తెలుగులో పాల్కూరికి సోమన పండితారాధ్య చరిత్రలోను, కొరవి గోపరాజు సింహాసన ద్వాత్రింశికలోని చింతచెట్టు వర్ణనలోని హాస్యం, శ్రీనాధుడి పల్నాటి వీర చరిత్రమున వేశ్యమాత వర్ణనము. ఆకార వికృతికి చెందిన హాస్యం. తెలుగు సాహిత్యంలో భావవిప్లవ కవిగా పేర్గాంచిన వేమన కవిత్వంలో అసలు సిసలైన హాస్యమును పొందుపరచియున్నాడు. ఇలా చెప్పుకుంటూ పోతే ఈ జాబితా ఒక చిన్నపాటి మిని గ్రంథమవడానికి అవకాశం ఉంది. కాబట్టి ఆధునిక కాలంలో వివిధ ప్రక్రియలలో హాస్య రచనలు చేసిన రచయితలను ఒకసారి స్మృతికి తెచ్చుకుందాం.

విభిన్న ప్రక్రియలలో వచ్చిన చాలా గ్రంథాల రచయితలు వారి రచనల్లో అక్కడక్కడ హాస్యాన్ని ప్రస్తావించారు. వారి అందరిని ఇక్కడ పేర్కొనడం సముచితం కాదు. వ్యాసంలో భాగంగా కొంతమందిని పేర్కొంటాను.

తెలుగు సాహిత్యంలో నిరూపమానమైన సృష్టి కాంతం పాత్ర. దానిని అచ్చమైన తెలుగు ఇల్లాలిగా తీర్చిదిద్దిన కథా యజమాని మునిమాణిక్యం నరసింహారావు. భార్యభర్తల మధ్యన జరిగే సునిశితమైన

సంఘటనలను హాస్యం అనే ఆయుధం చేతబట్టి హాస్య సంగ్రామ యుద్ధంలో దిగి ప్రత్యర్థులు అంటే కథను చదువుతున్న పాఠకులకు వారి ముఖమున నిరాశను వీడనాడి ముఖమున ఆనందమనే హాస్యాన్ని పూసి మెరిసిన కథనరంగవీరుడు మునిమాణిక్యం నరసింహారావు. వారి కాంతం పాత్రం కథా సాహిత్యంలో పూసిన తొలి కుసుమం అని చెప్పవచ్చును. తదుపరి చెప్పుకోవల్సిన రచయిత్రి భానుమతి రామకృష్ణ. వీరి అత్తగారి కథలకు రాష్ట్ర సాహిత్య అకాడమీ వారి బహుమతికి పాత్రమైనది. తెలుగు సాహిత్యంలో చిరకాలంగా నిలిచే అత్తగారి పాత్రను సృష్టించిన వీరు ఆ పాత్రకు సజీవత్వాన్ని నింపి పదాల పొందికలోనూ, కోడలిపై అత్తగారు యొక్క తెలిసి తెలియని వ్యంగ్య పూరితమైన అజమాయిషీని ప్రతి కథలోనూ, వాక్యంలోనూ భానుమతి రామకృష్ణ గారు చిత్రించిన విధము బహుదా ప్రశంసనీయము. దరిమిలా ముళ్ళపూడి వెంకటరమణ గారు హాస్య రచనలు చేసిన వారిలో ప్రముఖులు. వీరి కలం నుండి ఉద్భవించిన బుడుగు పాత్ర అంచెఅంచెలుగా వికాసం చెంది బాల సాహిత్యంలో తనదైన ముద్రను వేసింది. ఇంకా భమిడిపాటి కథల్లో, విశ్వనాథ, సత్యం శంకరమంచి, కో.కు, భమిడిపాటి, చిలుకూరి దేవపుత్ర మొ॥ ఎందరో, మరెందరో తమ కథా సాహిత్యంలో కొన్ని పాత్రలకు హాస్యమనే హరివిల్లును పూయించారు.

కథ తర్వాత చెప్పుకోదగిన వచన సాహితీ ప్రక్రియ నవల. తెలుగు నవల్లో కూడా కొందరు రచయితలు, రచనాంతము వరకు చక్కని తేటైన హాస్యమును నింపినవారు ఉన్నారు. వీరు సమాజంలో ఉన్న మూఢవిశ్వాసాలను, రూపుమాపడానికి కలాన్ని ఆయుధంగా ఎన్నుకుని ప్రక్షాళనకు ముందడుగు వేసారు. అటువంటి వారిలో ప్రథములు గద్య తిక్కనగా ప్రసిద్ధి గాంచిన కందుకూరి వీరేశలింగం పంతులుగారు. వీరి వ్యంగ్యాత్మక వచన హాస్య ప్రబంధం సత్యరాజా పూర్వదేశ యాత్రలు (1891). ఇది అనుకరణ నవల ఇందులో సాంఘిక దురాచారాలను, మూఢనమ్మకాలను, పురుషాధిక్యాన్ని, స్త్రీ హైన్యాన్నీ ఎత్తి చూపటానికి వ్యంగ్యాన్ని అస్త్రంగా చేసుకుని ఇందు అధిక్షేపించాడు. ఈ నవలలో ప్రధాన నాయకుడు సత్యరాజా చార్యులు. వీరికి చదువు వంటబట్టదు. చిన్న వయస్సులో వివాహం, అనారోగ్య కారణాల వల్ల భార్య మరణం (స్ఫోటకం). పెళ్ళి అప్పుల వల్ల భూమిని కోల్పోవడం. బ్రతుకు తెరువు కోసం విశాఖపట్నం చేరడం అక్కడ బ్రాహ్మల చేత మోసగింపబడటం చేత అనేక కష్టాలు పడి ఆడమాలయాళం చేరడం ఆ ప్రాంతంలో అందరూ ఆడవాళ్ళే, ఉండటం మగవాళ్ళు లేరనుకునేరూ. ఉన్నా వారికి అక్కడ ప్రాధాన్యత లేదని తెలుసుకున్న కందుకూరి గారి నాయకుడు. ఆడమాలయాళంలో ఉన్న స్త్రీ, పురుష వ్యతిరేఖ సంస్కృతిని మార్చి, ఈ దురాచారాన్ని రూపుమాపాలని కందుకూరి వారు సత్యారాజాచార్యులను ఒక సంఘసంస్కర్తగా నిల్పినాడు. తదుపరి కందుకూరిని ఆదర్శంగా తీసుకుని నవలా రచన చేసిన చిలకమర్తి వారి నవల గణపతి. ఇది కూడా నవలా ప్రపంచమున హాస్యమునకు ఒక మేలుబంతి అని చెప్పవచ్చును.

చిలకమర్తి నవలల్లో హాస్యగుణం ఉంటుంది. అది గణపతి నవల అంతా దర్శనమిస్తుంది. ఇందులో ఇతివృత్తం కష్టపడి పని చేసేతత్వం లేని ఒక మూర్ఖుడును. నిర్భాగ్యుడైన ఒక బ్రాహ్మణ యువకుడు జీవించటానికై పడిన ఎక్కట్లను గణపతి నవల్లో చూడవచ్చును. ఉదాహరణకు గణపతి నవల్లో ఒక హాస్య సంభాషణను చూసినట్లయితే బ్రతుకు తెరువు కోసం గణపతి ఒక బడి పెట్టి విద్యార్థులకు భోదనలను సాగిస్తున్నాడు. అందునా కొత్తగా చేరిన ఒక విద్యార్థి గణపతి ప్రతిభను తెలుసుకుందాం అని దాశరధి శతకంలోని శ్రీ రఘురామ రామ చారు తులసీరామ' అను పద్యం చదివి వినిపించి గురువు గారు దీని అర్థం మీ నోటి ద్వారా వినాలని ఉందని అడుగగా వెంటనే అపర మేధావి అయిన గణపతి శ్రీరఘురామ అంటే రాములవారు

చారు అంటే ఒకనాడు పైత్యంగా ఉండి చారు కాపించుకొన్నారు, తులసీదళదామ అంటే ఆ ప్రదేశంలో కరివేపాకు లేదు కాబట్టి తులసీ మొక్క రెమ్మలను అందులో వేసి పొంగించారు. ఇలా ఆ విద్యార్థి అడిగిన పద్యానికి అర్థం చెప్పడంలో గణపతి అమాయకత్వ అ పాండితీ ప్రకర్షకు విద్యార్థికి నవ్వు రాకుండా ఉండదు. అవును తప్పకుండా వస్తుంది. ఇది చిలకమర్తి నిజజీవితంలో ఎదురైన ఒక సంఘటనకు అక్షర రూపం కావచ్చును. దానిని గణపతి పాత్ర ద్వారా వాస్తవికంగా ప్రదర్శింపజేసారు చిలకమర్తి. ఇలా చెప్పుకుంటూ పోతే తెలుగులో అనేక హాస్య నవలలు వచ్చాయి. మొక్కపాటి నరసింహశాస్త్రి బారిష్టర్ పార్వతీశం హాస్యరసం అంగిగా సాగిన నవల. పాలగుమ్మి పద్మరాజు, బ్రతికిన కాలేజ్, విశ్వనాథ సత్యనారాయణ, విష్ణుశర్మ ఇంగ్లీష్ చదువు, రావూరి భరద్వాజ కరిమ్రింగిన వెలగపండు. ముళ్ళపూడి వెంకటరమణ. 'ఇద్దరమ్మాయిలు ముగ్గురబ్బాయిలు మొ॥ నవలల్లో రచయితలు చక్కని పాలమీగడలాంటి హాస్యాన్ని పోషించారు.

సంస్కృత నాటకాలలో హాస్యరసానికి నిలయమైన పాత్ర విదూషకుడు. అటువంటి హాస్యపాత్రను మొదటిసారిగా రామరాజ భూషణుడు వసుచరిత్ర అనే నాటక రీతులతో నడిచిన ప్రబంధంలో పాత్రను ప్రవేశపెట్టారు. ఇక తెలుగు నాటకాలలో అచ్చమైన వ్యవహారిక భాషను తెలుగు ప్రజలకు అందించిన దీపధారి గురజాడ. వీరు కన్యాశుల్క నాటకంలో గిరీశం పాత్రచే హాస్యాన్ని పలికించారు. గిరీశం పాత్ర అసత్యాన్ని సత్యం చేసే ఒక గాలి పాత్ర ప్రముఖ విమర్శకులు సర్దేశాయి తిరుమలరావు "గిరీశాన్ని దేవాలయాలపై ఉన్న బూతుబొమ్మ'గా పేర్కొన్నారు. ఇంకా "నిజముగా తెనుగు భాషకు మొట్టమొదటి హాస్యరసము చవిచూపిన ధీరుడు గురజాడ అప్పారావు గారే"[2] అని రాళ్ళపల్లివారు ప్రశంసించారు. తర్వాత పేర్కొనదగినది వేదం వారి ప్రతాపరుద్రీయం. ఇందులో పేరిగాని పాత్ర హాస్యసరముతో ఒలలాడుచున్నది. అంతేకాకుండా ప్రముఖ అభ్యుదయ కవి గజ్జెల మల్లారెడ్డి 'పేరిగాని దర్బారు' అని పేరుగాని పాత్రను అధిక్షేపించారు. పానుగంటి వారు కంఠాభరణం నాటకం మొత్తం కూడా హాస్యసరిత్తులాంటిది. దానిని వివిధ పాత్రలు విభిన్న మార్గాల ద్వారా పాయలు పాయలుగా ప్రవహించి కాలువలు నదిని నింపినట్లు పాత్రలన్నీ హాస్యమనే రసాన్ని నింపాయని చెప్పవచ్చును. ఇంకా చాలామంది నాటక రచయితలు ఉన్నా పరిశోధన వ్యాస పరిధి వల్ల ఒకటి, రెండు నాటకాలను ప్రస్తావించాను.

అధిక్షేప రచనలు కూడా తెలుగు సాహిత్యమున ప్రచారము పొందాయి. దాని యందు ఒకింత వ్యంగ్య విమర్శ ఉంటుంది. శ్రీ జలసూత్రం రుక్మిణి శాస్త్రిగారి 'హాస్యనుకృతులు', శ్రీ దేవిశ్రీ ప్రసాద్ గారి 'భక్తేశ్వర శతకం', మొ॥ గ్రంథాలు చక్కని అధిక్షేపాత్మక వ్యంగాత్మక రచనలు. సుప్రసిద్ధ ప్రజాకవి తెలంగాణా వైతాళికుడైన కాళోజీ నారాయణగారు చక్కని హాస్య గేయము రాశారు అది

***"ఏ దేశమేగినా ఎందు కాలిడినా***
***చూడరా నీ బొజ్జ పూడు మార్గం"*** అని కాళోజీవారు పై గేయంలో చక్కని హాస్యాన్ని అందించారు. ఇది ఒక విధంగా రాయప్రోలు వారి దేశభక్తి గేయానికి పేరడిగా ఉందనవచ్చు.

వ్యాసరచనలో ప్రథమ స్థానమును అలంకరించినవారు పానుగంటి లక్ష్మీనరసింహారావు గారిని పేర్కొనవచ్చు. వారి సాక్షి వ్యాసములు సకలాంధ్ర ప్రజాభిమానమును పొందిన మణిమకుటాలు, వారి ప్రతి వ్యాసమున సునిశితమైన హాస్యమును, లోతైన భావ తీవ్రతను అందు చొప్పించి చదివిన పాఠకుడిని ఉత్తేజితుడిని చేసే నిర్మలమైన భావానుగుణశైలి పానుగంటి వారి ప్రత్యేకత. అందులో ఉన్న పాత్రలు ఒక్కొక్కటి

ఒక్కొక్క హాస్యగుళిక. సాక్షి వ్యాసములోని జంఘాలశాస్త్రి హాస్యము, సంస్కరణ అనే రెండు జోడుగుర్రాల వంటి పాత్ర. ఒక వైపు సంఘంపై అధిక్షేపం. మరోవైపు వ్యంగ్య విమర్శ ద్వారా సంస్కరణ దిశగా పయనం. తర్వాత మొక్కపాటి వారి బారిష్టర్ భాతాఖానీ, వేమనపై రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారి వ్యాసాలు చక్కని హాస్యమును, నీతిని బోధిస్తున్నాయి.

బాలబాలికలను నవ్వించుటకు కొన్ని రకాల గ్రంథాలు అందుబాటులో ఉన్నాయి పంచతంత్రం, పరమానంద శిష్యుల కథలు, అక్బర్-బీర్బర్ కథలు, తెనాలి రామలింగని కథలు, అలీబాబా నలభై దొంగలు కథలు మొ॥వి బాల సాహితీ ప్రపంచానికి ఒక ప్రక్క హాస్యమును, నీతిని, సమయస్ఫూర్తిని అందించే మిశ్రమ జ్ఞాన కేంద్రాలుగా ఉపకరిస్తున్నాయని చెప్పవచ్చును.

తెలుగునందు జరిగిన హాస్యమును గూర్చి గ్రంథాలలోని ఈ పాత్రలను, పాఠకలోకానికి అందించడానికి కొంతమేరకు పరిశోధన జరిగింది. ప్రథమ జానపద పరిశోధన గ్రంథంగా పిలువబడుతున్న డా॥ బి.రామరాజు గారి తెలుగు జానపద గేయ సాహిత్యం'లో హాస్యగేయములు అను ప్రత్యేక ప్రకరణాన్ని చేర్చారు. ముట్నూరు సంగమేశం గారు 'తెలుగు హాస్యం' అను గ్రంథం రాసి ఉత్తమ సాహిత్య విమర్శ బహుమతి పొందారు. ముణిమాణిక్యం నరసింహారావు 'మనహాస్యం' అనెడి గ్రంథం రాశారు. దీనిలో హాస్యము అంటే ఏమిటి. దాని లక్షణాలను, ఏది హాస్యమనబడుతుంది. ఏది చెందదు. అను అంశాలను పొందుపరిచారు. శ్రీ మాణిక్యం వేదవల్లి తాయారమ్మ 'తెలుగు సాహిత్యంలో హాస్యరసము' అనే పరిశోధనా గ్రంథాన్ని రాశారు. పి.యల్.ఎన్. ప్రసాద్ 'తెలుగు సాహిత్యంలో హాస్యం' అనే గ్రంథాన్ని ద్వా.నా శాస్త్రి తెలుగు సాహిత్యంలో హాస్యామృతం' అనెడి గ్రంథ రాజసమును రాసియున్నారు. ఇంకా ఆధునిక యుగమున జరిగిన హాస్య రచనలపై పరిశోధనలు రావాల్సిన అవసరం ఎంతైనా ఉంది.

అచ్చమైన తెలుగు కవిత్వ వికాసానికి నిండైన ప్రతిరూపం వేమన. ఆనాడే ఈ సంఘమున వ్యక్తీకరించిన మలినమైన అనారోగ్య ప్రపంచానికి శస్త్ర చికిత్స చేసిన ఘనుడు. పండితులకై పరిమితమైన విద్యా దీపాన్ని పామరులకు సైతం మౌఖిక రూపమున చెప్పగల జ్ఞాన సరస్వతిని అందించిన అసలైన ప్రజాకవి వేమన. జానపదులు విషయానికొస్తే అత్తా, అల్లుళ్ళు మధ్య, బావా మరదళ్ళ మధ్య, అప్పగింతల దగ్గర తల్లి-కూతుళ్ళ మధ్య ఎంతో హాస్యం తెప్పించే గేయాలు ఉన్నాయి. విషయభావం వల్ల వాటిని ఈ వ్యాసమున ప్రస్తావించలేదు. జానపదుల కళారూపమైన తోలుబొమ్మలాటలో కేతిగాడి పాత్రలో, బుర్ర కథలో వంతగాడు పాత్రలో, సర్కస్ విన్యాసంలో బఫూన్ పాత్రలో సన్నివేశ విషయానికి అనుగుణంగా పఠితులకు ఎంతో హాస్యమును కలిగిస్తాయి. పైవిధంగా ఈ వ్యాసంలో తెలుగు సాహిత్యంలో జరిగిన హాస్య పరిణామ వికాసాన్ని వివరించడమైనది.

**పాదసూచికలు :**

1) విశ్వనాధుడు - సాహిత్య దర్పణం
2) రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మ - వేమన - పుట 124

**ఆధార గ్రంథాలు :**

1) మన హాస్యం - మణిమాణిక్యం నరసింహారావు
2) సాహిత్య వ్యాసాలు - తుమ్మల రామకృష్ణ
3) తెలుగు హాస్యం - ముట్నూరు సంగమేశం
4) అంతర్జాల సమాచారం

.... 4 ...

# కన్యాశుల్కం నాటకంలో గిరీశం - హాస్యం

**కొత్తకోట శ్రీనివాసరావు**
పరిశోధక విద్యార్థి,
తెలుగుశాఖ,
ఆంధ్ర విశ్వకళాపరిషత్, విశాఖపట్నం.
చరవాణి : 95735 69542
Email : srinuchinna2930@gmail.com

**హాస్యం – పరిచయం :**

హాస్యం అనగా వినోదం కలిగించి నవ్వు పుట్టించే లక్షణం కలిగిన ఒక భావానుభవం. నవరసాల్లో హాస్యానికున్న ప్రాధాన్యం అనన్య సామాన్యం. హాస్యరసాన్ని ఆస్వాదించి ఆనందించే లక్షణం ప్రపంచంలో మనిషికి తప్ప మరే ఇతర జీవికీ లేదు. హాస్యరసానికి స్థాయీ భేదం హాసం అనగా నవ్వు. ఏ మనిషీ సగటున రోజులో ఒక్కసారైనా నవ్వకుండా ఉండడం దాదాపు అసాధ్యం.

ఉరుకులు పరుగులతో కూడిన ప్రస్తుత జీవన విధానంలో మానసిక ఒత్తిడి నుండి తక్షణ ఉపశమనం కలిగించేది హాస్యం మాత్రమే. హాస్యం ఆనందాన్ని, ఆరోగ్యాన్ని ఇచ్చి విషాద విచ్ఛేదకమవుతుంది. రోజూ ఓ గంటసేపు నవ్వితే అమృతపానం చేసినంత ఫలితం.

**తెలుగు సాహిత్యంలో హాస్యం :**

వాసనలేని పువ్వులా పరిహాస ప్రసంగంలేని వాక్యం వ్యర్థమన్నారు. తెలుగులో లిఖిత సాహిత్యానికి ముందున్న మౌఖిక సాహిత్యంలో హాస్యానికి సంబంధించిన గేయాలు, కథలు, హాస్యోక్తులు, చలోక్తులు విరివిగా ఉండేవి. తెలుగు సాహిత్యంలో తొలి రచనగా భావిస్తున్న నన్నయ ఆంధ్రమహాభారత రచన గంభీరంగా సాగినప్పటికీ అక్కడక్కడా హాస్య సన్నివేశాలు కూడా జోడించారు. గరుత్మంతుని చేత పీడింపబడిన దేవతల పరుగులు, బకాసురుని వృత్తాంతం, మయసభలో దుర్యోధనుని భంగపాటు పాఠకులకు నవ్వులు తెప్పిస్తాయి.

నన్నెచోడుని కుమారసంభవంలో మన్మధునికి, రతీదేవికీ మధ్య గల సన్నివేశాలు హాస్యంగా సాగాయి. తిక్కన రచనలో వ్యంగ్యం ఎక్కువ. నర్తనశాలలో స్త్రీ వేషంలో ఉన్న భీముడు, కీచకునికి మధ్యగల సంభాషణలు, ఉత్తర కుమారుని ప్రగల్భాలు కడుపుబ్బా నవ్విస్తాయి. గౌరన నవనాథచరిత్రలో పురోహితుడు ఎలుగుబంటితో సరసాలాడడం, హరిశ్చంద్రోపాఖ్యానంలో కలహకంఠి, కాలకౌశికులు పోట్లాటలు, రోకళ్ళతో కొట్టుకోవడాలు విపరీతంగా నవ్విస్తాయి.

శ్రీనాథునివిగా ప్రసిద్ధి చెందిన చాటు పద్యాలలో కావల్సినంత హాస్యం మనకు కన్పిస్తుంది.

*పూజారి వారి కోడలు*
*తాజారగ బిందె జారి దబ్బున పడియెన్*
*మైజారు కొంగు తడిసిన*
*బాజారే తొంగి చూసి ఫక్కుంజనగియెన్*

ఎంత దగ్గరివారైనా ఇలాంటి సన్నివేశాల్లో దబ్బున జారిపడితే చూసిన వాళ్ళెవరికైనా ముందు వచ్చేది నవ్వే. ఇలాంటి శ్రీనాథుని చాటువులు అనేకం.

ఇక రాయల కాలంలో నవరసాలకి స్వర్ణయుగం. తెనాలి రామకృష్ణుని చాటుపద్యాలు హాస్య భాండాగారాలు. రామకృష్ణుని అద్భుతకృతి పాండురంగమహత్మ్యంలో నిగమశర్మ అక్క దుష్టసావాసాలు చేస్తున్న తమ్ముణ్ణి దగ్గర కూర్చోబెట్టుకొని ఎన్నో నీతులు చెబుతుంది. వాడు అన్నీ విన్నట్లే విని ఆ రోజు రాత్రి ఇంట్లో వస్తువులను పట్టుకుపోతూ పనిలో పనిగా అక్కగారి ముక్కుపుడుక కూడా చక్కగా పట్టుకుపోతాడు. తెల్లవారిన తరువాత విషయం తెలుసుకున్న ఆవిడ తమ్ముడు తన మాటలు వినలేదన్న బాధ కన్నా తన ముక్కుపుడక కూడా పట్టుకుపోయాడని గొల్లుమనడం పాఠకులకు ఫక్కుమని నవ్విస్తుంది.

రాయల వారి ఆముక్తమాల్యదలోని భ్రాంతిమతి అలంకారాలు మనల్ని నవ్వించకమానవు. క్షీణ యుగంలో హాస్యం తన ఔచిత్యాన్ని కొంత కోల్పోయినా చేమకూర వెంకటకవి చమత్కారాలు మాత్రం చక్కిలిగింతలు పెడతాయి.

శతకకర్తలు చాలామంది హాస్యప్రియులు. తెలుగు వారి హాస్యం శతకాల్లో ఎక్కువగా దర్శనీయమవుతుంది. వేమన శతకంలోని చాలా పద్యాలు హాస్యాన్ని ప్రతిబింబిస్తాయి.

***"పాల సంద్రమునందు పవ్వళించిన హరి***
***గొల్ల యిండ్లకు పాలు కోరనేల***
***యెదుటివారి సొమ్ము యెల్ల వారికి తీపి***
***విశ్వదాభిరామ వినురవేమ"***

ఆధునిక కాలంలో భమిడిపాటి, మొక్కపాటి, మునిమాణిక్యం గార్లు తెలుగులో హాస్య కవిత్రయం. మునిమాణిక్యం గారి కాంతం కథలు, మొక్కపాటి వారి బారిష్టర్ పార్వతీశం, చిలకమర్తి వారి ప్రహసనాలు, పానుగంటి వారి సాక్షి వ్యాసాలు ఇలా ఎన్నో రచనలు హాస్యన్ని పండించాయి.

ఆచార్య తూమాటి దొనప్పగారు "అడుగడుగునా, అనుక్షణమూ తెలుగువారి బ్రతుకుదారుల్లో హాస్యరసం జాలువారుతూనే ఉంది" అన్నారు.

ఇది తెలుగు సాహిత్యంలో హాస్యరసాన్ని గురించి కేవలం విహంగ వీక్షణం మాత్రమే. పద్యాలు, వచనాలు, కవితలు, కథలు, నవలలు, నాటకాలతో పరమాద్భుత విన్యాసాలు చేసి పాఠకునికి పరమానంద భరితుల్ని చేసిన ఎందరో హాస్యరస పోషకులు ఉన్నారు.

**కన్యాశుల్కం పరిచయం :**

ఆంధ్రదేశంలో ఒక తెలుగు నాటకం నూరేళ్ళు పైబడి నిర్విరామంగా ప్రదర్శించబడింది. అంతేకాదు మరో నూరేళ్ళు ఉజ్వలంగా ప్రదర్శించడానికి కొత్త ఊపునీ, ఉత్సాహాన్నీ పుంజుకుంటుంది. దానికి కారణం రచయిత ఆ నాటకంలో ఉపయోగించిన భాష, చిత్రించబడిన మనుషులూ, వాళ్ళ ప్రవర్తనలోంచి ఉత్పన్నమైన హాస్యం. ఇవీ ఆ నాటకాన్ని బ్రతికిస్తున్నాయి. ఆ తెలుగు నాటకం కన్యాశుల్కం. సృష్టికర్త గురజాడ వెంకట అప్పారావు.

వాస్తవానికి ప్రస్తుత సమాజంలో కన్యాశుల్కం అనే సాంఘిక దురాచారం దాదాపుగా లేదు. వరశుల్కం మాత్రమే ఉంది. కానీ ఈనాటికీ ఇంత ప్రజాదరణ కలిగిన నాటకం తెలుగునాట మరొకటి లేదు. కన్యాశుల్కం తెలుగు సాహిత్యంలో హాస్యానికి పెద్దపీట వేసింది. ఈ నాటకంలోని పాత్రల ద్వారా గురజాడ అప్పారావు గారు సాంఘిక దురాచారాలకు వ్యతిరేకంగా మానవ మనస్తత్వంలో మార్పు కోరుకున్నారు.

**కన్యాశుల్కం నాటకంలో గిరీశం – హాస్యం :**

కన్యాశుల్కం నాటకంలోని పాత్రలన్నీ ఉత్కృష్టమైనవే. వాటిలో అసలేమాత్రం వాసి తగ్గని పాత్ర గిరీశం. నాటకం ప్రారంభం నుండి అంతం వరకూ ప్రతీ అంకంలోనూ గిరీశం తన చమత్కారపు మాటలతో నవ్వులు పూయిస్తాడు.

నాటకారంభం ప్రథమాంకంలో “మీ సావాసం చేయడం చేత నా పరీక్ష పోయింది. మీవల్ల నాకు వచ్చిందల్లా చుట్ట కాల్చడం ఒక్కటే” అని విచారిస్తున్న శిష్యుడు వెంకటేశంతో గిరీశం పలికిన ప్రగల్భాలు, సమర్థింపులు పాఠకులకి, ప్రేక్షకులకి నవ్వు తెప్పిస్తాయి.

గిరీ　: డామిట్ ఇలాంటి మాటలంటే నాకు కోపం వస్తుంది. దిస్ ఈజ్ బేస్ ఇన్గ్రాటిట్యూడ్, నాతో మాట్లాడడమే ఒక ఎడ్యుకేషన్. ఆ మాటకొస్తే నీకున్న లాంగ్వేజి నీ మాష్టారుకుందీ? విడో మారియేజ్ విషయమై, నాచ్ఛికొశ్చన్ విషయమై నీకు ఎన్ని లెక్చెర్లు ఇచ్చాను? నా దగ్గర చదువుకున్నవాడు ఒహడూ అప్రయోజకుడు కాలేదు. పూనా డక్కను కాలేజీలో నేను చదువుతున్నప్పుడు ‘ది ఎలెవన్ కాజస్ పర్ది డి జనరేషన్ ఆఫ్ ఇండియా’ను గూర్చి మూడు గంటలు ఒక్క బిగిని లెక్చర్ యిచ్చేసరికి ప్రొఫెసర్లు డంగయిపోయినారు. మొన్న బంగాలీవాడు యీ వూళ్ళో లెక్చరిచ్చినపుడు ఒక్కడికైనా నోరు పెగిలిందీ? మనవాళ్ళు వొట్టి వెధవాయలోయ్! చుట్ట నేర్పినందుకు థాంక్స్ చెప్పక తప్పుపడుతున్నావ్? చుట్ట కాల్చడం యొక్క మజా నీకు యింకా బోధపడక పోవడం చాలా ఆశ్చర్యంగా ఉంది. చుట్ట కాల్చబట్టే కదా దొర్లంత గొప్పవాళ్ళయినారు! చుట్ట కాల్చని ఇంగ్లీషువాణ్ణి చూశావూ? చుట్ట పంపిణీ మీదనే స్టీము యంత్రం వగయిరా తెల్లవాడు కనిపెట్టాడు. లేకపోతే వాడికి పట్టుబణ్ణా? శాస్త్రకారుడు యేవన్నాడో చెప్పానే!

సూత ఉవాచ–

క॥　*ఖగపతి యమృతము తేగా*
*భుగభుగమని పొంగి చుక్క భూమిని వ్రాలెన్*
*పొగ చెట్టై జన్మించెను!*
*పొగ తాగనివాడు దున్నపోతై పుట్టున్”*

ఇది బృహన్నారదీయం నాలగవ ఆశ్వాసంలో వున్నది.

చుట్టకాల్చడమనేది దురలవాటుని, తప్పు అని చెప్పకపోగా ఉపయోగం అని, గొప్ప అని శాస్త్రీయంగా, సోపపత్తికంగా శిష్యుడు వెంకటేశానికి వివరించడం, అది నిజమే అని శిష్యుడు నమ్మడం మంచి హాస్య సన్నివేశం.

ద్వితీయాంకంలో బాల్యవివాహాలు, కన్యాశుల్కం వంటి సాంఘిక దురాచారాలు సమాజంలో ఉండకూడదని పూనా వంటి పెద్ద నగరాల్లో లెక్చర్లు ఇచ్చానని చెప్పుకుని తిరిగే గిరీశం తన లెక్చర్ల ద్వారా అగ్గిరాముడు లాంటి అగ్నిహోత్రావధాన్లు మనసు మార్చలేక తానే అతని దారిలోకి వెళ్ళిపోయే చేతకానితనాన్ని, తన రాజకీయ చాణక్యంగా మార్చి శిష్యుడు వెంకటేశంతో ధాంబికాలు చెప్పే తెలివితేటలు ఆశ్చర్యంతో కూడిన హాస్యాన్ని కలిగిస్తాయి.

వెంక : లెక్చరిచ్చి మా తండ్రిని వొప్పించడానికి బదులుగా ఆయన చెప్పినదానికి మీరే వొప్పుకున్నారూ!

గిరీ : కుంచం నిలువుగా కొలవడానికి వీల్లేనప్పుడు తిరగేసైనా కొలిస్తే నాలుగ్గింజలు నిలుస్తాయి. బాగా ఆలోచిస్తే యిన్ఫెంట్ మారేజి కూడుననే తోస్తుంది.

వెంక : యిన్నాళ్ళూ కూడదని చెప్పేవారే నా తోటి?

గిరీ : ఒపీనియన్స్ అప్పుడప్పుడూ ఛేంజి చేస్తుంటే గాని పొలిటీషను కానేరడు. నాకు తోచిన కొత్త ఆర్గ్యుమెంట్ విన్నావా? యిన్ఫెంట్ మారేజీలు అయితే గానీ యంగ్ విడోస్ వుండరు. యంగ్ విడోస్ వుంటేగాని విడో మారయేజ్ రిఫారమ్‌కి అవకాశం వుండదు గదా! సివిలిజేషన్కల్లా నిగ్గు విడో మారియేజ్ అయినపుడు యిన్ఫెంట్ మారేజీల్లేకపోతే సివిలిజేషన్ హోల్టవుతుంది. మరి ముందుకు అడుగు పెట్టలేదు. గనక తప్పకుండా యిన్ఫెంట్ మారేజి చెయ్యవలసిందే.

సివిలిజేషన్ అనగా నాగరిక సమాజానికి నిగ్గు విధవా వివాహం. విధవా వివాహాలు జరపాలంటే యంగ్ విడోస్ ఉండాలి. ఆ యంగ్ విడోస్ కోసం యిన్ఫెంట్ మారేజ్ అనగా బాల్యవివాహాలు జరిగి తీరాల్సిందే అని గిరీశం గారు శెలవిచ్చారు. ఇలా గిరీశం ఊసరవెల్లిలా రంగులు మారుస్తూ ఏ ఎండకాగొడుగు పడుతూ తన పనికిమాలిన పాండిత్యం ప్రదర్శించడం హాస్య ప్రియులకు వినోదాన్ని కలిగిస్తుంది.

ఇంకా అక్కడితో ఆగక "పెళ్ళనేది మంచి పదార్ధవైతే అధికస్య అధికం ఫలం అన్నారు. గనక చిన్నపిల్లని ఒక ముసలాడికి పెళ్ళి చేసి వాడు చస్తే మరోడికి, మరోడు చస్తే మరోడికి యిలాగ పెళ్ళి మీద పెళ్ళి, పెళ్ళి మీద పెళ్ళి అయి వీడి దగ్గరో వెయ్యి వాడి దగ్గరో వెయ్యి మరోడి దగ్గర మరో వెయ్యి, రొట్టె మీద నెయ్యి, నేతి మీద రొట్టెలాగ యేకోత్రవృద్ధిగా కన్యాశుల్కం లాగి, తుదకి నాలాంటి బుద్ధివంతుణ్ణి పెళ్ళాడితే చెప్పావ్ మజా? ఇహసౌఖ్యం పూర్తిగా లభిస్తుంది. ఇహసౌఖ్యం వుంటే పరసౌఖ్యం కూడా సాధించావే అన్న మాట" అని హాస్య వేదాంతం వల్లించడం ఒక్క గిరీశానికే చెల్లుతుంది.

గిరీశం పంతులకి అనుకోని సమస్య ఎదురైనపుడు మాయోపాయం చేసి తన సమయస్ఫూర్తితో, వాక్చాతుర్యంతో ఎదుటివారిని బోల్తా కొట్టించడం వంటి సన్నివేశాలు నాటకంలో నవ్వులు పూయిస్తాయి.

నాటకం తృతీయాంకం ఒక సన్నివేశంలో గిరీశం ప్రేమపాఠాలు, లవ్ సిగ్నల్స్, శృంగార చేష్టలతో బుచ్చెమ్మని ఎలాగైనా ప్రేమలో పడేయ్యాలని ప్రయత్నం చేస్తున్న సందర్భంలో వారి మధ్య అడ్డంకిగా ఉన్న వెంకటేశాన్ని జామచెట్టు ఎక్కి పళ్ళు కోసుకోమని అక్కడి నుండి పంపించేస్తాడు. వెంకటేశం తండ్రి అగ్నిహోత్రావధాన్లు అదే సమయానికి అక్కడికి ఆకస్మికంగా వస్తాడు. ఆ ఉపద్రవం నుండి సమయస్ఫూర్తితో తప్పించుకునే సందర్భంలో గిరీశం తెలివితేటలకు, ఎత్తులకు ఎంతటివారైనా నవ్వకుండా ఉండలేదు.

అగ్ని : వెంకదు రాసుకుంచున్నాడా, చదువుకుంచున్నాడా అండీ?

గిరీ : యింతసేపు చదువు చెప్పి చెట్లు చావలూ యెక్కి ఆడుకో అని తోసేసాను.

అగ్ని : మీకేం మతిపోయిందా ఏవిటండీ? కాలూ చెయ్యి విరుచుకుంటే?

గిరీ : రేపు మనవాడికి గుణుపురం తాసీల్దారీ అయి అడవిలో కమాను వెళ్ళుతూ వుండగా, పెద్దపులొస్తే చెట్టెక్కలేక, కాళ్ళు వొణికి చతికిలబడాలని మీ అభిప్రాయవాయేవిటి?

అగ్ని : మనవాడికి తాసిల్దారీ అవుతందండీ?

గిరీ : యెందుక్కాకూడదు? గుఱ్ఱాలెక్కడం, చెట్లెక్కడం మనవాడు నేర్చుకోకపోతే, నాయినా నువ్వు కమాన్లకి పనికిరావు డసుకు దగ్గర కూచొని గుమస్తా పని చేసుకో, తాసిల్దారీ, గీసిల్దారీ తలపెట్టకు అని దొర్లంటారు.

అగ్ని : అప్పైతే చిన్న చెట్టెక్కించండి గాని పెద్ద చెట్లప్పుడే యక్కనియ్యకండి.

గిరీ : అంచాతనే జామి చెట్లు యక్కమన్నాను చూశారా?

చెట్టెక్కమని పురమాయించినందుకు తనపై కోప్పడిన అగ్నిహోత్రావధాన్లు చేతనే సరే చెట్లెక్కడంలో తర్ఫీదు ఇవ్వండి అని చెప్పించగలిగిన ఘటనా ఘటన సమర్థులు గిరీశం పంతులు.

నాటకం చతుర్థాంకంలో బుచ్చెమ్మని ఎలాగైనా లేవదీసుకుపోవాలని దృఢంగా నిశ్చయించుకున్న గిరీశం, అగ్నిహోత్రావదాన్లు ఇంట్లో లేని సమయంలో తన మాయమాటలతో, ప్రగల్భాలతో బుచ్చెమ్మని పెళ్ళికి ఒప్పించే సన్నివేశాలను గురజాడవారు హాస్యరస ప్రధానంగా చిత్రించారు.

గిరీ : నా బుచ్చెమ్మ నన్ను పెండ్లాడకపోయిన తరువాత నా బతుకు యెందుకు? అని నిస్పృహ కలిగి చఱ్ఱున టేబిల్ సొరుగు తీసి, అందులో వున్న జోడు గుళ్ళ పిస్తోలు యెక్కు బెట్టి గుండె దూసిపోయేటట్టు కొట్టేసుకుంటాను.

బుచ్చ : కొట్టుకోకండి మీరు అలా అంటే నాకు యేడుపొస్తుంది.

గిరీ : తక్షణం దేవతలు విమానం పంపించి నన్ను స్వర్గానికి తీసుకువెళతారు. స్వర్గానికి వెళ్ళానని నాకు అక్కడ మాత్రం సుఖం ఉంటుందనుకున్నావా వొదినా? నవాభరణ భూషితురాలయి రంభ తక్కుతూ, తారుతూ వొచ్చి "హా ప్రియా గిరీశ! నీలాంటి సుందరుణ్ణి యన్నడూ నేను చూడలేదు రమ్ము నన్ను చేకొమ్ము" అని రెక్కపట్టుకొని లాగుతుంది. నేనే వంటాను? ఛీ! అవతలికలి పో – నేను యాంటీ నాచ్చి! సానిది తాకితే, పరమ అపవిత్రంగా తలుస్తాను. పియర్సు సబ్బు రాసి కడిగితే గాని యీ చేతికి కల్మశం పోదు. నువ్వా రంభవి? మా బుచ్చెమ్మ సొగసుకు నువ్వు వడ్డీకి పనికిరావు. గో యేవే, డామ్, డర్టీ గూస్ అని అంటాను. అలాగే మేనకా, ఊర్వసీ, తిలోత్తమా మొదలైన యావన్మంది అప్సర స్త్రీలని తన్ని తగలేసి, కాషాయ వస్త్రాలు ధరించి కల్పవృక్షచ్ఛాయని" హా! బుచ్చెమ్మా, బుచ్చెమ్మా!" అని నీ పేరు జపం చేస్తూ అనేక సంవత్సరాలు పద్మాసనం మీద వుండిపోతాను.

ఇలా గిరీశం తన లౌక్యం మొత్తం ప్రదర్శించి బుచ్చెమ్మని లేచిపోయి పెళ్ళి చేసుకోవడానికి బలవంతంగా ఒప్పిస్తాడు. బయటికి యాంటి నాచ్ లాగ నటిస్తూ అందరినీ నమ్మించే ప్రయత్నం చేస్తాడు. అందుకే నాటకం చివరలో గిరీశం గురించి పూర్తిగా తెలుసుకున్న సౌజన్యారావు పంతులు "నెపోలియన్ ఆఫ్ యాంటినాచ్" గారూ అని వ్యంగ్యంగా సంబోధిస్తారు.

**ముగింపు :**

కన్యాశుల్కం నాటకంలో గిరీశం పాత్ర ఆద్యంతం హాస్యరస ప్రధానంగానే సాగింది. నాటకం గిరీశంతోనే ఆరంభమై గిరీశంతోనే ముగుస్తుంది. అంతటి ప్రాధాన్యం కలిగిన వైవిధ్యభరితమైన పాత్ర. వ్యాస రచనలో పరిమితుల కారణంగా కొన్ని సన్నివేశాలు మాత్రమే ఉదహరించగలిగాను. గిరీశం పాత్ర ఒక వర్గానికి ప్రతినిధిగా జనబాహుళ్యంలో చిరస్థాయిగా నిలిచే ఉంటుంది.

**ఉపయుక్త గ్రంథాలు :**

1. కన్యాశుల్కము - గురజాడ అప్పారావు
2. నూరేళ్ళయితేనేం అది కన్యాశుల్కం - వెలుగు రజతోత్సవ కానుక
3. మాలిక సాహిత్య మాసపత్రిక కథనం.

# "యిక్కుర్తి నరసింహారావు గారి 'సుఖీభవ' నాటిక – హాస్య చతురత"

**డా॥ జి.శ్రీనివాస్,**
తెలుగు శాఖాధిపతి,
గవర్నమెంట్ డిగ్రీకళాశాల,
చింతలపూడి,
పశ్చిమగోదావరి జిల్లా.

## 1. ఉపోద్ఘాతం :

ఆధునిక సాహిత్యంలో హాస్యరచనలు చేసిన అతికొద్ది మంది రచయితలలో యిక్కుర్తి వారు ఒకరు. వారి కవిత్వం సమాజహితం. పాఠకుల మనోభావాలను, హృదయస్పందనను మనస్సుకు హత్తుకునేలా సరళమైన భాషలో వారి రచనలు ఉంటాయి. యిక్కుర్తి వారి రచనలలో హాస్యం సహజంగా కనిపిస్తుంది. వారి నాటికలలో పూర్తిగా 'హాస్యం' ఇతివృత్తంగా ఉన్న చక్కని హాస్యనాటిక 'సుఖీభవ'.

## 1.1. సుఖీభవ నాటిక – ఇతివృత్తం :

స్త్రీపాత్ర లేని సంపూర్ణ హాస్య నాటిక యిది. ఇందులో మారుతి కథానాయకుడు. తన తండ్రి నుండి వచ్చే ఆస్తి తాను పెళ్ళి చేసుకుంటే తగ్గిపోతుందని భావించి పెళ్ళి చేసుకోవడం మానేస్తాడు. అమెరికా వెళ్ళి డాలర్లు సంపాదించాలని కలలు కంటాడు. తండ్రి పక్షితీర్థం మారుతికి ఎలాగైనా పెళ్ళి చేయాలని కంకణం కట్టుకుంటాడు. అందుకోసం వధువు తండ్రి ముష్టావతారం, అన్న సురేంద్ర, రాజులతో కలిసి ఒక చిన్న నాటకం ఆడి మారుతిని లైన్లోపెట్టి పెళ్ళికి ఒప్పిస్తారు. నాటకం సుఖాంతం అవుతుంది.

## 2. పాత్రలు – పాత్రౌచిత్యాలు :

**2.1. మారుతి**

**2.2. రాజు**

**2.3. ముష్టి కృష్ణావతారం**

**2.4. పక్షితీర్థం :**

### 2.1. మారుతి :

మారుతి ఆంజనేయస్వామి భక్తుడు. పెళ్ళి కాకుండ ఉండటం కోసం స్వామిని పూజిస్తుంటాడు. అతడి మిత్రుడు రాజు. పూజ చేస్తూ రాజుకోసం చూస్తు తనలో తాను మాట్లాడుకుంటు ఉంటాడు. మారుతి మాటలు ఇలా వుంటాయి. "శ్రీ అంజనేయా... ఛప్రాసీ వెధవ! ఇదేగా వచ్చేస్తానంటూ నిన్న సాయంత్రం అనగా వెళ్ళాడు. ప్రసన్నాంజనేయా... ఫింజారీ ఫీనుగు వెధవ."[1] అంటూ దండకం చదువుతుంటాడు.

మారుతికి పెళ్ళంటే భయం. ధనం ఖర్చు అవుతుందని బాధ. బ్రహ్మచారిగా జీవితం బాగుంటుందని అనుకుంటాడు. పెళ్ళి వయస్సు వచ్చిందంటే “ఈ రోజుల్లో పెళ్ళికి వయస్సు రావడం ఏమిటీ! అంటూ ప్రశ్నించాడు.

మారుతున్న కాలాన్ని బట్టి పెళ్ళి నిర్ణయంలో వస్తున్న ఆలోచలను, మారుతి పాత్ర ద్వారా చక్కగా చూపి, మారుతికి పెళ్ళి పట్ల ఉన్న అభిప్రాయాలను మార్చారు.

**మారుతి పాత్రలో కొన్ని హాస్య గుళికలు :**

- ఏదో క్షణంలో ఉరితాడు లాంటి పసుపుతాడు చేత్తో పట్టుకుని ఏ పిల్ల మెడలోనే కట్టమంటూ నా కన్నతండ్రి వచ్చేస్తాడు.[2]
- తప్పుడు కూతలు కూస్తే చెప్పుల్లో రాళ్ళువేసి నడిపిస్తానురా వెధవా.[3]
- ఆడవాళ్ళు చదువుకోవడం వల్లనే కదండీ ఈ సమస్యలన్నీ.
- మళ్ళా మీరు తగులడ్డారు నా ప్రాణానికి.
- నీ పెళ్ళి లోకువ పెటాకుల కానూ!
  నీ బ్యాంకు ఎక్కౌంటు చిక్కిపోను!
  నీ కళ్ళజోడు పవరు తగ్గిపోనూ!
  నీ డొక్కు సైకిలు గాలిపోనూ?
  నీ పళ్ళపై ఎనామిల్ కరిగి పోనూ?[4]

ఇలా మారుతి చిత్రవిచిత్రమైన డైలాగులతో అందరిని హడలు గొట్టిస్తుంటాడు. ‘మారుతి’ పాత్ర ద్వారా సమాజంలో వస్తున్న మార్పులను ఎక్కువ సంతానం వల్ల కలిగే సమస్యలను పెళ్ళి చేసుకుంటే బ్రతుకు ఎలా వుంటుంది అనే విషయాలను చక్కగా చూపించారు. ఇక్కడ మారుతి పెళ్ళి చేసుకోవడానికి కుంటుంబ, సమాజ పరిస్థితులనే విషయాన్ని హాస్యభరితంగా చూపారు యిక్కుర్తి నరసింహారావు.

**2.2. రాజు :**

మారుతి స్నేహితుడు రాజు. ఏదో విధంగా మిత్రునికి పెళ్ళి చేయాలని మారుతి తండ్రితో కలిసి నాటకం ఆడి పెళ్ళి చేస్తాడు. ఇందులో రాజు పాత్ర ఆధునిక భావాలు కలవాడు. సందర్భోచితంగా చక్కగా మాట్లాడగల నేర్పుకలవాడు.

రాజు పాత్రకు మంచి హాస్యం జోడించారు రచయిత.

- వెంకట సుబ్బలక్ష్మి సుందర.... సుబ్బరత్న....
  అబ్బ కారురా! రత్న సుందర వెంకట లక్ష్మి...[5]
  అమెరికాలో జన్మించబోయే బిడ్డకు కాబోయే ఇండియా తండ్రిని.. నా అమెరికన్ కొడుకు బాధ పడ్తాడురా?[6]

– నీ బొంద దాన్ని ఆశయం అనరు. దురాశయం అంటారు.[7]

ఇలా రాజు పాత్రద్వారా మంచి హాస్యాన్ని పండించారు రచయిత.

**2.3. ముష్టి కృష్ణావతారం :**

ఇదొక చక్కని పాత్ర. మన తెలుగు సాంప్రదాయంలో సహజంగా వినిపించే తిట్లను కొత్తగా, వ్యంగ్యంగా, చమత్కారంగా చెప్పించారు రచయిత. సహజంగా పెద్ద వయస్సున్న వారు మాట్లాడే రీతి ఇందులో కనిపిస్తుంది.

– నేను ముష్టి....[8]
– ముస్టి లేదా? ఏమి చమత్కారం, ఏమి నమస్కారం.[9]
– తప్పు తప్పు నా బొంద చూడు నాయనా!
  నా బొంద నా కలవాటైపోయింది[10]
  నసాళానికంటిన నస్యం పట్టుగా ధాటిగా సెలవిచ్చారు.[11]
– మళ్ళీ తగులబడ్డానికి అసలు దిగబడితే గదా నాయనా నా బొంద![12]

ఇలా సాగుతుంది వారి హాస్య ప్రసంగం. ముష్టి కృష్ణావతారం అంటూ హాస్య భరిత పేర్లతో మంచి ఆరోగ్యకరమైన హాస్యాన్ని ఈ పాత్ర ద్వారా పండించారు రచయిత.

**2.4. పక్షితీర్థం :**

ఈయన మారుతి తండ్రి. గంపెడు సంతానం వీరికి. పెళ్ళి చేసుకోనన్న కొడుకును మార్చడం కోసం చివరకు నేనే పెళ్ళి చేసుకుంటానని పెళ్ళి కుమారిడిగా మారి మారుతిని మార్చి పెళ్ళి చేస్తాడు. ఈ పాత్ర ద్వారా సున్నితమైన హాస్యాన్ని వ్యంగ్యంగా పలికించారు.

– నీ పిండం పిల్లులు కొదిలెయ్య. కాకులు రెట్టయ్య, తప్పబుట్టిన తాలు వేరుశనక్కాయ
  ముఖమును.... నువ్వునూ[13]
– గాలి కాదురా పగిలిపోయిన గాజుగోలి, అట్టే లాగితి ఇట్లే కొరికి పడేసా.[14]
– నాకు తిక్క రేగిందంటే నిన్ను అప్పడాల కఱ్ఱ చెక్కించినట్లు చెక్కించేస్తా.
  గుడ్లు పీకించి చొక్కాకు బొత్తాలు కుట్టించేస్తా.
  కాళ్ళు విరగొట్టి కుర్చీకి చేతులు చేయిస్తా!
  గోళ్ళు కత్తిరించి దురద గుండాకు పూయిస్తా! ఊపిరితిత్తులు తీసి విసరకఱ్ఱలా విసురుకుంటా![15]

ఇలా సాగుతుంది. పక్షితీర్థం గారి హాస్య చతురత. ఇది చాలా సహజమైన హాస్యం, పదాలు, సంభాషణలు, సందర్భాలు, ఇతివృత్తం, పాత్రలు, పేర్లు మన నిత్య జీవితాల నుండి తీసుకుని అత్యంత సహజంగా, సరళంగా సాగిన 'సుఖీభవ' హాస్యనాటికలో పాత్రౌచిత్యాలు గొప్పగా  చూపించారు యిక్కుర్తి నరసింహారావు.

**ఉపసంహారం :**

'సుఖీభవ' హాస్య నాటికలో రచయిత యిక్కుర్తి నరసింహారావు చూపిన హాస్యం చాలా సహజమైనది. చతురత కలిగింది. పాత్రలను తీర్చిదిద్దిన తీరు చాలా బాగుంది. పాత్రలకు పెట్టిన పేర్లు నవ్వు పుట్టిస్తాయి. పాత్రల మధ్య సాగిన భాష, చమత్కారం, సంభాషణలు పాఠకులకు ఆనందాన్ని నవ్వును పుట్టిస్తాయి.

'మారుతి'కి పెళ్ళి చేయడానికి రాజు, పక్షితీర్థం, ముష్టి, సురేంద్ర పడిన తపన ఇందులో మంచి హాస్యాన్ని పండించింది. ఇది ప్రదర్శనాయోగ్యమైన నాటిక

**<u>ఆధార గ్రంథాలు :</u>**


1. యిక్కుర్తి నరసింహారావు నాటికలు
2. ముళ్ళపూడి వెంకట రమణ హాస్య నాటికలు
3. గుడిపూడి చలం - రచనలు
4. జంధ్యాల - హాస్య సమీక్షలు
5. వివిధ హాస్య నాటికలు - ప్రచురణలు


పుట సంఖ్యలు :

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | సుఖీభవ | - | యిక్కుర్తి నరసింహారావు | - | పుట సంఖ్య - 97 |
| 2. | సుఖీభవ | - | యిక్కుర్తి నరసింహారావు | - | పుట సంఖ్య - 98 |
| 3. | సుఖీభవ | - | యిక్కుర్తి నరసింహారావు | - | పుట సంఖ్య - 104 |
| 4. | సుఖీభవ | - | యిక్కుర్తి నరసింహారావు | - | పుట సంఖ్య - 109 |
| 5. | సుఖీభవ | - | యిక్కుర్తి నరసింహారావు | - | పుట సంఖ్య - 112 |
| 6. | సుఖీభవ | - | యిక్కుర్తి నరసింహారావు | - | పుట సంఖ్య - 93 |
| 7. | సుఖీభవ | - | యిక్కుర్తి నరసింహారావు | - | పుట సంఖ్య - 96 |
| 8. | సుఖీభవ | - | యిక్కుర్తి నరసింహారావు | - | పుట సంఖ్య - 98 |
| 9. | సుఖీభవ | - | యిక్కుర్తి నరసింహారావు | - | పుట సంఖ్య - 98 |
| 10. | సుఖీభవ | - | యిక్కుర్తి నరసింహారావు | - | పుట సంఖ్య - 98 |
| 11. | సుఖీభవ | - | యిక్కుర్తి నరసింహారావు | - | పుట సంఖ్య - 106 |
| 12. | సుఖీభవ | - | యిక్కుర్తి నరసింహారావు | - | పుట సంఖ్య - 106 |
| 13. | సుఖీభవ | - | యిక్కుర్తి నరసింహారావు | - | పుట సంఖ్య - 100 |
| 14. | సుఖీభవ | - | యిక్కుర్తి నరసింహారావు | - | పుట సంఖ్య - 106 |
| 15. | సుఖీభవ | - | యిక్కుర్తి నరసింహారావు | - | పుట సంఖ్య - 107 |

# వారణాసి నాగలక్ష్మి కథలు - హాస్యం

**గుదె శివ శంకర్**
పరిశోధక విద్యార్థి
తెలుగు మరియు ప్రాచ్యభాషా విభాగం
ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయం
చరవాణి : 7799091288

---

నవరసాలలో హాస్యరసానిది రెండవ స్థానం. దీని స్థాయిభావం హాసం. హాస్యరసాన్ని ఒక్క మానవుడు మాత్రమే ఆస్వాదించి ఆనందింపగలడు. “ఆలంకారికుల అభిమతానుసారం హాస్యం ఆరు విధాలు. 1. స్మితం 2. హసితం 3. విహసితం 4. అతిహసితం 5. అవహసితం 6. అపహసితం”. మన ప్రాచీన సాహిత్యాన్ని నిశితంగా పరిశీలిస్తే మన ప్రాచీన కవులు హాస్యరసానికి ప్రాధాన్యం ఇవ్వలేదని స్పష్టమవుతుంది. సంస్కృత నాటకాలలో మాత్రం “విదూషక” పాత్ర ద్వారా ఆయా నాటక కర్తలు హాస్యరసాన్ని పోషించినట్లు తెలుస్తుంది. అయితే ‘శ్రీనాథుని’ చాటువుల్లోను, ‘తెనాలి రామకృష్ణుని’ చాటువుల్లోను మనకు హాస్యం కొంత మేరకు కనిపిస్తుంది.

**“సిరిగల వానికి చెల్లును**
**దరుణుల పదియారు వేల దగ పెండ్లాడన్**
**తిరిపెమున కిద్దరాండ్రా ?**
**పరమేశా..! గంగ విడుము పార్వతి చాలున్”**

పై చాటు పద్యంలో “తిరిపెమున కిద్దరాండ్రా?” అని శ్రీనాథుడు పరమేశ్వరుని ప్రశ్నించడంలో గల “అధిక్షేప హాస్యం” ఆలోచింపచేస్తుంది. “తెనాలి రామకృష్ణుడు” ఈక్రింది పద్యంలో అన్ని లఘువులతో వ్యంగ్యహాస్యాన్ని అందించారు.

**“ఎమి సెపితివి కపితము**
**బ్రమపడి వెరిపుచకయ వడిదిని సెపితొ**
**యుమెతకయ తిని సెపితివొ**
**అమవస నిసిని అలసని పెదన”**

1875 సం॥ నుండి మన తెలుగు సాహిత్య చరిత్రలో ఆధునిక యుగం ప్రారంభమయింది. తెలుగు సాహిత్యం వివిధ ప్రక్రియలతో శాఖోపశాఖలుగా విస్తరించింది. ఈకాలానికి చెందిన కవులు హాస్యరసానికి పెద్దపీట వేశారు. కందుకూరి, చిలకమర్తి, గురజాడ, మునిమాణిక్యం, మొక్కపాటి, పానుగంటి, భమిడిపాటి, ముళ్ళపూడి మొదలైనవారు తమ రచనల ద్వారా అద్భుతమైన, ఆరోగ్యకరమైన హాస్యాన్ని అందించారు. సమాజానికి ఏదైనా ఒక సందేశాన్ని అందించాలనుకున్నప్పుడు తాము చెప్పదలచుకున్న విషయాన్ని హాస్యరసంతో జోడించి చెప్పినప్పుడు అది పాఠకుల మనస్సులను సులభంగా ఆకట్టుకుంటుందని వారి భావం.

వీరేశలింగం, గురజాడ, కందుకూరి, చిలకమర్తి, ప్రభృతులు సాహిత్యం ద్వారా తాము తలపెట్టిన సంఘ సంస్కరణలకు హాస్యరసాన్ని మేళవించి తమ సాహిత్య కృషిని కొనసాగించారు. వీరి రచనలు నేటికీ నిత్యనూతనాలుగా భాసిల్లుతున్నాయి. గిరీశం, గణపతి, బారిష్టర్‌పార్వతీశం, కాంతం, బుడుగు మొదలగు పాత్రలు తెలుగువారి మనస్సుల్లో కలకాలం స్థిరంగా ఉంటాయి. సాహిత్యం ద్వారా సంఘసంస్కరణలు సాధించడానికి హాస్యరసం ఎంతో అనుకూలమైనదని పైవారి ప్రతులను చదివినప్పుడు స్పష్టమవుతుంది.

హాయిగా నవ్వుకోగలగడం మంచి ఆరోగ్య లక్షణమని మనవారి భావన. అయితే ఈ విషయంలో భిన్నాభిప్రాయాలు ఉన్నాయి. "నవ్వు నాలుగువిధాల చేటు" అని కొందరంటుంటే "నవ్వు నాలుగు విధాల గ్రేటు" అని మరికొందరంటున్నారు. రెండిటిలోను నిజం లేకపోలేదు. అసందర్భంగా, అనాలోచితంగా, వెకిలిగా నవ్వితే అది అపార్థాలకు, అనర్థాలకు దారితీస్తుంది. మన జానపదులలో సుస్థిర స్థానాన్ని ఏర్పరుచుకొన్న "లక్ష్మణ దేవర నవ్వు" ఇందుకు మంచి ఉదాహరణ. చక్కని సంభాషణల ద్వారా, చమత్కారాలతో కూడిన హాస్యం ఆరోగ్యకరమైనది, ఆహ్లాదకరమైనది.

ఆధునికాంధ్ర సాహిత్యంలో తనకంటూ ఒక ప్రత్యేక స్థానాన్ని సుస్థిరం చేసుకొని చదివీ చదవగానే ఇది రమణీయమైన రచన అని, చప్పున తెలిసిపోయేలా పాఠకుల హృదయాలలో నిలిచి పోయిన ఆహ్లాద రచయిత 'శ్రీ ముళ్లపూడి వెంకట రమణ'. వీరు ఇతివృత్తాలను ఎన్నుకోవడంలోనే గొప్ప వైవిధ్యము ఉంటుంది. వాటిలో ఒకటి అప్పుల ప్రహసనం "ఋణానందలహరి", వేరొకటి సినీ మాయాలోక చిత్ర విచిత్రం "విక్రమార్కుని మార్కు సింహాసనం", సినిమాలపై సెటైర్లు గిరీశం లెక్చర్లు, ఇంకోటి రాజకీయ చదరంగం గురించి 'రాజకీయ భేతాళ పంచవింశతి', మరొకటి ఇద్దరమ్మాయిలు – ముగ్గురబ్బాయిల ప్రేమాయణం, అన్నిటికంటే ముఖ్యంగా చెప్పుకోవలసినది, తెలుగు బాల సాహిత్యంలో ప్రఖ్యాతి చెందిన "బుడుగు".

ముళ్ళపూడి "బుడుగు" ఎంతో జీవితానుభవం కలిగిన వాడినని చెప్పుకుంటాడు. ఆ జీవితానుభవం తోనే పిల్లలకి పాఠాలు చెప్పే "ప్రైవేట్ మాస్టార్లు" ఎలా ఉండాలో, ఎలా ఉండకూడదో అని కొన్ని "థీసిస్" తయారుచేశాడు. అలాగే తనకు పరిచయం ఉన్న వ్యక్తుల ద్వారా కూడా ఎంతో జీవితానుభవం పొందాడు, ఏడు సంవత్సరాల "బుడుగు" కి ఎంతో జీవితానుభవం ఉంది కాని 'నిఝం' (నిజం) అనేదాన్ని ఎప్పుడు చెప్పాలో, ఎప్పుడు చెప్పకూడదో తెలియలేదు. ఎల్లప్పుడు నిజమే చెప్పడం వలన చాలా ఇబ్బందులు ఎదుర్కొన్నాడు. ఒకసారి " నాన్నతో సంబరానికి వెళ్ళినప్పుడు ఒక వ్యక్తి కనబడ్డాడు బుడుగుకి. మామూలుగా ఎప్పుడూ తలపాగా పెట్టుకునేవాడు, ఆ రోజు తలపాగా లేదు. వాడి గుండు అప్పుడు చూసి ఆశ్చర్యపోయాడు బుడుగు. ఆశ్చర్యపడుతూ నాన్నోయ్.... చూసావా .. వీడిది బోడిగుండు అన్నాడు. వాడికి కోపం వచ్చింది. ఇంటికి వచ్చాక నాన్న కొప్పడ్డాడు. వేళాపాళా ఉండొద్దూ నిజం చెప్పడానికి ", అని.

సమకాలీన యుగంలో వాస్తవాన్ని వాస్తవంగా చిత్రించి వాస్తవంలో కూడా కళ ఉన్నదని అనిపించే విధంగా, నిత్యజీవితంలో మనముందు మసలుతున్న ఎన్నో ఆణిముత్యాల్లాంటి సన్నివేశాలను ఉత్తమ కథలుగా

మలచిన, మంచి సామాజిక స్పృహగల కథా రచయిత్రి "వారణాసి నాగలక్ష్మి". ఆయా సామాజిక రుగ్మతలను తమ కథల ద్వారా సున్నితంగా ఎత్తిచూపటంలో మంచి దిట్ట. వీరు సామాజిక సమస్యలే ఇతివృత్తాలుగా స్వీకరించి 'ఆలంబన, ఆసర, వేకువ పాట' కథా సంపుటాలతో 50కి పైగా కథలు రాశారు. వీరి రచనలలో "అమెరికాలో బుడుగు", "శ్యామాగోపాళం" అనే రెండు కథలను హాస్యస్ఫోరకంగా రచించారు. ఈ రెండు కథల పైన 'ముళ్ళపూడి వెంకటరమణ' ప్రభావం ప్రస్ఫుటంగా గోచరిస్తుంది. "అమెరికాలో బుడుగు" కథ పైన ముళ్ళపూడి "బుడుగు", "శ్యామాగోపాళం" కథ పైన ముళ్ళపూడి "రాధాగోపాళం" ప్రభావం కనిపిస్తుంది. ముళ్ళపూడి "బుడుగు" ఆంధ్ర సచిత్ర వారపత్రికలో నవంబర్ 1956 నుండి ఏప్రిల్ 1957 వరకు ధారావాహికంగా ప్రచురింపబడి తర్వాత అంటే 1957లోనే పుస్తకరూపంలో వెలువడింది. వారణాసి నాగలక్ష్మి "అమెరికాలో బుడుగు" కథ 1988 లో 'ఆంధ్రజ్యోతి వారపత్రిక'లో ప్రచురింపబడింది. బాపు దర్శకత్వంలో ముళ్ళపూడి రచన "రాధాగోపాళం" 2005 సం॥ లో చలనచిత్రంగా విడుదలయింది. నాగలక్ష్మి "శ్యామాగోపాళం" కథ 2006 సం॥ ఏప్రియల్ నెలలో 'నవ్య వారపత్రిక'లో ప్రచురింపబడింది.

వారణాసి నాగలక్ష్మి 'శ్యామాగోపాళం' కథలోని "బుజ్జిగాడి" పాత్ర బుడుగు పాత్రను ప్రతిబింబిస్తుంది. "వీధిలోంచి తుపాకీ వదిలిన గుండులా దూసుకొచ్చాడు బుజ్జిగాడు. కుర్చీలో కూర్చొని ఫైళ్లన్నీ చూసుకుంటున్న నాన్న మెడ చుట్టూ చేతులేసి, వీపు మీద ఊగబోయాడు. తండ్రి విసుక్కోబోయేలోపే ఎగిరి ఒళ్లోకి దూకాడు. ఫైళ్లన్నీ చిందరవందర అయ్యాయి.

నాన్నా! ఇవ్వాళ ఏమైందో తెలుసా? స్కూలు బస్సులో మా గుండు మాష్టారు నిద్రపోతుంటే ఒక వెంట్రుక పీకి తెచ్చా చూడూ ! జేబులోంచి వెంట్రుక తీసి చూపించాడు బుజ్జిగాడు. గుండు మాష్టారుకి వెంట్రుకేమిట్రా? మొహం చిట్లించాడు బుజ్జిగాడి తండ్రి గోపాళం.

అంటే ఇవ్వాళేమో స్కూల్లో నేనూ, రాము పందెం వేసుకున్నాం. ఆయన తల మీద పది వెంట్రుకలే ఉన్నాయని నేనన్నాను. రాముగాడేమో పదకొండున్నాయన్నాడు. స్కూలైపోయాక ఇంటికొచ్చేటప్పుడేమో బస్సులో ముందు సీట్లో ఆయన కూర్చున్నారు. వెనకాల సీట్లో నుంచొని ఆయన గుండు మీద వెంట్రుకలన్నీ లెక్కబెట్టాను. చూస్తే పదకొండున్నాయి. ఎల్లామరి? ఓడిపోతే నా 'గోకూ' బొమ్మ రాముగాడికిచ్చేయాలి. ఏమి చేయనా అని ఆలోచించా, కళ్ళలో చిలిపి నక్షత్రాలు మెరుస్తుంటే తండ్రివైపు అనుమానంగా చూసాడు చెప్పనా వద్దా అన్నట్టు.

'హతవిధీ! ఇదేం చదువురా వెధవాయ్? తప్పుకదా... గురువుగారి జుట్టు పీకావా?' నిజమా? కోపంతో అన్నాడు గోపాళం. నేనేం జుట్టుపీకలే నాన్నా ఆయన నిద్రపోతుంటే ఒక వెంట్రుక పట్టుకుని నుంచున్నా. సడన్ బ్రేక్ వేసినపుడు అదే ఊడిపోయింది ". తండ్రిలాగే భ్రుకుటి ముడి వేయడానికి ప్రయత్నిస్తూ అన్నాడు బుజ్జిగాడు.

" బాగుందా? నువ్వూ నీ పెంపకమూనూ? చికాకు పడ్డాడు గోపాళం, భార్య శ్యామా వైపు చూస్తూ... ఏ! మీ రమణ గారి 'బుడుగు' చేస్తే బానే ఉంది గానీ నాలుగేళ్ళ చంటి వెధవ, మన ఇంటి దీపం వాడు చేస్తే

తప్పయిపోయిందా? న్యాయవాది అయిఉండి సొంత కొడుకు విషయంలో చూపిస్తున్న వివక్షకి మనసు నొచ్చుకోగా అలకని జారవిడుస్తూ అడిగింది శ్యామా" ఇంతలో "నాన్నోయ్"! అని గావుకేక పెట్టాడు బుజ్జిగాడు. " ఏమిట్రా " ఉలిక్కిపడి అడిగాడు గోపాళం. "నాన్నోయ్ ! ఇవి రెండు వెంట్రుకలు ! అంటుకుపోయి ఉంటే ఒకటే అనుకున్నా!" రెండూ విడదీసి చూపిస్తూ అరిచాడు బుజ్జిగాడు. బెంగతీరి వర్షంలో నీరెండలా, మబ్బువీడిన చందమామలా నవ్వారు శ్యామాగోపాళం. ఈ కథలో భార్యాభర్త లైన శ్యామాగోపాళం సంభాషణల్లో ముళ్ళపూడి 'బుడుగు' ప్రస్తావన రావడం గమనార్హం. ముళ్ళపూడి, వారణాసి కథలలోని పై సంఘటనలు రెండూ నేపథ్యాలు వేరైనప్పటికీ బింబ-ప్రతిబింబాలు కావడం విశేషం. ఇదే విధంగా బాపు దర్శకత్వంలో చలన చిత్రంగా వెలువడిన "రాధాగోపాళం" కథ కూడా ముళ్ళపూడి రచనే. ఈ రచనలోని భార్యాభర్తలైన "రాధాగోపాళం" పాత్రలను ప్రతిబింబించే విధంగా "శ్యామాగోపాళం" కథలోని భార్యాభర్తలైన శ్యామా-గోపాళం పాత్రలను తీర్చిదిద్దడంలో 'వారణాసి' కృతకృత్యులయ్యారు.

వారణాసి నాగలక్ష్మి మరో కథ "అమెరికాలో బుడుగు". ఈ కథలో ప్రధాన పాత్ర "కాత్యాయని". తల్లిదండ్రులు ముద్దుగా 'కాత్యా' అని పిలుస్తారు. ఈ అమ్మాయి తెలివైన అమాయకురాలు. అమెరికాలో పుట్టి పెరుగుతుంది. తెలుగు భాషా పరిజ్ఞానం ఏమాత్రం లేదు. అయితే ఒకసారి తండ్రి స్వస్థలమైన భీమవరంలోని తాతగారింటికి వచ్చి రెండు వారాలు ఉంటుంది. ఇక్కడ ఉంటున్నప్పుడు నాయనమ్మ తెలుగు మాట్లాడే తీరును, ఆమె హావభావాలను గమనిస్తుంది. అమెరికా వెళ్ళిన తరువాత వాటిని అనుకరిస్తూ తెలుగు తెలిసినట్లు ప్రవర్తించి పాఠశాలలో ఉపాధ్యాయుల ప్రశంసలు పొందుతుంది. తాను పిల్లిని చూసి భవిష్యత్తులో తాను కూడా పిల్లిని కావాలని, చిరుత పులి బొమ్మలను చూసి తాను కూడా చిరుతపులిని కావాలని అమాయకంగా కలలు కంటుంది.

"వాట్ డు యూ వాంట్ టు బి వెన్ యు గ్రో అప్" అని విచక్షణా రహితంగా ప్రతివారిని ప్రశ్నిస్తూ ఉంటుంది. ఒకసారి అతిథిగా వారింటికి వచ్చిన ఒక పెద్దమనిషిని (జేమ్స్) కూడా ఇదేవిధంగా ప్రశ్నించి తల్లిచేత మందలించబడుతుంది. వారణాసి 'కాత్యాయని' పాత్రపై కూడా ముళ్ళపూడి 'బుడుగు' పాత్ర ఛాయలు స్పష్టంగా కన్పిస్తాయి.

ముళ్ళపూడి "బుడుగు" వచ్చీరాని తెలుగు మాట్లాడుతూ ఉంటాడు. ఉదాహరణకు చదూసంజెలు (చదువు సంధ్యలు), కల్ల (కర్ర), తానం (స్నానం), ముగుడు (మొగుడు), గానపెసూనాంబ (జ్ఞానప్రసూనాంబ), ఆచెరు (ఆశ్చర్యం), సుబ్బలష్మి (సుబ్బలక్ష్మి). ఇదే విధంగా వారణాసి "అమెరికాలో బుడుగు" కథలో కాత్యాయని తెలుగు పదాలు ఉచ్చరించకపోయినప్పటికీ తెలుగు వచ్చినట్లు అభినయిస్తూ నాయనమ్మ హావభావాలను ప్రకటిస్తూ ప్రవర్తిస్తుంది. "కాత్యాయని సంభాషణల్లో వాడిన దాదాపు వంద పదాల్లో నాలుగో ఐదో తెలుగు పదాలు, మిగిలినవన్నీ 'కాత్యా' సృష్టించిన పదాలే కావటం విశేషం".

మొత్తం మీద వారణాసి రెండు కథలపైన ముళ్ళపూడి "బుడుగు" ప్రభావం స్పష్టంగా కనిపిస్తుంది. ఈ రెండు కథలలోని 'బుజ్జిగాడు', 'కాత్యాయని' పాత్రల ద్వారా చిన్నపిల్లల మనస్తత్వాన్ని, వారి ఆలోచనా సరళిని సహజమైన రీతిలో చిత్రీకరించి, తెలుగు పాఠకులకు మంచి హాస్యాన్ని అందించిన " వారణాసి నాగలక్ష్మి " అభినందనీయురాలు.

# నండూరి వారి హద్దులు - హద్దులు కథ హాస్యం

శ్రీమతి నెమ్మలూరి భవాని
తెలుగు అధ్యాపకురాలు
సి. హెచ్. ఎస్. డి. సెయింట్ థెరిసా మహిళా డిగ్రీ కళాశాల
ఏలూరు, పశ్చిమగోదావరి జిల్లా
సెల్ : 8143877881
email :- bhavaninemaaluri123@gmail.com

మానవ జీవితంలో కష్టసుఖాలు సాధారణంగా వచ్చిపోతుంటాయి. ఎలాంటి కష్టాన్నైనా ఏదో ఒక సందర్భంలో చిన్నచిరునవ్వు ద్వారా మర్చిపోగలుగుతాం. మనిషి జీవితంలో నవ్వడం అదృష్టం, ఆరోగ్యదాయకం, శుభకార్యాలు జరిగే సమయాలలో సందర్భాన్ని బట్టి రకరకాల హాస్య సన్నివేశాలు ఎదురవుతుంటాయి. బంధువులు, స్నేహితులు కలిసి సరదాగా నవ్వుకునే సమయంలో ఎలాంటి కష్టాన్నైనా మర్చిపోగలము. అత్తా, అల్లుళ్ళు, బావా - మరదలు, బావాబామ్మర్దులు, మేనత్త - మేనకోడళ్ళు ఇలాంటి వరుసలు కలిగిన వాళ్లు ఒకరికొకరు ఆటపట్టించుకుంటారు. కొత్త అల్లుళ్ళు ఇంటికి వచ్చినపుడు కూడా మర్యాదలు చేస్తూనే మరదళ్ళు, బావమరుదులు సరదాగా ఏడిపిస్తుంటారు. హాస్యాన్ని పుట్టించే ఎన్నో కథలు, నవలలు, జానపద గేయాలు, మొదలైనవి ఎన్నో తెలుగు సాహిత్యంలో చోటుచేసుకున్నాయి. చిలకమర్తి లక్ష్మీనరసింహం, ముళ్ళపూడి వేంకటరమణ, మొక్కపాటి నరసింహశాస్త్రి వంటి కవులు వారి హాస్యరచనలను తెలుగు ప్రజానికనికందించారు.

నండూరి సుబ్బారావు గారి హద్దులు - హద్దులు కథ కూడా చక్కని హాస్యరసాన్ని పోషించింది. అల్లుడికి మర్యాదలు చేసే అత్తమామలు, బావమరిది పాత్రలతో దేనికైనా హద్దుండాలంటూ చక్కని హాస్య కథను చిత్రించారు నండూరి సుబ్బారావు గారు. బావగారిని ఆటపట్టిస్తూ మరిది చేసే

అల్లరిని అతని తండ్రి "నవ్వు నాలుగు విధాల చేటు" అల్లరికి కూడా హద్దుండాలి అంటూ చెప్పే విధానంతో కథను ప్రారంభించి ఎక్కడికక్కడ నవ్వించే సన్నివేశాలనందించారు. "అల్లుడు గారు మరీ కొత్త పాత లేకుండా మాట్లాడకుండా ముంగిలా ఉండటం కూడా మంచిది కాదంటూ" మాటతీరులో హద్దుండాలని చిరునవ్వు కురిసేలా వర్ణించారు రచయిత.

కొత్త అల్లుడికి మర్యాదల కోసం రకరకాల వంటలు చేసిపెట్టి, మొహమాట పెట్టి మరీ తినిపించే అలవాటు ఆంధ్రుల సొంతం. హద్దులు - హద్దులు కథలో కూడా "పొద్దునే ఇడ్లీలు, పదింటికి బొబ్బట్లు, గారెలతో భోజనం, మధ్యలో కారప్పూస, మధ్యాహ్నం మొక్కజొన్న పొత్తులు" ఇలా రకరకాల చిరుతిళ్ళు బలవంతంగా అల్లుడిగారికి వడ్డిస్తుంది అత్తగారు. మరీ అలా అన్ని రకాలు పెట్టడం కూడా మంచిది కాదని, తిండికి కూడా హద్దుండాలని భార్యని మందలించే భర్త పాత్రని చిత్రించి చక్కని హాస్యాన్ని పండించారు నండూరి వారు. మర్యాదలతో కొత్త అల్లుడికి బలవంతంగా తినిపించే ప్రతి కుటుంబానికి సహజంగా నవ్వు వచ్చే విధంగా ఈ సన్నివేశాన్ని నడిపించారు. మితిమీరిన తిండితో ఓ పక్క కడుపునొప్పితో బాధపడే బావగారితో మరిది ఆ సమయంలో కూడా వేళాకోళాలాడటం హాస్యాన్ని పుట్టించింది.

అల్లుడి మర్యాదలకు అయ్యే ఖర్చే కాక, మళ్ళీ కడుపునొప్పికి సంబంధించిన వైద్యానికి అయ్యే ఖర్చు కూడా తనే భరించాలనే మామగారి ఆలోచన, "అంత ఖర్చు మనకెందుకు" అని భార్యకు చెప్పే తీరు, "అమ్మో కడుపునొప్పి, నేనిక బతకను" అంటూ అల్లుడు పడే పాట్లు, పాత్రల మాటతీరు కథలో చక్కని హాస్యాన్ని కనబరచాయి. అల్లుడిని డాక్టరు దగ్గరకు తీసుకువెళ్ళి "మా వియ్యంకుడుగారికి కబురు చేయమంటారా" అని మామగారు అడిగిన తీరు పాఠకుల పెదవులపై చిరునవ్వును పుట్టించింది. డాక్టరు గారు "ఫీజు వెయ్యి రూపాయలిచ్చి మనిషికి బతికించుకోండి, లేదా భగవంతుడిపై భారం వేసి తీసుకుపోండి" అనగానే మామగారు ఖర్చుకు భయపడి భార్యతో

"ఏమే! భగవంతుడి మీద భారం వేసి తీసుకుపోదామా" అనడం అల్లుడి పరిస్థితిని పక్కన బెట్టి అత్తమామలు "మీ మూలం గానే" అంటూ ఒకరినొకరు నిందించుకోవటం కథలో మరింత నవ్వును సృష్టించాయి. డాక్టరు అల్లుడికి ఆపరేషన్ చేస్తూ పొట్టలో నుండి బొబ్బట్లు, గారెలు, డబ్బులు తీసే సన్నివేశం కడుపుబ్బా నవ్వించింది.

డాక్టరు ఏం చెప్పబోతున్నాడో కూడా వినకుండా అత్తగారు ఆవేశంతో "అల్లుడు చనిపోయాడనుకుని" గుండెలు బాదుకుంటూ, కూతురి జీవితాన్ని తలచుకొని ఏడ్చే తీరు ఎంతగానో నవ్వించే విధంగా అత్తగారి పాత్రను చిత్రించారు. డాక్టరు పెద్దపళ్ళెంలో గారెలు, ఐదుపైసల నాణేలు, పది పైసల నాణేలు చూపించటం, మరిది నా పెన్ను ఒకటి పోయింది ఉందేమో చూడండి అనడం కథలో మరింత హాస్యాన్ని కల్గించాయి. చిల్లర డబ్బులు పొట్టలోకి ఎలా వెళ్ళాయా అని ఆలోచించే అత్తగారితో, ఆమె భర్త పప్పుల డబ్బాల్లో చిల్లర దాచటం వలనే అవన్నీ తిండితో కలిసి పొట్టలోకి వెళ్ళుంటాయని చెప్పటం కథలో చివరిగా బిగ్గరగా నవ్వేలా చేసింది.

నండూరివారు ఈ కథలో దేనికైనా హద్దుండాలనీ, అల్లరికి, చాదస్తానికి, పిసినారితనానికి, తిండికి ఇలా అన్నింటికీ హద్దుండాలని చెప్తూ, చక్కని సామాజిక సందేశాన్నందిస్తూనే, కథలో ప్రతి సన్నివేశంలో నవ్వును సృష్టించారు. సంక్షిప్తమైన పాత్రలతోనే విస్తృతంగా హాస్యాన్ని పుట్టించారు. నవరసాలలో హాస్యరస స్థానం ప్రత్యేకమైనది. హాస్యరసాన్ని పుట్టించడం అంతటి సులభమైనది కాదు. చక్కని హాస్య సన్నివేశాలను చిత్రిస్తూ కథలో ఆద్యంతం హాస్యం స్ఫురించే కథను రచించిన నండూరి వారి ప్రతిభా పాటవాలు, వారి హాస్యచతురత కడు ప్రశంసనీయం. అన్నింటికీ హద్దుండాలని, చివరికి మర్యాదలకు కూడా ఒక హద్దుండాలనిపించే విధంగా, హాస్య సన్నివేశాలతో, పిల్లలకు, పెద్దలకు అందరికీ అర్థమయ్యే విధంగా సరళమైన వాక్యాలతో, సంక్షిప్త సుందరంగా సందేశాత్మకమైన హాస్య కథను చిత్రించిన నండూరి సుబ్బారావుగారి రచనా వైశిష్ట్యం,

అభినందనీయం. హాస్య పూరితమైన రచనలను చదవటం వలన మానసిక ఆనందం కలుగుతుంది. వ్యక్తి జీవితంలో నవ్వు చాలా అవసరం. వ్యక్తి తన మనసిక ఆరోగ్యాన్ని పెంపొందించుకునే దశలో ఇటువంటి హాస్య  రచనలను చదవడం వలన మరింత ఉత్సాహంగా మారే అవకాశం ఉంటుంది. అదే విధంగా సాహిత్యాభిరుచి అలవడుతుంది. కాబట్టి ఇటువంటి హాస్య రచనలు వ్యక్తి జీవితానికి, సమాజ శ్రేయస్సుకు దోహదపడుతాయనడంలో ఏ మాత్రం అతిశయోక్తి లేదు.

# పేరడి

***డా. ఎస్. హెచ్.వి. కిరణ్ కుమార్,*** రీడర్, తెలుగు శాఖ, ప్రభుత్వ కళాశాల, నాయుడుపేట

జన జీవన మార్గంలో నెలసరి జీతం తాలూకు బిల్లు తతంగం పూర్తవగానే "పేరడీ" అయిందనటం. మనం వింటుంటాము. అలాగే ఇచట వివరించబోయే పేరడీ' సాహిత్య పిపాసువులకు షఢ్ర సోపేతమైన విందుభోజనం అందిస్తుంది. జీతం జీవనానికి ఉపయోగపడితే, పేరడి' జీవన గమనానికి తగిన ఊతంలా మనసుకు ఉల్లాసాన్ని కలిగిస్తుంది. సాహిత్యం పాఠకునికి బ్రహ్మానంద సహోదరమైన రసానందాన్ని అందిస్తుంది. ఆధునిక సాహితీ జగత్తులో రసానందమనే విందుభోజనం అందించే అనేక ప్రక్రియలు వెలసినవి. వాటిలోనిదే పేరడీ' అనే ప్రక్రియ.

'ప్యారడీ' లేక 'పేరడీ' అన్నది సాహిత్యంలో గల అనేక శాఖలలో ఒకటి. దీన్ని మాచిరాజు దేవీ ప్రసాద్ వాక్యాలలో చెబితే "సాహిత్య రీత్యా చేసిన వెక్కిరింత" దీనిని వికృతి, అనుకరణ, వికటకవిత్వాలుగా పేర్కొనటం జరిగింది.

**పూర్వరంగం:**

ప్రాచీన కవులలో తెనాలి రామలింగ కవిని వికటకవిగా, హాస్య స్ఫోరకమైన సన్నివేశములతో చిత్రింపబడిన ఉదాహరణలనేకం ఉన్నాయి. కాని అతని రచన తీరు వికటకవిత్వం అని పూర్తిగా చెప్ప వీలు కానిదని భావించవచ్చు, కనుక దానిని పేరడీగా పేర్కొనలేము. అలాగే కూచి మంచి జగ్గకవి 'చంద్రలేఖా విలాపం' పేరడీ అని కొందరన్నారు. కాని ఆకవి నీలాద్రి రాజును అతని పరిజ్ఞానాన్ని తిట్టటం వలన హాస్యము ఉద్భవించినప్పటికీ, అది ఉత్తమ హాస్యంగా కనబడదు. ఇందు జుగుప్స ఎక్కువగుట వలన దీనిని కూడా పేరడీగా చెప్పుటకు వీలు లేదు.

పూర్వ కవి కవితాను కరణమనునది సర్వ సాహిత్యాలలో అని వార్యంగా కనిపించే విషయం. దానిని పేరడీ అనలేము. కాని క్రీ.శ 15వ శతాబ్దికి చెందిన 'క్రీడాభిరామ' కర్తయైన వినుకొండ వల్లభరాయుడు అను వ్యక్తి కవిసార్వ భౌముడై వెలుగొందిన శ్రీనాధుని పద్యాలను పద బంధాలను భావాలను హాస్యాను కరణంతో పాటు, ఆ కావ్యనాయకుడైన గోవిందశర్మ పాత్రను శ్రీనాధుని తో వ్యంగ్యాను రూప చిత్రంగా మలిచాడు. శృంగార నైషధంలో పూజాగృహానికి వెళుతున్న నలుడు

*"గన్నేరు పూజాయ గనుపట్టు జిలుగైన*
*సలిల కాషాయ వస్త్రంబుగట్టి"*

అని వర్ణించెను. దానినే కొంచెం మార్చి వేశ్యాసంగమార్థియై వెళుతున్న గోవిందమంచన శర్మకు అలంకార ప్రాయంగా ఎలా చెప్పాడో చూడండి.

*"గన్నేరు బూజాయ కరమొప్పనీరా.*
*మడుగు దోవతి విడిచి కట్టి'*

ఇట్టి ఉదాహరణలనేకం ఇందులోనున్నవి.

ఈ అనుకరణమంతా అతడు శృంగారం యెడల అసహ్యాభావం కలిగించటానికి రచించినట్లున్నది. మొత్తము మీద తెలుగు భాషలో పూర్తి హాస్యాను కరణం చేసిన మొదటి రచన 'క్రీడాభిరామమే' అని చెప్పవచ్చును. ఈ విషయాన్ని బి.వి. సింగరాచార్య తమ క్రీడాభిరామ 'సమాలోకం' లో పేర్కొన్నారు.

ఆధునికులలో కట్టమంచి వీరేశలింగం గారు 'అభాగ్యోపాఖ్యానం' పేరడీ అనిపించినా అది పూర్వ ప్రబంధాలను అధిక్షేపించినట్లున్నది. చెళ్లపిళ్ల వారి 'గీరతము' పేరడీ భావంలా కనిపించినా ఉపదేశాత్మక రచనగా భావింపవచ్చును.

ఇది అంతా పేరడీ రచనకు పూర్వ రంగమై ఉన్నది. పాశ్చాత్య ప్రక్రియలు అనేకం మన సాహిత్య స్రవంతిలో చొచ్చినట్లు పేరడీ కూడా మన సాహిత్యంలో చేరింది.

***నిర్వచనం :*** పేరడీలో సున్నితమైన హాస్యము, సుకుమారమైన చమత్కారము ముఖ్యాంశములు. దీనిలో కవి స్వయంవ్యక్తిత్వమును విస్మరించుట ప్రధాన విషయము. అనుసరింపదలచిన దానిలో లీనమై యుండవలెను. దీనినే ఎడ్మండ్ గాస్ "The Perodist sinks his own individuality as completely as possible. He lives in the writer whom he parodies, like a Soldier crab in a shell carrying his original about in fantastic excursions over which the original has no control. It must enter into the spirit of its model and not merely echo its voice".

ఆంగ్ల నిఘంటువులలో పేరడీ అంటే ఒక పాటలోని అర్థాన్ని విపరీతంగా మార్చేసే మరోపాట" అని 'పాట, పద్యం మొదలైన వాటికి చేసే అనుకరణ' అని, అంతేకాక పేరడీ రచయిత పేరడీ రచింపదలచుకొన్న రచయిత గూర్చి, రచన గూర్చి కూలంకషంగా తెలుసుకోవాలి. మూలరచన గంభీరంగా ఉంటే పేరడీ తెలిగ్గా సాగాలి. విమర్శ హాస్యం హద్దు మీరకుండా, సృజనాత్మకతతో ఉండాలి.

***పేరడీ అంటే :*** గద్యం లేదా పద్య రూపంలో వున్న సాహిత్యకృతిని పరిహసిస్తూ చేసే అనుకరణ లేక పాట పద్యం మొదలైన వాటికి చేసే అనుకరణ," "రచయిత శైలిని అనుకరణ ద్వారా అపహాస్యం చేసే ఒక రచన', ''పేరడీ అంటే ఒక పాటలోని అర్థాన్ని విపరీతంగా మార్చేసే మరోపాట" అని ఆంగ్ల నిఘంటువులు నిర్వచించాయి.

***జరుక్ శాస్త్రి :*** మన సాహిత్యంలో నూతనంగా దిగుమతి అయిన ఈ 'పేరడీ' లను రచించిన వారు కొద్దిమంది కన్పిస్తారు. వారిలో 'జరుక్ శాస్త్రి' అనే పేరొందిన జల సూత్రం రుక్మిణీ నాధ శాస్త్రి ఒకరు, ఆయనకే 'పేరడీ శాస్త్రి' అని మరోపేరు. ఈ ప్రక్రియకు ఆయన ఒక ప్రత్యేక స్థానం కల్పించారనటంలో సందేహం లేదు. వీరు బడిలో కొద్దిపాటి చదువు, తండ్రిగారి వద్ద వేదం, స్మార్తం, జ్యోతిషం నేర్చి, వాటితో పాటు ఒక విధమైన తిరుగుబాటు స్వభావాన్ని పొంది ఉండవచ్చు. అవి ఆయన పై గౌరవాభిమానాలు. కల్గించినవనటంలో అతిశయోక్తి లేదు. 'కృష్ణ శాస్త్రినో, విశ్వనాధనో, ఏక కాలంలో ఇద్దరినో, ఒకరి తరువాత మరొకరినో మానా చేసుకొన్న, శ్రీశ్రీ లాంటి అలనాటి యువకులలోనే రుక్మిణీ నాధశాస్త్రికి స్థానం" అన్న కె.వి. రమణారెడ్డి గారి మాటలు జరుక్ శాస్త్రి అభ్యుదయ మార్గంలో నడిచినట్లు తెలుపుతున్నవి.

జరుక్ శాస్త్రి గారు ఎవరిపై గౌరవాభిమానాలున్నాయో వారినే వినోదాను కరణం చేశారు. వీరిహాస్యాను కరణం గేయాన్ని మొత్తం గానో, కొన్నిసార్లు వచనాన్ని అనుకరించినపుడు అందులో వినోదం, అధిక్షేపణలు వినోదాన్ని కలిగిస్తాయి. వీరు అనుకరణకై కృష్ణ శాస్త్రి, విశ్వనాధ్, శ్రీశ్రీ వంటి గొప్ప రచయితలను చేగొన్నారు.

శ్రీ శాస్త్రి గారు భావకవుల పదప్రయోగాన్ని దృష్టిలో ఉంచుకొని భావ కవిత్వం అన్వయ క్లిష్టతతో ఉన్నదని, చదువరిని ప్రక్క మార్గం పట్టిస్తుందని తలచి కృష్ణ శాస్త్రి వ్రాసిన

*"తొలి వియోగిని నేనే*
*తొలి ప్రేయసిని నేనే*
*ఆనాటి కీనాటికేను నీ దాసనే" అనే కవితను*
*"తులసి మొక్కను నేనే*
*తురక వేపను నేనే*
*ఆనాటి నాటి*
*కేనుమృత్కణమేను" అంటూ పేరడీ చేశారు.*

విశ్వనాధ 'నర్తనశాల' నాటకాన్ని హాస్యాను కరణం చేసిన ఖ్యాతి జరుక్ శాస్త్రి గారు దక్కించుకొన్నారు. నర్తనశాలలో కీచకుడు విషాదాంత నాయకుడు. కాని ఇందులో వినోదాత్మక వ్యంగ్యంగా రచన సాగింది. నాటకం మొదటి రంగంలో సైరంధ్రి కీచకుని తో "మీరు పంతులని విన్నాను" అంటుంది. అందుకు కీచకుడు "నాకు పెద్ద బాలశిక్ష బాగవచ్చు" అంటాడు. అలాగే రాత్రి ప్రొద్దుపోయిన తర్వాత ద్రౌపది కీచకుని వద్దకు వచ్చినపుడు "మా అక్క మిమ్మల్ని పంపిందా? అంటాడు. అందుకామె "అవును టీ డష్టకోసం " అంటుంది. నాటకాంతంలో ద్రౌపది కీచకుణ్ని చంపుతుంది. దీని ద్వారా స్త్రీలు సబలలనే భావం కలిగించి హాస్య వ్యంగ్యాలతో ఒక సందేశాన్ని కూడా రచయిత అందించినట్లున్నది.

శాస్త్రి గారు శ్రీశ్రీ 'నవ కవిత'ను సరదాపాట గా మలచారు. మహా కవి శ్రీశ్రీ కవిత ద్వారా జనంలో చైతన్యం కలిగించాలనే భావన తో రచించిన దాన్ని చాలా మంది కవులు అనుకరించారు. కాని దాని ద్వారా వారేమీ సాధించలేకపోయారు. ఈ విషయాన్ని చెప్పదలచిన శ్రీ శాస్త్రి ఎలా అనుకరించారో చదవండి.

*శ్రీశ్రీ నవ కవితలో*
*సిందూరం రక్త చందనం*
*బందూకం సంధ్యారాగం*
*పులి చంపిన వేడి నెత్తురు*

ఎగరేసిన ఎర్రజెండా.... అని ప్రారంభించి "కావాలోయ్ నవ కవనానికి" అన్నారు. దీని భావ ప్రభావంచే చైతన్యం కలిగించే ఈ గేయాన్ని తేలిక పరచే పేరడీ లక్షణం ఎలాగుందో చూడండి.

*"మాగాయ కంది పచ్చడి*
*ఆవకాయ పెసరప్పడమూ.*
*తెగిపోయిన పాత చెప్పులూ*
*పిచ్చాడి ప్రలాపం కోపం*
*వైజాగులో కారా కిళ్లీ .... అంటూ వినోదానుకరణం చేశారు.*

**దేవీ ప్రసాద్ :** తెనుగు సాహితీ మాగాణంలో పేరడీ ప్రక్రియను వినోదం, వ్యంగ్యం, అధిక్షేపం, అవహేళన, హేళనలతో పెక్కు రచనలు చేసి దీన్ని 'వికటకవిత్వంగా నిర్వచించిన వ్యక్తి.

***శ్రీశ్రీ దేశ చరిత్రలో***

*"ఏ దేశ చరిత్ర చూచినా*
*ఏ మున్నది గర్వ కారణం*
*రహదారి చరిత్ర సమస్తం*
*యాతా యాత జన సమస్తం" అన్నదాన్ని*

***దేవీ ప్రసాద్ రహదార్లులో***

*"నడివీధికి సంగమ ముందా*
*అ రహదారీ వాలం చెంతది*
*పోసిన రాళ్లు, నడిపిన గుళ్లు*
*ఇవికావోయ్ బాట లభాగ్యం"*

అంటూ దేశ చరిత్రను రోడ్ల చరిత్రగా పేరడీ చేశారు.

ఇలా మన సాహిత్యంలో 'పేరడీ' అనే ఈ ప్రక్రియ అనుకరణం, వ్యంగ్యం, వినోదం, హాస్యాలను కలబోసిన కదంబ మాలికలా విశిష్ట స్థానాన్నందుకొంది. అనుకరణము సాహిత్యంలో పుట్టినప్పటికి నేటికి ఈ స్థితిలో కన్పిస్తున్నది. ఇది ఇంకా ప్రచారం పొందాలంటే దీనిని రచింపదలచిన రచయితలకు ధైర్యం, సమకాలిక రచయితల, రచనలపై సమగ్ర అవగాహన, సామాజిక స్పృహలతో హాస్య ప్రవృత్తిని కలిగి ఉండాలి. అపుడది అందర్నీ అలరిస్తుంది.

# नागानन्दनाटके तृतीयाङ्के समुपवर्णितः हास्यरसः- एकमध्ययनम्

**डॉ.सिहेच्. पवन् कुमारः,** संस्कृते अतिथि अध्यापकः, तेलुगु & प्राच्यभाषा विभागः,
आचार्य नागार्जुनविश्वविद्यालयः, नागार्जुननगरः, आन्ध्रप्रदेशः, चरवाणीः 80083 23223
ई-मईल् : pavansimha1981@gmail.com

## आमुखम् :-

असारेऽस्मिन् संसारे दुःख-दावाग्नि - दग्धस्य आधिव्याधिप्रपीडितस्य पापादिविषण्णस्य मायामोहभ्रान्तचेतसो मानववृन्दस्य मनः सन्तापनिवारणाय चेतः प्रसादाय सुखावाप्तये च विद्वद्धौरेयाः तत्त्वज्ञाः काव्यशास्त्रनामकं रत्नं वाङ्मयमहोदधेः सारभूतम् उददीधरन् । रत्नमेतत् चतुर्वर्गावाप्तिसाधनं ब्रह्मानन्दसहोदरं रसम् आस्वाद्यतया जनयद् गौरवम् अलभत । तच्च काव्यं द्वधा विभज्यते - दृश्यं श्रव्यं च । श्रव्यं काव्यं काव्य - महाकाव्य-गीतिकाव्यादिभेदेन बहुविधम् । दृश्यं काव्यम् अभिनेयं भवति । तत्र च नटादौ रामादिस्वरूपारोपो भवति । अतः दृश्यं काव्यं 'रूपकम्' इत्युच्यते । उक्तं च विश्वनाथेन -

> **"दृश्यश्रव्यत्वभेदेन पुनः काव्यं द्विधा मतम् ।**
> **दृश्यं तत्राभिनेयं तद्रूपारोपात्तु रूपकम् ।।"**[1] इति ।

धनञ्जयेन यथोक्तम् -

> **"अवस्थानुकृतिर्नाट्यम् । रूपकं तत्समारोपात् ।।"**[2]
>
> **"वस्तु नेता रसस्तेषां भेदकः ।।"**[3] इति ।

तस्यमतानुसारं नाटके तत्त्वत्रयं प्रमुखम् । तदाश्रितं च नाटकस्य विभाजनम् । अत्र नाटके रसस्य महत्त्वम् उररीक्रियते । रसनिष्पत्त्यै आनन्दोपलब्ध्यै च नाटकानां रचना ।

## नाटकानां महत्त्वम् :

नाट्ये न कोऽपि भावो विषयो वाऽवशिष्यते । सर्वेऽपि रसा अत्र निबद्धाः । यथास्थानं पुरुषार्थचतुष्टयं चतुर्वर्गो वाऽत्र संगृह्यते । यथा -

1. द्रः- विश्वनाथः - साहित्यदर्पणम् - VI / का - 1
2. द्रः- धनञ्जयः दशरूपकम् - I / का - 7
3. द्रः- धनञ्जयः दशरूपकम् - I / का - 11

**क्वचिद् हास्यं क्वचिद् युद्धं क्वचित् कामः क्वचिद् वधः ॥''**[1] इति

## रसस्य स्वरूपम् :

विश्वनाथः साहित्यदर्पणे अस्य रसस्य स्वरूपं प्रतिपादयति यद्रसो ब्रह्मास्वादसहोदरः -

**''वेद्यान्तरस्पर्शशून्यो ब्रह्मास्वादसहोदरः ।**
**स्वाकारवदभिन्नत्वेनायमास्वाद्यते रसः ॥''**[2] इति

**''पानकरसन्यायेन चर्व्यमाणः, हृदयमिव प्रविशन् अन्यत् सर्वमिव तिरोदधत्, ब्रह्मास्वादमिवानुभावयन्, अलौकिकचमत्कारकारी श्रृङ्गारादिको रसः''**[3]

इति रसस्य आस्वाद्यत्वम् अनुभूतिविषयत्वं च मम्मटेन वर्ण्यते ।

तैत्तिरीयोपनिषदि - **''रसो वै सः । रस ह्येवायं लब्ध्वाऽऽनन्दी भवति ।''**[4]

इत्यत्र ब्रह्मणो रसस्वरूपं तदवाप्तौ च आनन्दोपलब्धिर्वर्ण्यते । नाट्यशआस्त्रे भरतेन निर्दिश्यते -

**''रस इति कः पदार्थः? उच्यते - आस्वाद्यमानत्वात् । कथमास्वाद्यते रसः? यथा हि नानाव्यञ्जन--संस्कृतमन्नं भुञ्जाना रसानास्वादयन्ति सुमनसः पुरुषा हर्षादींश्चाधिगच्छन्ति, तथा नानाभावाभिनयव्यञ्जितान् वागङ्गसत्त्वोपेतान् स्थायिभावान् आस्वादयन्ति सुमनसः प्रेक्षकाः हर्षादींश्चाधिगच्छन्ति ।''**[5] इति ।

रसभावयोश्च परस्परं पोषकत्वम् । न भावहीनो रसः, न च रसहीनो भावः । एवं द्वावपि परस्परं भावयतः । रसः सर्वेषां भावानां मूलम्, यथा बीजं वृक्षपुष्पादेः, इत्येवं भरतेन नाट्यशास्त्रे कथ्यते यथा -

**''नानाद्रव्यैर्बहुविधैर्व्यञ्जनं भाव्यते यथा ।**
**एवं भावा भावयन्ति रसानभिनयैः सह ॥**
**न भवहीनोऽस्ति रसो नभावो रसवर्जितः ।**
**परस्परकृता सिद्धिस्तयोरभिनये भवेत् ॥**
**व्यञ्जनौषधिसंयोगो यथान्नं स्वादुतां नयेत् ।**
**एवं भावा रसाश्चैव भावयन्ति परस्पसम् ॥**

---

1. द्रः- भरतः - नाट्यशास्त्रम् - I / श्लोः 108
2. द्रः- विश्वनाथः - साहित्यदर्पणम् - III / का - 2, 3
3. द्रः- मम्मटाचार्यः - काव्यप्रकाशः - VI (ध्वनिकाव्यनिरूपणम्)
4. द्रः- तैत्तिरीयोपनिषद् - II / मं - 7
5. द्रः- भरतः - नाट्यशास्त्रम् - VI - पृ.सं : 286, 287

**यथा बीजाद्भवेद्वक्षो वृक्षात्पुष्पं फलं यथा ।**
**तथा मूलं रसाः सर्वे तेभ्यो भावा व्यवस्थिताः ।।''**[1] इति

कथं रसनिष्पत्तिरिति जिज्ञासायां तेनोच्यते -

**''विभावानुभावव्यभिचारिसंयोगाद्रसनिष्पत्तिः ।।''**[2]

अत्र विभावाः कारणानि, अनुभावाः कार्याणि, व्यभिचारिणश्च सहकारिणः, एषां संयोगाद् रसस्य निष्पत्तिः इति । एतादृशः रसः आदौ अष्टविधा भरतेनोक्तम् । यथा -

**''शृङ्गारहास्यकरुणा रौद्रवीरभयानकाः ।**
**बीभत्साद्भुतसंज्ञौ चेत्यष्टौ नाट्ये रसाः स्मृताः ।।''**[3] इति

अनन्तरकाले मम्मट-विश्वनाथादि आलङ्कारिकैः शान्तरसैस्ह निववविधाः रसाः प्रकीर्तिताः । एतेषु रसेषु शृङ्गार-वीररसादनन्तरं हास्यरसः साहित्यालङ्कारग्रन्थेषु प्रमुखं स्थानमावहते ।

## हास्यरसस्वरूपम् :

अथ हास्यो नाम हासस्थायि भावात्मकः । स च विकृतपरवेषालङ्कारधाष्ट्र्यलौल्यकुहकासत्प्रलापव्यङ्ग्यदर्शन-दोषोदाहरणादिभिर्विभावैरुत्पद्यते । तस्य ओष्ठनासाकपोलस्पन्दनदृष्टि व्याकोशाकुञ्चनस्वेदास्यरागपार्श्वग्रहणादि-भिरनुभावैरभिनयः प्रयोक्तव्यः । व्यभिचारिणश्चास्यावहित्थालस्यतन्द्रानिद्रास्वप्नप्रबोधासूयादयः । द्विविधश्चायमात्मस्थः परस्थश्च । यदा स्वयं हसति तदाऽऽत्मस्थः । यदा तु परं हासयति तदा परस्थः ।

**''विपरीतालङ्कारैर्विकृताचाराभिधानवेषैश्च ।**
**विकृतैरर्थविशेषैर्हसतीति रसः स्मृतो हास्यः ।।**
**विकृताचारैर्वाक्यैरङ्गविकारैश्च विकृतवेषैश्च ।**
**हासयति जनं यस्मात्तस्माज्ज्ञेयो रसो हास्यः ।**
**स्त्रीनीचप्रकृतावेष भूयिष्टं दृश्यते रसः ।**
**षड्भेदाश्चास्य विज्ञेयस्तांश्च वृक्ष्याम्यहं पनः ।।**
**स्मितमथ हसितं विहसितमुपहसितं चापहसितमतिहसितम् ।**
**द्वौ द्वौ भेदौ स्यातामुत्तममध्याधमप्रकृतौ ।।**
**स्मितहसिते ज्येष्ठानां मध्यानां विहसितोपहसिते च ।**
**अधमानामपहसितं ह्यतिहसितं चापि विज्ञेयम् ।।''**[4]

---

1. द्रः- भरतः - नाट्यशास्त्रम् - VI / श्लोः 35-38
2. द्रः- भरतः - नाट्यशास्त्रम् - VI / श्लोः 32
3. द्रः- भरतः - नाट्यशास्त्रम् - VI / श्लोः 15
4. द्रः- भरतः - नाट्यशास्त्रम् - VI / श्लोः 49-53

इत्येवंप्रकारेण नाट्यशास्त्रे भरतेन हासयरसलक्षणम्, स्वरूपभेदांश्च सम्यक् निर्दिष्टाः अभवन् ।

## नागानन्दनाटके तृतीयाङ्के समुपवर्णितः हास्यरसः - एकमध्ययनम्

संस्कृतसाहित्यलोके श्रीहर्षमहाकविना विरचितं सुप्रसिद्धं नाटकं नागानन्दमेव । पञ्चअङ्कैः नाटकमिदं विराजते । नाटकेऽस्मिन् नायकः विद्याधरचक्रवर्ती जीमूतवाहनः । नायिका मलयवती । गरुडमुखात् नागजातिं संरक्षणाय स्वीय प्राणान् तृणवदितिमत्वा दातुं सन्नद्धः धीरोदात्तः जीमूतवाहनस्य उदात्त चरितमेव नाटकेऽस्मिन् प्रधानेतिवृत्तः । वस्तुतस्तु नाटकेऽस्मिन् दयावीरः अङ्गिरसोऽपि, श्रीहर्षेण तृतीयाङ्के आदितः अन्तस्तावत् विट-चेट-विदूषक-चेटी इत्यादि साहाय्यक पात्राणां संभाषणैः अङ्गरसरूपेण हास्यरसपोषणं सुष्ठु चकार । अस्य हास्यरसस्यपोषण नैपुण्यं यथामति परिशीलनमेव मदीय शोधपत्रस्य प्रधोनोद्देश्यः ।

विवाहनिश्चयानन्तरं कुसुमकर उद्याने आयोजितः एकः सुन्दर पानोत्सवे जीमूतवाहन-मलयवत्यौ उभौ सानन्देन विहरन्तिस्म । जीमूतवाहनस्य प्रियसखः विदूषकः आत्रेयः तस्य सखः उद्यानपानोत्सवे विहरतीति विषयं ज्ञात्वा, तस्यान्तिकं गन्तुमुद्युक्तस्सन् स्कन्धन्यस्तवस्त्रयुगलैः प्रविशति । प्रविश्य भ्रमरबाधां नाटयन् - अरे ! कथं पुनर्दुष्टमधुकरा मामेव अभिभवन्ति । भवतु ज्ञातम्, यत् तन्मलयवतीबन्धुजनेन जामातुः प्रियवयस्य इति कृत्वा सबहुमानं वर्णकैर्विलिप्तोऽस्मि । सन्तानकुसुमशेखरकश्च मम शीर्षे पिनद्धः स खलु एषोऽत्यादरोऽनर्थी भूतः । किमिदानीमत्र करिष्यामि ? अथवा एतेनैव मलयवतीसकाशाल्लब्धेन रक्तांशुकयुगलेन स्त्रीवेशं विधाय उत्तरीयकृतावगुण्ठनो गमिष्यामि । प्रेक्षे तावत् किं दास्याः पुत्रा मधुकराः करिष्यन्ति । इतिमत्वा तथा करोति । एतस्मिन् समये -

**विटः** : अरे चेट ! (अङ्गुल्या निर्दिश्य सहासम्) एषाखलु नवमालिका आगता । मां प्रेक्ष्य चिरस्यागत इति कुपिता अवगुण्ठनां कृत्वाऽन्यतो गच्छति । तत् कण्ठे गृहीत्वा प्रसादयाम्येनाम् । (सहसोपसृत्य कण्ठे गृहीत्वा मुखे ताम्बूलं दातुमिच्छति) ।

**विदूषकः** : (मद्यगन्धं सूचयन् नासिकां गृहीत्वा पराङ्मुखः स्थित्वा) कथमेकेषां मधुकराणां सकाशात् परिभ्रष्ट इदनीमन्यस्य दुष्टमधुकरस्य मुखे पतितोऽस्मि, इति चिन्तयामास ।

**विटः** : (प्रणामं कुर्वन् विदूषकस्य चरणमात्मनः शिरसि कृत्वा) कथं कोपेन पराङ्मुखीभूता ? प्रसीद नवमालिके ! प्रसीद । इति प्रार्थयामास । ततः चेटी प्रविशति ।

**चेटी** : आज्ञप्ताऽस्मि भर्तृदारिकया - 'हञ्जे नवमालिके ! कुसुमाकरोद्यानं गत्वा उद्यानपालिकां पल्लविकां भण । अद्य सविशेषं तमालवीथिकां सज्जीकुरु । मलयवतीसहितेन जामात्रा तत्र गन्तव्यम्' इति । आज्ञप्ता मया पल्लविका । तद् यावत् रजनीविरहवर्द्धितोत्कण्ठं प्रियवयस्यं शेखरकमन्विष्यामि । एषः शेखरकः । कथमन्यां कामपि स्त्रिय प्रसादयति । यदिह स्थितैव जानामि कैषिति, इति विचिन्त्य तत् दृश्यम् आलोकयामासा ।

**विटः** : (सहर्षम्) -

**"हरिहरपितामहानामपि गर्वितो यो न जानाति नन्तुम् ।**
**स शेखरकश्चरणेषु तव नवमालिके ! पतति ॥"**[1] इत्यवदत् ।

**विदूषकः :** दास्याः पुत्र ! मत्तपालक ! कुतोऽत्र नवमालिका ? इति तं विटं निन्दयामास ।

**चेटी :** तत् दृश्यं दृष्ट्वा, कथं मामिति कृत्वा मदपरवशेन शेखरकेण आर्य्यात्रेयः प्रसाद्यते ? तद् यावत् अलीकं कोपं कृत्वा द्वावप्येतौ परिहसिष्यामि इत्यमन्यत् ।

**चेट : :** चेटीं दृष्ट्वा शेखरकं हस्तेन चालयन् - 'भर्तः ! मुञ्चैतं न भवत्येषा नवमालिका । एषा पुना रोषारक्ताभ्यां लोचनाभ्यां प्रेक्षमाणाआगता ।' इत्येवमकथयत् ।

**चेटी :** तत्र उपसृत्य, 'शेखरक ! का पुनरेषा प्रसाद्यते ?' इत्यपृच्छत् ।

**विदूषकः :** भो देवी ! कोऽपि ब्राह्मणोऽहं मन्दभागधेयप्रयुक्तः इति स्वकीय दुःस्थितिं जगाद ।

**विटः :** विदूषकं स्पष्टतया दृष्ट्वा 'अरे कपिलमर्कट ! त्वमपि शेखरकं प्रतारयसि ? अरे चेट ! गृहाणैतम्, यावत् नवमालिकां प्रसादयामि' इत्यवदत् ।

**चेटः :** 'यत् भर्ता आज्ञापयति' इति विटेन प्रत्यवदत् ।

**विटः :** तदनन्तरं विदूषकं मुक्त्वा चेट्याः पादयोः पतति । प्रसीद नवमालिके ! प्रसीद । इति प्रार्थयामास ।

**विदूषकः :** एष मेऽपक्रमितुमवसरः इति स्वान्तरङ्गे मत्वा पलायितुमीहते ।

**चेटः :** तदा विदूषकस्य यज्ञोपवीतं गृह्णाति । यज्ञोपवीतं त्रुट्यति । क्व ? क्व ? कपिलमर्कट ! पलायसे ? इत्युक्त्वा तदुत्तरीयेणैव गलके बद्ध्वा कर्षति ।

**विदूषकः :** भगावती नवमालिके ! प्रसीद, मोचय माम् इति प्रार्थयामास ।

**चेटी :** विहस्य, यदि भूमौ शीर्षं निवेश्य पादयोः मे पतसि इति साऽवदत् ।

**विदूषकः :** भोः ! राजमित्रं ब्राह्मणो भूत्वा दास्याः पुत्र्या पादयोः पतिष्यामि ? इति सरोषं सप्रकम्पश्च तया सह अब्रवीत् ।

---

1. द्रः- श्रीहर्षदेवः - नागानन्दम् - III / श्लोः 3

**चेटी** : विदूषकस्य शेषभरित वचनान्यकर्ण्या सा अङ्गुल्या तर्जयन्ती सस्मितम्, 'इदानीं पातयिष्यामि शेखरक ! उत्तिष्ठ । प्रसन्ना तेऽहम् । एष पुनर्जामातुः प्रियवयस्यः त्वया खलीकृतः । एवञ्च श्रुत्वा कदाऽपि भर्ता मित्रावसुस्तुभ्यं कुप्यति । तदादरेण सम्मानयैनम्' इति शेखरकं प्रति जगाद ।

**विटः** : यन्नवमालिका आज्ञापयति तत् कर्तुं सन्नद्धः सन् विदूषकं कण्ठे गृहीत्वा, उत्तरीयं वर्तुलीकृत्य आसनं ददाति । अनन्तरं, 'आर्य ! त्वं मया प्रियसम्बन्धिकः इति कृत्वा परिहसितः । किं सत्यमेव शेखरक ! त्वया कृतः परिहासः ? इह उपविशतु सम्बन्धी । इत्येवं विदूषकं सान्त्वयितुं आदरपूर्णवचनान्यवदत् ।

**विदूषकः** : स्वान्तरङ्गे - 'दिष्ट्यापगत इवास्य मदावेगः' इति मत्वा उपविशति ।

**विटः** : नवमलिके ! उपविश त्वमपि एतस्य पार्श्वे, येन द्वावपि युवां सममेव सम्मानयिष्यामि इत्यकथयत् ।

**चेटी** : विहस्य उपविशति ।

**विटः** : चषकमादाय, अरे चेट सुभृतं खल्वेतं चषकं कुरु अच्छसुरया इति चेटमादिदेश ।

**चेटः** : चषकभरणं करोति ।

**विटः** : स्वशिरः शेखरात् पुष्पाणि गृहीत्वा चषके विन्यस्य जानुभ्यां स्थित्वा नवमालिकया उपनयति । नवमालिके ! आस्वाद्य एतस्मै विदूषकाय देह्येतमित्यवदत् ।

**चेटी** : सस्मितम्, यत् शेखरको भणति तथा कृत्वा विटस्य अर्पयति ।

**विटः** : विदूषकस्य चषकमर्पयति । अर्पणसमये 'एतत् नवमालिकामुखसंसर्गविशेषवासितरसं शेखरकात् अन्येन केनाप्यन्येनानास्वादितपूर्वम्, तत् पिबैतत् । किं ते अतोऽप्यपरं सम्मानं करिष्यामि' इत्यब्रवीत् ।

**विदूषकः** : सवैलक्ष्यस्मितं कृत्वा, 'शेखरक ! ब्राह्मण खल्वहम्' इति प्रत्यब्रवीत् ।

**विटः** : यदि त्वं ब्राह्मणः तत् क्व ते ब्रह्मसूत्रम् ? इति पप्रच्छ ।

**विदूषकः** : तत् खलु मेऽनेन चेटेन कृष्यमाणं छिन्नम् इति प्रत्युत्तरं दीयते ।

**चेटी** : विहस्य यद्येव, तद्वेदाक्षराण्यपि तावत् कत्यपि उदाहर । इत्यब्रवीत् ।

**विदूषकः** : देवी ! अनेन शीधुगन्धेन पिनद्धानि वेदाक्षराणि । अथवा किं मम भवत्या समं विवादेन ?एष ते ब्राह्मणः पादयोः पतति, इत्युक्त्वा चेट्याः पादयोः पतितुमिच्छति ।

**चेटी** : तदा तं विदूषकं हस्ताभ्यां निवार्य्य, मा खल्वेवं करोत्वार्य्यः । शेखरक ! अपसर अपसर, ब्राह्मणः खल्वेषः । आर्य्य ! न त्वया कोपितव्यं सम्बन्ध्यनुरूपः खल्वेष मया परिहासः कृतः इत्युक्त्वा विदूषखस्य पादयोः पतति ।

**विटः** : अहमप्येनं प्रसादयामि इति मत्वा, पादयोर्निपत्य मर्षयतु मर्षत्वार्य्यः, यत् मया मदपरवशेनापराद्धम्, येनाहं नवमालिकया सह आपानकं गमिष्यामि ।

**विदूषकः** : मर्षितं मया, गच्छतं युवाम् । अहमपि प्रियवयस्यं प्रेक्षे । इति विदूषकेनोक्तानि वचनान्याकर्ण्य विटश्चेट्या सह चेटश्च निष्कान्ताः अभवन् ।

**विदूषकः** : अतिक्रान्तो ब्राह्मणस्याकालमृत्युः । तद्यावदहमपि मत्तपालकसङ्गदूषित इह दीर्धीकायां स्नास्यामि इति मत्त्वा तथाकरोति । नेपथ्याभिमुखमवलोक्ये, एष प्रियवयस्योऽपि रुक्मिणीमिव हरिर्मलयवतीमवलम्ब्य इत एवागच्छति । तद् यावत् पार्श्ववर्त्ती भवामि । इति स्वमनसि विचिन्त्य विवाहवेषालंकृतौ मलयवतीजीमूतवाहनयोः सकाशम् अगच्छत् ।

## उपसंहारः

इत्येवं नाटकेऽस्मिन् विद्यमानान् एतान् साहाय्यकपात्राणां संभाषणांपरिशीलनेन श्रीहर्षदेवस्य पात्रचित्रण कौशलं, हास्यरसपोषणे तस्य नैपुण्यं च सम्यक् प्रकटितोऽस्ति ।

## उपयुक्तग्रन्थसूची


| | | | |
|---|---|---|---|
| 1. | तैत्तिरीयोपनिषत् | समूलशाङ्कारभाष्य एवं ज्योति हिन्दी टीकासहितम्, व्याख्याकारः कन्हैयालाल् जोषि | चौखम्बा ओरियंटालिया, दिल्ली । |
| 2. | धनञ्जयः | दशरूपकम् सविमर्श 'विद्वद्विनोदिनी' हिन्दी व्याख्योपेतम्, व्याख्याकारः डॉ. सुधाकर मालवीयः | कृष्णदास अकादमी, वाराणसी । |

# చారిత్రక గేయాలలో హాస్యం

డా. పెరుగుపల్లి బలరామ్
అధ్యాపకుడు,
టి. జె. పి. ఎస్. కళాశాల,
గుంటూరు.

## ఉపోద్ఘాతం:

పాట అనేది చాలా ప్రాచీనమైనది. దానికి కాల నిర్ణయం చేయడం చాలా కష్టం. గేయమంటేనే పాడుకోవడానికి వీలుగా ఉండేది. కొన్ని పాటలలో చెప్పబడిన పదాలను బట్టి కాల నిర్ణయం చేయడం చేసేందుకు ప్రయత్నించవచ్చు. అయితే కాలక్రమంలో కొన్ని పదాలు పరిణామం చెంది పాత పదాల స్థానంలో

కొత్త పదాలు చేరి ఉంటాయి. ఇలా రూపు మార్చుకున్న పాటలు ఎన్నో ఉంటాయి. పాట పుట్టుక విధానం గురించి బిరుదురాజు రామరాజు గారు "నాగరికత ప్రారంభంలో నాట్యం పుట్టింది. మనుషులు పగలంతా కష్టపడి రాత్రి నలుగురూ ఒక చోట ఉల్లాసంగా కాలం గడిపేటప్పుడు నాట్యము ప్రారంభమవుతుంది. క్రమేణా మౌనరాగము బయలుదేరుతుంది. ఆ తరువాత మనస్సులో మాట బయటకు అనేటప్పుడు లయమేర్పడుతుంది. ఆ శబ్దజాలము పాట అవుతుంది."[1] జానపద సాహిత్యంలో ప్రధానమైనది గేయ సాహిత్యం. జానపదులు పాడుకునే పాటలలో చారిత్రక ప్రసిద్ధి చెందిన గేయాలు చాలా ముఖ్యమైనవి. తెలుగు రాష్ట్రాలలో ప్రసిద్ధి చెందిన చారిత్రక ఘట్టాలు పల్నాటి వీర చరిత్ర, కాటమరాజు కథలు చాలా ముఖ్యమైనవి.

## పల్నాటి వీర చరిత్రలో యుద్ధ భీరువుల వర్ణన – హాస్య రసం:

ఆంధ్ర ప్రాంతంలో ఒకనాటి మహా భారత సంగ్రామాన్ని తలపించేలా జరిగిన యుద్ధం పల్నాడు యుద్ధం. గుంటూరు జిల్లాలోని పల్నాడు ప్రాంతమైన కారెంపూడి, గురజాలలో జరిగిన యుద్ధం ఇది. క్రీస్తు శకం 12 వ శతాబ్దంలో ఆంధ్ర దేశ స్థితిని, రాజకీయ, సాంఘిక, మత మార్పులకు కారణం అయిన సంఘటన. ఆ ప్రాంతానికి పాలకులుగా ఉన్న అలరాజు, నలగామ రాజుకు మధ్య జరిగిన సంగ్రామం ఇది. ఈ యుద్ధంలో బ్రహ్మనాయుడు అనే మంత్రికి పుట్టిన బాలచంద్రుడనే వీరుని వర్ణనలు చాలా ఎక్కువగా కనిపిస్తాయి. అతని

[1] తెలుగు జానపద గేయ సాహిత్యము-బిరుదురాజు రామరాజు -పుట:17

యుద్ధ రీతి అభిమన్యుడి యుద్ధం వంటిదని జానపదులు కీర్తిస్తుంటారు. అతని యుద్ధాన్ని తట్టుకోలేక పారిపోతున్న సైనికుల అవస్థలు హాస్యాన్ని కలిగించే విధంగా ఉంటాయి.

"పారిపోవగ లేక బ్రతుకుపై నాశ

బ్రతిమాలుచుండెడు బలని చయంబు

లిటువంటి జగడంబు లెన్నడెరుంగ

మేలాగుపోదు మనుచు నేడ్చెడివారు

పణతులు దిట్టిన పడలేక వచ్చి

చచ్చుచునుంటిమే సమర రంగమున"[1]

దీనిలో చూసినట్లయితే బాలచంద్రుడితో యుద్ధం చేయలేక భటులు పారిపోదాం అనుకుంటే ఇంటి దగ్గర భార్యలతో  పోరు, అవమానం వస్తుందని దానిని అసలు భరించలేక, ఏం చేయాలో పాలుపోని స్థితిలో ఉండటం హాస్యాన్ని ఇస్తుంది.

అదే సమయంలో సైనికుల వేషంలో నాగమ్మ చేత పంపబడిన  కొందరు బోయ వాళ్ళు కూడా బాల చంద్రుడిని చూసి భయపడ్డారు. తమ ఆకారం, దేహ దారుఢ్యం చూసి బాల చంద్రుడు, ఇతర సైనికులు భయపడిపోతారనుకున్నారు. కానీ ఏనాడూ యుద్ధం చేసిన అనుభవం లేని బోయవాళ్లు బాలచంద్రుని యుద్ధ రీతి చూసి భయపడిపోయారు. వాళ్ళ స్థితి కూడా హాస్యాన్ని కలిగిస్తుంది.

"బోయవారము మేము పూర్వంబునందు

భుజముల కాయలు పూని కన్గొనుడి

పగవారు మము కనుగొని పారిపోవుదురు

మీకేమి భయమని మెలత నాగమ్మ

బాగుగా నమ్మించి పంప వచ్చితిమి"[2]

---

[1] తెలుగు జానపద గేయ సాహిత్యం -బిరుదురాజు రామరాజు -పుట :198

[2] తెలుగు జానపద గేయ సాహిత్యం – బిరుదురాజు రామరాజు -పుట:198

నాగమ్మ చెప్తే యుద్ధం చేయడానికి వచ్చారు. కానీ వారికి యుద్ధం చేయడం రాదు. అనుకున్నదొక్కటి అయినది ఒక్కటి అన్నట్లుగా ఉంది వాళ్ళ పరిస్థితి. బాల చంద్రుడి చేతిలో ప్రాణాలను పోగొట్టుకోకుండా తప్పించుకునేందుకు ప్రయత్నిస్తున్నారు.

"చనలేక భయమున చచ్చిన వారి

మీద ద్రోసుక యుండి మెదలని వారు

చచ్చిన గజముల చాటున దాగి

పందతనంబున పడియుండువారు

పెండలాల తలుచుక బిట్టేడ్చువారు

వల్మీకముల మీద వశియించు వారు

గడ్డి పొదల చాటున కదలని వారు"[1]

యుద్ధంలో చనిపోయిన వాళ్ళ మధ్యలో చనిపోయిన వాళ్ళ లాగా పడుకున్న వాళ్ళు కొందరు, ఏనుగుల చాటున దక్కున్న వాళ్ళు కొందరు, తమ ఇళ్లదగ్గర భార్యలను తలుచుకొని ఏడ్చే వాళ్ళు కొందరు, తపస్సు చేస్తున్న వాళ్ళ లాగా నటించే వాళ్ళు కొందరు, అమాయకులులాగా వేళ్ళు చీకుతూ నటించే వాళ్ళు కొందరు ఇలా ఒక్కొక్కళ్ళు ఒక్కోలా తప్పించుకునేందుకు చేస్తున్న ప్రయత్నం మనకు నవ్వు తెప్పిస్తుంది.

**కాటమ రాజు కథలో హాస్యం:**

తెలుగు నాట్య మరొక వీరరసాత్మక ఘట్టం కాటమరాజు కథ. కాటమ రాయుడు, నలసిద్ది మహారాజుకి మధ్య నెల్లూరు ప్రాంతంలో పశువులకు కావాల్సిన గ్రాసం విషయమై తలెత్తిన వివాదం యుద్ధానికి దారి తీసింది. ఆ యుద్ధం కూడా అతి భయంకరంగా జరిగినది. ఆ యుద్ధంలో యదు వంశ ప్రముఖుడైన కాటమరాజు పశు గణంలోని బొల్లావు కూడా యుద్ధంలో పాల్గొంది. సాక్షాత్తు విష్ణు అంశగా భావించే ఆ ఎద్దు చేసే యుద్ధం శత్రు సైనికులను భయానికి గురి చేసింది.

"శకునంబు గాదాయే సాగిరాగాను

[1] తెలుగు జానపద గేయ సాహిత్యము – బిరుదురాజు రామరాజు -పుట:198

కాని శకునంబున కదలినందున

కలనిలో బొల్లావు కల్లుగా జంపె

ఇకనైనా నెల్లూరుకిప్పుడే పోయి

మంచి శకునమరసి మారాలి వచ్చేదమని

ఒకడు తప్పించుకొనుచుండిరి”[1]

ఇలా కొందరు దాన్ని పట్టి బంధించాలని ప్రగల్భాలు పలుకుతుంటే మరికొందరు దానిని చూసి యుద్ధం చేయలేక ఇది మంచి శకునం కాదని, మరలా వద్దామని పారి పోయే ప్రయత్నం చేస్తున్న వాళ్ళు కొందరు. ఆద్యంతం వీర రసాత్మకంగా సాగే ఈ కథలలో జానపదులు అక్కడక్కడా సందర్భోచితంగా హాస్యాన్ని పండించి, మనకు అందించారు. జానపదుల ఊహా శక్తికి, హాస్య చతురతకు ఇలాంటి హాస్య గేయాలు నిదర్శనాలుగా కనిపిస్తాయి. పైన చెప్పబడిన సందర్భాలలో హాస్యాన్ని పండిస్తూనే బాలచంద్రుడు, బొల్లావు యొక్క వీరత్వాన్ని కూడా చూపించారు.

**ఆధార గ్రంథాలు :**


1. తెలుగు జానపద గేయ సాహిత్యము – బి. రామరాజు
2. జానపద సాహిత్యం- హాస్యం – డా. దాసరి రమేష్

# సరదా హాస్య కథలు

భాస్కర రావు,
తెలుగు ఉపాధ్యాయుడు,
లొయోలా పబ్లిక్ స్కూల్,
నల్లపాడు,
ఫోన్: 7569966729.

**ఉపోద్ఘాతం:**

అనవరతం సాగిన గ్రామీణ హాస్యాస్పద సంభాషణలు ఆధునిక వైవిధ్య జీవనంలో కనుమరుగవుతున్న సంఘటనలు కోకొల్లలు. కారణాలు ఎన్నున్నా కోరికలు అనంతాలు. కావున సరియైన కారణంగా భావింపబడుతున్నది. కోరికలు మాత్రమే మానవ జీవితాన్ని ఊపిరి సలుపని ఉద్యోగ పయనాలలో ముంచెత్తుతున్నది. అలనాటి పాతకాలపు సమాజంలో మానవుడు ఎంతటి సుఖవంతమైన జీవితాన్ని అనుభవించాడు. ఆనాటి కాలపు సమాజంలో ఒకరికి ఒకరుగా అందరకి ఎంతో సమయం, తీరిక ఉండేది. ఒకరితో ఒకరు ఎంత గొప్పగా సమ్మిళితమయ్యేవారు. అందరూ రక్త సంబంధీకులు కాకపోయినా మామ, బాబాయి, అత్త, పిన్ని, అక్క, అంటూ పిలుచుకునే ఆత్మీయ పలకరింపులో ఎంత ప్రేమ దాగుంది. ఒకరికి ఒకరు ఎంత హాస్యాస్పదంగా మాట్లాడుకునేవారు. సహృదయంతో స్వార్థం లేకుండా ఎంత చక్కగా నవ్వుకునేవారు. అట్టి సంఘటనల్లో మచ్చుకు కొన్నైనా గుర్తు చేసుకుంటూ ప్రస్తుత మన జీవితాన్ని ఆనందమయంగా కొంత సమయమైనా గడపాలని నా ప్రయత్నం. ఈ ఉద్దేశంతోనే జనబాహుళ్యంలో కొన్ని హాస్యాస్పద కథలను మీ ముందుంచే ప్రయత్నం చేస్తున్నాను.

**1. తింగర నరసింహం:**

తీరిక దొరికింది కదా అని మరదలితో సరదాగా గడుపుదామని బయలు దేరాడు నరసింహం. ప్రయాణం చేస్తూ తనని ఎన్నో రకాలుగా ఊహించుకుంటూ తనలో తాను నవ్వుకుంటూ బయలుదేరాడు. ప్రయాణం చేస్తూ తనని ఎన్ని రకాలుగా ఆట పట్టించి, ఏడిపిస్తూ తన ప్రేమని పొందవచ్చో అనేక రకాలుగా ఊహించుకుంటూ, తనలో తాను నవ్వుకుంటూ బయలుదేరాడు. దారి మధ్యలో తనకు తెలిసిన వారు, తెలియని వారు ఏంతో మంది కలిశారు. వారితో ఏదో కచ్చా పచ్చాగా మాటలు కలిపి మళ్ళీ తన ఊహల లోకంలో మునిగిపోతూ ప్రయాణం సాగిస్తూనే ఉన్నాడు. ఏదైతేనేం చివరికి మరదలి ఇంటికి చేరుకుని అంతా

వెతికి ఆదుర్దాగా చూశాడు. ఇంట్లో ఎక్కడా తన జాడ లేదు. కొంత నిరాశగా ఒక చోట సేదతీరిన అనంతరం అప్పుడే ఏదో ఒక శుభకార్యానికి వెళ్ళి వచ్చినట్లు కొందరు ముత్తైదువులు, కొందరు పెద్దమనుషులు తన మరదలి ఇంటి వద్ద కాళ్ళు కడుక్కుంటూ కనిపించగా నరసింహానికి అనుమానమొచ్చి తన బావను ఆరా తీయగా " అదేంట్రా తెలియనట్లు అడుగుతున్నావు దారి మధ్యలో ఎంత మందిమి అడిగినా సరిగ్గా సమాధానం చెప్పకుండా ఏదో ఊహించుకుంటూ నీలో నువ్వు నవ్వుకుంటూ వెళుతున్నావు. నీ మరదలి నిశ్చితార్థానికి వెళుతున్నామని చెప్పాను కదా! అనే సరికి నరసింహం గుండెల్లో గుభేల్..

## 2. తెలివి తక్కువ హనుమంతు:

హనుమంతుకి తాను తెలివి గలవాడిననే కొంత అహం ఉండేది. కానీ ఆ అహం వల్ల తాను కొన్ని ఇబ్బందులకు గురవుతుండేవాడు. ఒక శుభ కార్యానికి వెళ్ళి అందరితోపాటు పుష్టిగా భోజనం చేసి ఎంచక్కా తీపి పాయసాన్ని జుర్రుకుంటున్నాడు. పాత రోజుల్లో భోజనాల చివర్లో మాత్రమే పాయసం విస్తర్లలో వేడి వేడిగా పోసేవారు. దాన్ని చాలా త్వరగా తాగేయాలని తాను అందరికంటే ముందే పంక్తి భోజనాలలో నుండి లేవాలని తన మనస్సులో అనుకున్నాడు హనుమంతు. పాయసం వేడి వేడిగా చేయి, నోరు కాలిపోతున్నా అతి కష్టం మీద తాగేశాడు. కానీ అది తన అర చేతి నుండి మోచేతి వరకు చూరుని పట్టుకు కారే వర్షపు నీరులా చక్కగా పక్క వాడి ఒళ్ళోకి జారిపోతుంది. పక్కవాడు కోపంగా చూస్తున్నాడు తన బట్టలన్నీ పాడు చేశాడానే కోపంతో. కానీ హనుమంతుకి అతను ఎందుకు కోపంగా చూస్తున్నాడో అర్థం కాలేదు. నాకెందుకులే అనుకొని వడివడిగా లేచి నీళ్ళు పొయ్యి నా చేతిని కడుక్కోవాలి అని ఆదుర్దాగా ఒక చీకటిగా ఉన్న చుట్టూ తడికెలతో జాగ్రత్తగా మూసివేసి ఉన్న ఒక చోటికి వెళ్ళి అక్కడున్న ఒక పల్లె పడుచుతో అడగటం మొదలు పెట్టాడు. ఆమె గట్టిగా అరవగా అందరూ చుట్టూ మూగి నాలుగు దెబ్బలు తగిలిస్తే గాని అర్థమైంది ఆమె స్నానం చేస్తుందని.. తాను చూసుకోకుండా గెలుపు అనే ఆనందం కోసం ఆమెనే నీళ్ళు పోయమని అడిగానని అనుకుంటూ నాలుక కరుచుకొంటూ సాగిపోయాడు హనుమంతు.

## 3. ప్రేమలోకం:

ఒక ప్రియుడు తన ప్రియురాలిని తీసుకొని ఈ ఆదివారమైనా సరదాగా గడపాలని ఒక అందమైన వనానికి తీసుకెళ్ళాడు. కానీ వీరిని చూసి ఆ పార్కు కాపలాదారులు ఇక్కడకు ప్రేమికులు రాకూడదని పంపించేశారు. సరేలే అని ఒక మంచి సినిమాకి వెళ్దామని వెళ్ళగా హాల్లో కూడా వీరి చనువు,

ప్రవర్తనలను చూసి పంపించేశారు. పాపం ఏం చేయాలో అర్థం కాక సినిమా మధ్యలోనే వచ్చేశారు. ఆదివారం వృధా అయిపోతుంది. మళ్ళీ ఆదివారం వరకు తనతో సరదాగా గడపటం కుదరదని నిరుత్సాహపడుతున్న ప్రియుడు దారిలోనే నడుచుకుంటూ పోతుండగా ఒక చోట ఒక బస్సు ఆగి ఉండటం చూశాడు. ఎవరూ చూడకూడదని ఆ బస్సు పక్కన కూర్చొని కబుర్లు చెప్పుకుంటున్నారు. సమయం గడిచిపోతుంది. ఒక పక్క మంచి ప్రదేశం దొరికిందని లోలోపల ఎంతో సంతోష పడుతున్నాడు ప్రియుడు. అలా సంతోషంతో సరదాగా కబుర్లు చెప్పుకుంటున్న వేళ ఒక కానిస్టేబుల్ తన లాఠీతో రోడ్డుపై గట్టిగా కొడుతూ, విజిల్ వేస్తూ దగ్గరకు రావడం మొదలు పెట్టాడు. వడివడిగా వచ్చి ఏయ్ ఏంటి మీరిక్కడ లేవండి.. లేవండి.. ఇది రోడ్డు అని గట్టిగా అరవడం మొదలు పెట్టాడు. ఇక ఆ మాటలు విన్న ప్రియుడికి ఒక్క సారిగా కోపం కట్టలు తెంచుకొని "ఏయ్ ఎంటయ్యా పార్కుకి వెళ్తే పంపేశారు. సినిమాకి వెళ్తే పంపేశారు... చివరికి ఒక బస్సు చాటున కూర్చొని కాలక్షేపం చేసుకుంటున్నా పంపించేస్తున్నారేంటయ్యా! అని గట్టిగా దబాయించాడు. కానీ "ఇది నడి రోడ్డయ్యా! బస్సు వెళ్ళి గంటయ్యింది. జనమంతా మిమ్మల్నే చూస్తున్నారు. అని కానిస్టేబుల్ అనేంతవరకు ప్రేమలోకంలో విహరిస్తున్న ఈ ప్రేమ జంటకి ఇహ లోకం గుర్తుకి రాలేదు. అప్పుడు చుట్టూ మూగిన జనం గుంపుల్ని చూస్తూ సిగ్గుతో తలవంచుకొని పారిపోయారు ప్రేమికులు.

**ఉపసంహారం:**

ఇలాంటి కబుర్లతో కాలక్షేపం చేస్తూ, వంట వండుకుంటూ పగలంతా పొలం పని చేసుకొని అలసిపోయిన తన శరీరాన్ని వేడి వేడి నీటితో స్నానం చేసి ఇలాంటి కబుర్లు, కథలతో సరదాగా నవ్వుకుంటూ మానసికంగా, శారీరకంగా ఆరోగ్యంగా మాటలను అందరితో పంచుకుంటూ సంతోషంగా నిద్రపోయేవారు. మరుసటి రోజుకి అదే ఉత్సాహంతో, ఆరోగ్యంతో తయారయ్యేవారు ఆనాటి తరం వారు. కానీ ఈ నాటి తరం వారికి ఒకరికొకరికి మాటలు లేవు. టి. వి. , సెల్ ఫోన్, ఇంటర్నెట్, కంప్యూటర్లతో ఊపిరి సలుపని జీవితాలు. ఒకరినొకరు పలకరించుకోలేనంత విచిత్రమైన ఉద్యోగాలు. ఈ ధోరణి మారిన రోజున ఆయురారోగ్యాలతో అందరూ విలసిల్లుతారని భావన.

# తెలుగు జానపదుల సాహిత్యం లో హాస్య ఘట్టాలు

ఆలా వెళాంగిణి రాజు

తెలుగు ఉపాధ్యాయుడు,

లొయోలా పబ్లిక్ స్కూల్,

నల్లపాడు,

ఫోన్:9948559171.

**ఉపోద్ఘాతం:**

"కొత్త పుంతలు తొక్కుతూ...

కాంతి రెక్కలు తొడుగుతున్న తెలుగు సాహిత్యం"

కాలానుగుణంగా మానవుడు మారినప్పుడే కొత్తదనానికి చోటు ఇచ్చిన వాళ్ళమవుతాము. మార్పుని ఆహ్వానించి అభివృద్ధికి తావునివ్వాలి. కాలంలో మార్పులు సహజం, అవి అనివార్యంగా వస్తుంటాయి. ప్రాచీనాన్ని గౌరవిస్తూనే ఆధునికానికి స్వాగతం పలికితేనే గొప్ప తెలుగు సాహిత్యాన్ని సృష్టించిన వారమవుతాము. కాలానుగుణంగా సాహిత్యంలో జరిగిన మార్పులను చూస్తే రకరకాల కవిత ప్రక్రియలు, వచన ప్రక్రియలకు ఊహించని మార్పులు, ధోరణులు చోటు చేసుకున్నాయి. ప్రాచీన తెలుగు సాహిత్యంలో నన్నయ దగ్గర నుండి నేటి ఆధునిక కవుల వరకు ఎందరో ఎన్నో కవిత ప్రక్రియలను సృష్టించి తెలుగు సాహిత్యాన్ని ఎంతో ఎత్తులో నిలిపారనటంలో అతిశయోక్తి లేదు.

మానవ జీవితంలో మార్పులను ఆహ్వానించినట్లే సాహిత్యంలో కూడా మార్పులను ఆహ్వానించాలి. సాహిత్యంలో కూడా రకరకాల ప్రక్రియలను కలుపుకొని ముందుకు సాగినప్పుడే అభివృద్ధి పథంలో సాగుతుంది. సి. నారాయణ రెడ్డి గారు చెప్పినట్లు....

"కడలి అంచులు దాటి కదిలింది తెలుగు

ఎదల లోతులు మీటి ఎగసింది తెలుగు

ఇటు మలేషియా నుంచి అటు అమెరికా వరకు

పలు దిశల గొంతుకల పలికింది తెలుగు

ఏ భాష చెణకైనా ఏ యాస చినుకైనా

తనలోన కలుపుకొని తరలింది తెలుగు"

అలా అన్నీ భాషలను తెలుగు భాషలో కలుపుకొని ముందుకు సాగిపోయే గొప్ప భాష మన తెలుగు భాష. ఇటువంటి తెలుగు భాషను మరిచిన మనిషికి మనుగడ ఉండదు. తెలుగు కవిత్వంలో గడిచిన వంద సంవత్సరాల కాలంలో వివిధ ధోరణులు, ప్రక్రియలు, వాదాలు, ఉద్యమాలు ఇలా రకరకాల మార్గాలలో పయనిస్తూ వస్తున్నది. పాతలోని మంచిని తీసుకొని కొత్తలోని విశిష్టతను తీసుకుంటూ తెలుగు ప్రజలు ముఖ్యంగా రచయితలు, కవులు ముందుకు నడవాల్సిన అవసరత ఉంది. ఏది ఏమైనా తెలుగు సాహిత్యానికి పెద్ద పీట వేస్తూ కొత్త పుంతలు తొక్కిస్తూ కాంతి రెక్కలు తొడిగేలా చేయాలి. ఈ విషయంలో కవులు, రచయితలతో ఏమాత్రం తీసిపోని వారు జానపదులే.

తెలుగు సాహిత్యం జానపదుల మౌఖిక సాహిత్య రూపం నుండి మొదలు పెట్టి నేటి వరకు అనేక రూపాలలో, అనేక ఉద్యమాలతో చైతన్యవంతమై నేటి వరకు కొనసాగుతుంది. జానపద కళారూపాలు, కథలు, పాటలు కొన్ని జానపదుల నోటిలో నాని, పరిపక్వత చెంది, ఆనాటి ఆచారాలను, సంప్రదాయాలను, అలవాట్లను, జీవన విధానం నేటి ఈ తరాలకు అందించగలిగి వాటి ఆధారంగా మరింత ముందుకు వెళ్లేందుకు అవి ఎంతో తోడ్పాటుని ఇస్తున్నాయి.

ప్రపంచంలోని భాషలలో కెల్ల తెలుగు భాష, తెలుగు సాహిత్యంలో ఉన్న హాస్యం మరే భాషలో అంతగా కనిపించదంటే అది అతిశయోక్తి కాదు. తెలుగు భాషే మధురంగా ఉంటే అంతా కన్నా మధురంగా హాస్యం ఎక్కువగా ఉంటుంది. హాస్యాత్మకంగా మాట్లాడుకునే వాళ్ళు ఉండాలే కానీ నవ్వుకోవడానికి మన తెలుగు వారికి కొదువ లేదు. జంధ్యాల పాపయ్య శాస్త్రి గారు చెప్పినట్లు – నవ్వడం ఒక యోగం, నవ్వించడం ఒక భోగం, నవ్వలేకపోవడం ఒక రోగం. అందుకే తెలుగు ప్రజాలమైన మనము నవ్వుకుంటూ సరదాగా గడపడానికి కొన్ని హాస్య కథ సన్నివేశాలను మీ ముందుంచే ప్రయత్నం చేస్తున్నాను.

**1. సరసులు:**

భార్యా భర్తల మధ్య అనుబంధం, ప్రేమానురాగాలు ఎలా ఉంటాయో, ఇద్దరు చమత్కార ప్రియులైనప్పుడు వారి సంభాషణలు ఎలా ఉంటాయో ఈ కథలో చూడవచ్చు.

ఒక రోజు భార్య ఆఫీసుకి వెళ్ళిన భర్త తిరిగి ఎప్పుడు వస్తాడా అని ఎదురు చూస్తుంది. భర్త కోసం అని రకరకాల వంటకాలు అన్నీ తయారు చేసి, ప్రేమగా భర్తకి వడ్డించాలని గంపెడు ఆశతో ఎదురు చూస్తుంది. ఈ లోపు భర్త రానే వచ్చాడు. స్నానాదికాలు అయ్యాక బోజనానికి సిద్ధమైన భర్తకి వడ్డిస్తూ భార్య చమత్కారంగా 'కోతి' అని అన్నది. అది విన్న భర్త మరికొంతసేపటికి 'పశువ' అన్నాడు. అది విన్న భార్య నేను ఎంతో ప్రేమగా మీకు రకరకాల వంటకాలు పెడుతుంటే ఇంత మాట అంటారా అని కొంత ఆవేదన వ్యక్తం చేసింది. ఆ మాటలు విన్న భర్త కూడా కొంత అసంతృప్తిని వ్యక్తం చేస్తూ మరి నన్ను నువ్వు కోతి అని అన్నావు కదా! అందుకే నేను నిన్ను పశువ అని అన్నాను అని బదులు చెప్పాడు భర్త. అందుకు భార్య ఇలా అన్నది 'కోతి అంటే నిందించినట్లు కాదండి! కోతి అంటే "కోరినంత తిను" అనే పదాలలో కో, తి అనే రెండు అక్షరాలు కలిపితే వచ్చిన పదం అని చమత్కారంగా చెప్పింది. అది విన్న భర్త కూడా భార్య చమత్కారానికి తగిన విధంగా సమాధానమిచ్చాడు.

అసలు విషయానికి వస్తే నన్ను పశువ అని ఎందుకు అన్నారని భార్య అడిగినప్పుడు భర్త ఈ వధ్యంగా సమాధానమిచ్చాడు 'పశువ అంటే 'ప' అంటే పరి, 'శు' అంటే శుభ్రంగా 'వ' అంటే వడ్డించు అని అర్థం అని చెప్పాడు. ఈ విధంగా సరసమైన సంభాషణ భార్య భర్తల మధ్య జరిగింది. ఇది ఒక హాస్య ఘట్టం. భార్య భర్తలిద్దరు సంభాషణ సరసులయినప్పుడు హాస్యాని కొదువ ఉండదు కదా.

## 2. పండితుడు – పళ్ళ వ్యాపారి:

ఒక రోజు ఒక తెలుగు పండితుడు రోడ్డు మీద వెళుతూ ఒక పండ్ల దుకాణం వద్దకు వెళ్ళాడు. వెళ్ళి పండ్ల వ్యాపారితో నేను ఒక తెలుగు పండితుడిని, మాది పండితుల వంశం అని చెప్పాడు. అది విన్న పండ్ల వ్యాపారి అయితే "సంకనాకు" ఏది అన్నాడు. పండ్ల వ్యాపారి ప్రయోగించిన పదబంధంలో 'సంకనాకు' లో రెండు అర్థాలున్నాయి. ఒకటి నువ్వు పండితుడవైతే నాకేంటి సంకనాకు అని అని ఒక తిట్టు అర్థంలో కాగా, మరొకటి పండితుడవు అంటున్నావు కదా చేతిలో తాళపత్ర గ్రంధాలు (సంకలో పెట్టుకుని తిరుగుతారు కదా) ఏవి అనే అర్థంలో ప్రయోగించాడు. ఆ పండితుడు రెండింటిలో ఏది అర్థం చేసుకుంటాడో చమత్కారంతో వివరించడమైనది.

కొంతసేపటి తర్వాత పండితుడు పండ్ల వ్యాపారి దుకాణంలో ఉన్న అరటి గెల మీద చేయి పెట్టి అరటి పండ్లను తెంచబోయాడు. అప్పుడు పండ్ల వ్యాపారి అరటి గెలపై చేయ తీయండి లేకపోతే 'పళ్ళు రాలిపోతాయి' అన్నాడు. మళ్ళీ ఇందులో రెండు అర్థాలు ఉన్నాయి. ఒకటి చేయి తీయకపోతే అరటి పండ్లు రాలిపోతాయి అని కాగా, రెండవది నోటిలోని పళ్ళు రాలిపోతాయి అని. ఇది జానపదుల హాస్య సంభాషణకు నిలువెత్తు నిదర్శనం.

3. నామకరణం:

ఒక వ్యక్తికి వరుసగా కుమార్తెలు పుట్టారు. ముందు పుట్టిన ఇద్దరు కుమార్తెలలో ఒకరికి 'గోపిక', మరొకరికి 'దీపిక' అని పేరు పెట్టారు. మూడవసారి కూడా కూతురు పుట్టింది. ఏ పేరు పెట్టాలా చమత్కార ప్రియుడైన ఒక పండితుడిని అడిగాడు. ఆయన చమత్కారంగా మొదటి పాప పెరు గోపిక, రెండవ పాప పేరు దీపిక, మూడవ పాప పేరు 'ఆపిక' అని రసవత్తరంగా సమాధానం ఇచ్చాడు. ఇందులో కూడా ద్వంద్వార్థాలు లేకపోలేదు.

ఉపసంహారం:

ఇలా అజరామరమైన సాహిత్యంలో హాస్యాస్పదమైన సన్నివేశాలు, సంఘటనలు కోకొల్లలుగా కనిపిస్తాయి. జానపదులైన ప్రజలు ఇలాంటి ఎన్నో హాస్యాత్మక సంఘటనలు, కథలు చెప్పుకుంటూ కాలక్షేపం చేస్తుంటారు. ఈ కాలం ప్రజలకు కొంచెం సేపు మాటలాడుకోవడానికి కూడా సమయం ఉండటం లేదు. దాని వల్ల హాస్య చతురతకి వారు దూరమౌతున్నారని చెప్పవచ్చు. ఇలాంటి సందర్భాల ద్వారనైన కొంచెం సేపు నవ్వుకునే ప్రయత్నం చేయవచ్చు.

# स्वप्नवासवदत्तनाटके - हास्य चतुरता

डाँ. के यश्वन्त कुमार रेड्डि
संस्कृत अतिथि अध्यापकः
तेलुगु & प्राच्यभाषाविभागः, आचार्य नागर्जुन विश्वविद्यालयः
ई-मईल : ykreddy.kallam@gmail.com

**आमुखम्**

संस्कृतवाङ्मयम् द्विधा विभक्तं वैदिकं लौकिकं चेति । वैदिके तु वेदाः ब्राह्मणानि, आरण्योपनिषदः पुराणानि सन्ति । लौकिके रामायण महाभारतेतिहासौ, महाकाव्यानि, पद्यगद्यचम्पू काव्यानि, नाटकानि इत्यादिनि सन्ति ।

लौकिकसाहित्य जगति साहित्यान्तरमिव रूपकसाहित्यमपि सुसमृध्दं विद्यते । तत्र तस्य हि स्वकीया एव विराष्टि परम्परा । लोकप्रियता दृष्ट्या काव्येषु रूपकसाहित्यस्य प्रथमं स्थानम् ।

**भासः परिचयः**

भासो हि सम्प्रति विज्ञातनाटककृत्सु प्राचीनतमो मतः । भासस्य स्थिति - काल विषये प्रण्डिताः सम्प्रत्यपि नैकमत्यं भजन्ते । तसां मध्ये पाणीनि कालिदासः, कौटिल्यः पूर्वेऽपि उदयन समकालिकं गणपतिशास्त्रिणा प्रभोदयति । महाकवि कालिदासः मालविकाग्निमित्रे "प्रथितयशसाम् भाससौमिल्ल कविपुत्रादीनाम् प्रबन्दान्..." इति भासः प्रसिद्ध नाटककारः एव प्रभोदयति ।

स्वप्नवासवदत्त नाटक कर्तृत्व विषये राजसेखरः सूक्तिमुक्तावल्यं -

यास नाटक चक्रे ऽपिच्छकैः क्षिप्ते परीक्षितुम् ।

स्वप्नवासवदत्तस्य दाहको ऽभून्न पावकः ।।

इति भासः कर्तृत्वं निर्धरीतवान् । तदनन्तरं अभिनवगुप्तः, भोजदेवः, सागरनन्दि इत्यादि पण्डितेभ्यः स्पष्टतयभासः कर्तृः एव निर्धरिताः ।

भासः स्वप्नवासवदत्त नाटके षष्ठ अङ्काः सन्ति । वासवदत्त उदय महाराजेन स्वप्नेन मिलिताः । ता एव नाटके स्वप्नवासवदत्त इति नामः अकरोत् ।

भासः स्वप्नवासवदत्त नाटके वासवदत्त, पद्मवति पत्रेषु, उदयनः दक्षिण नायकत्व पत्रेषु स्पष्ट रूपेण चित्रिताः । उदयनः स्वप्नेन निज रूपेण अनुभवः सुस्पष्टतया ऊहा रूपेण चित्रिताः इति भासः अद्भुत कल्पनेन एक एव । तदनन्तर कविवरेण्यः स्वप्नवासवदत्त नाटक कथक्रमः अनुसारेण अनेके नाटकानि हर्षः कालिदासादिभिः अनुसरणीयाः ।

नाट्यशास्त्र प्रवर्तकेषु प्राचीनतमेष्वाचार्येषु प्रमुखः भरतमुनिः तस्य नाट्यशास्त्रे रस - गुण - रीति अलंकारादीनामपि समीचीनं विवेचनं प्राप्यते । तस्य ग्रन्थे -

"श्रृङ्गर - हस्य - करुणा - रौद्र - वीर - भयानकाः ।

बीभत्साभ्दूतसंज्ञौ चत्यष्टौ नाट्ये रसाः स्मृताः ॥

रतिर्हासश्च शोकश्च क्रोधोत्साहौ भयं तथा ।

जुगुप्सा विस्मयश्चेति स्थायिभावाः प्रकीर्तिताः ॥

इति अष्टरसौ ते स्थायी यावः वर्पिताः ।

स्वप्नवासवदत्तनाटके - हास्य चतुरता

स्वप्नवासवदत्ते कविः भासः पात्राणां चरित्रचित्रणे नाट्यकलायाः अभ्दुतं चित्रं चित्रयति। विशुद्धस्य विशदप्रेम्णः यादृशं वर्णनं भासेन कृतं, तादृशं संस्कृतसाहित्ये सुदुर्लभम् । नाटकेऽस्मिन् नाटकीयघटनानाम् ईदृशं मनोहरस्वरूपं प्राप्यते, यत् अस्वाभाविकतायाः दर्शनमेव कुत्रापि न भवति । स्वप्नवासवदत्तं संस्कृतसाहित्यिस्य जाज्वल्यमानं महार्हं रत्नं विद्यते इति नात्र संशयः ।

यौगन्धरायणो हि आदर्शमन्त्री, यः सदैव राज्ञः राज्यस्य च सुरक्षा चिन्तयति । स्वकर्तव्यपालनार्थं राज्ञः प्रियं कर्तुं यौगन्धरायणः वासवदत्तायाः वह्नौज्वलनस्य मिथ्यावृत्तं प्रसारयति । शत्रून् पराजयितुं राज्ञः दर्शकस्य सहायता अत्यावश्यकीति ज्ञात्वा तेन महता कौशलेन पद्मावत्या सह वत्सराजस्य विवाहः विहितः । विजयानन्तरं सः पुनः राज्ञः समीपे वासवदत्ताम् उपस्थापयति ।

भासः प्रकृतिवर्णन शिल्पी, रसालङ्कारयोः कलापक्षस्य च प्रियः कविरिति प्रतिभाति। भासः हास्य रसः विदूषकः, काञ्चुकीय, चेटी पत्रेषु सम्यक्तया सुन्दर रूपेण वर्णीतमस्ति ।

स्वप्नवासवदत्ते वत्सदेश महाराज उदयनेन मित्रः वसन्तकः, काञ्चुकीयः मगधराजन्तपुरचर रूपेण हास्य चमत्कारः भासः वर्णिताः ।

स्वप्नवासवदत्ते प्रथमाङ्के काञ्चुकीयः प्रविश्या - सम्भषक! नखलु नखलूत्सरणा कार्या - पश्य -

यौगन्धरायणः - हन्त । सविज्ञानस्य दर्शनम्, वत्से ! उपसर्पावस्तावदेनम् ।

वासवदत्ता - आर्य ! तथा ।

यौगन्धरायणः - (उपसृत्य) भोः किं कृतेयमुत्सारणा ?

काञ्चुकीयः- भोस्तपस्विन् !

यौगन्धरायणः- (आत्मगतं) तपस्वीन्निति गुणवान् खल्वयमालापः । अपरिचयात्तुनश्लिष्य ते मे मनसि ।

काञ्चुकीयः - भोः । श्रूयताम्, एषाखलु गुरुभिः अभिहित नामधेयस्य अस्माकं महाराज दर्शकस्य भगिनी पद्मावती नाम । सैषा नो महाराज मातरं महादेवी माश्रमस्थामभि गम्यानुज्ञातात् अत्र भवत्या राजगृहमेवशस्यति ।

चतुर्थाङ्के प्रविशति विदूषकः - (सहर्षं) भोः! दिष्ट्यां तत्र भवतो वत्सराजस्य अभिप्रेत विवाह मङ्गल रमणीयः कालो दृष्टः । तत् समये प्रवेश्य चेटी - कुत्र सखलु गत आर्य वसन्तकः ? अम्मो ! एष आर्य वसन्तकः (उपसृत्य) आर्य वसन्तक ! कः कालस्त्वाम् अन्विष्यामि ?

विदूषकः - (दृष्ट्वा) किं निमित्तं भद्रे ! माम् अन्विष्यसि ?

चेटी - अस्माकं भट्टिनी भणति अपिस्नातो जामातेति ?

विदूषकः - किं निमित्तं भवती पृच्छति ?

चेटी - किमन्यत् ? सुमनो वर्णकमानयामीति ?

विदूषकः - स्नातस्तत्र भवान् । सर्वमानयतु भवती वर्जयित्वा भोजनम् ।

चोटी - किं निमित्तं वारयसि भोजनम् ?

विदूषकः - अ धन्यस्य मम कोकिलानामक्षि परिवर्त इव कुक्षि परिवर्तः संवृत्तः ।

चेटी - ईदृश एव भव ।

विदूषकः - गच्छतु भवती । याव दह मपि तत्र भवतः सकाशं गच्छामि ।

तत् समये सपरिवार समेतः पद्मावती, अवन्तिका वेषधारिणी वासवदत्ता च प्रवेशति। अतः -

चेटी - किं निमित्तं भर्तृदारिका प्रमदवनम् अगता ?

पद्मावती - हला ! तेतावच्छेफालिकागुल्मकाः पश्यामि कुसुमिता वा न वेति । अत्र राजविदूषकश्च आगताः । तदा -

दिदूषकः - ही ही ! प्रचित पतित बन्धुजीव कुसुम विरल वात रमणीयं प्रमद - वनम् । इतः तावत् भवान् ।

राजा - वयस्य वसन्तक ! अय महम् आगच्छामि ।

चेटी - पश्यतु पश्यतु भर्तृदारिका ।

वासवदत्ता - एवं यवतु (तथा कुर्वन्ति)

राजा - कथं भवान् जानाति ?

विदूषकः - इमा नवचित कुसुमान् शेफालिका गुच्छकान् प्रेक्षतां तावत् भवान्

उपसंहार :

एवं स्वप्नवासवत्त नाटके वत्सराज उपयनः वासवदत्ता वियोगेन दुःखितोऽभवत् । तस्मिन् सन्दर्भे दुःखानलदग्धः उदयनस्य हृदये दुःख दूरीकरणाय समयानुकूल हास्य चमत्कृत्या स्वीयः राज्ञां हृदये उत्पादयामास मित्रः विदूषकः । अनेन कारणेन विदूषक पात्रं एव अतिमुख्यतमः अस्मिन् रूपके ।

उपयुक्त ग्रन्थसूची

१. संस्कृत साहित्येतिहासः - आचार्य लोकमणि दाहालः

२. नाट्य शास्त्रम् - भरतः

३. स्पप्नवासवदत्तम् - भासः

# సాహిత్యంలో హాస్యం

ఎ.వెంకటేశ్వర్లు,
పరిశోధనా విద్యార్థి,
ఆచార్యనాగార్జున విశ్వవిద్యాలయం.

నవ్వునాలుగువిధాలచేటు " ఇది పాత సామెత కాని నేడు కాలం మారింది. నవ్వు "నూరువిధాల గ్రేటు " అంటాము. నవ్వటం వలన శరీరంలో ఎండార్ఫిన్లనే హార్మోన్లు విడుదల అవుతాయి.ఇవి మనిషిని ఉత్తేజంగా ఉంచుతూ ఆరోగ్యాన్ని చేకూర్చుతాయని వైద్యులు చెప్తున్నారు. మానవ శరీరంపై నవ్వుఎలా ప్రభావంచూపుతుందో తెలిపే శాస్త్రాన్ని " జెలోటాలజీ " అంటారు.

ప్రాణికోటిలో నవ్వగలిగేది కేవలం మానవుడుమాత్రమే అందుకే జాషువ " నవ్వవు జంతువుల్ నరుడు నవ్వును-నవ్వులు చిత్తవృత్తికి దివ్వెలు ........ " అన్నాడు జాషువ .

నవ్వగలగడం మనిషికి దేవుడిచ్చినవరం. వ్యంగం,హాస్యం,ఛలోక్తులు,కితకితలు వల్ల సాధారణంగా నవ్వుపుట్టిన చాలా సందర్భాలలో ఎదుటివ్యక్తి అపహాస్యం పాలయినపుడు కూడా హాస్యంపుడుతుంది.బోసినవ్వు పాపాయినుండి బోడిగుండు తాతాయ్య వరకు నవ్వేవారి ముఖాలుచూచి ఆనందించేవారే మన తెలుగుకవులు హాస్యాన్ని మేళవించి ఎన్నోపద్యాలు రచించారు, చాటువుగా కూడా చెప్పారు.

శ్రీనాథుడు ఒకసారి వీధిగుండా వెల్తున్నాడు.అదే సమయంలో ఓ యువతి నీళ్లబిందెతో వస్తుంది కాలికి ఏదో తట్టుకుని నీళ్లబిందెతో సహా జారిపడింది.అదే కవిగారి నోటినుండి పద్యంగా జాలువారింది.

" పూజారివారి కోడలు
తాజారగ బిందెజారి డబ్బునబడియెన్
మైజారు కొంగు తడిసిన
బాజారె తిరిగిచూచి ఫక్కున నవ్వెన్ "

ఓ కవిగారి భార్య భర్తతో మీరు అందరిమీద కవిత్వంచెప్తారు. మరి అబ్బాయి మీద కవిత్వం చెప్పమని ఒత్తిడి చేసింది. భార్యగోల పడలేక కవిగారు

"బాచాబూచుల లోపల
బాచన్నే పెద్దబూచి పక్కున్ తామున్
బూచంటే రాత్రి వెఱతురు

బాచన్ననుచూచి పట్టపగలే వెఱతురు "

అని హాస్యమాడిన ఘనుడు మన తెలుగు కవిగారు.

పూర్వం సర్వజ్ఞుడను రాజు తనను తాను అన్నీ తెలిసినవాడుగా విర్రవీగుతూ సర్వజ్ఞుడని స్వయంగా ప్రకటించుకున్నాడు. కవిగారిని పిలిచి తనపై పద్యంచెప్పమనగా

" సర్వజ్ఞనామధేయము
శర్వునకే రావు సింగభూపాలునకే
యుర్విం జెల్లును తొక్కరు
సర్వంజ్ఞుండనుట కుక్క సామజమనుటే "

రాజుగారు మురిసిపోయారు . కాని పండితులు , విమర్శకులు చుట్టూచేరి కవిగారిని నిలదీశారు గొప్పలుపోయి అతను అడిగితే మాత్రం మీరు అలా చెప్పారు అని నిలదీయగా దానికి కవిగారు. మీరు పద్యం సరిగా వివినట్టుగా లేరు మళ్లిచెప్తావినండి అని ..

సర్వజ్ఞనామధేయము శర్వునకే , రావుసింగ భూపాలునకే యుర్వించెల్లును ? తక్కోరు సర్వజ్ఞుండనుట కుక్క సామజమనుటే అని రాజును ఇటువంటివి మానుకోమని మందలించానని చెప్పగా అందరు శాంతించారు .

కూచిమంచితిమ్మకవి అని వెనుకటికి ఒకమంచి కవి ఉండేవాడు . అతను అందవికారంగా ఉండేవాడట, కాని రశికుడుగా పేరుగాంచాడు.అతని సంగతేంటోచూద్దామని ఒక సుందరాంగి దగ్గరికి వెళ్లి కౌగిలించుకుంది. కవిగారు బిత్తరపోయి తలవెనక్కి చూచుకున్నాడట. దానికి ఇదేనా మీ రశికత్వం అనగా దానికి కవిగారు " ఏం లేదు నీ స్తనాలు నా గుండెల్లో గుచ్చుకుని వీపులోకి వచ్చాయేమోనని చూస్తున్నాను" . అన్నాడట . దాంతో సుందరాంగికి మన్మథంతం తలకెక్కింది.

ఆధునిక కవి, రచయిత, అవధాని గరికపాటివారు ఒక ప్రయాణంలో బస్టాండ్‌లో రిజర్వేషన్ దొరకక కొంతసేపు వేచియుండాల్సిన సమయంలో ఒక వనితామణి జడమాత్రమే చూచి చెప్పిన చాటువు చిరు దరహాసాన్ని కలిగిస్తుంది .

" ప్రేమ గుడ్డిది అయిన బామమంచిదియనన్ నల్లని జడలోని మల్లెపూలు
అంధకారంబున అరుణోదయంబున కనకాంబరముల కాంతివొప్ప
పెదవిపైననేకాదు వెనుకనన్ కూడా ముద్దుముచ్చటయనన్ ముద్దబంతి
ముద్దునిచ్చును లేక ముల్లుగ్రుచ్చునో కాని ఎగదిగ చూచిన సిగగులాబి

" వెనుకనే యింత సౌందర్యఘనత
యున్న ముందుచూచిన మరియెంతముద్దుయగునో
అందులకే మనవారలందరు యంద్రు
ముందుచూపు బ్రతుకులో మరియెంత ముఖ్యమంద్రు. "

చాటువులో పాఠకుల మనసులో చిరుదరహాసం పలికించక ఉండదు.

కవి ఎవరో తెలియదు కాని ఆస్యం ఒలికే అభినవపద్యం . పద్యం చదవటమే కాక అభినయం కూడా చేయాలి అప్పుడే హాస్యం అలుముతుంది.

" తేజము పాదువృత్తమును తేకువ కల్గిన మృత్యుదెన్నడున్
అలికి ఇట్లనియె
పరుని అనికిట్లనియె
అర్థికి ఇట్లడున్
తేజము పాదువృత్తమును తేకువ కల్గిన మృత్యుదెన్నడున్
అలికి ఇట్లనియె
పరుని అనికిట్లనియె
అర్థికి ఇట్లడున్ .

పూర్వం బావ మరదలుతో చాటువుగా పద్యరూపంలో సున్నం అడిగిన తీరు చూడండి ఎంత సొంపుగా ఉందో అర్థంచూస్తే ఎంత వింతగా ఉంటుందో..

" పర్వతశ్రేష్ఠపుత్రిక పతివిరోధి
అన్న పెండ్లాము అత్తనుగన్న తండ్రి
ప్రేమతోడుత కన్నట్టి పెద్దబిడ్డ
సున్నమిపుడు తేగదే సన్నుతాంగి ."

ఓ దరిద్రపు పెద్దమ్మ సున్నం తీసుకురా అని మరదలని పిలిచాడు. దానికి మరదలు గడుసుగా ఇచ్చిన సమాధానం చూడండి నవ్వక ఉండరు .

"శతపత్రంబుల మిత్రుని
సుతుజంపినవాని బావ సూనుని మామన్
సతతము తల దాల్చినతని
సుతువాహన వైరి వైరి సున్నంబిదిగో "

కుక్క, సున్నం తీసుకో అని సమాధానం మిచ్చిన తెలుగు సౌరభం

ఆధునిక కవులలో గరికపాటి ఒక అవధానంలో ఇచ్చిన సమస్యాపూరణంలో " వధూః శరూరవిక్షతి " అనే సమస్యకి ఇచ్చిన సమాధానం చిరు దరహాసం తెప్పిస్తుంది.

" హిడింబా భీమదయితా నిదాకే కర్మపీడితా
వధూః శరూరవిక్షతి "

హిడింబా భీముడికి భార్య నిజంగానే భీముడి దయ కలిగింది ఆమె గాలిలేక బాధ పడుతుంది అందుకు తన స్తనాలపై ఉన్న పైటకొంగును తీసికుని విసురుకుంటుంది. గాలిదేవుడు ఆమెకు మామగారు కావున సమస్యాపూరణం నరిపోయింది.

ఇలా మన ప్రాచీన కవులు తమ సాహిత్య పటిమతో చాటువులతో , హాస్యాన్ని తమ రచనలతో, విమర్శలతో , రాజసభలలో తమ జీవితంలో కూడా భాగంగా చేసుకుని జీవితాన్ని పండించుకున్నారు. సామాన్య ప్రజలు సహితం ఆ పాండిత్యాన్ని చదువుకుని, విని తమ జీవితంలోని శ్రమని,దుఃఖాన్ని మరిచిపోయి హాయిగా గడిపారు.

# జానపదుల పెళ్లి వేడుకలు – హాస్యం

సి. హెచ్. ఉమారాణి
అధ్యాపకులు, ప్రభుత్వ మహిళా డిగ్రీ కళాశాల,
గజ్వేల్, సిద్దిపేట

**ఉపోద్ఘాతం:**

గ్రామీణ ప్రాంతాలలో నివసిస్తూ, విద్యాగంధం లేకపోయినా చక్కని సాహిత్య విలువలు, విషయ పరిజ్ఞానాన్ని కలిగిన జనులు జానపదులుగా పిలవబడుతున్నారు. వీరికి లికిత రూప సాహిత్యం లేకపోయినా, మౌఖికంగా విశేషమైన సాహిత్య, విజ్ఞాన సంపద కలిగినట్టి వారు జానపదులు. అయితే వీరి సాహిత్యం కాలక్రమంలో కొంత కనుమరుగైపోతుంది. అయినప్పటికీ ఎంతో కొంత వారి సాంప్రదాయాల రూపంలో కాని, ఆచారలా రూపంలో కాని మిగిలే ఉంది. సాహిత్యం అనే అంశంలో ఎన్నో విభాగాలుంటాయి. అనేక విధాలుగా ప్రాచీన కాలం నుండి  ఒకతరం నుండి మరొక తరానికి ప్రసారమవుతూ, తన ఉనికిని కాపాడుకుంటూ వస్తున్నది జానపద సాహిత్యం. ఎన్నో విలువలను, ఎన్నో అనుభవాలను, జీవిత సత్యాలను రంగరించి చక్కని జీవితాన్ని అనుభవించిన జానపదులు తమ విజ్ఞానం అంతటినీ జానపద సాహిత్య రూపాలయిన పాటలు, కథలు, సామెతలు, పొడుపు కథలు వంటి వాటి రూపంలో చెప్పుకుంటూ వచ్చారు. జానపదులు నవరసాలైన శృంగారం, హాస్యం, కరుణ, అద్భుతం, బీభత్సం, భయానకం, రౌద్రం, కరుణ, వీర్యం వంటి ఏ రసాన్నైనా చక్కగా పండించగలరు. ఈ నవరసాల అన్నింటిలోనూ హాస్యం అంటే అందరూ ఇష్టపడతారు. జానపదులు ఆనందానికి ఎంతగానో ప్రాధాన్యత ఇస్తారు. మిగతా రసాలు తాత్కాలికంగా అలరించేవే కాని హాస్యం మాత్రం  ఎన్ని సార్లు విన్న, చదివినా మళ్ళా ఆనందాన్ని ఇస్తూనే ఉంటుంది.హాస్య రసాన్ని ఆస్వాదించాలంటే ముందు రస హృదయం ఉండాలి. రస హృదయం లేకపోతే హాస్య రసమే కాదు ఏ రసము వారిలో అనుభూతిని ఇవ్వలేదు. జానపదులు ఏ విషయాలు  చెప్పుకున్న అందులో ఎంతో కొంత హాస్యం తొణికి సలాడింది. ఈ విషయంలో జానపదులేమి, శిష్టులేమి అందరూ ఒక్కటే. జానపదులు తమ నిత్య వ్యవహారంలో కుటుంబ పక్షంగా జరిగే ఎన్నో వేడుకలలో  వారిదైన హాస్యాన్ని పండిస్తూ, చతురోక్తులతో సరదాగా, ఆనందంగా గడిపేస్తుంటారు. శిష్ట కవులు సైతం  తమ నిత్య వ్యవహారంలో హాస్యానికి ప్రాధాన్యత ఇస్తుంటారు. తమ కథలలో ప్రధాన నాయకుడికి స్నేహితుడు పాత్రగా ఒక విదూషకుడిని పోషిస్తుండేవారు. ఇలాంటి

పాత్రలు నిత్య వ్యవహారంలో మనకు కనిపిస్తూనే ఉంటాయి. అదే జానపదుల్లో అయితే నలుగురు ఒక చోట కూర్చున్నారంటే చాలు చక్కని హాస్యం వాళ్ళ మధ్య కనిపిస్తుంది. ఇంకా పెళ్లి వేడుక వంటి వాటిల్లో అయితే సరదాగా ఒకరి మీద మరొకరు చలోక్తులు విసురుకుంటూ హాస్యాన్ని ఆస్వాదిస్తారు. పెళ్లి వేడుకలలో హాస్యం జానపదుల్లో ఎక్కువగా కనిపిస్తుంది. దానిని ఈ వ్యాసంలో పరిశీలించుదాం.

**పెళ్లి తంతు వేడుక :**

జానపదులలో పెళ్లి వేడుక చాలా ఘనంగా జరుగుతుంది, ఎవరి తాహతుకి తగట్లుగా, వారి ఏర్పాటులతో, బందు జనం నడుమ సంతోషాలతో ఈ తంతు జరుగుతుంది..పెళ్లి కొడుకు, పెళ్లి కూతుర్లకు నలుగులు పెట్టడంతో మొదలై అప్పగింతల వరకు ఉండే ఈ కార్యక్రమంలో ఒక్కొక్క సందర్భంలో హాస్యం ఎలా ప్రయోగించబడుతుందో పరిశీలించుదాం.

**నలుగులు పెట్టడం – హాస్యం:**

జానపదులు పెళ్లి నిశ్చయమైన జంటలకు పెళ్ళికి ముందుగా ఒక వారం నుండి పసుపుతో వారికి స్నానాలు చేయిస్తూ ఉంటారు. అయితే ఈ కార్యక్రమం ఒక్కొక్క రోజు ఒక్కొక్క ఇంటి వారు ఆ వధువు లేదా వరుడికి చేపిస్తూ ఉండటం ఆనవాయితీ. ఈనాటి కాలంలో నాగరికత ప్రభావం వల్ల కాని, బంధువులకు సమయాభావం వల్లకాని, పెళ్లికొడుకు, పెళ్ళికూతురు ఉద్యోగాలు చేసుకోవడం వల్ల ఇదంతా నేటి కాలంలో జరగడం లేదు. తూతూ మంత్రంగా ఒక్క రోజు పెళ్ళికి ముందు నిర్వహించి, నాలుగు పెట్టి పెళ్ళికూతురుగా, పెళ్ళికూతురుగా సిద్ధం చేస్తూ ఉండటం మనం చూడవచ్చు. జానపదులు పెళ్ళికి ముందు వారం నుండే పనులు ప్రారంభిస్తారు. వధూ వారుల దగ్గరి బంధువులు, ఇరుగు పొరుగు వారు తమ ఇళ్లకు వారిని తీసుకు వెళ్ళి సున్నీపిండి, పసుపు వంటివి శరీరానికి పట్టించి స్నానం చేయిస్తారు. రుచికరమైన పిండి వంటలతో వారికి భోజనం పెడతారు. అలా చేయడం వల్ల కొన్ని శారీరక, మానసిక ప్రయోజనాలు ఉన్నాయి. నాలుగు పెడితేనే పెళ్లి కళ వస్తుంది.

ఈ నాలుగు పెట్టేటప్పుడు తమ చుట్టూ పక్కల ఉన్న ఇరుగు పొరుగు స్త్రీలను ఆహ్వానిస్తారు. ఆ పేరంటాళ్లు నలుగు పెడతారు. ఇందులో కొందరు చమత్కారం తెలిసిన వాళ్ళు ఉంటారు. పెళ్ళికొడుకుకి, పెళ్లి కూతురుకి వరసైన వారుంటారు. వదినలు, మరదళ్లు, అత్తలు

వంటి వారు వారిని ఆట పట్టిస్తారు. చక్కిలిగింతలు పెట్టి నవ్విస్తారు. చిన్న చిన్న చిలిపి పనులు చేస్తూ అల్లరి చేస్తారు. ఉదాహరణకు వధువు లేదా వరుడు కూర్చొన్న పీటను లాగడం, మొట్టి కాయలు వేయడం, హాస్య పూరిత వ్యాఖ్యలు చేయడం వంటివి చేసి నవ్విస్తారు. ఇక్కడ హాస్యానికి తప్ప వేరొక రసానికి తావుండదు.　కొన్ని నాలుగు పాటలు కూడా పాడుతూ కార్యక్రమం జరిపిస్తారు.

**పెళ్లి కార్య క్రమం:**

ఆనంద సంతోషాలు, బంధు మిత్ర సపరివారంగా, చిన్న పిల్లల కోలాహలంతో, ఆడువారి ముచ్చటలతో, మగవాళ్ల సరదాలతో అంగరంగ వైభవంగా జరిగే పెళ్లి కార్యక్రమం ప్రతీ వారి జీవితాల్లో మధుర ఘట్టం. ఇద్దరు వ్యక్తులు ఒక కుటుంబంగా ఏర్పడేందుకు　అది తొలి అడుగుగా చెప్పవచ్చు. ఇక్కడా కూడా హాస్యానికి ఏంతో　ప్రాధాన్యత ఉంటుంది. ఈ శుభ కార్యక్రమంలో　అందరి ముఖాలు ఆనందంతో వికసిస్తాయి. వియ్యాల వారు ఒకరి మీద ఒకరు మాటలతో　దెప్పిపొడుపులు పాడుచుకోవడం, చతురోక్తులు విసురుకోవడం, అతిథి మర్యాదలకు వంకలు పెట్టడం, ఎగతాళి చేయడం వంటివి చేస్తారు. అలా ఎగతాళి చేస్తూ పాటలు కూడా పడుకుంటారు.

“నూగులు నునుబట్టి గానిగ గసబట్టి
పెండ్లి కూతురోళ్ళ అబ్బ తల్లో పేనుబట్టి
పెండ్లి పెండ్లి అని చెప్పి పెండ్లికి రమ్మంటే
ఎనపోళ్ళు మీసాలు ఎరువులడిగే

కాకర పూయంగా కాకర కాయంగా
కాస్తారోలింటిలో బిడ్డ తెస్తిమి
ఇచ్చిన ఒక రూక ఇవ్వకున్న ఒక రూక
గుడిపేట సంతలో గుడ్డి రూక”[1]

[1] జానపద సాహిత్యం – హాస్యం – డా. దాసరి రమేష్ పుట: 473

అంటే కాదు ఒకరినొకరు దూషణలో కూడా హాస్యాన్ని పండిస్తారు. ఎగతాళి చేస్తారు. పెళ్లి కూతురు తండ్రి జుట్టు నూగుగా ఉందని, పెళ్లి కూతురుకు మెల్ల కన్ను ఉందని, పళ్ళు తోముకోరు అని ఇలా పలు కారణాలు చెప్పి ఎగతాళి చేస్తారు. పెళ్లికొడుకు పెళ్ళికూతురు వేసుకున్న బట్టాలకు వంకలు పెడతారు. కొన్ని సార్లు కొన్ని ఆభరణాలు అద్దెకు తెచ్చి వేస్తుంటారు. లేదా నకిలీవి తొడుగుతారు. అలాంటి సందర్భాలలో ఒక పెళ్లి కొడుకుని పరిహాసం చేస్తూ ఇలా పాడుకుంటారు.

"చాలు చాలు పెండ్లి కొడుకా చక్కనైన వాడవే
వీలుసాలు లేక ఇటుల విర్రవీగేవురా

1. కోటు మీదా కోటు తొడిగి – కోర చూపు చూచుచును
నీటుగా తలాడ నొంగి – గోడ చూచుచుందువా  ॥చాలు॥

2. లోటు లేని వాని వలేను చూతకంబు లాడుచూ
తేట సొమ్ములెల్ల నెరవు తెచ్చి పెట్టుకొంటివా "[2]  ॥చాలు॥

ఇలా కొన్ని సందర్భాలలో పొగిడినట్లు పొగిడి దూషణ చేస్తుంటారు. అయితే ఇదంతా వారు సరదాగా తీసుకుంటారు కాని పంతాలకు పోయి గొడవలు పెట్టుకోరు. ఎందులోనూ ఎవరు కాదన్నట్లు ఒకళ్ళ మీద ఒకళ్ళు ఎత్తిపొడుపులు పొడుచుకుంటారు. ఇదంతా సరదాగానే జరుగుతుంది. పెళ్లి కొడుకు వాలు పెళ్ళికూతురు వాళ్ళని మాకు అవి కావాలి, ఇవి కావాలి అని గొంతెమ్మ కోరికలు కోరడం అవి అందించడంలో చమత్కారంగా చేయడం ఇలా సరదాగా హాస్యాత్మకంగా జరుగుతుంది. తాళి కట్టడం అయిపోయాక అరుంధతి నక్షత్రం చూపించే విషయంలో కూడా కొందరు తమ చమత్కారపు మాటలతో నవ్విస్తారు. పాదాలు తొక్కడంలో కూడా ఎవరు తీసిపోని విధంగా బలంగా నొక్కుతూ అందరినీ నవ్విస్తారు. తలంబ్రాలు పోసుకునే విషయంలో కూడా వధూవరులుకు పోటీలు పెడతారు. ఈ కార్య క్రమాలన్నీ హాస్య భరితంగా నవ్వులు, ఆనందాల సందోహం మధ్య జరుగుతుంది.

అరివేణి పాత్ర విషయంలో  కూడా పేరంటాళ్లు, ఇరు కుటుంబాల బంధువులు చేసే హడావిడి అంతాఇంతా కాదు. ఒక కడవలో నీళ్ళు పోసి అందులో ఉంగరం వేసి దానిని వెదికే ప్రయత్నం చేయమని వధూవరులకు చెప్తారు. ఇలా చేయడం వల్ల వాళ్ళ మధ్య స్నేహ భావం పెరుగుతుంది. కేరింతలు

[2] పాడిన వారు: చెన్నుబోయిన లక్షుమ్మ  వయస్సు: 56

కోలాహలంగా ఈ కార్యక్రమం జరగడం మనం గమనించవచ్చు. నాగవల్లిలో కూడా ఇద్దరు నవ వధూవరుయాలను మంచం మీద కూర్చోబెట్టి పూల చెండుతో ఆడిస్తారు. ఇక్కడ కూడా పోటీ వాతావరణాన్ని సృష్టిస్తారు. మధ్యలో చమత్కారాలు, హాస్యోక్తులతో నవ్విస్తారు. వధూవరులను ఇంటిలోకి తీసుకెళ్లేటప్పుడు కూడా తలుపు దగ్గర పాటలు పడతారు. పేరంటాళ్లు, మరదళ్లు, వదినలు వంటి వారు అల్లరి చేసి నవ్విస్తారు. ఇక్కడ కూడా వంకలు పెట్టి నవ్విస్తారు. కాళ్ళు కడిగినందుకు వరసయిన వాళ్ళకు చదివింపు పెట్టాలి. తక్కువ డబ్బులు ఇస్తే గేలి చేస్తారు. కాని అదొక సరదాగా ఆటపట్టించడం కోసం చేస్తారు.

**శోభన కార్యక్రమం – హాస్యం:**

పెళ్లి తంతులో ఒక  ముఖ్య ఘట్టం. జానపదులు **ఈ** కార్యక్రమాన్ని కూడా నవ్వుల సంతోషాల నడుమనిర్వహిస్తారు. ఇక్కడ కూడా పేరంటాళ్ళ కోలాహలమే ఎక్కువ. పెళ్లి జరిగిన మూడవనాడు అత్తగారింట్లో(పెళ్ళికొడుక్కి)ఈ కార్యక్రమం నిర్వహించడం పరిపాటి. పేరంటాళ్ళు వధూవరులకు మంగళ స్నానాలు చేయిస్తారు. ఈ స్నానాలు చేయించేతప్పుడు కూడా నవ్వు తెప్పించే పాటలు పాడుతారు. అక్కడి ఇరుగుపొరుగు వారు వధూవరులను అలంకరించేటప్పుడు కూడా చిలిపి ప్రశ్నలతో,కొంటె సమాధానాలతో ఆటలాడిస్తారు. ఈ ఆట సరదాగా ఉండేందుకు హాస్య చతురతో కూడిన సంభాషణను నిర్వహిస్తారు. అమ్మాయికి,అబ్బాయికి ఒకరి మీద మరొకరికి పోటీ వాతావరణాన్ని సృష్టిస్తారు . ఒక్కోసారి పెళ్ళికొడుకుని ఆటపట్టించడం కోసం కొందరు పేరంటాళ్ళు విరిగిన మంచం తీసుకొచ్చి,అది కనిపించకుండా దుప్పట్లోతో కప్పి దానిపై కూర్చోబెడతారు. పెళ్లికొడుకు చూసుకోకుండా కూర్చొంటే క్రిందపడతారు కాబట్టి ఆ  సన్నివేశం చూసి నవ్వుకుంటారు. కొంటె వ్యాఖ్యలు చేస్తారు. మరికొందరు కొంటె పేరంటాళ్ళు బుగ్గలు గిల్లుతూ,పంచెను లాగుతూ ఆటపట్టిస్తారు. వారికి అదొక సరదా!వధూవరులను గదిలోకి పంపేముందు ఒకరికొకరు పిండివంటలను తినిపించుకునేలా ప్రోత్సాహిస్తారు. సందర్భానికి తగినట్లుగా పాటలు పాడుతూ కన్విస్తారు. దీనినిబట్టి చూసినప్పుడు ఈ కార్యక్రమంలో కూడా హాస్యం పాత్ర ఎక్కువగా కనిపిస్తుంది.

**అప్పగింతల కార్యక్రమం ;**

పెళ్లి తంతులో ఇది ఆఖరిగట్టం. వధువును అత్తవారింటికి పంపే కార్యక్రమం సుమారుగా 20 సంవత్సరాలు ఆడపిల్ల పుట్టింటిలో ఉండి, వివాహానంతరం శాశ్వతంగా ఆ కుటుంబాన్ని విడిచి తనకు

పరిచయం లేని చోటికి వెళ్ళిపోవడం, తన రక్త సంబంధీకులను విడిచి తనకు పరిచయం లేని చోటికి వెల్లిపోవడం, తన రక్త సంబంధీకులను విడిచి వెళ్ళడం వంటివి దుఃఖానికి హేతువులుగా కనిపిస్తాయి. కాబట్టి ఈ కార్యక్రమంలో కొంత కరుణ రసం కనిపిస్తుంది. వధువు, ఆమె తల్లిదండ్రులు కన్నీటి పర్యంతమైన వేళ ఈ కార్యక్రమం జరుగుతుంది. ప్రతి స్త్రీ జీవితంలో జరిగే తప్పని దశ. అందుకే జానపదులు ఇక్కడ ఒక సామెతను సృష్టించారు. “ఆడపిల్ల తల్లిదండ్రులు తమ బిడ్డలను కాలు తడవకుండా కడలినైనా దాటించగలరు కాని కన్ను తడవకుండా కాపురానికి పంపలేరు.” అయినప్పటికీ ఇక్కడ కూడా హాస్యం కనిపిస్తుంది. కొందరు పేరంటాళ్లు కాపురానికి పంపేటప్పుడు బుద్ధులు చెప్తారు. అత్తగారింట్లో ఎలా నడుచుకోవాలో, అందరితో ఎలా వ్యవహరించాలో జాగ్రత్తలను చెప్పే పాటలున్నాయి.

“పతివ్రతా ధర్మంబు – భక్తితో సలిపి
అతని చెంప మీద – అంటిస్తూ ఉండు
మగనితో నీకసలు – సరిపడకపోతే
పగదానివలే నీవు – పడబోవు తల్లి”[3]

ఇలా విచిత్రమైన పద్ధతిలో నీతులను చెబుతారు. అయితే ఇది హాస్యానికి మాత్రమే. నిజంగా ఇలా ప్రవర్తించమని కాదు. ఏ ఇల్లాలైన ఇలా ప్రవర్తిస్తే ఆమె భర్తకు జీవిత వైరాగ్యం రాక మానదు. సంసారం చట్టు బండలు కాకమానదు.

**ఉపసంహారం :**

పై అంశాలను విసదంగా పరిశీలించినప్పుడు జానపదులు హాస్యానికి ఇస్తున్న ప్రాధాన్యత తెలుస్తుంది. ఆరుగాలం శ్రమించి, అందరి ఆకలి తీర్చే రైతు శరీరం కేవలం ఇలాంటి హాస్య చాతుర్యలు, వేడుకలలో ఉత్సాహంగా పాల్గొని హాస్యాన్ని ఆనందించడం ద్వారా హాయిని పొందుకుంటారు. నేటి వేగవంతమైన కాలంలో పట్నాలు ప్రభావంవల్ల ఉరుకు పరుగుల జీవితాల వల్ల బంధువుల కోలాహలాల మధ్య జరగాల్సిన పెళ్ళిళ్ళు కేవలం ఒక్కరోజులో కళ్యాణమండపాల్లో నామమాత్రంగా జరిగిపోతున్నాయి. నేటితరం ఎంతో విలువైన హాస్య సాహిత్యాన్ని, కోలోహలానికి బందుజనుల ప్రేమానురాగాలను, స్నేహపూర్వక వాతావరణాన్ని పొందుకోలేకపోతున్నారన్నది వాస్తవం. అందుకే జానపదులను వారి

[3] సరాగాలు – ఎల్లోరా, పుట:23

సంప్రదాయాలను అందులోని విలువలను భవిష్యత్ తరానికి అందించాల్సిన అవసరం ఎంతైనా ఉంది.

**ఆధార గ్రంధాలు:**


1. జానపద సాహిత్యం – హాస్యం – డా. దాసరి రమేష్
2. సరాగాలు – ఎల్లోరా
3. ఆంధ్రుల జానపద విజ్ఞానం – ఆర్. వి. ఎస్ సుందరం
4. జానపద గేయాలు – విద్వాన్ దస్తగిరి

## వైవిధ్య భరిత హాస్యం

డా. కొలపాక అరుణ

తెలుగుఉపాధ్యాయురాలు,

సి. హెచ్. ఎస్. డి సెయింట్ థెరిస్సా,

స్వయం ప్రతిపత్తి మహిళా కళాశాల,

ఏలూరు.

**ఉపోద్ఘాతం:**

మనిషి ఆశా జీవి. నిరంతరం హాయిగా బ్రతకడానికి మార్గాలను అన్వేషిస్తుంటాడు. ఆ ఆనందం ఒక మంచి హాస్య రసాత్మక కథ విన్నడం ద్వారా లేదా జోక్ వినడం ద్వారా లేదా సన్నివేశం చూడటం ద్వారా లభిస్తే మరింత మనస్ఫూర్తిగా ఆనందిస్తాడు. అప్పటివరకు తనకున్న ఎన్నో ఇబ్బందులను, మానసిక ఒత్తిడిలను కొంచెం సేపు మరిచిపోయి హాయిని పొందుతాడు. నవ్వంటే ఇష్టపడని వాళ్ళు ఎవరూ ఉండరంటే అతిశయోక్తి కాదు. నవ్వుకోవాలని ఎవరికుండదు? నవ్వడం వల్ల మనిషికి పరోక్షంగా ఆరోగ్యం కూడా లభిస్తుంది. అయితే మనుషులలో ఒక్కొక్కరు ఒక్కొక్కవిధంగా ఆస్వాదిస్తారు. కొందరు నవ్వు వచ్చినా సభ్యత పేరుతో దానిని నీయంత్రించడానికి ప్రయత్నిస్తుంటారు. మరికొందరు అలాంటి వాటికి తావివ్వకుండా మనస్ఫూర్తిగా నవ్వేస్తారు. నవ్వుని మనం హాస్యం అని కూడా వ్యవహరిస్తాం. నవ రసాలలో కూడా హాస్యానికి ఎంతో ప్రాముఖ్యత ఉంది. ప్రాచీనులంతా శృంగారాన్ని రసరాజంగా ప్రకటించినా నేటి కాలంలో హాస్యమే రస రాజంగా పేర్కొనదగినది, ఏ భేదం లేకుండా అందరికీ కావాల్సింది హాస్యమే. ఆ హాస్యంలో నేడు పరిశోధకులు, విశ్లేషకులు ఎన్నో భేదాలను, రకాలను వెలికి తీశారు. వాటిలో కొందరు ప్రముఖులు చేసిన వర్గీకరణను ఈ వ్యాసంలో చూడవచ్చు.

**హాస్యం రకాలు:**

"చేకొని యక్రూరములగు

నాకార వికార చేష్ట లాలోకింపన్

గైకొను మహావికార

స్వీకారమును హాసమయ్యె వినుమెట్లన్నన్"[4]

అంటే 'అతి వికృతమగు ఆకారము, వికార చేష్టలు చూచుట వలన కలుగు మనో వికాసమే హాస్యం' అని అర్థమవుతుంది. హాస్యం ప్రధానంగా వికృతంగా అనిపించే చేష్టల వల్ల కానీ మాటల వల్ల కానీ పుడుతుంది. కానీ హాస్యం ఎప్పుడూ ఒకేలా ఉండదు. సందర్భోచితంగా ప్రయోగింపబడే హాస్యోక్తిని బట్టి దాని ద్వారా మనలో కలిగే రస స్థాయిని బట్టి నవ్వుని కూడా పలు రకాలుగా వర్గీకరించారు. హాస్యోక్తిలో కలిగే రసానుభూతిని బట్టి, దాని వల్ల మనలో కలిగే భావ వ్యక్తీకరణలో భిన్నత్వాన్ని బట్టి, నవ్వే విధానంలో ముఖంలో వచ్చే మార్పులను బట్టి ప్రముఖులు ఈ వర్గీకరణలు చేశారని చెప్పవచ్చు. వాటిలో చాలా ముఖ్యమైన వర్గీకణలను ఇప్పుడు పరిశీలిద్దాం.

**విశ్వనాధుడి వర్గీకరణ:**

విశ్వనాధుడు తన సాహిత్య దర్పణంలో హాస్యాన్ని 6 రకాలుగా కనిపిస్తాయని సూచించాడు. నవ్వే వారిలో కనిపించే భావాలను బట్టి వారిని ఉత్తములుగా, మధ్యములుగా, నీచులుగా విభజించారు. వారికి హాస్యం ఎలా ఉంటుంది, ఎలా ఆస్వాదిస్తారనేది ఇలా సూచించారు.

"1. ఉత్తములకు స్మితము, హసితములు

2. మధ్యములకు విహసితము, అపహసితము

3. నీచులకు ఉపహసితము, అతి హాసితము"[5]

1. స్మితము: కొద్దిగా కళ్ళు వికసింపజేసి, పెదవులు తెరవకుండా, నవ్వీ నవ్వనట్లుగా ముసి ముసి నవ్వులు నవ్వటాన్ని స్మితము అంటారు. దీనినే లేలేత నవ్వు అని, స్నిగ్ధ దరహాసం అని కూడా అంటారు.

2. హాసితము: దీనిలో కొద్దిగా చిరు నవ్వు కనిపిస్తుంది. దవడ బిగపట్టి నవ్వడం, సకబద్ధం రాకుండా నవ్వడం ఉంటుంది.

3. విహసితము: పళ్ళు బాగా కనిపించేటట్లు నవ్వడమే కాకుండా కొద్దిగా నవ్వు కూడా వినిపిస్తుంది.

4. అపహసితము: దీనినే వెకిలి నవ్వు అని కూడా అనవచ్చు. కొద్దిగా భుజాలు, తల కదలింపబడతాయి.

5. ఉపహసితము: అవయవాలు కదిలిస్తూనే నోరు తెరచి గట్టిగా నవ్వడం

[4] కావ్యాలంకార సంగ్రహం – శ్రీ పోచనపెద్ది వెంకట మురళీకృష్ణ వ్యాఖ్య – పుట: 128

[5] జానపద సాహిత్యం -హాస్యం, డా. దాసరి రమేష్ -పుట:80

6. అతిహసితము: మనిశాంతా ఊగిపోతూ, పగలబడి నవ్వడం

**తిక్కన కవి చేసిన నవ్వుల వర్గీకరణ:**

ఆంధ్ర మహాభారతంలో తిక్కన మహాకవి నవ్వులలో బేధాలను వివరిస్తూ పాత్రలు నవ్విన నవ్వులలో 32 రకాలను ప్రస్తావించారు. ఈ వర్గీకరణాలను గురించి మొదటగా 'ఆంధ్ర శేషగిరిరావు గారు' ఆంధ్ర సారస్వత వ్యాసావళిలో ప్రకటించారు. వాటినే మనం తిరుమల తిరుపతి దేవస్థానం వారు ముద్రించిన ఆంధ్ర మహా భారతంలోని పీఠికలో చూడవచ్చు. అవి:

| | |
|---|---|
| "1. పిన్న నవ్వు | 2. అల్లనగవు |
| 3. అలతినవ్వు | 4. చిరునవ్వు |
| 5. మందస్మిత | 6. హర్ష మందస్మిత |
| 7. అంతస్మిత | 8. జనని మందస్మిత |
| 9. ఉద్ధత మందస్మితం | 10. అనాదరం మందస్మితం |
| 11. సాదర దరహాసం | 12. తిన్నని నవ్వు |
| 13. లేత నవ్వు | 14. కొండొక నవ్వు |
| 15. పెలుచ నవ్వు | 16. ఉబ్బు మిగిలిన నవ్వు |
| 17. గేలికొను నవ్వు | 18. ఒత్తిలి నవ్వు |
| 19. అపహాసం | 20. రోషకలిన హాసం |
| 21. ఉద్భుట నవ్వు | 22. కలకల నవ్వు |
| 23. ఎలినవ్వు | 24. ప్రౌఢస్మితం |
| 25. బెట్టు నవ్వు | 26. కన్నుల నవ్వు |
| 27. కన్నుల నిప్పులురాలు నవ్వు | 28. కినుక మానిన నవ్వు |
| 29. కినుక మునుగు నవ్వు | 30. కలిన నవ్వు |

31. నవ్వు రాని నవ్వు                    32. ఎర్ర నవ్వు "[6]

**భమిడిపాటి కామేశ్వరరావు నవ్వుల వర్గీకరణ:**

నవ్వు అనే అంశంపై విశిష్టమైన వ్యాసం రాసిన విశిష్ట రచయిత కామేశ్వరరావు గారు. వారు ఆ వ్యాసంలో నవ్వులలో ఉన్న వివిధ రకాలను క్రింది విధంగా సూచించారు. అవి:

"1. చిరునవ్వు                    2. సకిలింపు నవ్వు                    9. అట్టహాసం నవ్వు

3. ఇకిలింపు నవ్వు                    4. ముసిముసినవ్వు

5. మూగ నవ్వు                    6. గుడ్డి నవ్వు

7. పకపక నవ్వు                    8. వెకవెక నవ్వు"[7]

**ఉపసంహారం:**

వీరు మాత్రమే కాకుండా ఎందరో హాస్య పండితులు, పరిశోధకులు, రచయితలు హాస్యాన్ని తమదైన రీతిలో వర్గీకరించారు. వారిలో ఎం. రాధాకృష్ణ మూర్తి గారు, మునిమాణిక్యం నరసింహారావు గారు, పానుగంటి వారు, వంటి ఎందరో ఉన్నారు. మనిషి ఎన్ని రకాలుగా నవ్వగలడో వారి వర్గీకరణలు ద్వారా అవగతం చేసుకోవచ్చు. నవ్వు మనిషి జీవితానికి ఎంతో అవసరమైనది కాబట్టి, దానివల్ల ఎన్నో ఆరోగ్య ప్రయోజనాలు కూడా ఉండటంతో దానిని గురించి ప్రత్యేకంగా మే నెలలో 10 వ తారీఖుని కేటాయించుకొని ప్రపంచ నవ్వుల దినోత్సవాన్ని జరుపుకుంటున్నాము. నవ్వుని ఆస్వాదించండి, మనసారా నవ్వండి.

**ఉపయుక్త గ్రంధసూచీ:**

1. శ్రీమదాంధ్ర మహాభారతం – తి.తి. దే ప్రచురణ
2. జానపద సాహిత్యం – హాస్యం – డా. దాసరి రమేష్
3. హాస్య ప్రపంచం-ఎం. రాధాకృష్ణమూర్తి

[6] కవిత్రయ విరచిత శ్రీమదాంధ్ర మహాభారతం - తి. తి. దే పీఠిక , పుట:70

[7] హాస్య ప్రపంచం – ఎం. రాధ కృష్ణమూర్తి -పుట:238

# శ్రీ శ్రీ కవిత్వం లో హాస్యం

డా. పత్తూరి శ్రీనివాసులు,
తెలుగు లెక్చరర్
ప్రభుత్వ డిగ్రీ కళాశాల, చేబ్రోలు,
గుంటూరు జిల్లా

అభ్యుదయ కవితా పితామహుడనీ, విప్లవ కవితా పితామహుడు అని విమర్శకుల ప్రశంసలను అందుకున్న శ్రీశ్రీ మొదట పద్యకవి.ఆ తర్వాత ఉద్యమ కవి. ఈ "సీరియస్" కవిలో తమాషా కవి ఉన్నాడు.-సరదాకవి ఉన్నాడు - అధిక్షేపకవి ఉన్నాడు - కొండొకచో తిట్టుకవి ఉన్నారు.అందుకే "సిప్రాలి" వెలువరించారు. 'సిప్రాలి'లో శ్రీశ్రీ మళ్ళీ పద్యకవిగా - కంద పద్యకవిగా దర్శనమిస్తాడు. సిరిసిరిమువ్వలు, ప్రాసక్రీడలు, లిమబుక్కులు కలిసి 'సిప్రాలిగా తీసుకొచ్చాడు. ఇది జూన్ 1981లో అమెరికాలో విడుదలైంది. ఇందులో 'మేమే'' గేయాలు, 'పంచపదులు' కూడా చేర్చారు.'కాదేదీ కవితకనర్హం' అన్న అ శ్రీశ్రీ మాటలు 'సిరిసిరిమువ్వ శతకాని'కి కూడా బాగా వర్తిస్తాయి.

"మళ్ళీ ఇన్నాళ్ళకి
ఇన్నేళ్ళకి పద్యాలు రాయుటది యెట్లన్నన్
పళ్ళూడిన ముసిలిది
కుచ్చిళ్లను సవరించినట్లు సిరిసిరిమువ్వా"

అని శ్రీశ్రీ తనపైనే 'జోక్' వేసుకున్నాడు. ఎప్పుడో 'ప్రభవ' రాసిన తర్వాత ఇన్నేళ్ళకి మళ్ళీ పద్యరచన ప్రారంభించాడు మరి! సుమతీ శతక పద్యానికి ప్యారడీ రాసి 'కాఫీ' మన ఇళ్ళల్లో ఎంతగా తిష్టవేసిందో తెలిపాడు -

"ఎప్పుడు పడితే అప్పుడు
కప్పెడు కాఫీ నొసంగ గలిగిన సుజనుల్ చొప్పడిన యూర నుండుము

చెప్పడకున్నట్టి యూరు చెరకుము మువ్వా"

'ఇష్టదేవతాప్రార్థన'లో తనకిష్టమైన కవుల్ని, రచయితల్ని, పాత్రల్ని స్తుతించాడు. 'క్రీడాభిరామం'లోని టిట్టిభసెట్టిని కొలుస్తాడట! నవయువకులకు నమూనాకవి గిరీశమన్నాడు! సాక్షి వ్యాసాలలోని జంఘాల శాస్త్రిని - మానవ సంఘాల వ్రణాల పాలి శస్త్రిగా పేర్కొన్నాడు. బారిష్టరు పార్వతీశాన్ని చెప్పి మరొకరిని చెప్పాలట! జరుక్ శాస్త్రినీ మెచ్చుకున్నాడు. మొదటగా తెనాలి రామలింగడ్ని స్తుతించాడు. అంటే శ్రీశ్రీ హాస్యప్రియత్వం తేటతెల్లమే మరి!

శ్రీ శ్రీ సామాజిక దృక్పథంతో

"వ్యాపార ప్రకటనలే
వ్యాపించుట చేత నేటి పత్రికలందున్
రాపిడి పడి సత్యం కా
శీ పయనం కట్టినయ్యె సిరిసిరిమువ్వా!

ఇది ఇప్పటి పత్రికలకి చక్కగా వర్తిస్తుంది. "సత్యం కాశీపయనం కట్టి" అన్నది కొత్త నుడికారం!

తనకున్న 'మందు' అలవాటు గురించి కూడా చెప్పాడు. శ్రీశ్రీది దాచుకోని మనస్తత్వం. పైన చెప్పినట్టు తనమీద తానే జోక్ వేసుకోగల ధైర్యం అతనిది. అందుకే

"విస్కీసేవిస్తూనే
శ్రీస్కీనై బతకగలను" అన్నాడు.

ఈ పద్యాలలో అంత్యప్రాసలతో పాటు ఆది ప్రాసలు కూడా అందంగా అమర్చాడు శ్రీ శ్రీ. ప్రాసను ప్రాసకోసం వాడే స్థాయి కాదు శ్రీశ్రీది! అర్థ వంతంగా చమత్కారంగా వాడిన ఆదిప్రాసగల పద్యమిది -

"ఉగ్గేల త్రాగుబోతుకు

ముగ్గేలా తాజమహలు మునివాకిటిలో

విగ్గేల కృష్ణశాస్త్రికి?

సిగ్గేల భావకవికీ? సిరిసిరిమువ్వా?"

సిరిసిరిమువ్వ శతకం'లో రాజకీయాల ప్రస్తావన ఉంది. వైరాగ్యపద్ధతిలో మన నాయకుల్ని ఎండగట్టారు. మన ఎన్నికల తంతును అధిక్షేపించిన పద్యమిది-

"తలకాయలు తమతమ జే

బులలోపల దాచుకొనుచు పోలింగుకు పోవలసిన రోజులు వస్తే

సెలవింక డెమోక్రసీకి సిరిసిరిమువ్వా!"

శ్రీశ్రీకి ఏవి ఇష్టమో ఎవరు ఇష్టమో -

ఏవి ఏవగింపో, ఎవరు గిట్టరో ఈ 'సిప్రాలి' చెప్తుంది. శ్రీశ్రీ ఎలా అంతరంగాన్ని వెల్లడిస్తున్నాడో చూడండి-

"నేనూ! ఒక మూర్ఖుణ్ణే

ఐనా నాకన్న మూఢులగపడుతుంటే

ఆనందపారవశ్యము

చే నవ్వక తప్పలేదు...."

సర్రియలిస్టుల భావ భంగిమల్ని ఏదో విభాగంలో పేర్కొన్నాడు. వీటిల్లో హాస్యంతో పాటు అధిక్షేపమూ తొంగి చూస్తుంది. ఈ - పద్యంలో గల హాస్యం బాగా నవ్విస్తుంది -

"దెయ్యాలను చూపిస్తా

నయ్యా" రమ్మనుచు నొక్క ఆసామీ నా

కయ్యో, తన కూతుళ్ళను

చెయ్యూపుచు పిలిచి చూపె..."

శ్రీశ్రీకి అప్పుడప్పుడు చిరుకోపమూ వస్తుంది. 'కవి' నామమాత్రుల్ని నిందిస్తూ కవి వరాహగార్ధభ శునకాద్యవతారాలుగా ప్రకటించాడు.

కాంగ్రెసు పార్టీపై శ్రీశ్రీ నిప్పులు చెరిగాడు. కాంగ్రెసులో ముఠా తగాదాల వల్ల ప్రకాశం పంతులుగారికి పదవి పోయింది. ఇటువంటివన్నీ దృష్టిలో పెట్టుకున్న శ్రీశ్రీ పలికిన పద్యమిది-

"చీకటి బజారులో (వేళాకోళం కాదు) లక్షల కొలంది మస్కా కొట్టిన వాళ్ళంతా కాంగ్రెసువాదులౌర..."

అంతేకాదు 1948లోనే శ్రీశ్రీ ఇలా అన్నాడంటే...?

"దోచేసేవాళ్ళను ఏదో
చేస్తుందని శివాశతో చూస్తుంటే
దోచేస్తోంది కదా కం
చే చేను మేసినట్టు లీ ప్రభుత జరూ"

అని 'కుక్కుటేశ్వర శతకంలో 'సీరియస్ గానే చెప్పాడు.

“ప్రాసక్రీడలు”లో మరొక శ్రీశ్రీని చూస్తాం. గొప్పవారు అనుకొన్న వారిని నిందించాడు. కొందరికిది నచ్చకపోవచ్చు. శ్రీశ్రీ అలా ఎందుకు వ్యాఖ్యానించాడో... అనిపిస్తుంది. కమ్యూనిస్టు వ్యతిరేకి, రైతుబాంధవుడని పించుకున్న ఎన్.జి. రంగా పార్టీలు మార్చడంపై ఈ విసురు చూడండి-

"కృషీలోక బాంధవుడగు
గోగినేని రంగా
కోటు మార్చి ప్లేటు మార్చి
కులుకు విలాసంగా”

శ్రీశ్రీ, ఆదిభట్ల నారాయణదాసు, గిడుగులను ప్రశంసించాడు.

గురజాడ, రాయప్రోలు, అబ్బూరి, నాని, నండూరి వంటి వారంటే శ్రీశ్రీకి ఇష్టం. విశ్వనాథను 'అగ్గిమీద గుగ్గిలం' అన్నాడు. అంటే సాంబ్రాణి, నిప్పు మీద గుగ్గిలం చేస్తే పొగ వస్తుంది. అందులో సత్యం-వాస్తవం కనిపించదు. విశ్వనాథ కూడా సత్యం,వాస్తవికత గుర్తించకుండా పొగ వేస్తున్నాడన్న భావం ధ్వనిస్తుంది. "పుష్పకమే తెలుగు కాబినెట్టు" అని 1954లో శ్రీశ్రీ అన్న మాట ఇవాల్టికీ ఉన్నమాటే కదా!

"తొడలు విరిగిన దుర్యోధనా
తోక తెగిన గుంటనక్కా
పిచ్చి పట్టిన కొండముచ్చు
పుచ్చిపోయిన సవాయి రోగీ"

అంటూ శ్రీశ్రీ సామ్రాజ్యవాద అమెరికా పై దూషణాస్త్రం సంధించాడు. ఎవడిచ్చాడురా నీకీ పోలీసుద్యోగం? అనటం అక్షరాక్షరసత్యం. ఇవాళ స్థితి కూడా అంతే కదా!

ప్రాసక్రీడలులో మనం జీర్ణించుకోలేని, అసహ్యమనిపించే కవితలూ ఉన్నాయి. శ్రీశ్రీ అక్కడ 'తిట్టుకవి'గా కనిపిస్తాడు. ఈ తిట్టు 'శృతి మించిందని చెప్పాలి. దాశరధి కృష్ణమాచార్య ఆస్థాన పదవిచేపట్టడం, పదవి పోగానే కోర్టుకు వెళ్ళడం ఇవన్నీ అభ్యుదయ, ప్రగతిశీల భావాలు గల కవి చేయదగినవి కాదని శ్రీశ్రీ ఉద్దేశం కావచ్చు. కానీ

"ఏవిట్రోయ్ పొట్టికవీ...
శ్రీశ్రీనే ఎదురించే
ఎత్తుకి పెరిగావటరా..."

అంటూ పొట్టి కవికి మొట్టికాయలుగా రాయడం శ్రీ శ్రీ తన స్థాయిని మరిచినట్టే, ఇందులో కోపం తప్ప కవిత్వం లేదు.

ఇంగ్లీషులో 'లిమరిక్, ఋక్కులు'కలిపి లిమరుక్కులు అని సమాసం చేసాడు. ఇవి అంత్యప్రాసల ప్రాధాన్యం కలవే. అయితే విప్లవ పోరాటాల కాలంలో రాయబడినవి కాబట్టి ఆ కాలపు భావజాలం ప్రతిబింబిస్తుంది.

"విచిత్ర వీరులు నక్సలైట్లు
అన్యాయాలకు డైనమిట్లు
అంధకారంలో టార్చ్ లైట్లు
నవయువ జీవన కాన్మోనాట్లు"

ఆకలి బాధలు తట్టుకోలేక సినీ రంగానికి వెళ్ళాడు శ్రీశ్రీ అవగాహన వచ్చినప్పుడు ప్రగతిశీల భావాలతో పాటలు రాశాడు అయితే సినిమా రంగం గురించి శ్రీ శ్రీ అంతరంగం ఏమిటంటే

"నీతి నీయమా
ల్లేని సినిమా
ముందు ప్రణామా
లెందుకురా అది మనీ మా
ర్కెట్ ఎనీమా".

ఉద్యమకవిగా, ప్రయోగవాదిగా, సరసకవిగా, నిరసవ కవిగా, సినీ కవిగానే కాకుండా అధిక్షేప కవిగా కూడా సమాజాన్ని జాగృతం చేసిన కవి శ్రీ శ్రీ.

ఆధారగ్రంథాలు : 1.సిప్రాలి - శ్రీ శ్రీ
2.ఆధునిక తెలుగు సాహిత్యంలో అధిక్షేప ధోరణులు - డా.రెంటాల వెంకటేశ్వర రావు